బాలసరస్వతి-5 కౌముదీపరిషత్ప్రచురణము-౧

# ఆంధ్ర ధ్వన్యాలోకము

మూల కారికాది సమన్వితము. ద్వితీయోద్ద్యోతము.

ఆంధ్రీకృత శ్రీమదభినవగుప్త లోచనోన్మీలితము.
స్వవిరచిత ప్రభామతి ప్రసారితము.

కవిశేఖర,
వేదాంత విమర్శన విశారద,
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

ఓం నమోభగవతే, శ్రీరమణాయ.
శ్రీ భారతీదేవ్యైనమః.

# ఆంధ్ర ధ్వన్యాలోకము

ఆంధ్రీకృత శ్రీమదభినవగుప్త లోచనోన్మీలితము.
స్వవిరచిత ప్రభామతి ప్రసారితము.

[ప్రథమభాగము: ద్వితీయోద్ద్యోతము.]



ఆంధ్రీకృతి, ప్రభామతి, కర్త :
సాహిత్యవిద్యాప్రవీణ - ఉభయభాషాప్రవీణ,
కవిశేఖర, వేదాంతవిమర్శనవిశారద,
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

సర్వస్వామ్యములు - ఆంధ్రీకృతికర్తవి.

★

రచన 

**24-9-1939**

ప్రథమ ముద్రణము :

**24-9-1944**

ద్వితీయ ముద్రణము :

**30-6-1959.**

మూల్యము :- గ్లేజు ముద్రణము రూ 5/-
న్యూస్ ముద్రణము రూ 4/-

ప్రాప్తిస్థానము :
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.
ఆంధ్రభాషా ప్రధానాధ్యాపకుఁడు
ప్రభుత్వ మహారాజ సంస్కృత కళాశాల
పత్తిపాటివారివీధి
విజయనగరము (విశాఖజిల్లా)
ఆంధ్రప్రదేశ్.

ఓం నమో భగవతే శ్రీరమణాయ.
శ్రీభారతీ దేవ్యైనమః.

ఆంధ్రధ్వన్యాలోకము. ద్వితీయోద్ద్యోతము.

# విషయసూచిక

[ధ్వని, ఆలోక, లోచన, ప్రభామతులకు సంబంధించినది]

(*) "ప్రథమ ద్వితీయోద్ద్యోతములకు, సంబంధించినశోధికలు రెండింటియందు నుగూడ - మీఁది గుర్తుగల విషయములు-మూలమునకు సంబంధించినవి. ఈఁగుర్తు లేని విషయములు- లోచన, ప్రభామతి, వ్యాఖ్యాప్రసారితములగు విషయములకు సంబంధించినవి." అనితెలియునది.

గలధ్వని - అత్యంతతిరస్కృత వాచ్యధ్వనియని చెప్పబడినది.]

లోచనము : అవ :- "అయ్యా! ధ్వనిపదార్థమగు వ్యంగ్యమునకు భేదము నిరూపింపఁబడునపుడు, "ద్వివిధమైన వాచ్యమ్ము" అని, వాచ్యమునకు భేదమును జెప్పుట సంగతమా ?" అని, యాశంకించి చెప్పుచున్నాఁడు.

(2) మూలము : — కావున. తథావిధములగు, వానిచేత [వ్యంజకములగు, నీవాచ్యములచేత] వ్యంగ్యమునకే, భేదముసిద్ధించును. కనుక, నిచట వ్యంగ్యభేదనిరూపణమున కుపయోగించునది యగు వాచ్యభేదనిరూపణము సంగతమేయగును.

లోచనము : — "వ్యంజకవైచిత్ర్యమువలననే, వ్యంగ్యవైచిత్ర్యము కలుగునుగదా !" అనిభావము. "వ్యంజకమగు నర్థమునందు మాత్రము- ధ్వనిశబ్దము నుపయోగించునెడల, నపుడు - దోషమేదియుఁగలుగదు" అనిభావము.

అవ :— [ఇట్లు] "భేదప్రతిపాదకమగు నస్వార్థనామముచేతనే, లక్షణము కూడ సిద్ధమగును". అను నభిప్రాయముచేత [లక్షణమును దెలుపక] ఉదాహరణమునే చూపుచున్నాఁడు.

(3) మూలము : — అర్థాంతర సంక్రమిత వాచ్యమున కుదా :— ['నవలా' అను జాతీయపద్యము.] (జానకీవిరహియగు, శ్రీరాముఁడు జలధరములనుజూచి, యుద్విగ్నుఁడై యనుచున్నాఁడు.)

ఘనములు- స్నిగ్ధశ్యామలరుచిలిప్తనభమ్ములు, వేల్లద్ బలాకములు.
అనిలులు-శీకరులు, జలదసుహృదులయానందకలాయుతములు_ కేకలు
ఘనయభేచ్ఛనొదవనీ! రాముఁడను, కఠోరహృదయుఁడ నంతయు
సహింతు
జనకజ, తానేమగునో? హాహాహా! సాధ్వి! దేవి! ధీరురాలవగుమా! (౧)

అనునిచటి రామశబ్దము. [అర్థాంతర సంక్రమితవాచ్యము]

[అనుపయుజ్యమానమగు నర్థముగల] దీనిచేత - "వ్యంగ్య

ధర్మాంతరరూపమున, పరిణతమగు, సంజ్ఞి" బోధింపఁబడుచున్నది. కాని [కేవలమగు] సంజ్ఞిమాత్రమే, బోధింపఁబడుటలేదు.

లోచనము :— "మీఁది పద్యమున రామశబ్దము- అర్థాంతరమగు వ్యంగ్యమునందు సంక్రమింపఁబడిన వాచ్యముగలదియగుచున్నది." అనిసంగతి తెలియుంగునది. ఘనములనఁగా; మేఘములు- స్నిగ్ధమును. అనఁగా; జలసంబంధముచేత సరసమును, 'శ్యామలమును,' అనఁగా: ద్రావిడవనితల, కుచితమగు నీలవస్త్రము గలదియు, నగు రుచిచేత - 'కాంతిచేత', అనఁగా; చాకచక్యముచేత, 'లిప్తము' అనఁగా; అచ్ఛురితమగు, నభముగలవియు, "వేల్లద్బలాకములు" అనఁగా, [తెల్లని కొంగలకు నల్లనిమేఘములవలనఁగలిగిన] పరభాగవశమువలనను, [మేఘసంసర్గమున జనించిన] ప్రహర్షవశమువలనను, విజృంభమాణములును, కనుక నే. చలించుచున్నవియునగు, 'బలాకములు' అనఁగా; సితపక్షివిశేషములు [తెల్లని కొంగలు] గలవియు, నగుచున్నవి.

"మేఘములు - ఏవంవిధములగుచున్నవి.[నీటితోనిండిన మేఘములుండుటవలన] ఆకాశమిట్లు దురాలోకమగుచున్నది. [చూడశక్యముగాకున్నది.] దిక్కులుగూడ — దుస్సహములైయున్నవి. "అనిలులు - శీకరులు" అనఁగా, గాలులు- సూక్ష్మజలకణోద్గారిణులు. [నీటితుంపరలను స్రవించునవి.] అనియర్థము. దీనిచేత- [జలకణములను మోచికొనివచ్చుచున్నవనుటచేత] ఆగాలులు- మెల్లమెల్లనివనియు, బహువచనముచేత - నియతమగు గమనములేనివనియు, [తిన్ననినడకలేనివనియు] సూచితము. "అట్లయినయెడల, [మేఘములిట్లు పిడాకరములగునెడల, నవి కనుపింపకుండునట్లు] గుహాలయందెచ్చట నయినను ప్రవేశించియుండరాదా" అని-యెవ్వఁడైన ననవచ్చునని నభిప్రాయమున, శ్రీరాముఁడే చెప్పుచున్నాఁడు. "జలదసుహృదులు" అనఁగా; శోభన హృదయములుగల మేఘమిత్రములగు మయూరములు. [శోభనహృదయములుగలవానికే యానందములు కలుగును. కనుక,] ఆమయూరముల కొదవిన యానందముచేత, అనఁగా, ప్రహర్షముచేత, నయిన 'కలలు', అనఁగా; షడ్జసంవాదినులును, ["స" అను స్వరమునుబోలునవియు,] అవ్యక్తమధురములును, నగు "కేకలు." అనఁగా (మయూరి) ధ్వనివిశేషములు. [కూతలు] ఆకేకలుకూడ-దుస్సహములగు, మేఘవృత్తాంతమును స్మరింపఁజేయుచున్నవి. మఱియు, స్వయముఁగాగూడ, [తాముకూడ] దుస్సహములగుచున్నవి." అని యుందలిభావము.

ఇట్లు ఉద్దీపనవిభావములచేత నుద్బోధింపఁబడిన [వియోగకాలసమన్విత రతి

రూపమగు] విప్రలంభముగలరాముఁడు [స్త్రీపురుషులకు జీవితసర్వస్వాభిమానాత్మకయగు] రతి - స్త్రీపురుషుల కిరువురకునుఁగూడ సంబంధించియుండుటవలన [వెనుకఁదెలుపఁబడిన] జలధరాది విభావములు- ప్రియతమయగు జానకికిఁగూడ, సాధారణములు కాఁగలవనిభావించి-యిక్కడినుండి మొదలుపెట్టి, ప్రియతమను హృదయమునందుంచికొనియే-స్వాత్మవృత్తాంతమును మొదటఁదెలుపుచున్నాఁడు. "కఠోరహృదయుఁడను" అనుపదము - "రాముఁడను" అనుపదమున కర్థవిశేషములను [ధ్వనివిశేషములను] స్ఫురింపఁజేయునవకాశము నొసంగుటకుపయోగింపఁబడినది. తృతీయోద్ద్యోతమునందు "నతభిత్తి" అనుపదము - 'అది' అను పదమున కిట్లే, వ్యంజనావకాశము నొసఁగుటకు ప్రయోగింపఁబడినదిగదా :

ప్రభా :— "అది - నతిభిత్తియైన నిలయంబు" అనుపద్యమును, ద్వితీయ భాగమునందలి తృతీయోద్ద్యోతమునందుఁగల, 103వ పేజీయందుఁ జూచునది.

లోచనము :— "కఠోరహృదయుఁడను' అనుపదము - ప్రయోగింపఁబడియుండనియెడల, [కేవలమగు] రామపదము - దశరథకులోద్భవుఁడు, కౌసల్యాస్నేహ [వాత్సల్య] పాత్రుఁడు, బాల్యచరిత జానకీలాభయుక్తుఁడు,[తాటకాఖండనసనిపుణుఁడు, పరశురామవిజేత] ఇత్యాదిధర్మవిశిష్టమగు నర్థాంతరమున, పరిణతమగు [సంక్రమితమగు] నర్థమునే, ధ్వనింపఁజేసియుండును.

ప్రభా :— అట్లుగాక, "కఠోరహృదయుఁడను"అను విశేషణపదమిచట, నుండుటవలననే, యిచటి రామపదము - రాజ్యపరిత్యాగినగు రాముఁడను, పితృసాన్నిధ్యమును బాసినరాముఁడను, ఘోరారణ్యవాసినగు రాముఁడను. పితృమారణకారణుఁడనగు రాముడను. ప్రియతమాహరణజన్య దుఃఖాతిశయసహనశీలుఁడనగు రాముఁడను, అని, ఇత్యాదిధర్మాంతరవిశిష్టుఁడగు రాముని వ్యంజింపఁజేయుచున్నది.

లోచనము :— "రాముఁడను" అనఁగా; "రాజ్యపరిత్యాగాది ధర్మాంతరయుక్తుఁడనగు రాముఁడనునేను" అనియర్థము. "తానేమగునో" అనుచోటను గల "అగునో" అనునది - క్రియాసామాన్యమును బోధించును. దీనిచేత "జానకి" తానేమిచేయునో" అనునర్థము బోధింపఁబడును. "అగునో" అను దానిచేత, ఆమెజీవించియుండుటకూడ- అసంభావ్యమను నర్థముకూడ-సూచింపఁబడును. వెనుకఁ దెలుపఁబడిన ప్రకారమున హృదయమున నుంచుకొనఁబడినదియు, [ఈజలధరాద్యుద్దీపకములు - ప్రియతమా సాధారణములని,] స్మరించుట

చేత నుదయించిన, "ఏమగునో", ఇత్యాది వికల్పశబ్దములచేత ప్రత్యక్షముగా నున్నట్లు భావింపఁబడినదియు, హృదయస్ఫోటనోన్ముఖియు, నగు ప్రేయసి నుద్దేశించి, ససంభ్రమముగా ననుచున్నాఁడు. హాహాహా! [సాధ్వి] దేవీ" అని. దీనిచేత [కృతాభిషేకవగు] "నీకు ధైర్యము యుక్తము" అనునర్థము వ్యంజిత మగును, "దీనిచేత" అనఁగా: అనుపయుజ్యమానార్థముగల రామశబ్దముచేత, "అనియర్థము. "వ్యంగ్యధర్మాంతర"మనఁగా; [ఇచ్చటనున్న లక్షణావ్యాపార మునకు] ప్రయోజనరూపమగు వ్యంగ్యము. ఆవ్యంగ్యము - రాజ్యమునుండి వెడలగొట్టఁబడుట" మున్నగు, నదియగుచు, ససంఖ్యేయముగానున్నది.[లెక్కింపఁదగనంతదిగా నున్నది.] వ్యంగ్యరూపమగు నాప్రయోజనము- అసంఖ్యమగుటవలన- అభిధావ్యాపారముచేత సమర్పింపఁబడుటకు శక్యముగునదికాదు. [అభిధచేత నీప్రయోజనమొక్కమారుగా సమర్పింపఁబడునదికాదు.] [ఒక్కమారుగాఁ గాక] క్రమముగా నర్పింపఁబడునదియయినను, ఏకజ్ఞానవిషయముకాకుండుట వలన, చిత్రమగు నాస్వాదమునకు స్థానమగునదికాదు. కనుక, సౌందర్యాతిశయమును గలిగించునదికాదు. అసంఖ్యమయిన [రాజ్యనిర్వాసనాది] ప్రయోజనరూపమగు ప్రతీయమానముమాత్రము- అనుద్భిన్నమగు [అస్పష్టమగు] పరస్పరభేదముగలదియగుచునే, [ప్రతిపత్తృ ప్రతిభావిశేషమువలన] నానారూపమును భాసించును. కనుక, అనేకరసములుగల చిత్రపానకరసము, అప్పము, గుడమోదకము, [బెల్లపుజిల్లేడుగాయ] మున్నగువాని యాస్వాదముతో సమానమైన విచిత్రచర్వణకాస్పదమగుచుండును.

ప్రభా :— "రాముఁడను" అనుపదముచేత బోధింపబఁబడునదియగు వ్యంగ్యమిచట లెక్కలేనంతదిగానున్నది. ఇచట; పెక్కులైయున్న, వ్యంగ్యధర్మములనన్నిటినిగూడ - అభిధ - ఒక్కమారుగ బోధింపఁజాలదు. క్రమముగా బోధించినను, ఒక్కసారిగా, ఒకేజ్ఞానమున, కవి-విషయములు కాజాలవు. కనుక, నాచ్యము - చిత్రచర్వణాస్పదముకాదు. పానకరసాదులయందు (కలిసియున్న) కర్పూరాద్యంశము-వేరుగా నాస్వాదింపఁబడునట్లు, 'రాజ్యమునుండి భ్రంశము నొందుట' మున్నగు [లక్షణాప్రయోజనములగు] వ్యంగ్యములు పెక్కులిచట నున్నను, సహృదయులగు జ్ఞాతలచేత నవి-వేరుగా నాస్వాదింపఁబడక, ఏకధీవిషయములగుచు, నొక్కమారుగనే, యాస్వాదింపఁబడును. కనుక, "వ్యంగ్యము మాత్రమే- చిత్రచర్వణాస్పదమగును. కనుక, నిచట, వ్యంగ్యమే - సౌందర్యాతిశయకారియగును" అనిభావము.

లోచనము :— ["సౌందర్యాతిశయకారియగు ప్రయోజనజాతము -

గలధ్వని - అత్యంతతిరస్కృత వాచ్యధ్వనియని చెప్పబడినది.]

లోచనము : అవ :- "అయ్యా! ధ్వనిపదార్థమగు వ్యంగ్యమునకు భేదము నిరూపింపఁబడునపుడు, "ద్వివిధమైన వాచ్యమ్ము" అని, వాచ్యమునకు భేదమును జెప్పుట సంగతమా ?" అని, యాశంకించి చెప్పుచున్నాఁడు.

(2) మూలము : — కావున. తథావిధములగు, వానిచేత [వ్యంజకములగు, నీవాచ్యములచేత] వ్యంగ్యమునకే, భేదముసిద్ధించును. కనుక, నిచట వ్యంగ్యభేదనిరూపణమున కుపయోగించునది యగు వాచ్యభేదనిరూపణము సంగతమేయగును.

లోచనము : — "వ్యంజకవైచిత్ర్యమువలననే, వ్యంగ్యవైచిత్ర్యము కలుగునుగదా !" అనిభావము. "వ్యంజకమగు నర్థమునందు మాత్రము- ధ్వనిశబ్దము నుపయోగించునెడల, నపుడు - దోషమేదియుఁగలుగదు" అనిభావము.

అవ :— [ఇట్లు] "భేదప్రతిపాదకమగు నస్వార్థనామముచేతనే, లక్షణము కూడ సిద్ధమగును". అను నభిప్రాయముచేత [లక్షణమును దెలుపక] ఉదాహరణమునే చూపుచున్నాఁడు.

(3) మూలము : — అర్థాంతర సంక్రమిత వాచ్యమున కుదా :— ['నవలా' అను జాతీయపద్యము.] (జానకీవిరహియగు, శ్రీరాముఁడు జలధరములనుజూచి, యుద్విగ్నుఁడైయనుచున్నాఁడు.)

ఘనములు- స్నిగ్ధశ్యామలరుచిలిప్తనభమ్ములు, వేల్లద్ బలాకములు.
అనిలులు-శీకరులు, జలదసుహృదులయానందకలాయుతములు_కేకలు
ఘనయ ధేచ్ఛనొాదవనీ! రాముఁడను, కఠోరహృదయుఁడ నంతయు
సహింతు
జనకజ, తానేమగునో? హాహాహా! సాధ్వి! దేవి! ధీరురాలవగుమా!(౧)

అనునిచటి రామశబ్దము. [అర్థాంతర సంక్రమితవాచ్యము]

[అనుపయుజ్యమానమగు నర్థముగల] దీనిచేత - "వ్యంగ్య

ధర్మాంతరరూపమున, పరిణతమగు, సంజ్ఞి" బోధింపఁబడుచున్నది. కాని [కేవలమగు] సంజ్ఞిమాత్రమే, బోధింపఁబడుటలేదు.

లోచనము :— "మీఁది పద్యమున రామశబ్దము- అర్థాంతరమగు వ్యంగ్యమునందు సంక్రమింపఁబడిన వాచ్యముగలదియగుచున్నది." అనిసంగతి నెఱుంగునది. ఘనములనఁగా; మేఘములు- స్నిగ్ధమును. అనఁగా; జలసంబంధముచేత సరసమును. 'శ్యామలమును.' అనఁగా: ద్రవిడవనితల, కుచితమగు నీలవర్ణము గలదియు, నగు రుచిచేత - 'కాంతిచేత', అనఁగా; చాకచక్యముచేత, 'లిప్తము' అనఁగా; ఆచ్ఛాదితమగు, నభముగలవియు, "వేల్లద్బలాకములు" అనఁగా, [తెల్లని కొంగలకు నల్లనిమేఘములవలనఁగలిగిన] పరభాగవశమువలనను, [మేఘసంసర్గమున జనించిన] ప్రహర్షవశమువలనను, విజృంభమాణములును, కనుకనే. చలించుచున్నవియునగు, 'బలాకములు' అనఁగా; సితపక్షివిశేషములు [తెల్లని కొంగలు] గలవియు, నగుచున్నవి.

"మేఘములు - ఏవంవిధములగుచున్నవి.[నీటితోనిండిన మేఘములుండుట వలన] ఆకాశమిట్లు దురాలోకమగుచున్నది. [చూడశక్యముగాకున్నది.] దిక్కులుగూడ — దుస్సహములైయున్నవి. "అనిలులు - శీకరులు" అనఁగా, గాలులు. సూక్ష్మజలకణోద్గారిణులు. [సీటితుంపరలనుస్రవించునవి.] అనియర్థము. దీనిచేత- [జలకణములను మోచికొనివచ్చుచున్నవనుటచేత] ఆగాలులు-మెల్లమెల్లనివనియు, బహువచనముచేత - నియతమగు గమనములేనివనియు, [తిన్ననినడకలేనివనియు] సూచితము. "అట్లయినయెడల, [మేఘములిట్లు పీడాకరములగునెడల, నవి కనుపింపకుండునట్లు] గుహాలయందెచ్చటనయినను బ్రవేశించియుండరాదా" అని యెవ్వఁడైన ననవచ్చునను నభిప్రాయమున, శ్రీరాముఁడే చెప్పుచున్నాఁడు. "జలదసుహృదులు" అనఁగా; శోభన హృదయములుగల మేఘమిత్రములగు మయూరములు. [శోభనహృదయములుగలవానికే యానందములకలుగును. కనుక,] ఆమయూరముల కొదవిన యానందముచేత, అనఁగా, ప్రహర్షముచేత, నయిన'కలలు', అనఁగా;షడ్జసంవాదినులును, ["స"అను స్వరమునుబోలునవియు,] అవ్యక్తమధురములును,నగు"కేకలు-"అనఁగా(మయూర) ధ్వనివిశేషములు. [కూతలు] ఆకేకలుకూడ-దుస్సహమగు, మేఘవృత్తాంతమును స్మరింపఁజేయుచున్నవి. మఱియు, స్వయముఁగాఁగూడ, [తాముకూడ] దుస్సహములగుచున్నవి." అని యుందలిభావము.

ఇట్లు ద్దీపనవిభావములచేత నుద్బోధింపఁబడిన [వియోగకాలసమన్విత రతి

రూపమగు] విప్రలంభముగలరాముఁడు [స్త్రీపురుషులకు జీవితసర్వస్వాభిమానాత్మకయగు] రతి - స్త్రీపురుషుల కిరువురకునుఁగూడ సంబంధించియుండుటవలన [వెనుకఁదెలుపఁబడిన] జలధరాది విభావములు- ప్రియతమయగు జానకికిఁగూడ, సాధారణములు కాఁగలవనిభావించి-యిక్కడినుండి మొదలుపెట్టి, ప్రియతమను హృదయమునందుంచికొనియే-స్వాత్మవృత్తాంతమును మొదటఁదెలుపుచున్నాఁడు. "కఠోరహృదయుఁడను" అనుపదము - "రాముఁడను" అనుపదమున కర్థవిశేషములను [ధ్వనివిశేషములను] స్ఫురింపఁజేయునవకాశము నొసంగుటకుపయోగింపఁబడినది. తృతీయోద్ద్యోతమునందు "నతభిత్తి" అనుపదము - 'అది' అను పదమున కిట్లే, వ్యంజనావకాశము నొసఁగుటకు ప్రయోగింపఁబడినదిగదా ॥

ప్రభా :— "అది - నతభిత్తియైన నిలయంబు" అనుపద్యమును, ద్వితీయ భాగమునందలి తృతీయోద్ద్యోతమునందుఁగల, 103వ పేజీయందుఁ జూమనది.

లోచనము :— "కఠోరహృదయుఁడను' అనుపదము - ప్రయోగింపఁబడి యుండనియెడల, [కేవలమగు] రామపదము - దశరథకులోద్భవుఁడు, కౌసల్యాస్నేహ [వాత్సల్య] పాత్రుఁడు, బాల్యచరిత జానకీలాభయుక్తుఁడు,[తాటకాఖండనసనిపుణుఁడు, పరశురామవిజేత] ఇత్యాదిధర్మవిశిష్టమగు నర్థాంతరమున, పరిణతమగు [సంక్రమితమగు] నర్థమునే, ధ్వనింపఁజేసియుండును.

ప్రభా :— అట్లుగాక, "కఠోరహృదయుఁడను"అను విశేషణపదమిచట, నుండుటవలననే, యిచటి రామపదము - రాజ్యపరిత్యాగినగు రాముఁడను, పితృసాన్నిధ్యమును బాసినరాముఁడను, ఘోరారణ్యవాసినగు రాముఁడను. పితృమారణకారణుఁడనగు రాముడను. ప్రియతమాహరణజన్య దుఃఖాతిశయసహనశీలుఁడనగు రాముఁడను, అని, ఇత్యాదిధర్మాంతరవిశిష్టుఁడగు రాముని వ్యంజింపఁజేయుచున్నది.

లోచనము :— "రాముఁడను" అనఁగా; "రాజ్యపరిత్యాగాది ధర్మాంతరయుక్తుఁడనగు రాముఁడనునేను" అనియర్థము. "తానేమగునో" అనుచోటనుగల "అగునో" అనునది - క్రియాసామాన్యమును బోధించును. దీనిచేత "జానకి" తానేమిచేయునో" అనునర్థము బోధింపఁబడును. "అగునో" అను దానిచేత, ఆమెజీవించియుండుటకూడ- అసంభావ్యమును నర్థముకూడ-సూచింపఁబడును. వెనుకఁ దెలుపఁబడిన ప్రకారమున హృదయమున నుంచుకొనఁబడినదియు, [శీతజలధరాద్యుద్దీపకములు - ప్రియతమా సాధారణములని,] స్మరించుట

చేత నుదయించిన, "ఏమగునో", ఇత్యాది వికల్పశబ్దములచేత ప్రత్యక్షముగా నున్నట్లు భావింపఁబడినదియు, హృదయస్ఫోటనోన్ముఖియు, నగు ప్రేయసి నుద్దేశించి, ససంభ్రమముగా ననుచున్నాఁడు. హాహాహా! [సాధ్వి] దేవీ" అని. దీనిచేత [కృతాభిషేకవగు] "నీకు ధైర్యము యుక్తము" అనునర్థము వ్యంజిత మగును, "దీనిచేత" అనఁగా: అనుపయుజ్యమానార్థముగల రామశబ్దముచేత, "అనియర్థము. "వ్యంగ్యధర్మాంతర"మనఁగా; [ఇచ్చటనున్న లక్షణావ్యాపార మునకు] ప్రయోజనరూపమగు వ్యంగ్యము. అవ్యంగ్యము - రాజ్యమునుండి వెడలగొట్టఁబడుట" మున్నగు, నదియగుచు, ససంఖ్యేయముగానున్నది.[లెక్కింపఁదగనంతదిగా నున్నది.] వ్యంగ్యరూపమగు నాప్రయోజనము- అసంఖ్యమగుటవలన- అభిధావ్యాపారముచేత సమర్పింపఁబడుటకు శక్యమగునదికాదు. [అభిధ చేత నీప్రయోజనమొక్కమారుగా సమర్పింపఁబడునదికాదు.] [ఒక్కమారుగాఁగాక] క్రమముగా నర్పింపఁబడునదియయినను, ఏకజ్ఞానవిషయముకాకుండుట వలన, చిత్రమగు నాస్వాదమునకు స్థానమగునదికాదు. కనుక, సౌందర్యాతిశయమును గలిగించునదికాదు. అసంఖ్యమయిన [రాజ్యనిర్వాసనాది] ప్రయోజనరూపమగు ప్రతీయమానముమాత్రము- అనుద్భిన్నమగు [అస్పష్టమగు] పరస్పరభేదముగలదియగుచునే, [ప్రతిపత్తృ ప్రతిభావిశేషమువలన] నానారూపమున భాసించును. కనుక, అనేకరసములుగల చిత్రపానకరసము, అప్పము, గుడమోదకము, [బెల్లపుజిల్లేడుగాయ] మున్నగువాని యాస్వాదముతో సమానమైన విచిత్రచర్వణాస్పదమగుచుండును.

ప్రభా :— "రాముఁడను" అనుపదముచేత బోధింపఁబడునదియగు వ్యంగ్యమిచట లెక్కలేనంతదిగానున్నది. ఇచట; పెక్కులైయున్న, వ్యంగ్యధర్మములనన్నిటినిగూడ - అభిధ - ఒక్కమారుగ బోధింపఁజాలదు. క్రమముగా బోధించినను, ఒక్కసారిగా, ఒకేజ్ఞానమున, తవి-విషయములు కాజాలవు. కనుక, వాచ్యము - చిత్రచర్వణాస్పదముకాదు. పానకరసాదులయందు (కలిసియున్న) కర్పూరాద్యంశము-వేరుగా నాస్వాదింపఁబడునట్లు, 'రాజ్యమునుండి భ్రంశము నొందుట' మున్నగు [లక్షణాప్రయోజనములగు] వ్యంగ్యములు పెక్కులిచట నున్నను, సహృదయులగు జ్ఞాతలచేత నవి-వేరుగా నాస్వాదింపఁబడక, ఏకధీవిషయములగుచు, నొక్కమారుగనే, యాస్వాదింపఁబడును. కనుక, "వ్యంగ్యము మాత్రమే- చిత్రచర్వణాస్పదమగును. కనుక, నిచట, వ్యంగ్యమే - సౌందర్యాతిశయకారియగును" అనిభావము.

లోచనము :— ["సౌందర్యాతిశయకారియగు ప్రయోజనజాతము -

వ్యంజకశబ్దముకంటె నితరమగు శబ్దముచేతఁ జెప్పఁబడునదికాదు.'' అనుసంశయము- ''ఏది-ఉక్త్యంతరమున వచింపఁబడదో'' అనుదానిచేత వెనుకఁదెలుపఁబడినదిగదా ! ఇదియే-[విచిత్రమగు, చర్వణకు విషయమగుచుండుటయే] ప్రతీయమానతచేత ప్రయోజనమునకగు నుత్కర్షకు హేతువని తలఁపఁదగియున్నది. [సంజ్ఞిమాత్రమే బోధింపఁబడుటలేదు. అనుచోట]మాత్రగ్రహణముచేత ''సంజ్ఞి-[రామశబ్దార్థము] ఇచట, తిరస్కరింపఁబడుటలేదు'' అనిచెప్పఁబడినది.

ప్రభా :— ''ఘనములు'' అను మీదిపద్యమున, ''రాముఁడను'' అను చోటఁజెప్పబడిన సంజ్ఞియగురాముఁడే - రాజ్యమునుండి భ్రష్టుఁడగుట''మున్నగు వ్యంగ్యధర్మములు గలవాఁడుగా,ఁదెలియఁబడుచున్నాఁడు. కనుక, ''సంజ్ఞియగు రామశబ్దార్థమిచట తిరస్కరింపఁబడుటలేదు''. అనిభావము.

అవ :— అర్థాంతరసంక్రమిత, స్వవాచ్యమైనను, వాచ్యమగు సంజ్ఞి-తిరస్కరింపఁబడదనుటకు వృత్తికారుఁడింకొకయర్థాంతర సంక్రమిత వాచ్యోదాహరణమును ప్రదర్శించుచున్నాఁడు.

(3) మూలము : అదెట్లనిన : — నాయదియేయగు 'విషమబాణలీల' యందలి పద్యము - దీనికింకొక యుదాహరణము :—

గీ॥ ఎపుడు సహృదయకోటి గ్రహించువాని
నప్పుడే, యయ్యవి - గుణమ్ములగుచునుండు,
తరణి కిరణ సమనుగృహీతములగు, సర
సీరుహములుగదా ! సరసీరుహములు !. (౨)

అను నిచట ద్వితీయమగు 'సరసీరుహశబ్దము.' [అర్థాంతర సంక్రమితమగు వాచ్యముగలది.]

ప్రభా :— శ్రీమదానందవర్ధనాచార్యవిరచిత విషమబాణలీలయందలి మూలశ్లోకమిది :—

తాలాజాఅన్తి గుణా । జాలాదేసహిఅఏహి ఘేప్పన్తి ।
రఇకిరణానుగ్గాహి ఆఇహోన్తి కమలాఇకమలాఇ.

లోచనము :— తాలా - తదా. జాలా - యదా. ఘేప్పన్తి - గృహ్యన్తే
[అనునది- సంస్కృతచ్ఛాయ]

'తరణి' అని, యర్థాంతరన్యాసము చెప్పఁబడినది.

"సరసీరుహమ్ములుగద సరసీరుహములు" అనుచోనున్న ద్వితీయమగు సరసీరుహశబ్దము- లక్ష్మీపాత్రిత్వాది ధర్మాంతరశత చిత్రతాపరిణతమగు సంజ్ఞిని- చెప్పునని యర్థము.

ప్రిహా :— ఇది - మీది ప్రాకృతశ్లోకమునకు సంస్కృతచ్ఛాయ.

"తదాజాయన్తే గుణాయదాతే సహృదయైర్గృహ్యన్తే ।
రవికిరణానుగృహీతాని భవన్తి కమలాని కమలాని."

"తరణికిరణ సమనుగృహీతములగు" అనుదానిచేత - అర్థాంతరన్యాసము చెప్పఁబడినది. ఇది - ప్రతివస్తూపమయగునని దీధితివ్యాఖ్య చెప్పుచున్నది.

"ఇచట. రెండవదియగు "సరసీహములు" అనుశబ్దము-["సూర్యకిరణముములచేత స్పృశింపఁబడిన] కమలములు - లక్ష్మీపాత్రములు [కాంత్యతిశయయుక్తములు] వికాసపూర్ణములు, సౌరభశాలులు, అని, లక్ష్మీపాత్రిత్వాది రూపమున, పెందలకోలఁదియునగు నర్థాంతరములగు వ్యంగ్యధర్మములతోఁగూడియుండుటవలన చిత్రముగాఁ బరిణమించిన, కమలములనెడి సంజ్ఞిని-స్ఫురింపఁజేయుచున్నది. కనుక 'నర్థాంతరసంక్రమితవాచ్యము.' అనిచెప్పఁబడును" అనియర్థము.

—• పూర్వపక్షము - తత్ ఖండనము •—

లోచనము :— "అయ్యా : శుద్ధమగు ముఖ్యార్థమునందు [కేవలమగు రామపద ముఖ్యార్థమునందు - ప్రకృతమున నుపయోగింపకుండుటయను] నిమిత్తమగు బాధయున్నది. ధర్మియగు రామపదముఖ్యార్థమున, "రాజ్యమునుండి భ్రష్టుఁడగుట" మున్నగు తద్ధర్మములతోడి సంబంధమున్నది. [ఆధారాధేయభావ రూపముఖ్యార్థ సంబంధమున్నది.] ప్రకృతమునందీరామపదార్థ ముపయోగింపకుండుటయను నిమిత్తముచేత - ఈరామశబ్దము-ధర్మాంతరపరిణతమగు నర్థమును [రాజ్యమునుండి భ్రంశమునొందుట మున్నగు [వ్యంగ్య] ధర్మాంతరములతో విశిష్టుఁడనగు రాముఁడను - అనునర్థమును] లక్షింపఁజేయును. ఇచట, [మామత

మున| వ్యంగ్యములగు నర్థములేవియనిన; అవి - శబ్దవాచ్యములుకానివియు, సాధారణములుకానివియు, నగు [నిర్వేద,గ్లాని, మోహాదులగు] ధర్మాంతరము ౦గును. ఇట్లే, [ద్వితీయమగు] సరసీరుహశబ్దముకూడ - [లక్ష్మీపాత్రిత్వాది ధర్మాంతరశతచిత్రతా పరిణతమగు సరసీరుహమును లక్షితమొనర్చును. వ్యంగ్య మో,[ఆసరసీరుహములే] మనోహరములుమున్నగునదియగును.] గుణశబ్దముమా త్రము - [‘ధర్మాంతరపరిణతమగు సంజ్ఞినిలక్షితమొనర్పక] సంజ్ఞినిమాత్రమే తెలుపును.'' అని - ఇచట, కొందఱుచెప్పిరి. : మీదియుదాహరణములయందు, కొందఱిచేతనిట్లు బలాత్కారముచేత [బుద్ధిసామర్థ్యముచేత] ఆరోపించి, చెప్పఁబడి నయర్థము - సహృదయ ప్రతీతి సిద్ధమగునదికాదు. కనుక, అనుపయోగబాధాధీ నమగుటవలన, [అసంఖ్యమగు] రాజ్యనిర్వాసనాద్యర్థము- [అవివక్షితవాచ్యమగు] ధ్వనికేవిషయమగును. [కాని, లక్షణకు విషయమగునదికాదు.] ఇంకేమనిన :— లక్షణ - యీధ్వనికి మూలమగును. [సహకారిణియగును.]

ప్రభా :— ఇచట, లక్షణచేత ధర్మాంతర పరిణతమగు నర్థము-లక్షితము కాదు. ‘‘అంతయును సహింతును’ అను ప్రకృతార్థమునందుపయోగింపకుండుట వలన, మీఁది యుదాహృతియందు, శబ్దమునకు ముఖ్యమగు నర్థమునకు బాధకలు గునపుడు, లక్షణచేత- ఏకధర్మప్రకారకమగు నర్థమునకే ప్రతీతికలుగును. కాని, [రాజ్యనిర్వాసనాది] అనేక ధర్మప్రకారకమగు నర్థమునకు ప్రతీతికలుగదు. కనుక, అనేక ధర్మాంతరశతచిత్రితాపరిణతమగు నీయర్థము - ధ్వననవ్యాపార మునకేగాని, లక్షణావ్యాపారమునకు విషయమగునదికాదు. లక్షణ - ఇచట - సహకరించును. కనుకనవివక్షితవాచ్యధ్వని - లక్షణామూలమగుటమాత్రము - విరుద్ధముకాదు.

లోచనము :— ‘‘హాహాహా సాధ్వీ! దేవీ! ధీరురాలవగుమా!'' అనుదాని చేత గమ్యమగు, సంరంభార్థమే-యీచమత్కారము.'' అని హృదయదర్పణము నందుఁజెప్పఁబడినది.

ప్రభా :— దానికిది - సమాధానము.

లోచనము :– ‘‘ఘనములు'' అనుపద్యమున ‘‘హాహాహా'' పదవ్యంగ్యము సంరంభార్థమేయగుఁగాక ! అట్లయినను, [భట్టనాయకు నభిమతము సిద్ధింపదు.]

సంరంభమననేమి ? ఆవేగముగదా ! ఆయావేగము - విప్రలంభ శృంగార రసమునకు వ్యభిచారియేయగును. కనుక, [భట్టనాయకుని కభిమతముగానిదగు]

రసధ్వని [ఇచట, మొదట] అంగీకరింపఁదగినదగును. "నేనంతయు సహింతును. కాని, వైదేహియెట్లుండునో" అనురూపముగలదియే - సంరంభముగదా! రామ శబ్దముచేత, అభివ్యక్తమగు రాజ్యనిర్వాసనాద్యర్థ సహాయములేనిదే, ఆసంరంభో ల్లాసముకూడ - ప్రతీతము, కాదు.

ప్రభా :— "భట్టనాయకుఁడు - పట్టుపట్టి, యిచట, "సంరంభార్థమే - వ్యంగ్యము." అనునెడల, సంరంభమనఁగా; ఆవేగము. అది-విప్రలంభశృంగార వ్యభిచారి. కనుక, నిచట, భట్టనాయకుఁడు - తనకిష్టములేకున్నను, విప్రలంభ శృంగారరసధ్వని నంగీకరింపవలసివచ్చును. ఇంతియేకాదు. రామశబ్దముచేత వ్యంజితమగు "రాజ్యభ్రంశమునొందిన........ ఇత్యాదిరాముఁడను" అనునర్థము యొక్క సహాయములేనిదే, అసలీయావేగము - స్ఫురింపఁజేయఁబడదు. కనుక, (మేముచెప్పిన) అవివక్షిత వాచ్యమగు ధ్వనినిగూడ, నతడంగీకరింపకతీరదు." అనిభావము.

అవ :— మీది యుదాహరణద్వయమునందలి ముఖ్యార్థబాధను, స్వయ ముగా వివరించుచు, ఇవి - అవివక్షితవాచ్యధ్వని భేదమగు నర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని భేదమున కెట్లుదాహృతులగునదియుఁదెలుపుచున్నాఁడు.

లోచ :— "సరసీరుహములు" అనుపదమునందు, సంరంభము - గమ్య ముకానేకాదు. అయినను, "రాముఁడను" అనుప్రథమోదాహరణమునందువలె, నిచ్చటఁగూడ - అనుపయోగాత్మికయగు ముఖ్యార్థబాధయుండుటవలన, శుద్ధా ర్థము [వాచ్య, జాత్యాదివిశిష్టవ్యక్తిరూప, ముఖ్యార్థము] వివక్షింపఁబడునదికాదు. కావున, నిదియు, లక్షణామూలమేయగును. కనుక, నిదియు అవివక్షితవాచ్యధ్వని యగుట - ఉపపన్నమేయగును. వ్యక్తిరూపమగు నర్థమునకుఁగూడ [సరసీరుహ ములు అనువాని ముఖ్యార్థమునకుఁగూడ] సరసీరుహపదమునకు లక్ష్యమగునర్థము నందును, వ్యంగ్యమగునర్థమునందునుగూడ-అనుప్రవేశముండుటవలన,ధర్మియగు సరసీరుహవాచ్యము-తిరస్కరింపఁబడునదికూడకాదు. కనుకనే, యిదియు, వ్యంగ్య ధర్మాంతర పరిణతమని [మాచేత] వ్యవహరింపఁబడినది.

అవ :— 'ధ్వని - [రామాయణాది] లక్ష్యమునందుఁ బ్రసిద్ధ'మనుటకై - చెప్పుచున్నాఁడు.

ప్రభా : అవ :— వృత్తికర్త - అవివక్షిత వాచ్యధ్వనికి ద్వితీయభేద మగు నర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనికి- శ్రీమద్రామాయణమునుండి, యుదా

హ్యాతి నొసఁగుచున్నాఁడు.

(4) మూలము :— అత్యంత తిరస్కృత వాచ్యధ్వనికి - ఆదికవియగు వాల్మీకినుండి యుదాహరణము :—

"రవి సంక్రాన్త సౌభాగ్యస్తుషారావృత మణ్డలః।
నిఃశ్వాసాన్ధ ఇవాదర్శ, శ్చన్ద్రమా న ప్రకాశతే."

గీ॥ అర్క సంక్రాంత సౌభాగ్యుఁడయి, తుషార
సంవలిత మండలుండైన, చంద్రముఁడు-
తనరకున్నాఁడిపుడు, నిశ్వసనముతోడి
స్పర్శమున, నంధమైన [గ్రుడ్డిదైన] యాదర్శమట్లు (౪)

ఇంచలి, అంధశబ్దము. [అత్యంత తిరస్కృత వాచ్యము.]

లోచనము :— ఇది - పంచవటియందున్న రాముఁడు - హేమంతమును వర్ణించుచునుడివినమాట. "అంధము" [గ్రుడ్డిది] అనఁగా; "ఉపహతముగుదృష్టి గలది." [చూపుచెడినది] అనునది - ముఖ్యార్థము.

ప్రిభా : అవ :— "అయ్యా! చూపుచెడుట - పుట్టినతరువాత ప్రాపి కేదోకారణమునఁ గలుగునే!, అట్లుండ, పుట్టుగుడ్డివానిని "అంధుఁడు" అని వ్యవహరించుటయెట్లు ? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచ :— జాత్యంధునకుఁగూడ [పుట్టుగ్రుడ్డికిఁగూడ] గర్భమునందే దృష్టి చెడుట సంభవించుటవలన, జాత్యంధుఁడు - అంధుఁడని వ్యవహరింపఁబడును. [చెడనిదృష్టిగలవాఁడయిననుగూడ - అన్యాలోచనచేత పరాకుగల మనుష్యుని గుఱించి] "ఈయంధుఁడు - తనయెదుటనున్నవస్తువును గూడఁజూడడు." అని. వానికిలేని, "దృష్టిచెడుట" యారోపింపఁబడి, యుపచారముచేత నాతఁడంధుఁడు గాఁజెప్పఁబడునుగదా! కనుక, నచట, అంధపదముఖ్యార్థమునకుఁ గొంతతిరస్కారమున్నను, అత్యంతమగు తిరస్కారములేదు.

"అంధమయిన యాదర్శమ్ము చందమునను" అను నిచటమాత్రము -

ఆరోపింపఁబడిన దయినను గూడ-ఆదర్శమున కంధత్వము-సహింపఁదగినదికాదు.

ప్రభా :— అద్దమున కసలుదృష్టియేలేకుండుటవలన, దృష్టిచెడుటయను నర్థముగల యంధత్వమును దానికారోపించుట సహింపఁదగినదికాదు. అద్దమున కొకప్పుడు దృష్టియుండిన, నిప్పుడు చెడినదనుటకు వీలుండును. దానికసలుదృష్టి లేనపుడు, దృష్టిచెడినదనుటకును వీలుండదుగదా !

లోచ :— చూపుచెడినదానియందు - పదార్థ స్ఫుటీకరణశక్తియుండదు, కనుక, చూపుచెడినదానియందు పదార్థములను స్ఫుటీకరించు శక్తిలేకుండుటను నిమిత్తముగాఁజేసికొని, ఇచటి యంధశబ్దము - లక్షణచేత "నిట్టూర్పుచేత గ్రుడ్డిద యినయద్దము - పదార్థములను స్ఫుటీకరించునదియగు శక్తిగలదికాదు" అను లక్ష్యార్థమును లక్షింపఁజేసి, [తదుపరి] అసాధారణమగు విచ్ఛాయత్వము, అనుప యోగిత్వము, మున్నగు [లక్షణా] ప్రయోజనము నవగమింపఁజేయును.

ప్రభా :— "నిశ్వసనముతోడి" అనఁగా; నిట్టూర్పుతోడి - అనఁగా; 'ముఖనాసికానిలముతోడి.' అనియర్థము. స్పర్శమునన్ = సంబంధముచేత, అంధ మయిన = గ్రుడ్డిదయిన, చూపుచెడిన, ఆదర్శమట్లు = అద్దమువలె, అనిఁ యర్థము. కాఁగా; సూర్యునియందుఁజేరిన - శోభగలవాఁడును, మంచుచేతఁగప్ప బడిన మండలముగలవాఁడును, నగు చంద్రుఁడి హేమంతకాలమున నిట్టూర్పుతోడి సంబంధముచేతఁ జూపుచెడిన యద్దమువలెఁ బ్రకాశింపకున్నాఁడు" అని దీని వాచ్యార్థము.

"అద్దమునకుఁజూపేలేదు. కనుక, నది-చెడుటకూడనుండదు.కనుక;అంధ శబ్దము-అత్యంతమును, తిరస్కరింపఁబడిన వాచ్యమగు నర్థముగలదియగుచున్నది. ఈయంధశబ్దము-తనకుసంబంధించిన ముఖ్యార్థమునకగుబాధయను నిమిత్తముచేత- "అద్దము - పదార్థములను స్ఫుటీకరించు శక్తిలేనిది" అని ముఖ్యార్థముతోడి- సంబంధరూపమగు నర్థమును లక్షింపఁజేయును. తరువాత వ్యంజనచేత-"నిట్టూర్పు తోడి సంబంధమునొందిన యద్దము-'అత్యంతమలినము, ఉపయోగములేనిది, సౌంద ర్యములేనిది. ఇత్యాది[లక్షణా]ప్రయోజనరూపమగు వ్యంగ్యార్థమును, వ్యంజింపఁ జేయును" అనిభావము.

—, "ఇచట ధ్వనిలేదు" అని, భట్టనాయకుఁడొనర్చిన పూర్వపక్షము ,—

"[అంధశబ్దమునకిచట ఉత్ప్రేక్షావాచకమగు] అట్లు" [వలె] అనుపదము

తోడియోగము - [సంబంధము] ఉన్నది. కనుక, [ముఖ్యార్థబాధలేదు. కనుక, ముఖ్యార్థబాధవలననగు] గౌణత, యేదియు నిచటలేదు. "[ఇది - అత్యంతతిర స్కృత వాచ్యధ్వనికాదు.]" అని భట్టనాయకుఁడు చెప్పినది- ఈశ్లోకమును పరా మర్శించి, చెప్పినమాటకాదు.

ఏలయనిన :— ఇచటనున్న "అట్లు" శబ్దము. ఆదర్శ, చంద్రమసులకు సాదృశ్యమును ద్యోతింపఁజేయుచున్నది. "నిశ్వసనముతోడి స్పర్శమున నంధము యిన," అనునిది - ఆదర్శమునకే విశేషణమగుచున్నది. ["ఆదర్శమట్లు" అని, అట్లుశబ్దము - చంద్రిమసున కాదర్శముతోడి సాదృశ్యమును దెలుపుచున్నది. కనుక, నిదియుత్ప్రేక్షావాచకము -కాదు.]

భట్టనాయకుని ప్రశ్న :— ['నిశ్వసనముతోడి స్పర్శమున నంధమట్లున్నది - యాదర్శము'. అని] 'అట్లు' శబ్దము నంధశబ్దముతోఁగూర్చి యన్వయించునెడల, [ఇది యుత్ప్రేక్షావాచకమగును. అప్పుడు గౌణతయుండదు.]

ఉ :— అంధశబ్దముతో "అట్లు" శబ్దమునుగూర్చి, యన్వయించునెడల, "అంధమట్లున్న యాదర్శము-చంద్రిమసుఁడు" అని యన్వయింపవలసివచ్చును.

ప్రశ్న :— ఇట్లు యోజింపఁగూడదాయేమి ?

ఉ :— 'అట్లు' శబ్దమునిట్లు యోజించుట క్లిష్టమయినదగును.

ప్రశ్న :— పోనిండు. "నిశ్వసనముతోడి స్పర్శమున, నంధమట్లున్న యాదర్శమునట్లు" అని [అట్లు శబ్దమును రెండుసారులు] అన్వయించినయెడల [అది సంభావనను బోధించును. అప్పుడిది-యుత్ప్రేక్షయగును. అప్పుడెట్టి దోష మునుండదు. దీనికి మీరేమందురు ?]

ఉ :— అట్లు శబ్దమున, కిట్లు రెండుసారులన్వయమును దెలుపునదియగు కల్పన - యుక్తముకాదు. జైమినీయ సూత్రమునందుమాత్రమే - [గత్యంతరము లేనపుడు] ఇట్లు యోజింపఁబడును. కావ్యమునందుఁగూడ, నిట్లు కల్పించుట - యుక్తము కానేరదు.

ప్రభా :— "అట్లు" శబ్దము - సాదృశ్యమునే బోధించును. కనుక, నిది ఉపమయేయగును. "అంధమయిన యాదర్శమట్లు" అని 'అట్లు'ను సాదృశ్య

బోధకమగు నట్లన్వయించునపుడు, అంధశబ్దమునందు ముఖ్యార్థబాధయుండునది యేయగును. కనుక; ఇది - అవివక్షితవాచ్యభేదమగు నత్యంత తిరస్కృతవాచ్య ధ్వని కుదాహరణమగుట సుసంగతమేయగును. ఈశ్లోకార్థమును యుక్తముగాఁ బరామర్శింపకుండుటవలన 'అట్లు'శబ్దమును సంభావనా వాచకముగాఁదెలిపి, భట్టనాయకుఁడిచట ధ్వనిలేదని చెప్పెను." "మేముచెప్పిన యుక్తిచేత - నది-యుక్తముకాదు" అనిభావము.

అవ :— పదగతమగు, అత్యంతతిరస్కృత వాచ్యధ్వని నిట్లుదాహరించి, యిపుడు, వాక్యగతమగుదాని నుదాహరించుచున్నాఁడు.

(5) మూలము : — [వాక్యగతమగు, నత్యంత తిరస్కృత వాచ్యధ్వని కుదాహరణమగు వర్షావర్ణనము.]

గీ॥ మత్త ఘనమయ్యు, నభము - సంపాత సంప్ర
హారలులితమ్ములగుచున్న యర్జునములు
గలిగియు, వనమ్ములు - నిరహంకారశశులు,
నీలములు, నయ్యు, నిశలు- నంధించు ముదమె. (4)

ఇచట, మత్త, నిరహంకార,శబ్దములు. [అత్యంతతిరస్కృత వాచ్యములు.]

పరిభా :— "ప్రియసుందరి యుక్తుఁడనగు నాకు, ఆకాశము- మదించిన మేఘములు గలిగియున్నను, తోటలు - వర్షధారాపాతముచేత నులిచివేయఁబడుచున్న వృక్షవిశేషములు [ఏరుమద్దిచెట్లు] గలిగియున్నను, రాత్రులు - నిరహంకారుఁడగు శశి [మృగాంకుఁడు] గలిగి, నీలములయియున్నను, గూడ - ఔత్సుక్యమునే యొదవించుచున్నవి." అనునది - దీనియందలి, ముఖ్యార్థము.

లోచనము :— ["గగనంచమత్తమేఘమ్" అనుదీని మూలశ్లోకమునందున్న] చశబ్దము-అపిశబ్దార్థకమని ["అయినను" అనునర్థముగలది యని] తెలియునది.

నభము - "మత్తఘనమయ్యు" అనఁగా; "కేవలము. తారకితమగుచునే

కావు'' అనియర్థము. "వనమ్ములు - సంపాతసంప్రహారవలితమ్ములగుచున్న యర్జునవృక్షములు గలిగియు'' అనఁగా; "కేవలము, మలయమారుతాందోళిత సహకారములు గలిగినవియగుచునేకాదు.'' అనియర్థము. "నిశలు - నిరహంకార శశులును, నీలములు నయ్యు''అనఁగా; "కేవలము, సితకరకరధవళితములగుచునే కావు.'' అనియర్థము. "సంధించుముదమె'' అనఁగా; ఉత్సుకునిగాఁజేయుచున్న వని యర్థము.

ప్రభా : అవ :— మీఁది పద్యమున "ఘనమయ్యు.'' ఇత్యాది స్థలము లందుఁగల, అప్యర్థకములచేత గమ్యమగు నర్థములను శ్రీలోచనకర్త- మీవనునిర్మలితమొనర్చి; ఇందలి, మత్త, నిరహంకారశబ్దములు- అత్యంతము దిరస్కరింపఁబడిన వాచ్యముగలవి యెట్లగుచున్నదియు, వానిచేత, నేయర్థములు ధ్వనింపఁజేయఁబడుచున్నదియుఁ, దెలుపుచున్నాఁడు.

లోచనము :— మత్తశబ్దమునకు ముఖ్యార్థము - కల్లుత్రాగుటచేతనగు మత్తెక్కుట. [మైమరవు.] అది- యిచట, సర్వవిధములను సంభవింపని స్వార్థము గలదైయున్నది. కనుక. బాధితమగు ముఖ్యార్థముగల, యీమత్తశబ్దము - సాదృశ్యమువలన - 'మేఘములను - మర్యాదనతిక్రమించినవానినిగా' లక్షింపఁజేసి- అసమంజసకారిత్వము, దుర్నివారత్వము, మున్నగు ప్రయోజనరూపమగు ధర్మ సహస్రమును ధ్వనింపఁజేయుచున్నది. నిరహంకారశబ్దమునకు - అహంకారము లేకుండుట - ముఖ్యార్థము. అది - అచేతనమగు చంద్రునియందు సంభవింపదు. కనుక, నిరహంకారశబ్దముకూడ - సంభవింపని స్వార్థముగలదగుచున్నది. అసంభవత్ స్వార్థమగుటవలన, బాధితమగు ముఖ్యార్థముగల, యీనిరహంకారశబ్దము కూడ - సాదృశ్యమువలన చంద్రుని [మాలిన్యవిశిష్టునిగా] లక్షింపఁజేసి - ఆశశాంకునియందుగల పారతంత్ర్యము, విచ్ఛాయత్వము, ఉజ్జిగమిషారూపమగు, జిగీషను- త్యజించుట, మున్నగు నర్థమును ధ్వనింపఁజేయుచున్నది.

ప్రభా :– "మత్తఘనమయ్యు'' అనుచోనున్న మత్తశబ్దమును, 'నిరహంకారశశులు' అనుచోనున్న నిరహంకారశబ్దమును, మీఁదిపద్యమున, అత్యంతతిరస్కృత వాచ్యములగుచున్నవి ఇచట, మదించుట - జీవధర్మము. అదియచేతనమగు మేఘమునందు సంభవించునదికాదు. కావున బాధితమగు ముఖ్యార్థముగల యీమత్తశబ్దము- మేఘమునందు- "కల్లుత్రాగుటచేత, మత్తెక్కినవానితోడి, సాదృశ్యమువలన, మర్యాద నుల్లంఘించుటను'' ['హద్దుమీరుటను'] లక్షింపఁజేయును-

కాఁగా; "మేఘములు - మర్యాద నతిక్రమించుచున్నవి", అనునర్థము - లక్షిత మగును. తదుపరి, నీశబ్దముచేత - "[ఇప్పుడీమేఘములు] - అసమంజసకారులు, దుర్నివారములు, విశృంఖలప్రసారములు, కనుకనే భయంకరములు, మున్నగు నవి" అనుప్రయోజనరూపమగు వ్యంగ్యార్థము - ధ్వనింపఁజేయఁబడుచున్నది. ఇట్లే, నిరహంకారుఁడగుట- జీవధర్మము. కనుక, నిరహంకారశబ్దమునకు ముఖ్యార్థమగు నభిమానములేకుండుట - అచేతనుఁడగు శశియందు సంభవించునదికాదు.

ప్రశ్న :— అయ్యా ! నిరహంకారశబ్దమునకు ముఖ్యార్థమగు, అహంకారములేకుండుట-చంద్రునియందు-అసంభవమెట్లగును? అచేతనుఁడగు చంద్రుడు-నిరహంకారుఁడేయగును. కనుక, "నిరహంకారశశులు" అనుచోటనున్న నిరహంకారశబ్దము - సంభవించునదియగు స్వార్థముగలదియేయగునే !

ఉ :— చంద్రునియందెప్పుడైన, నెచ్చటనయిన,నహంకారమున్నయెడల, అదిలేకుండుటకూడ, సంభవించును. నిషేధము - ప్రసక్తిపూర్వకముగదా ! అచేతనుఁడైన చంద్రుఁడు - సాహంకారుఁడైనను, నిరహంకారుఁడైనను, గూడ-నాతు సంతోషమునే సంఘటించును. అనునర్థము - "అయ్యన్" అనిదానివేత-వాచ్యము. అచేతనుఁడగు శశి - సాహంకారుఁడును, నిరహంకారుఁడును, గూడఁ గాఁడు. కనుక నిరహంకార శబ్దమునకు ముఖ్యమగునర్థముకూడ - సంభవత్ స్వార్థముకాదు. కనుక, నిరహంకార శబ్దముయొక్క ముఖ్యార్థమునకుఁగూడ. 'నన్వయము కుదురకుండుట'యను బాధయున్నది. కనుక, అత్యంత తిరస్కృత మగు, వాచ్యార్థముగల యీశబ్దముచేతఁగూడ, - నిరహంకారుఁడగు చేతనునితోడి సాదృశ్యమువలన, అచేతనుఁడగు చంద్రునియందు ['శశిశశి - మలినుఁడు 'అని] మాలిన్యము- లక్షితమగును. [తత్త్వజ్ఞానమువలనఁగాక, లౌకికములగు ప్రతిఘాతములవలన, నిరహంకారుఁడగు మనుష్యుఁడు - మలినుఁడుగానుండునుగదా!] తదుపరి నీశబ్దముచేత - నిరహంకారునియందుగల, పరతంత్రత, శోభలేకుండుట, [కాంతిలేమి] ఔన్నత్యమునుగోరుటయే రూపముగాఁగల,ఇయేచ్ఛను, త్యజించుట, అనఁగా; ఉత్కర్షములేకుండుట. మున్నగు ప్రయోజనరూపమగు వ్యంగ్యము - అసంఖ్యాకముగా ధ్వనింపఁజేయఁబడును." అనిభావము. ఇప్పుడీపద్యమున గమ్యమగు నర్థమునిట్లెఱుఁగునది. "నాకువలె, 'ప్రేయసీ నిరంతరసాహచర్యసంపదభ్యుదయముజేని సామాన్యజనులకెవ్వరికయినను, ఆకాశము - భయంకరములగు మేఘములతోఁగూడియుండునపుడు - ఔత్సుక్యమును గలిగించునదికాదు. ఇంతే మనిన; నక్షత్రములతోఁ గూడియుండునపుడే, యౌత్సుక్యము నొదవించును. ఇట్లే, వనములు-వర్షధారాలులితార్జునములుగాక, మలయానిలాందోలితసహకారము

లగునపుడును, నిశలు-కాంత్యాదులులేని చంద్రుఁడుగలవియు, నల్లగానున్నవియుఁగాక, సితకరకిరణ ధవళితములగునప్పుడును మాత్రమే-వారికౌత్సుక్యము నొదవించును.నాకో, అవనము-తాపకితమగునపుడుమాత్ర మేకాక, 'విశృంఖలపరిహారము' మున్నగు ధర్మములుగల మేఘములు గలిగియుండునపుడుకూడ - ఔత్సుక్యము నేసంధించుచున్నది. వనములు- మలయానిలునిచేత చలితములగు తియమామిడులు గలవయి మాత్రమేకాక, వర్షధారాపాతమున లులితములగు నర్జునములనఁగా; 'నేరుమద్దిచెట్లు'గలవగుచున్ననుగూడ - ఔత్సుక్యమునే సంఘటించుచున్నవి. రాత్రులు - సితకరుఁడగు, చంద్రునికిరణములచేత వెన్నెలను విరియఁజిమ్మునప్పుడుమాత్రమేకాక, కాంత్యుత్కర్షాదులులేని, శశాంకుఁడుగలిగి, నల్లనివగుచున్నను [అంధకారబంధురములగుచున్నను] గూడ - ప్రమోద సంధాయకము లేయగుచున్నవి.'' అనునది - వ్యంగ్యవిశేషయుక్తమగు నర్థము.

అవ :— సూత్రకారునికి, వృత్తికారునికిని. గలయైక్యము నంగీకరించి, లోచనకర్త - అవతారిక నొనర్చుచున్నాఁడు.

లోచనము : - వృత్తికర్త, ''అవివక్షితవాచ్య ప్రభేదమును ప్రతిపాదించుటకై'' అనిచెప్పెనుగదా; ''అవివక్షితవాచ్యము నొక ప్రభేదముగాఁ జెప్పుట యేల ? అది - దేనికంటెభిన్నము ? [దేనికైనను] స్వస్వరూపమునందునే, భేదముకలుగదుగదా !'' అనిశంకించి, ''వివక్షను, వివక్షలేకుండుటను, విరోధముండును. కనుక, [వాచ్యార్థమునకు వివక్షగల] వివక్షితాన్యపరవాచ్యముకంటె. [వివక్షలేని] అవివక్షితవాచ్యమునకు భేదముకలుగును'' అను నభిప్రాయముచేతఁ జెప్పుచున్నాఁడు.

(6) మూలము : —

[కా] అసంలక్ష్య క్రమోద్ద్యోతః, క్రమేణద్యోతితః పరః।
వివక్షితాభిధేయస్య ధ్వనేరాత్మాద్విధామతః. (2)

ద్విపద :- ఒకఁడసంలక్ష్య క్రమోద్ద్యోత, మింక
నొకటి, సంలక్ష్యక్రమోద్ద్యోత, మనఁగ,
తగ, వివక్షితవాచ్యమగుచుండు, ధ్వనికి -
నగురూపము - ద్విభేదమనుట- సమ్మతము. (2)

ముఖ్యముగా [ప్రధానముగా] ప్రకాశించు వ్యంగ్యమగు నర్థము - ధ్వనికాత్మ. [ప్రధానమగువ్యంగ్యమే-ధ్వనిస్వరూపము.]

లోచనము :— "అసంలక్ష్యక్రమోద్ద్యోతము" అనఁగా; "చక్కఁగాలక్షించుటకు [గుర్తించుటకు] శక్యముకాని క్రమముగలదియగు, ఉద్ద్యోతనవ్యాపారము [వ్యంజనావ్యాపారము]కలది." అనిబహువ్రీహిసమాసము నాశ్రయింపవలయును.

ప్రభా : అవ :— "వివక్షితాన్య పరవాచ్యమగు ధ్వనికి" అనిచెప్పక, "వివక్షితవాచ్యముగుచుండు ధ్వనికి" అని; వృత్తికర్త - యేలచెప్పెను ? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— "వివక్షితవాచ్యముగుచుండు ధ్వనికి" అనుచోట వివక్షిత వాచ్యమనునుక్తి - ధ్వనిశబ్దమునకు సన్నిధినుండుటవలన, వివక్షితమగు, నావాచ్యమునందు - అన్యపరత్వము [వ్యంగ్యపరత్వము] ఆక్షేపింపఁబడుటవలన - [వృత్తికర్తచేతనది] స్వకంఠమునఁ జెప్పఁబడినదికాదు.

ప్రభా :— "వివక్షిత వాచ్యధ్వని" అనఁగా; "వివక్షితాన్యపరవాచ్య ధ్వని", అనియే, యర్థమనునది - ఫలితార్థము.

లోచనము :— "ధ్వనికి రూపము", అనఁగా; "వ్యంగ్యమున కాత్మ" [అనఁగా; ప్రధానముగాఁ బ్రకాశితమగు వ్యంగ్యముయొక్క స్వరూపము] అని యర్థము. [ఇచటి విశేషమేమనిన;] కడచిన శ్లోకముచేత- వ్యంగ్యమునకు వాచ్యద్వారమున, భేదము చెప్పఁబడినది. ఇప్పుడో, [మీఁది శ్లోకమునందుమాత్రము] ద్యోతన [వ్యంజనా]వ్యాపారముఖమున-ద్యోత్యమునకు [వ్యంగ్యమునకు] స్వాత్మనిష్ఠమేయగు భేదము చెప్పఁబడినది.

అవ :— "ధ్వనియగువ్యంగ్యము- ద్యోతింపఁజేయఁబడునపుడు, స్వాత్మయందగు [ధ్వనిరూపమునందగు] క్రమమేది ?" అనియాశంకించి. వృత్తికర్త- చెప్పుచున్నాఁడు.

(7) మూలము :— అదికూడ - [వివక్షితాన్యపరవాచ్య ధ్వనికూడ] వాచ్యార్థము, [విభావాదికము] నపేక్షించి, అసంలక్ష్య క్రమతచేత, నొకటియు, సంలక్ష్యక్రమతచేత, నొకటియు, ప్రకా

క్షించుటవలన- ద్వివిధమని సమ్మతమగుచున్నది.

లోచనము :— 'వాచ్యార్థమునపేక్షించి'' అనఁగా; 'విభావాదుల నపేక్షించి' అనియర్థము.

ప్రభా :— మీఁది లోచనమునందలి యర్థమునిట్లు భావించునది. ద్యోతనమను నామాంతరముగల వ్యంజనావ్యాపారముచేతఁ బ్రకాశింపఁ జేయఁబడిన యర్థము - వ్యంగ్యము. అది - ప్రధానముకానపుడు - వ్యంగ్యమనియే, చెప్పఁబడును. అదియే.ప్రధానమగునపుడు.'ధ్వని' అనిచెప్పఁబడును. కనుక. వ్యంగ్యములగు రసభావాదులు - ప్రధానములగునపుడు - ధ్వనులగును. ప్రధానవ్యంగ్య రసాదిధ్వనిప్రతీతికి - వాచ్యములగు విభావాదుల ప్రతీతియే, కారణము. కనుక, రసాదిప్రతీతికంటె ముందు, విభావాదిప్రతీతిని జెప్పవలసియుండును. కనుక, వానికిఁగ్రమమును జెప్పకతీరదు. కనుక, వాచ్యవిభావాది ప్రతీతికిని, రసాదిధ్వని ప్రతీతికిని, నిజటక్రమము - కల్పింపఁబడినది. శతపత్ర పత్త్రములను భేదించునపుడు [వేధించునపుడు] పత్త్రభేదనమునందు పూర్వాపరభావరూపమగు, క్రమమున్నను, శీఘ్రతవలన - ఆభేదనక్రమము-సంలక్ష్యముకానట్లు, వాచ్యవిభావాది ప్రతీతికిని, రసాదిధ్వనిప్రతీతికిని, పూర్వాపరభావరూపమగు క్రమమున్నను గూడ - అత్యధికమగు ప్రతీతి శీఘ్రతవలన, వానికిఁగలక్రమము - చక్కఁగా గుర్తింపఁదగినదియుండునది, కాకుండును. కనుకనే; రసాదులు - అసంలక్ష్యక్రమ ధ్వనిభేదములుగాఁ జెప్పఁబడినవి: ఈరసాదులప్రతీతి-విభావాదులప్రతీతి కలిగిన పిమ్మటనే, కలిగినను, ఆవిభావాదుల ప్రతీతితోఁగూడియుండునదివలెనే, కానిపించును. [వాచ్యార్థమును, రసాదిధ్వనులును, నొక్కసారిగనే, స్ఫురించినట్లు భ్రాంతి కలుగును.] కొన్నిచోట్లను, ధ్వనినుండిపుట్టిన ప్రతిధ్వనివిషయమై, వాచ్యప్రతీతికిని, ప్రధానముగా, వ్యంగ్యములగు వస్త్వలంకారధ్వనుల ప్రతీతికిని, గల పూర్వాపర భావక్రమము - చెప్పనాగుర్తించుటకు వీలుపడునదియగుచుండును. కనుక. నట్లు సంలక్ష్యమగుక్రమముగల. ప్రధానవ్యంగ్యము-"సంలక్ష్యక్రమధ్వని'' అనిచెప్పఁబడినది. అన్వయబోధమునకు విషయముగానపేక్షింపఁబడునదియు, వ్యంగ్యమున కంగమగునదియు, నగు వాచ్యముగలధ్వని - "వివక్షితాన్యపరవాచ్యధ్వని'' అని చెప్పఁబడినది. దానియందలిభేదములగు, అసంలక్ష్యక్రమధ్వనియు, సంలక్ష్యక్రమ ధ్వనియు, వాచ్యమునపేక్షించిన-క్రమముగల వ్యంజనావ్యాపారమును గలిగియున్నవి. కాఁగా; వివక్షితమును, అన్యపరమును, నగు వివక్షితాన్యపరవాచ్యధ్వనికిఁ గల భేదములయందు మొదటిది - 'అసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వని.' రెండవది - 'సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వని'. అని చెప్పఁబడినవి.'' అనునది - ఫలితార్థము.

(8) మూలము :— తత్ర,

[కా] రసభావతదాభాస, తత్ ప్రశాన్త్యాదిరక్రమః।
ధ్వనేరాత్మాఽఙ్గి భావేన భాసమానో వ్యవస్థితః. (3)

అందు—

కం॥ రసమును, భావమ్మును, తద్
రసభావాభాసములును, తత్ప్రశమాదుల్,
వెస, నక్రమమ్ము, నంగి
త్వసముద్ద్యోతితము, నగుచు, ధ్వనికాత్మయగున్ (3)

ప్రభా :— "అంగిభావముచేత భాసించుచున్న రసము, భావము, [భావస్థితి] రసాభాసము. భావాభావము, భావశాంతి, భావోదయము, భావసంధి, భావశబలత, అనునవి - అసంలక్ష్యక్రమధ్వనికి స్వరూపము'' అని, కావ్యములందంతటను వ్యవస్థితము.'' అనిదీనియర్థము. ఇట్లన్వయించునపుడు, రసము, భావము, మున్నగునివి, అసంలక్ష్యక్రమధ్వనులేయగునని సిద్ధించును. "ఇందుభావాదులొకప్పుడు సంలక్ష్యక్రమములుగూడ నగుచుండును'' అనియంగీకరింపఁబడుటవలన, నీయర్థము బాధితముకావలసివచ్చును. కనుక, లోచనకర్త - ఇచటఁ జెప్పఁదగిన యర్థమును వ్యాఖ్యానించుచున్నాఁడు.

—• రసాదిధ్వని - సంలక్ష్యక్రమముకూడనగునా ? •—

లోచనము :— 'అందు,' అనఁగా,''అసంలక్ష్యక్రమ, సంలక్ష్యక్రమముల నడుమను'' అనియర్థము. వానిలో రసాద్యర్థమే - అసంలక్ష్యక్రమ ధ్వనిస్వరూపము. [అట్లని] రసము. భావము, మున్నగునది - అసంలక్ష్యక్రమముమాత్రమే యగునదికాదు. [ఏలయనిన] ఈ [రస] భావాదిక మొకానొకపుడు సంలక్ష్యక్రమముకూడ నగుచుండును. అప్పుడుదీనికి. అర్థశక్త్యుద్భవాను స్వానరూపభేదతకలుగును. అని ["అమరర్షి'' మున్నగు వక్ష్యమాణోదాహరణ పురస్సరముగా] ముందు చెప్పఁబడును. స్వభావవచనమగు నాత్మశబ్ద. మిచట ప్రకారమును దెలుపును. దీనిచేత, "రసము మున్నగునర్థము - ధ్వనికి సంబంధించిన అసంలక్ష్యక్రమమును భేదము'' అని సిద్ధించును.

ప్రభా : — "అమరర్షి" అని యీయుద్ద్యోతమునందే ముందు ప్రదర్శింపఁ బడు నుదాహృతియందు- స్ఫురింపఁజేయఁబడిన "లజ్జ" అను, భావము- సంలక్ష్య క్రమధ్వని యగుచున్నది. కనుక, నొకానొకప్పుడీ భావాదులు - సంలక్ష్యక్రమ వ్యంగ్యములగు ధ్వనులుగూడ నగును. అయినను, నంగిగాభాసించునవియగు రసాదులు - అసంలక్ష్యక్రమధ్వనికి సంబంధించిన నామభేదములేయగును. కాని. సంలక్ష్యక్రమధ్వనికి సంబంధించిన నామభేదములుకావు. "ధ్వనికాత్మయగున్" అనువాక్యమున కిచట, 'ధ్వనిభేదమగున్' అనునదియర్థముగాఁదెలియవలయును. అప్పుడు - "అంగిత్వముచేత భాసించునవియగు రసాదులు - అసంలక్ష్యక్రమ ధ్వనికి సంబంధించిన నామభేదములు" అనియేర్పడును. "భావాదులొకప్పుడు సంలక్ష్యక్రమధ్వనులయినను, అవి - సంలక్ష్యక్రమధ్వనికిసంబంధించిన నామ భేదములుగాఁ జెప్పఁబడునవికావు" అనునది - దీనిభావము.

లోచనము : ప్రశ్న : రసాదిరూపమగునర్థము - ఎప్పుడునుగూడ [ప్రధానమగునట్లు ధ్వనింపఁజేయఁబడునపుడును, అప్రధానమగునట్లు ధ్వనింపఁ జేయఁబడునపుడనుగూడ] ధ్వనిప్రకారమేయగుచుండునా ?

ఉత్త :— కాదు. "అంగిత్వసముద్ద్యోతితమునగుచు, ధ్వనికాత్మయగున్" అనుదానిచేత - "ఎప్పుడీరసాదులు - అంగిగా, అనఁగా; ప్రధానముగా, భాసించునవియగునో, అప్పుడు మాత్రమే- ధ్వనిప్రభేదములగును" అనిచెప్పఁబడినది. 'అంగియగు నర్థమే - ధ్వని'అను నియంశముకూడ - అర్థముయిన, శబ్దముయిన, స్వార్థములుపసర్జనీకృతములుగ" అనిచెప్పఁబడిన, [ధ్వని] సామాన్యలక్షణమున, నిరూపింపఁబడియేయున్నది. అయినను, రసవదాదులగు నలంకారములను ప్రకాశింపఁచేయుట కవకాశము నొసఁగుటకిట్లు పూర్వోక్తమగు నంశమే- అనువదింపఁ బడినది.

ప్రభా : — "రసాదులు - అంగిగాభాసించునపుడు - ధ్వనిభేదమగును" అనునపుడు, "అంగముగా భాసించునపుడేమగును ? అనుజిజ్ఞాసకలుగును. కనుక, "అంగములగునపుడు - రసాదులు - రసవదలంకారము మున్నగు నలంకారములగును."అని, ప్రకాశింపఁజేయుటకు- "పూర్వోక్తకారికావిషయమే- అనువదింపఁబడినది. కనుక నిచట పునరుక్తతాదోషములేదు" అనిభావము.

లోచనము :— అదికూడ [ఆ రసవదాద్యలంకారముకూడ] రసాదిధ్వని యందు వ్యవస్థితమేయగును. కావ్యమేదియుఁగూడ రసాదిశూన్యముకాదుగదా ;

ప్రభా :— "కొన్నిచోట్ల, రసాదికము -ప్రధానమగు, నంగికాక, అంగమగునపుడు, తానే-రసవదాద్యలంకారమగును. రసవదాద్యలంకారముగల, యాకావ్యమునందుఁగూడ, ఆయలంకారము - ఆకావ్యమున, ప్రధానమగు రసాదికము నలంకరించునదియేయగును." అనిభావము.

— • భావము మున్నగునవికూడ - ధ్వనింపఁజేయఁబడును. •—

లోచనము :— కావ్యమంతయుఁగూడ-రసముచేతనే జీవించును. అయినను, ఏకమును, ఘనమును, చమత్కారాత్మకమును, కావ్యజీవితమును, నగురసమునకుఁగూడ - ప్రయోజకీభూతమగు నొకానొకయంశమువలన [రసాంగభూతమగునేదోయొక యంశమువలన] ఈచమత్కారమధికమగుచుండును. అచట, నెప్పుడు - ఉద్రిక్తమగు నవస్థనొందినయొకానొక వ్యభిచారిభావము - చమత్కారాతిశయ ప్రయోజకమగుచుండునో, అప్పుడది - భావధ్వనియగును.

ప్రభా :— "భావాదికముకూడ - ధ్వనింపఁజేయఁబడి, కావ్యమునందుఁ బ్రధానమగు రసమునకు, చమత్కారాతిశయమును గలిగించును" అని దీని భావము.

లోచనము : దీనికుదా :— [విక్రమోర్వశీయ నాటకమునందిది-పురూరవసుని వచనము]

శా. అంతర్ధానము నొందెనోయలుక, దీర్ఘామర్షకాదామె, స్వః
క్రాంతిన్ జెందునె, నాయెడన్ సమధికార్ద్రస్వాంత యాకాంత, ఆ
యింటిన్ నాయెదుటన్ హరింపఁగలరే యేదైత్యులున్‌గూడ, న
త్యంతమున్ గనరానిదయ్యె నదియున్, హా! యెంతదౌర్భాగ్యమో!

ఇచట (ప్రధానమై) విప్రలంభ శృంగారరసమున్నను, ఏతత్పద్యార్థమును మాత్రమే గ్రహించునప్పుడిచట, "వితర్కము" అనుపేరుగల వ్యభిచారిభావము' నకు సంబంధించిన చమత్క్రియచేతఁ బ్రయోగింపఁబడిన, యాస్వాదాతిశయము కాన్పించును.

వ్యభిచారులు - ఉదయము, స్థితి, అపాయము, అను మూడుధర్మములు గలవైయుండును. 'వివిధమ్, ఆభిముఖ్యేన, చరన్తి' ఇతి = వ్యభిచారిణః. "బహువిధములై, అభిముఖములగునట్లు, [ఒకదాని-ముఖమింకొకదాని కెదురుపడునట్లు,].

చరించునవి = వ్యభిచారులు.'' అని పెద్దలుచెప్పియున్నారుగదా!

ప్రభా :— భావమనఁగా; వ్యభిచారిభావము. ఈవ్యభిచారులకుదయము, స్థితి, ప్రశాంతి, అనుధర్మములున్నవి. ఈధర్మము లవస్థారూపములు. మీఁది పద్యము- వ్యభిచారియను భావమునకు సంబంధించిన స్థితికుదాహరణము. ''భావ స్థితియే - భావము.'' అని చెప్పఁబడును. తనతోఁ గలిసిమెలసియుండిన, యప్సరః కాంతయగు నూర్వశి - కారణాంతరమున, దనకంటికిఁ గాన్పింపనపుడు - పురూరవుఁడిట్లు వితర్కించెను. కనుక, నిది - వితర్కమను వ్యభిచారి భావస్థితి కుదాహరణమని గుర్తించునది. ఈభావములలో, ఒకభావమునకు - తుల్యకక్ష్యగల, యింకొకభావముతోడి సమావేశమున, నొక్కసారిగనే సహృదయుల కొదవునది యగు నాస్వాదము - ''భావసంధి'' అనిచెప్పఁబడును. ఒకదానినొకటి బాధించు నవియగుచు, విరోధులగు ననేకభావములకు - ఒకచోనగు సమావేశమున, సహృదయులకొదవునదియగు, నాస్వాదము - 'భావశబలత' అనిచెప్పబడును.

లోచనము :— అందొకానొకప్పుడు - ఉదయావస్థచేత [ఉదయమునకున్ముఖమగు నవస్థచేత] ప్రయుక్తమగు, చమత్కారముగలదియగు, భావమునకు [అనఁగా, భావోదయమునకు] ఉదాహరణము :—

పొగడ. [నూతనముగాఁ గూర్పఁబడిన చాటియమగు పద్యము.]

తరుణి ప్రియునితోఁ బవళించెన్, పరతరుణి నామమూహించెన్,
పరివర్తనమొనరించెన్, మఱి, తత్ప్రారంభము నుపశమించెన్,
దిరుగ యతించెన్, వెలికొక బాహువుఁ దెరలిచి, పరివర్తించెన్;
పరునురమంటిన స్తనభరమునో, వెలువరింపనవశతఁ గాంచెన్.

ప్రభా :— ''తన్వంగియగు నొకతరుణి - ప్రియునాలింగన మొనర్చుకొని, పవళించినది. (శయనించినది) కాంతునిపలవరింతలో, అతఁడువాకొనిన పరకాంత పేరునాలించినది. ప్రియునికెదురుగానున్నతాను - వెనుకకుఁదిరుగవలయునని, బాగుగా నాలోచించినది. దిటముగా నాలోచించి, యెట్లో పరివర్తనమునకంగీకరించినది. అప్పుడు తిరుగ, వెనుకకుఁదిరుగుటకుయత్నించినది. ప్రియునికంఠమున లగ్నమైన యొకబాహులేఖ, నెట్లోవెలుపరించి, యుంచుక, పరివర్తించినదికూడ. అయినను, వాని వశమునఁ జిక్కినదియు [illegible] లశము

లనుమాత్రము, వెలువరించుటకు [సుఖపారవశ్యమున] అశక్తతనే కాంచినది.'' అనిదీనియర్థము.

లోచనము :— ''ఎరుసురమంటిన స్తనభరమునో, వెలువరింప, నవశతఁ గాంచెన్'' అనువాక్యముచేత [ఆతరుణికొదవిన] ప్రణయకోపోదయమున కవకాశము - నిరాకరింపఁబడినది. కనుక, నిచట, నాకోపము - [ఉదయింపక] ఉదయించుట కున్ముఖమగు నవస్థయందే నిలిచిపోయినది. ఇట్లాతరుణికి, ప్రణయరోషము - తానుదయించుట కున్ముఖమగు నవస్థయందుండుటయే[సహృదయులకగు] ఆస్వాదమునకు జీవితమగుచున్నది.

ప్రభా :— మీఁది పొగడకు మూలమగు శ్లోకమిట్లున్నది.

''యాతే, గోత్రవిపర్యయే, శ్రుతిపథం, శయ్యామనుప్రాప్తయా
నిర్ధ్యాతం పరివర్తనం, పునరపి ప్రారబ్ధుమఙ్గీకృతమ్, ।
భూయస్తత్ ప్రకృతం, కృతంచ, శిథిలక్షిప్తైకదోర్లేఖయా
తన్వఙ్గ్యానతుపారితః స్తనభరః క్రష్టుంప్రియనోష్మరసః'' అని.

''మీఁది పద్యమున, ప్రియభర్తయెడ - గాఢానురాగిణియగు, నొకతరుణి-వరుని యురమునంటిన, బరువైనస్తన కలశములను వెలువరింపఁ జాలకుండుటకు హేతువు - ప్రియసమ్మేళన సుఖపారవశ్యము. ఇచట, ప్రియుఁడు- వేరొకతరుణి నామమును వాకొనుటవలన, నీమెకొదవినదియు, ఈర్ష్యావిప్రలంభ శృంగారమున కభివ్యంజకమగునదియు, నగు కోపోదయము - [భావోదయము - ] ఇచటి 'పరివర్తనము' [వెనుకకుఁదిరుగుట] అను, ననుభావముచేత, ధ్వనింపఁజేయఁబడినది. మొదట ''(1) పరివర్తింపదలచుట, తదుపరి (2) దానినంగీకరించుట, పిమ్మట (3) దానికై యత్నించుట, తరువాత (4) బాహువునాకర్షించి, యించుకపరివర్తించుట,'' అనుపరివర్తనావస్థలిచట, వర్ణింపఁబడి, దానిచేత, నీకోపోదయమిచట, స్ఫురింపఁజేయఁబడినను, ''అతరుణి, వరునియురమునంటి - బరువెక్కియుండిన, కుచములనుమాత్రము- వెలువరింపఁజాలనిదయినది.'' అనిచెప్పుటవలన, ఈకోపభావోదయము - పూర్ణముగా ధ్వనింపఁజేయఁబడినదికాదు. కనుక, నీకోపభావోదయము - సుముఖముగాక, ఉన్ముఖమేయయినది. అయిననిదియే - సహృదయాస్వాదమునకు జీవితమునొసగుచున్నది కనుక, నిది-భావోదయమున కుదాహృతిగానీయఁబడినది'' అనితెలియునది.

లోచనము :— ''అంతర్ధానమునొందెనో'' అను, భావోదాహరణమే -

భావస్థితి కుదాహరణమని తెలియునది, కొన్నిస్థలములయందుమాత్రము, వ్యభిచారి యగు భావమునకు ప్రశమావస్థచేతనే, చమత్కారము ప్రియుక్తమగును. [''ఈర్ష్యావిప్రలంభ వ్యభిచారిభావమగు 'రోషము' అను, భావమునకు సంబంధించిన ప్రశమముగా] వెనుక నుదాహరింపఁబడిన, ''ఒకశయ్యన్ మొగముల్ మలంచుకొని'' అనునది - భావప్రశమమున కుదాహరణముగా గ్రహించునది. ''ఇచట నీయుదాహృతినే - ఈర్ష్యావిప్రలంభ శృంగారరసమునకుఁగూడ - ప్రశమముగా యోజింపఁజేయుటకును వీలుపడును.

ప్రభా :— ''దీనిని రసప్రశమమనుట-ఆనందవర్ధనాభిమతముకాదు. ఇది-లోచనకర్తయగు, అభినవగుప్తాచార్యుని స్వాభిప్రాయము'' అనితెలియునది. రసోదయాదులు, పృథక్కుగా గణింపఁబడునవి - కావు. భావానుబంధులగు ప్రశమ, ఉదయ, సంధి, శబలతలే- ఆస్వాదపదవినందును. రసమునకు భావద్వారముననే, యాస్వాదరూపత సిద్ధించుట-యుక్తము.

లోచనము :— కొన్నిచోట్లను, వ్యభిచారిభావమునకగు సంధియే -చర్వణాస్పద [ఆస్వాదస్థాన] మగుచుండును.

— • భావసంధి కుదాహరణము :—

మంజరి : — ఈర్ష్యాక్రుధలలిత, మాయింతి నెమ్మొగముఁ -
బ్రార్థించి, ముద్దాడె నాభాగ్యశాలి,
అమృత రసప్రసారముఁ గ్రోలనొదవు
సంతృప్తి సంవిత్ ప్రసారమ్మొఁగనియె.

అను, నిచట, కోపము - క్రుధవ్యక్తమయినను [ఈర్ష్యాశబ్దముచేత వాచ్యము యినను] కోప - ప్రసాదసంధి-వ్యంగ్యమగుచున్నది. ఈర్ష్యచేతనొదవిన కోపము చేత, కషాయమును, గద్గదమును, నగుచున్న, స్వరముతో - మెల్లగా [చల్లగా] నేడ్చుచున్న [ముగ్ధయగు] సుందరీమణి నెమ్మొగమును- ఎవఁడు-[ఏపురుషుఁడు-లాలించిలాలించి] ముద్దుఁగొనెనోవాఁడు [ఆభాగ్యశాలి] విశ్రమించి, విశ్రమించి, యొనర్చునదియగు, నమృతరసనిగరణము [ఆస్వాదము] చేతనగుతృప్తిజ్ఞానమును బడసెను.'' అను [వాచ్యముగు] అర్థముపలన- ధ్వన్యమానమగుచున్న, కోప - ప్రసాదసంధియే - యిచట, చమత్కారస్థానము.

ప్రభా :— ''ఆమె - ఒకముగ్ధసుందరి. ఏపొతోభర్తయందీసుఁగొనినది,

కోపమున మొగమెఱ్ఱపడినది. గద్గదముగాను, మందముగాను, నేడుపురాగము తీయసాగినది. భర్త - ఆమెను లాలించి, లాలించి, యెట్లోయొకసారియొకముద్దుఁ గొనెను. ఇఁక వానియానందమునకు మేరయేమున్నది? కనుకనే, విశ్రమించుచు, విశ్రమించుచు, అమృతరసపరిసారమును గ్రోలుచున్నట్లు అతఁడా భావనారూప మగు ముద్దుయొక్క తీపినే, [స్మరించి,స్మరించి] చిరకాలమనుభవించెను.'' అను నది యిందలి వాచ్యార్థము.

ఇట్లిచట - వాచ్యమగు నేడుపుచేత - కోపమును, ఒకసారియైనను, ముద్దుఁ గొననిచ్చుటచేత - ప్రసాదమును, ధ్వనింపఁజేయబడినవి. ఈ'కోప-ప్రసాదసంధి యే' యిచట చమత్కార స్థానమగుచున్నది.

కొన్ని స్థలములయందు పెక్కులగు, వ్యభిచారిభావములకగు, శబలతయే-[సహృదయహృదయమునకు] విశ్రాంతి స్థానమగుచుండును.

— • భావశబలత కుదాహరణము • —

మ॥ ''అకృతమ్మెందు కులమ్మునన్ గలదె ? నాకాకాంత కాన్పించునే ?
యిఁక నాజ్ఞానము - దోషనాశకముగాదే ? అల్గినన్ గాంత, మా
మొక; మహో ! కృతులేమియంద్రొ ? కలనేఁబూఁబోఁడి-యెట్లబ్బు ? నై
ర్మల్యకృతిన్ గొమ్ము మనమ్మ! మోవిఁగొనుధన్యాత్ముండు వాఁడెవ్వఁడో ? ''

ప్రభా :— ఇది - దేవయాని నభిలషించిన యయాతివాక్యము. విక్రమో ర్వశీయమునందలి చతుర్థాంకమునఁగూడ, నిదియధికపాఠముగా నొకచోఁగాన్పిం చుచున్నది. ఇది - [దీని ద్వితీయభాగమునందున్న] తృతీయోద్ద్యోతమున వృత్తి కారునిచేత నుదాహరింపఁబడినది. [ద్వితీయభాగమునందలి 121వ పేజీని జూచు నది.] అచట, ప్రభామతియందిది - విస్తరించి, వ్యాఖ్యానింపఁబడినది.

లోచనము :— ఇచట, [వ్యంజితములగు] వితర్క - ఔత్సుక్యములు, మతి - స్మరణములు, శంకా - దైన్యములు, ధృతి - చింతనములు, పరస్పరబాధ్య బాధకభావమున, ద్వంద్వములుగానుండి, చివరకు[చివరివాక్యమునవ్యంజితమగు] చింతకే ప్రాధాన్యమునొసఁగుచున్నవై, పరమాస్వాద స్థానముగుచున్నవి. ఇట్లే తదితరములనూహింపుకొనునది. ''ఉదయము, సంధి, శబలత'' మున్నగునివి-కారికయందు, ''తత్ప్రశమాదుల్'' అనుచోనున్న, ఆదిశబ్దముచేత, గ్రహింపఁ బడినవి. భావముయొక్క ప్రశమముచేనగు నాస్వాదము - దాని-ఉదయాదులచేత నగు నాస్వాదముకంటె-చమత్కారకృతమగు,అతిశయాధిక్యము గలదియగునను

నభిమతమున, భావప్రశమము - ముందుగా గ్రహింపఁబడినదని తెలియునది.

—• ధ్వనింపఁజేయఁబడిననుగూడ - విభావానుభావములకు విభావానుభావధ్వను లను వ్యవహారములేదు. • -

— • పూర్వపక్షము • —

లోచనము : ప్రశ్న :- అయ్యా! విభావముఖముననను,అనుభావముఖముననను గూడ - ఇట్లే - అధిక చమత్కారము కాన్పించుచుండును. కనుక, నపుడువానిని, 'విభావధ్వని,' అనియు, 'అనుభావధ్వని' అనియుఁ, గూడఁజెప్పదగును. [దీనికి మీరేమందురు ?]

ఉ :-- [విభావములు, అనుభావములు, ధ్వనింపఁజేయఁబడునని] చెప్పఁ దగదు. విభావానుభావములు-[ముఖ్యముగా] స్వశబ్దవాచ్యములేయగుచుండును. ఆవిభావానుభావములచర్వణకూడ – [అనుభవముకూడ] చిత్తవృత్తులగుస్థాయి· వ్యభిచారిభావముల, చర్వణయందే ముగింపునొందును. కనుక, [వానియాస్వా దము] రసభావములకంటె, నధికముగా చర్వణీయముగునదికాదు. ఒకప్పుడువిభా వానుభావములుకూడ - వ్యంగ్యములగునెడల, వానినేమనవలయునని యడుగు చున్నారా ? అప్పుడవి - వస్తుధ్వనియనుట- మీకు సహ్యముకాదా ? [అప్పుడవి- వస్తుధ్వనులేయగును.]

ప్రభా :— ''విభావానుభావములు - సామాన్యరూపమున వాచ్యములుగా నేయుండును. అట్లుండునపుడే - అవి, చమత్కారులగును. అవియే - రత్యాదు లగు చిత్తవృత్తులను ధ్వనింపఁజేయును. అవియు, ధ్వన్యమానములగునెడల, వస్తు ధ్వనులుగాఁబేర్కొనఁబడును. కాని, ''విభావధ్వని - అనుభావధ్వని'' అనిపేర్కొ నఁబడవు. రసభావములయందే, చిత్తమునకు విశ్రాంతిలభించును. కనుక, ధ్వనిం పఁజేయఁబడిన విభావానుభావములుకూడ - వస్తుధ్వనులగుచు, రసభావముల యందే పర్యవసానమునొందును.'' అనిభావము.

— • రసాభాసమననేమి ? • —

అవ : — ''తదాభాసాభాసములును'' అని కారికయందుఁ దెలుపఁబడిన, అభాసములను నిరూపించుచున్నాఁడు.

లోచనము :— విభావానుభావాభాసమువలన, రతికాభాసముదయించు

నపుడన్ననో, 'ఆ' విభావానుభావముల యాభాసమువలన, చర్వణకునునాభాసము కలుగును. కనుక నది - రసాభాసమునకు విషయమగును. ఈరసాభాసమున కుదాహరణము - రావణకావ్యమును [వాక్యమును] వినునపుడాస్వాదింపఁబడు నదియగు శృంగారాభాసము.

ప్రిభా :— విభావ, మాభాసమగునపు డనుభావ, మాభాసముఁగలదియ గును. వానివలన, రసమాభాసమగును.

అవ :— "శృంగారాభాసమువలన, హాస్యరసాభాస చర్వణకలుగదా?" అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

-✦ శృంగారరసాభాసానుభవము-మొదట, శృంగారరసానుభవముగా నేతోచును ✦-

లోచనము :— "శృఙ్గారానుకృతిర్యాతునహాస్యః"

"ఏది - శృంగారము ననుకరించునదిమాత్రిమే యగుచుండునో, అది-హాస్యము." అని [శృంగారాభాసము - హాస్యమేయని] [భరత] మునిచేత నిరూపింపఁబడినమాట నిజమే. అయినను, నచట, [రావణవాక్యమును వినునపుడు -] కలుగునదియగు, హాస్యరసానుభవము - ఔత్తరకాలికము. ["దూరాకర్షణ" అను వాక్యమును వినునపుడుకాక, తదుపరి కలుగునదియేయగును.]

ప్రిభా :— "పౌర్వాపర్యవివేకమునొందిన సహృదయుల హృదయమున హాస్యరసానుభవముదయించును" అనిభావము.

"సహృదయులకిచట, మొదటశృంగారచర్వణారూపముననే, శృంగారాభాసచర్వణకలుగును. తదుపరి, "రావణునకీయభిలాష, మనుచితము" అను వివేకము నొందినపిమ్మటనే, సహృదయహృదయమున, హాస్యరసానుభవము కలుగును" అని భావము.

అవ :— దీని కుదాహృతి నొసఁగుచున్నాఁడు.

లోచనము :—

శా॥ దూరాకర్షణ మోహమంత్రమువలెన్ దోచున్ శ్రుతిన్ 'సీత' యన్
పేరానామముపీడి, కాలకలయున్ వేగింపలేదీమన, ।

స్వైరూపమ్మను ప్రీతిఁగొల్పదు, స్మరాధీనమ్ము లీయంగముల్,
వైరమ్మూను, నెఱుంగ, నాకెటులు, తత్ప్రాప్తిప్రియంబబ్బునో''.

అను నిచటనుమాత్రము [మొదట] హాస్యచర్వణ కవసరములేదు.

ప్రభా :— మొదట నీవాక్యమును వినినసహృదయులు - శృంగారాభాస మునే - శృంగార రసరూపముగా నాస్వాదింతురు. కనుక, సహృదయులకిచట, హాస్యరసానుభూతి - కలుగదు.

లోచనము : ప్రశ్న : – అయ్యా! యిచట-స్థాయిభావమగు రతిలేదా ?

ఉ :— ఒండొరుల కిచట-ప్రేమబంధములేదు, కనుక నిది - రతియని యెవడుచెప్పెను ? [మీఁది పద్యమునందుఁ బ్రతీయమానమగునది - అభిలాషరూప మగు చిత్తవృత్తియేకాని, స్థాయిభావరూపమగు రతికాదు.]

అది-[రావణునికి సీతయందొదవినయభిలాషరూపమగు చిత్తవృత్తి-'స్థాయి యగు రతిగా', నాభాసించునదియగు] రత్యాభాసమేయగును.

''సీత - నాయందుపేక్షగలది'' అనుజ్ఞానముగాని, ''ద్వేషముగలది'' అను జ్ఞానముగాని, ఈరావణుని హృదయమును స్పృశింపనిదేయగుచున్నది. ఆజ్ఞాన మాతనిహృదయమును స్పృశించియేయుండినయెడల, ఆరావణునికొదవిన యభి లాషముకూడ - విలయముఁనొందియే యుండెడిని.

ప్రభా :— ''సీత- తనయందనురక్తకాదు'' అనినిశ్చయముండినయెడల, రావణునికొదవిన యభిలాషము - నశించియేయుండెడిది'' అనిభావము.

లోచనము :— [కేవలమును] కామకృతమగు మోహమువలన, - అత నికి ఈసీతనాయందనురక్తయను నిశ్చయము లేకుండుటకూడలేదు. ['అనురక్త' యను నిశ్చయమును, 'అననురక్త'యను నిశ్చయమునుగూడలేదు] ఈహేతువు వలనఁగూఁడ - ఇచట రతికాభాసత కలుగుచున్నది.

ప్రభా :— ''రావణుని హృదయమునందు - 'సీతకు నాయందనురాగ మున్న'దను నిశ్చయముగాని, 'అనురాగము' లేదను నిశ్చయముగాని, లేదు. ఇంతేమనిన; కామకృతమగు మోహముమాత్రమేయున్నది.'' అను హేతువువలనఁ గూడ - రావణునకు సీతయందొదవిన యభిలాషము - రతికానేరక, రత్యాభాసమే యగును.

లోచనము :— కావుననే, అభిలాష రూపమగు రావణుని చిత్తవృత్తి - రత్యాభాసరూపమని [సహృదయజ్ఞాతలచేత] స్థాపింపఁబడినది.

"ఏది - శృంగారముననుకరించునది మాత్రమే యగుచుండునో, అది - హాస్యము." అనుచోట, శృంగారానుకృతిశబ్దమును ప్రయోగించిన మునికూడ, అది - రత్యాభాసమే యగునను నంశమును సూచించెను. "అనుకృతి, అముఖ్యత, ఆభాసము," అనునవి- ఏకార్థకములు [పర్యాయపదములు] కదా !. కనుకనే, "అభిలాషమొకవ్యక్తియందే, యుండినను, గూడ అచ్చట నచ్చట, [ స్త్రీ పురుషులలో నొక వ్యక్తియందు మాత్రమే యుండిన యాయభిలాషమును] శృంగారమని వ్యవహరించుట - శృంగారాభాసమని వ్యవహరించుటయే యగును." అని తలఁపవలయును. "ఏది శృంగారానుకృతి మాత్రమో" అనుచోటనున్న, శృంగార శబ్దముచేత - వీరాది రసముల యాభాస రూపతకూడ - ఉపలక్షితమే యగును.

ప్రభా :— "శృంగారము ననుకరించునపుడది-శృంగారాభాసమగునట్లు, వీరాదులననుకరించునపుడవి- [గుర్వాదులాలంబనములుగాఁగల వీరాదులు] వీరాద్యాభాసములగును." అనునర్థము - [శృంగారానుకృతిర్యాతు అనుచోటనున్న] "శృంగార శబ్దముచేత నుపలక్షితమగుచున్నది అని తెలియవలయును" అని భావము.

అవ :— ముగించుచున్నాఁడు.

లోచనము :— ఇట్లే, 'భావధ్వని' ప్రభృతులు- రసధ్వనికి సంబంధించిన నిష్యందములేయగును. [భావోదయాదిధ్వనులు - రసధ్వని యందగు నాస్వాదములేయగును.]

ప్రభా :— అవ :— "అట్లయినయెడల. మీఁది యుదాహృతులయందున్న వన్నియు, రసధ్వనులే"యని వ్యవహరింపఁబడక, "భావధ్వని, భావోదయధ్వని" అనివేరువేరుగా వ్యవహరింపఁబడుట యెట్లు? అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

—: రసధ్వనియే-భావప్రశమాది ధ్వనులుగా వ్యవహరింపఁబడును :—

లోచనము :— [సహృదయులకు సిద్ధించునదియగు] ఆస్వాదమునందు - ప్రధానముగా, ప్రయోజకమగు [భావప్రశమము, భావోదయము, మున్నగు]

నంశములు - ఇట్లు, విభజింపఁబడి, వేరుగా [భావధ్వని, భావశాంతిధ్వని, భావోద యధ్వని, భావసంధిధ్వని, భావశబలతాధ్వని, అని] వ్యవస్థాపింపఁబడుచున్నవి.

ప్రిభా :— భావధ్వన్యాదులు - [శృంగారాది] రసధ్వనులేకాని, వేరగు నవికావు. అయినను, ఆశృంగారాది రసధ్వనులే- ఆశృంగారాదిరసధ్వనికి సంబంధించిన యాస్వాదమునందు, భావాదిరూపమగు నేయంశము - ముఖ్యముగా ప్రయోజకమగుచుండునో, ముఖ్యప్రయోజకమగు నాభావాద్యంశమునకు సంబంధించిన పేరుతో-భావశాంతిధ్వని, భావధ్వని, భావోదయధ్వని, భావసంధిధ్వని, భావశబలతాధ్వని, అని వేరుగా, వ్యవహరింపఁబడును. అనిభావము.

అవ :— అఖండమగు రసధ్వనియే - "భావధ్వని, భావోదయధ్వని," ఇత్యాదిగా విభజింపఁబడి, వ్యవహరింపఁబడునని,విశదీకరించునదియగు, దృష్టాంతమును జూపుచున్నాఁడు.

లోచనము :— అదెట్లనిన :- ఏక (రస) సంమూర్ఛితమగు నామోదమునకు సంబంధించిన యుపభోగమునందుఁగూడ - "ఈసౌరభము [సువాసన] శుద్ధమగు జటా'మాంసి'మున్నగుదానిచేత [గంధద్రవ్యవిశేషముచేత] ప్రయుక్తమయినది" అని గంధయుక్తిజ్ఞులచేత విభజించి, పేర్కొనఁబడునుగదా!.

ప్రిభా :— "మాంసి" అనునది - యొకానొక గంధద్రవ్యవిశేషము. 'పునుగు, జవ్వాది' మున్నగు గంధద్రవ్యవిశేషములచేరికవలన, అఖండమగు నొకానొక సౌరభము - ముంచెత్తినట్లు, వ్యాపించియుండునపుడు - ఆసౌరభమంతయుఁగలిసి, పరిమళభోగులచేత - ఏకముగనే, [అఖండముగనే] ఆస్వాదింపఁబడుచుండును, అయినను. "ఆగంధద్రవ్యవిశేషముల కూర్చునెఱిఁగినవారు - ఆయఖండాస్వాదరూపసౌరభమునందు - ఈసౌరభము- ముఖ్యముగా, శుద్ధమగు "జటామాంసి" [అనఁగా; కాకోలి, అనఁగా, కారుకొల్లి] అను గంధద్రవ్యవిశేషముచేత, లేక, 'జవ్వాది'అను గంధద్రవ్యవిశేషముచేతఁ, గలిగింపఁబడినది" అని విభాగమునొనర్చి, ఆనామములతోనే వ్యవహరించుచుందురుగదా!. అట్లే, రసము కూడ - అఖండాస్వాదరూపమే యగుచుండును. అయినను, ధ్వనితత్త్వజ్ఞులు - ఆరసమునకు సంబంధించిన యాస్వాదమున, ముఖ్యప్రయోజకములగు నంశములను విభజించి, ఇది - కోపశాంతిధ్వని. 'ఇది - వితర్కోదయధ్వని.' ఇత్యాదిగా, 'భావశాంతిధ్వన్యాదినామములతోనే దానినివ్యవహరింతురు' అనిభావము. "శుద్ధ

మాస్యాదిప్రయుక్తమ్'' అని చౌఖాంబాప్రతియందున్న, లోచనపాఠము - సార్థ
కముగాకుండుటవలన, శుద్ధ, మాంస్యాదిప్రయుక్తమ్'' అను నిర్ణయసాగరప్రతి
యందలి పాఠమిచట సమాదరింపఁబడినది.

ఆవ :— 'ఏది - రసధ్వనియని వ్యవహరింపఁబడును ?' అని యాశం
కించి, చెప్పుచున్నాఁడు.

లోచనము :— 'విభావము, అనుభావము, వ్యభిచారిభావము' అను
మూఁడింటియొక్కయు సంయోగమువలన, వానిచర్వణనుండియుదయించిన
['రతి' 'హాసము' మున్నగు] స్థాయిభావమునకు సంబంధించిన, జ్ఞానముగల
సహృదయజ్ఞాతకు-ముఖ్యముగా స్థాయిభావాంశచర్వణచేతఁ గలిగింపఁబడునదియే
యగు నాస్వాదాతిశయమేదికలదో, అదిమాత్రమే - యిచట, ముఖ్యముగా రస
ధ్వనియనివ్యవహరింపఁబడును. ముఖ్యమగురసధ్వనికుదాహరణము :—
[ఉదయనుఁడు-నర్మసచివునితో "ఈసాగరికచిత్రము-నాలోచనములను సుఖింపఁ
జేయుచున్నదని వేరే చెప్పవలయునా ?" అని పలికి, ప్రేయసీచిత్రమును జూచు
చున్న తనదృష్టిని వర్ణించుచున్నాఁడు.]

మ. ప్రమదోరుద్వయి నెట్లొదాఁటి, సునితంబభ్రాంతిఁ జాలించి, మ
ధ్యమునం దున్ ద్రివళీతరంగ విషమంబందుంచి నిష్పందతన్,
రమణీ తుంగకుచాధిరోహణగతిన్ మద్దృష్టి - తృష్ణార్త లీ
ల, ముహుర్వీక్షణొనర్చు తజ్జలలవప్రస్యంది నేత్రమ్ములన్.

ప్రభా :— ఇది- హర్షచక్రవర్తి కృతమగు రత్నావళీనాటిక యందలిది.
వత్సరాజు [ఉదయనుఁడు] చిత్రఫలకమున, సుసంగతచేత లిఖియగు, సాగరిక
యొక్క సౌందర్యప్రాశస్త్యమును వెలుపునదియగు, తనదృష్టిప్రసారమును విశ
దీకరించుచు, నర్మసచివుఁడగు విదూషకునితో నిట్లనెను.

"నాదృష్టి - రత్నావళి యూరుద్వయియందుఁ బ్రసరించి - తద్దర్శనమునఁ
దనివిఁగనకుండుటవలన. నచటినుండి, మిక్కిలి కష్టపడి, నితంబస్థలమునెనసి,
భ్రమించినది. ఆనితంబభ్రమణము నెట్లో చాలించి, త్రివళులనెడి కెరటములచేత,
నెత్తుపల్లములు కలిగియుండిన, యామెనడుమునందుఁ బ్రసరించి, యచటఁగొంత
సేపు చలింపక, నిలిచినది. తదుపరి, నచటినుండి, మెల్లగా, ఆరమణీమణియొక్క
సమున్నత స్తనద్వయినధిరోహించి, శ్రమపడినది. కనుక, తృషనందినదివలె,
జలకణ [అశ్రుకణ]ములను బిట్టుగాఁ, జిందించుచున్నట్లు లిఖింపఁబడిన, యా

తరుణీమణియొక్క లోచనములను గాఢస్పృహతో, మాటిమాటికిని జూచుచు, కదలకున్నది.'' అనునది - ఇందలి వాచ్యార్థము.

ఇచట. ఊరుయుగళమునకును - నితంబమండలమునకును - అత్యంతమగు విశాలత్వమును, మధ్యమునకు - అత్యంతమగు సూక్ష్మత్వమును, స్తనములకు - మహత్త్వమును, గమ్యమగుచున్నది. దానివలన, రత్నావళీ సౌందర్యాతిశయమును - 'తజ్జలలవప్రిస్యంది నేత్రిమ్ముకలన్' అను సమాసముచేత, ఆమెకొదవిన విరహదుఃఖాతిశయమును - వ్యంగ్యములగుచున్నవి. దృష్టియను స్త్రీకిసంబంధించిన పర్వతారణ్య భ్రిమణవృత్తాంతముకూడ-ఇచట, ప్రితీయమానమగుచున్నను, అది ప్రిస్తుతమున కలంకారమేయగుచున్నది.

లోచనము : — ఇచట, నాయికాకారముచేత - [రత్నావళీచిత్రిముచేత-] అనుసరించి చూడఁబడుచున్న, స్వాత్మప్రతికృతిచేత [నాయకుఁడగు తనయొక్క ప్రితికృతి (చిత్రిము)చేత] పవిత్రిమైన, చిత్రఫలకము నవలోకించుటవలన, పరస్పరాస్థాబంధరూపమును, [తెలియఁబడిన అన్యోన్యానురాగ సంబంధముగలదియు,] [కనుకనే] విభావానుభావ వ్యభిచారిభావసంయోజనవశమున, వత్సరాజునందు [జనించి, ప్రివృద్ధమైన] స్థాయియగు భావమయిన, రతిభావము - [గ్రహీతలగు సహృదయుల హృదయమున] చర్వణారూఢమగుచున్నది.

ప్రిభా : — 'సాగరిక' అనునామముగల రత్నావళి - చిత్రిఫలకమున మొదట, వత్సరాజగు నుదయనుని రూపమును- కామదేవుఁడను మిషపెట్టి, చిత్రించినది. ఆమె పరిచారికయగు సుసంగత - నిపుణురాలుగనుక, ఉదయనుని ప్రితిరూపముచెంత-రత్నావళి ప్రతిరూపమును రతియను మిషతోఁజిత్రించినది. అది - వసంతకుఁడను పేరుగల విదూషకునికి కదళీగృహమునందు దొరికినది. దానినతఁడుదయనుని కొసఁగుటయు, నతఁడు దానినీక్షించి, రత్నావళికిఁ దనయెడనొదవిన, యనురాగమునెఱిఁగి,తనయనురాగాతిశయము నిట్లువర్ణించెను.

''విభావానుభావ వ్యభిచారి భావసంయోజనమువలన, ఉదయనునియందుదయించినదియు, చిత్రఫలకావలోకనమున, వృద్ధినొందినదియు, నగు రతిభావమే- ఇచటనిట్లు స్ఫురింపజేయఁబడి, సహృదయాస్వాదము నధిరోహించునది. కనుక, స్థాయి, రత్యంశ, చర్వణాప్రియుక్తమగు, నాస్వాదప్రికర్షమే - ఇచట, అయోగ [అభిలాష] విప్రలంభ శృంగారరసధ్వనియగుచున్నది.'' అనితెలియునది.

లోచనము :— విస్తరమికఁ జాలును!. ''అంగిగా భాసించుచున్న- రసము

మున్నగునర్థము - అసంలక్ష్యక్రమవ్యంగ్యమగు ధ్వనిప్రకారము" అనునది- దీని ఫలితార్థము.

(9) మూలము :— రసము, [భావము]మున్నగు నర్థము- వాచ్యముతోఁ గూడియుండునదివలెనే, యవభాసించుచుండును. అదికూడ - అంగిగా [ప్రధానముగా] నవభాసించునదియగుచు, ధ్వనిస్వరూపమగును.

లోచనము :— "వాచ్యముతో" అనఁగా; "విభావానుభావాదులతో" అనియర్థము."వాచ్యములగు విభావానుభావములకును, ధ్వన్యమానములగు రసాదులకును, [పౌర్వాపర్యప్రతీతిరూపమగు] క్రమమున్ననుగూడనది - చక్కఁగా లక్షింపఁబడునదికాకుండును" అను నభిప్రాయము - "వలెనే" అనుశబ్దముచేత, వ్యాఖ్యానింపఁబడినది.

ప్రభా :— విభావాదిప్రతీతికిని, రసాదిప్రతీతికిని, గలక్రమము - శీఘ్రతవలన, సంలక్ష్యముకాకుండుటవలన, రసాదులు - అసంలక్ష్యక్రమములుగాఁ జెప్పఁబడినవి. అసంలక్ష్యక్రమములగు, నారసాదులుకూడ - ప్రధానములగుచుండునప్పుడే - ధ్వనులుగాఁ జెప్పఁబడును.

లోచనము : అవ :- అయ్యా! "అంగిగా నవభాసించునదియగుచు," అని [వృత్తియందు] చెప్పఁబడినదికదా; రసాదులంగములుగూడనగునాయేమి? "ఆరసాదులంగములగునపుడు, ధ్వనులుకావు" అనుటకేగదా! "అంగిగా నవభాసించునదియగుచు" అను విశేషణము ప్రయోగింపఁబడినది?" అను నభిప్రాయము చేత నుపక్రమించుచున్నాఁడు.

(10) మూలము : — ఇపుడు, "రసవదాదులగు నలంకారములకంటె, అసంలక్ష్యక్రమద్యోతన రూపమగు రసాదిధ్వనికి సంబంధించిన విషయము - విభక్తము. [వేరయినది.] అని, ప్రదర్శింపఁబడుచున్నది.

[కా] వాచ్య, వాచక, చారుత్వహేతూనాం వివిధాత్మనామ్।
రసాది పరతాయత్ర, సధ్వనేర్విషయోమతః. (4)

గీ॥ బహువిధాత్మములగు వాచ్యవాచకములు,
చారుతాకారణము లలంకారములును,
పరలు నెచట రసాది తత్పరతఁగలిగి,
అదియె - ధ్వనివిషయమ్మను నది - మతమ్ము. (4)

రసము, భావము, తదాభాసము, తత్ప్రశమము [మున్నగు నవి] లక్షణముగాఁగల, ముఖ్యమగునర్థము, ననువర్తించుచు, [ఉపస్కరించుచు] శబ్దార్థాలంకారములు,[శబ్దములు, అర్థములు, తదుభయాలంకారములు] గుణములు, పరస్పరమును,[తమలోఁదామును] ధ్వనినపేక్షించియు, ఏకావ్యమునందు, విభిన్నరూపములుగా, వ్యవస్థితములగుచుండునో, ఆకావ్యమునందు, 'ధ్వని'అనువ్యపదేశము- [వ్యవహారము] ప్రవర్తించుననునది - మామతము.

లోచనము : "తాము - రసవత్, ప్రేయ, ఊర్జస్వి, సమాహితము' అను నలంకార రూపములగునపుడు, ఈ రసాదులు - అంగములుగూడనగుచుండును." అనిభావము. ఈభంగిచేతఁగూడ - "రసవదాదులగు నలంకారములయందు - రసాదిధ్వని యంతర్భవింపదు." అని సూచింపఁబడినది. వెనుక, [ఇక్లే] "సమాసోక్త్యాదులయందు, వస్తుధ్వని యంతర్భవింపదు. అని ప్రదర్శింపఁబడినదిగదా !

"వాచ్యవాచక చారుత్వహేతూనామ్" అను, మూలకారికాంశమునకు, వాచ్యములు, వాచకములు, వానిచారుత్వహేతువులు" అను ద్వంద్వము నర్థముగాఁజెప్పఁదగును.

పరిభా :— ఆంధ్రీకృతకారికయందు, "వాచ్యవాచకములు" అనుచోటనే- వాచ్యములు, వాచకములు, అని ద్వంద్వసమాసమును జెప్పవలయును. తదుపరి, చారుతాకారణములనుచోట, "ఆవాచ్య, వాచకముల, సౌందర్యమునకుఁ గారణములు," అనునర్థమును స్వీకరింపవలయును. "అలంకారములు" అను పద, మిచట, స్పష్టతకై చెప్పఁబడినది.

లోచనము :— వృత్తియందును - "శబ్దార్థాలంకారములు" అనుచోట, శబ్దములు, [శబ్దమునకుసంబంధించిన] అలంకారములు, అర్థములు, [అర్థమునకు

సంబంధించిన] అలంకారములు, అని ద్వంద్వమునే చెప్పవలయును. ''మతము'' అనఁగా; ''ఇంతకుముందే, యీయంశము చెప్పఁబడినది'' అనియర్థము.

ప్రభా :— వేఱొక రసాదిరూపమగు నర్థము-ప్రధానముకాఁగా, దానికి రసమంగమగునపుడది - రసవదలంకారమగును. ఇట్లే, భావమంగమగునపుడది - "ప్రేయోలంకార (భావాలంకార) మగును రసాభాస, భావాభాసములంగములగు నపుడది - ''ఊర్జస్వి'' అనునలంకారమగును. భావశాంతి, యంగమగునపుడది - సమాహితమను నలంకారమగును. భావోదయాదులంగములగునపుడవి - భావోదయాదులగు నలంకారములగును.

ఇట్లు, రసాదులంగములుగూడ నగుచుండును. ఇట్లుండ, ''ఈరసవదాదులే- అసంలక్ష్యక్రమవ్యంగ్య ధ్వనులగు రసాదులు'' అనికొందఱుచెప్పినట్లున్నది. కావున,రసవదాద్యలంకారములకంటె,అసంలక్ష్యక్రమమగు రసాదిధ్వని విషయము-వేరనుటకిచట నిట్లు వెనుక దెలుపఁబడినదియేయగు స్వమతము-నిరూపింపఁబడినది.

''అంగములగు రసవదాదులయందు, అంగులగు రసాదిధ్వనులంతర్భవింపవు'' అనిదీనిచేత నిరూపితము.

లోచనము :— రసములు-[విభావాదులచేత] అభివ్యంజితములై,[సహృదయులచేత] 'రసీభవింపఁబడును'. [ఆస్వాదింపఁబడును] కనుక, ''రసములు'' అనిచెప్పఁబడును, రసాదివిషయమున, అభివ్యక్తి, ప్రధానముగాఁగాని, అప్రధానముగాఁగాని, కావచ్చును. ప్రధానముగా నభివ్యంజితములగు రసాదులు - ధ్వనియగును. అప్రధానముగా నభివ్యంజితములగు రసాదులు - రసవదాదులగు నలంకారములగును కనుక, ''ముఖ్యమగు నర్థముననువర్తించుచు''అనిచెప్పఁబడినది. పూర్వోక్తయుక్తులచేత (శబ్దార్థాదులు) విభాగముచేత వ్యవస్థాపింపఁబడుటవలన, ''వ్యవస్థితములగుచుండునో'' అని చెప్పఁబడినది.

ప్రభా :— శబ్దములు, అర్థములు, శబ్దాలంకారములు, అర్థాలంకారములు, గుణములు, వెనుక విభజించి వ్యవస్థాపింపఁబడినవిగదా! ఇవి - తమలోతాము వేరగుచున్నవి. ధ్వనికంటెనుగూడ - వేరగుచున్నవి అనిభావము.

☞ ఇచ్చట, లోచనమున, తదితరమతనిరసన పురస్సరముగా, రసతత్త్వము నిరూపింపఁబడినది. శ్రీమదభినవగుప్తపాదులచేత స్వలోచన నిరూపితమయిన రసతత్త్వ సిద్ధాంతము - శ్రీ భరతముని ప్రదర్శితనాట్యవేద తాత్పర్యానుసారి

యగుటవలన సమీచీనమైనది. సశాస్త్రీయమును, సయుక్తికమును, స్వానుభవసిద్ధమును, నగుటవలన. సమగ్రసిద్ధాంతమైయున్నది. అదియే - కావ్యాత్మతానిరూపకమగుటవలన, సహృదయానంద సంపాదకమైనది. సర్వవిషయప్రతిపాదకమగుటవలన నిశ్శంకమయినది. కనుకనే, మహామహేశ్వరాచార్య, శ్రీమదభినవగుప్తపాదులకుఁదరువాతి లాక్షణికులును, వివిధదర్శన తత్త్వవిదులును, నాట్యసాహిత్యశాస్త్రపారంగతులును, నగు, సర్వాలంకారికపండితశిరోమణులకును - సమ్మతమైనది. కనుకనే, వారిచేత శిరోధార్యమయినది. ఈయభినవసిద్ధాంతము - భట్టనాయక, మహిమభట్టాదుల ప్రతియుక్తులచేత ఖండితముకాక, నిరాతంక, నిరూఢ, సంచార, సముల్లసితమైనది. లోచనమున, వేర్వేరుస్థలములయందుఁ గూర్పఁబడిన, యీరససిద్ధాంతమంతయుఁగూడ - ఒక్కచోఁగూర్పఁబడినయెడల, సంపూర్ణముగా నుండునను నభిప్రాయముచేత, ప్రభామతిప్రసారిత, లోచనసమున్మీలిత, ధ్వన్యాలోక రసాలోక, మంతయుఁగూడ ద్వితీయోద్ద్యోతము [ప్రథమభాగము] చివరను గూర్పఁబడిన, ప్రథమానుబంధమున, 'రసాలోక' నామమున సంఘటితమైనది. ప్రథమోద్ద్యోతము చివరను, నిచటను, జూచియుండవలసిన, ప్రభామతిప్రసారిత, లోచనోన్మీలిత, రసాలోకమును, సహృదయపాఠకులచట['రసాలోక' మను, అనుబంధమునందు] సమీక్షించి, రసతత్త్వాలోకులగుదురుగాక !

ఇట్లు
నివేదయిత.
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

అవ :— స్వమతమున రసాదులకంటె వేరగురసవదాద్యలంకారముల లక్షణమును దెలుపుచున్నాఁడు.

(11) మూలము :—

ప్రధానేఽన్యత్ర వాక్యార్థే, యత్రాఙ్గంతు రసాదయః ।
కావ్యేతస్మిన్నలఙ్కారో రసాదిరితిమేమతిః. (5)

గీ॥ అన్యము - ప్రధానమగుట, వాక్యార్థమగుచు
నమర; నెచట రసాదులంగమగుచుండు;
నట్టికావ్యమ్మునను, యీరసాదికమ్ము,
తామలంకారమనునది - మామతమ్ము. (5)

రసవదాద్యలంకారమునకు విషయము [ఏది రసవదాద్యలంకారమో, దానిలక్షణము] నితరులు ప్రదర్శించియేయున్నారు. అయినను, అట్లుకాక, ఏకావ్యమునందు [రసాదులకంటె] అన్యమగు నర్థము-[వస్తుమాత్రమో, అలంకారతాయోగ్యమో, రసస్వరూపమో, యగునర్థము] ప్రధానతచేత, వాక్యార్థమగుచుండునపుడు, [అకావ్యమునకు సంబంధించినవియు, - వెనుక "రసమును భావమ్మను" అనుకారికయందుఁ దెలుపఁబడినవియు, నగు]ఏరసాదులు-దానికి [అన్యమగు నాప్రధానవాక్యార్థమునకు] అంగములగుచుండునో,["అంగములగుచున్న]ఆరసాదులు-అలంకారమగు రసాదికమునకు విషయము." ["అంగములగు నారసాదులు - రసవదాదులగు నలంకారములు".] అనునది - మామకీనమగు పక్షము.

లోచనము :— అన్యము = రసస్వరూపముగాని, వస్తుమాత్రముగాని, అలంకారతాయోగ్యముగాని, యగు వేరొకయర్థము. "మామతమ్ము" అనుదాని చేత, [ముందుచెప్పఁదలఁచిన] అన్యపక్షమును - దూషింపఁదగినదిగా, హృదయమునందుంచుకొని - (తనకు) అభీష్టము కనుక, "అయినను" అనువాక్యము చేత - మొదట, స్వపక్షమును ప్రదర్శించుచున్నాఁడు. "అయినను" అనుదాని భావము - "అన్యులచేతఁజూపఁబడినయర్థము - సూచేకముండు తెలుపఁబడునది యగు నీతిచేత - ఉపపన్నముకానిదేయగును." అనునది. అస్పష్టమగు సంగతి గల, "ఏకావ్యమునందు" అను [వృత్తి] వాక్యమునిట్లు యోజించునది. ఏకావ్యమునందు, 'ఆరసాదులు' అనఁగా; [రసమును భావమ్మను అనుకారికయందు] వెనుకఁజెప్పఁబడిన రసాదులు - అంగములుగానుండునో, [ప్రధానమగు]వాక్యార్థముమాత్రము - [అంగభూతరసాదులకంటె] అన్యమగు నర్థమగుచుండునో, ఆకావ్యమునకు సంబంధించిన, యేరసాదులు - [అన్యమగు నావాక్యార్థమునకు] అంగభూతములో, అవి - [అంగభూతములగు నారసాదులు] - అలంకారమగు రసాదికమునకు, అనఁగా; రసవదాద్యలంకారశబ్దమునకు, విషయములు. (కాఁగా) ఏదియంగమగుచుండునో, అదియే, అలంకారశబ్దముచేతఁ జెప్పఁబడును. కాని, తదితరమలంకారశబ్దముచేతఁ జెప్పఁబడునదికాదు." అనియర్థము.

ప్రభా :— [ఏరసాదులంగములుగూడనగుచుండునో, అంగములగు నా రసాదులకంటె, వేరయిన వ్యంగ్యమగు వస్తుమాత్రముగాని, అలంకారముగాని,

రసాదిస్వరూపముగాని, వాచ్యమగు వస్తువుగాని, యలంకారముగాని, వాక్యార్థమై ప్రధానముగా [అనఁగా; అంగిగా] నుండునపుడు-వెనుకఁదెలుపబడిన రసభావాదులు - ప్రధానమగు నావాక్యార్థమునకంగములగునెడల, అవి - ఆవాక్యార్థము నలంకరించుటవలన, అలంకారములగును. కనుక, "అంగభూతములగు నారసాదులే - రసవదలంకారములు", అనునది మాపక్షమనిభావము.

లోచనము :— "ఈరసాదు లంగములగునపుడే, రసవదలంకారములగును". అనునంశమున, నుదాహరణమును దెలుపుచున్నాఁడు.

(12) మూలము :— అదెట్లనిన :- [రసాదులెట్లంగములగుననిన :-] చాటువులందు, ప్రేయోఽలంకారము - [ప్రేయస్స్వంతమలంకారముగాఁగలది, లేక, ప్రేయోరూపమగునలంకారము] వాక్యార్థమై [ప్రధానమై, లేక, చమత్కారకారియై]యుండిననుగూడ, రసాదులంగభూతములుగాఁ జూడబడుచున్నవి. అలంకారములగు రసాదులు [రసవదాద్యలంకారములు] కూడ - శుద్ధముగాని, సంకీర్ణముగాని, యగుచుండును.

లోచనము :— ఇపుడు చెప్పఁబడు నుదాహరణమునందువలె, నితరస్థలములందుఁగూడ - [వేరొక యర్థము-ప్రధానమగునపుడు, దానికంగములగు రసాదులే - రసవదాదులగు నలంకారములగును. అనిభావము.] "భామహాభిప్రాయమున, చాటువులయందు; ప్రేయోఽలంకారము - వాక్యార్థమైయుండినను, రసాదు లంగములుగాఁ జేయఁబడియుండినట్లు, వీక్షింపఁబడుచున్నవి." అనునిది - యొక వాక్యము. [అనఁగా, "భామహాభిమతముగాఁ జెప్పఁబడిన, యభిప్రాయము నిట్లు సమన్వయింపవలయును" అనిభావము.] భామహుఁడు - "గురు, దేవ, నృపతి, పుత్త్రి [ప్రభృతి] విషయకమగు [భక్తివాత్సల్యాది రూపమగు] ప్రీతివర్ణనము - ప్రేయోఽలంకారము", అని చెప్పెనుగదా.

ప్రభా :— సర్వాలంకారిక గురుశిరోమణియగు భామహాచార్యుఁడు - గురువులయందో, దేవతలయందో, గల, భక్తినిగాని, పుత్త్రాదులయందుఁగల వాత్సల్యాదికమునుగాని, స్వవాచకశబ్దముచేతఁగాని, విభావాదిద్వారమునఁగాని- వర్ణించుట - ప్రేయోలంకారమని, భామహాలంకారమనుగ్రంథమునఁ, జెప్పెను.

ప్రస్తుతకాలమున లభించుభామహగ్రంథమున ప్రేయోలంకారలక్షణములేదు. కనుక, భామహుఁడొసఁగిన యుదాహరణమువలన నీయంశమేర్పడి యుండవచ్చును.

అవ :— చాటుకవిత్వరూపమగు "పరిహాసమిమ్మెదియేలః" అని ముందు ప్రదర్శింపఁబడనున్న యుదాహరణమునందు మహారాజ ప్రభావాదివర్ణనమో, లేక తత్ప్రభావాఽంచితమును, కవికి తన్నృపతియందుఁ గలదియు; నగు రతిభావమో; ప్రధానమగుటవలన -[అది వేరొకదాని నలంకరించునది కాకుండుటవలన నలంకారముకాక, అలంకార్యమైయున్నది: కనుక, లోచనకర్త "ప్రేయోలంకారము" అనుపదమునకు బహువ్రీహి సమాసము నాశ్రయించి, క్రిందియర్థమును దెలుపుచున్నాఁడు.

లోచనము :— భామహునిచేతఁ జెప్పబడిన, "చాటువులయందు" అను వాక్యమునందు, "ప్రేయాన్, అలఙ్కారో, యత్ర, సః = ప్రేయోఽలఙ్కారః = అలఙ్కరణీయః" "ఎచ్చట ప్రేయస్సు-[ప్రియస్వంతము] అలంకారమో, దాని చేత అలంకరణీయమగునది - [ప్రేయోరూపములగు భక్తివాత్సల్యాది భావముల చేత నలంకరింపఁదగిన యాప్రధాన వాక్యార్థము - ] ప్రేయోఽలంకారము." ["ప్రియోరూపములగు భావములు-అలంకారములుగాగలవి"]అని,యిచట చెప్పఁబడినది. కాని, అలంకారము - వాక్యార్థమని [ప్రధానముగా] చెప్పఁబడినదికాదు.

ప్రభా :— "చాటువులయందు ప్రేయోఽలంకారము - వాక్యార్థమైయుండినను గూడ" అని భామహాభిమతముగాఁజెప్పఁబడిన వాక్యమునకిట్లర్థమును జెప్పుటసమీచీనమగును." అని లోచనకర్త- దానియర్థమునిట్లు చెప్పుచున్నాఁడు. వర్ణింపఁబడునదియగు నరపతి ప్రభావాదికమే- ముఖ్యముగా వాక్యప్రతిపాద్యమగుట వలన వాక్యార్థమగుచుండును. "వర్ణింపఁబడునదియగు నీనరపతి ప్రభావాదికమే- చాటువు"అనిచెప్పఁబడును. దానికి-ప్రీతి, స్మరణాదిభావములంగములగునపుడది-ప్రేయోఽలంకారమగును, అనగా; ప్రేయోరూపమగుభావమలంకారముగాఁగలది యగును. ప్రేయోరూప [రతిస్మృత్యాదిరూప] మగు నలంకారము- ముఖ్యముగా వాక్యమునఁ బ్రతిపాద్యముకాదు. కనుక, వాక్యార్థముకాదు. అననదియే - భామహాభిమతముగాఁ దెలియవలయును" అనునది - లోచనాభిప్రాయము.

అవ :— "అయ్యా! ప్రేయాన్ + అలఙ్కారః' 'ప్రేయోఽలఙ్కారః' అని, యథాశ్రుతమగు వ్యుత్పత్తిననుసరించి-"ప్రియోరూపమగు నలంకారమిచట, వాక్యార్థమేయగును. అనఁగా; ప్రధానమేయగును. అనిచెప్పగూడదా?" అని, యాశంకించి, చెప్పుచున్నాఁడు.

లోచ :— "ప్రేయోఽలంకారము-వాక్యార్థమైయుండినను" అనుచోట, 'వాక్యార్థత్వము - ప్రధానత్వమే' అగునెడల, ఆప్రధానత్వము- చమత్కారకారి, త్వమేయగును. [అది-వాక్యముచేత ముఖ్యముగా ప్రతిపాద్యత్వము రూపముగాఁ గలదియగు వాక్యార్థత్వముమాత్రము, కాదు.]

ప్రభా :— "వర్ణింపఁబడునదియు, శ్లాఘ్యమానమును, నగునరపతి ప్రభావాదికము - "చాటువు" అనిచెప్పఁబడునుగదా. "ఓనరపతీ! నీశత్రుస్త్రీజనమిట్టి దుర్దశననుభవింపుచున్నది. నీప్రభావమెంత యాశ్చర్యకరము." అని వక్ష్యమాణమగు నుదాహరణమున, నరపతి ప్రభావము - ముఖ్యప్రతిపాద్యముగా నున్నది. తత్ప్రభావాలంబితమగు ప్రీతి - రిపుస్త్రీజనవృత్తాంతమును విషయముగాఁగలిగియుండుటవలన, చమత్కారకారియగుచున్నది. కనుక, "ప్రేయోఽలకారము వాక్యార్థమగుచుండినను గూడ", అనుచోట- "ప్రేయోఽలంకారము" అనగా; "దుర్దశాయుక్తమగు రిపుస్త్రీజన వృత్తాంతమును విషయముగాఁగలిగిన నరపతి ప్రభావరూపమగు ప్రేయోలంకారము - చమత్కారకారియగుచుండినను, గూడ," అనునర్థమునే గ్రహింపవలయును. కాని, "[ప్రీత్యాదిభావరూపమగు] ప్రేయోఽలఙ్కారము-ప్రధానమగుచుండినను" అనునర్థమును గ్రహింపఁదగదు. "అలంకారమగు ప్రీత్యాదిభావము - అలంకార్యముకాదు. కనుకనది- ప్రధానము కాదు. అలంకార్యమగు నరపతి ప్రభావముగాని, నరపతి విషయకరతిభావము గాని, 'అలంకారముకాదు. కనుక, నరపతి ప్రభావాదికమునుగాని, తద్విషయకరతిభావమునుగాని, అలంకారముగాఁజెప్పఁదగదు."అనునది-లోచనాభిప్రాయము.

లోచనము :— ఉద్భటమతము ననుసరించినవారు మాత్రము [భామహాభిమతమని చెప్పబడిన వృత్తివాక్యమును] భంజించి, [భేదించి] 'చాటువులందు అనఁగా; చాటు (కావ్య) విషయమున, చాటువులే [నరపతిప్రభావాదులే]వాక్యార్థమైయుండినను, [ఆచాటువులు] ప్రేయోఽలఙ్కారమునకుఁగూడ విషయము" అని, వ్యాఖ్యానించుచున్నారు. [అనఁగా; 'భట్టోద్భటానుయాయులు - చాటువులే కాక, ప్రేయోఽలంకారముకూడ-ప్రధానమగు వాక్యార్థమేయని చెప్పుదురు.' అని భావము] [ప్రేయస్సనఁగా, ప్రియతరాఖ్యానములేక, రతిరూపమగుప్రేమకనుక] ప్రేమ శబ్దముచేత [రతి, నిర్వేదము మున్నగు] భావములన్నియు, ఉపలక్షింపఁజేయబడును. కనుక, ఉద్భటమతమునందుభావమే - భావాలంకారము. ఆభావాలంకారమే-ప్రేయోఽలంకారముగాఁ [ప్రేయస్వదలంకారముగాఁ] జెప్పఁబడినది. [మఱియు, నీయుద్భటమతానుయాయులీచాటువులు - ] "రసవదలంకారమునకు మాత్రమేకాక, ప్రేయఃప్రభృతులకుఁగూడ [ప్రేయస్వంతము మున్నగు నలం

కారములకుఁగూడ] విషయములు'' అనునది - ''వాక్యార్థమై యుండినను గూడ, అనుచోనున్న [అపిశబ్దార్థకమగు] 'కూడ' శబ్దార్థము.'' అనిచెప్పుదురు.

ప్రిభా :-- ''రసవదలంకారమును, ప్రేయోలంకారమునుగూడ-చాటువు లందుండుననునది - భట్టోద్భటానుయాయులమతము'' అనిభావము.

అవ :— ఇప్పుడు-మరల, స్వమతము ననుసరించి, చెప్పుచున్నాఁడు.

లోచనము :— ''ఇట్లు వృత్తియందుఁదెలుపఁబడిన, రసవచ్ఛబ్దముచేత రసాదులగు [రసవదాదులగు] నలంకారములన్నియు గూడ ''నుపలక్షితములు'' అనితెలియునది. ఈయంశమే-''చాటువులందు రసాదులంగభూతములుగా'' అను చోటఁ [ఆదిశబ్దముచేతఁ] జెప్పఁబడినది.

(13) మూలము :— అలంకారమగు, నారసాదికము['ఆ'రసవదాద్యలంకారము] కూడ - శుద్ధమును, సంకీర్ణమును, గూడనగు చుండును. అందు, మొదటిదగు [శుద్ధమగు] రసవదలంకారమునకు దాహరణము :—

[చాటుకారుఁడగు నొకకవి - స్వప్నమున, నవ్వుచున్నట్లు కాన్పించిన తమప్రియతమునిఁ జూచిన శతృసుందరుల ప్రివర్తనమును వర్ణించుచున్నాఁడు.]

మ. పరిహాసమ్మిదియేల? కంటినిఁకఁబోవంజాల, వేలాప్రవా
నరుచిన్ నిర్దయః కాంతు, వేటికి నిరాసమ్మించు, నీశత్రుసుం
దరులెల్లన్-ప్రియకంఠలగ్నలయి, స్వప్నాంతమ్ములన్ బల్కి, యే
డ్తురహో! మేల్కాంచి, రిక్తదోర్వలయలై-తోరమ్ముతారమ్ముగాన్.

అమనిచట, శుద్ధమగు కరుణరసము [నరపతి-ప్రిభావము నతుఁగాని, నరపతియందు కవికిగల ప్రీతికిఁగాని] అంగముగానుం డుటవలన, రసవదలంకారము స్పష్టమేయగుచున్నది. ఇట్లే, యిటు వంటి స్థలములయందు [చాటువులందు] తదితరములగు రసముల

తంగభావము స్పష్టమేయగుచుండును.

లోచ :— అంగభూతమగు వేఱొక రసముతోఁగాని, వేఱొక యలంకారముతోఁగాని, మిశ్రితము కానిదియగు రసవదలంకారము- శుద్ధము. అరసాంతవాదులతో సంతటను మిశ్రితమైనది - సంకీర్ణము.

ఇచట, వర్ణింపఁబడుచున్న, నరపతియొక్క శత్రుకాంతలకు - స్వప్నమున, వారి ప్రియతముఁడు-నవ్వుచున్నట్లే కాన్పించెను. స్వప్నము - జాగ్రదనుభూతి సదృశముగానుండుటయే - దీనికి హేతువు.

పరిభా :— స్వాప్నికానుభూతి-జాగ్రిదనుభూతి సదృశముగానుండును. కనుక, "అనీశత్రుకాంతలు-నవ్వుచునేయున్నట్లు కాన్పించిన ప్రియతముని జూచి, యిట్లనుచుందురు. అని, ఒకకవి - ఒకరాజుతో ననుచున్నాఁడు.

"సరిహాసమ్మిదియేల ?" "ఇట్లునీవు బిగ్గరగానవ్వుటచేత, సాధింపఁగలిగిన ప్రయోజనమేమియును లేదు. నీయపరాధమును గప్పిపుచ్చఁజాలవు" అనిభావము.

లోచనము :— "కంటినిఁకఁబోవంజాలవు" "నీయందుఁగల [గూఢముగా విప్రియమునొనర్చు] శఠత్వము-నాకుఁదెలిసినది. కనుక, నిప్పుడు [నీవెంతనవ్వినను] నీకునాబాహుపాశమునుండి విముక్తికలుగదు." అనిభావము, వారాప్రియులనుబంధించిరి. కనుకనే, మేలుకొనినతరువాత 'రిక్తదోర్వలయలై' యేడ్చినట్లు చెప్పఁబడినది. స్వీయజనమునునిందించుట యుక్తమేయగును. కనుక "నిర్దయా" అని సంబోధింపఁబడినది. "ఏలనిరాసము" [ఎందులకు నన్నుదూరముగాఁజేయుచున్నావు ] అనఁగా; "గోత్రస్థలనాదులయందు [ పొరపడి, నీవు- నీ.లపుకత్తెనామము నుచ్చరించినపుడు] సైతము, నేనెప్పుడును, నిన్నుఖేదింపఁ జేసినదానను గానుగదా !" అనిభావము.

పరిభా :— "ఏలాప్రవాసరుచిత్వమ్మిది" నాకుప్రియభర్తవగునీకు- విదేశము నందగు నాసక్తి - ఉచితముకాదు.

లోచనము :— "స్వప్నాంతమ్ముల౯" మాటిమాటికిని నుదయించుట వలన 'స్వప్నాంతములు' - పెక్కులుగాఁ జెప్పఁబడినవి. [స్వప్నములందు ప్రలపించుట సంభవింపదు. కనుక, స్వప్నాంతములందని చెప్పఁబడినది.] పల్కి - పలవించి; నీశత్రుసుందరులెల్లన్ = నీశత్రుసుందరులలోనున్న, పత్రిసుందరి

యుఁగూడ-ప్రియకాంతుని కంఠమును బంధించినవారై, మేలుకొని, శూన్యమగు వలయాకారముగ లవిగాఁజేయఁబడినట్లున్న బాహుపాశములుగలవారలై, "తారమ్ము తారమ్ముగన్" = "అధికమైన తారస్థాయితోనేడ్తురు" అని యిందలియర్థము.

ఇచట స్థాయియగుభావము - శోకము. ఆశోకము - స్వప్నదర్శనముచేత నుద్దీపింపఁబడినది. కనుక, స్వప్నదర్శనముద్దీపనవిభావము. ఇట్లుస్వప్నదర్శనము చేత నుద్దీపితమగు, స్థాయిభావము - [సహృదయులచేత] సమాస్వాదింపఁబడి కరుణరసమగుచున్నది, ఆకరుణరసముచేత- సుందరీభూతమగుచు, [అలంకరింపఁ బడుచు, వాక్యార్థమగు] నరపతి ప్రభావము - భాసించుచున్నది. కనుక, నిచట శుద్ధమగు కరుణమే - [నరపతి ప్రభావరూప వాక్యార్థమునలంకరించుటవలన] అలంకారము. ఇచట - [నరపతి ప్రభావవర్ణనరూపమగు] ఈవాక్యార్థము-"శత్రువులఁజంపితివి నీవుసార్వభౌమ!" అను, ననలంకృతవాక్యార్థము వంటిదికాదుగదా! ఇంకేమనిన; [నరపతి ప్రభావవర్ణనరూపమగు] మీఁది వాక్యార్థమునందలి సౌందర్యము - కరుణరసకృతమే యగుచున్నది. కనుక నీవాక్యార్థము- దానిచేతనే సుందరీకృతమగుచున్నది.

చంద్రాదివస్తువు - ఉపమానమై, వేరొక వస్తువగు ముఖాదికమును సుందరమగునట్లొనర్చి, యలంకరించునట్లు, రసముకూడ-(అంగమై) వేరొకవస్తువునుగాని వేరొకరసమునుగాని, (భావమునుగాని) అలంకరించునపుడది - సుందరమగుచుండును. కనుక, ఒకవస్తువింకొక వస్తువునలంకరించుటవలన, తానలంకారమగునట్లు, రసముకూడ - వేఱొకదాని నలంకరించుటవలన నలంకారమగుటయందు విరోధమేమున్నది ?

ప్రశ్న :— అయ్యా! రసమునకు ప్రకృతార్థము నలంకరింపవలసిన యావశ్యకత యేమున్నది ?

ఉత్త :— ఉపమాదులుకూడ-వేరొకయర్థము నేల యలంకరింపవలయును?

ప్రశ్న :— ఉపమచేత - ప్రస్తుతమగు నర్థముపమింపఁబడును.

ఉ :— [ఆలాగునైనా ? సరియే.] రసముచేతఁగూడ నిట్లే- ప్రస్తుతమగు నర్థము-సరసము [రసవంతము]గాఁజేయఁబడును. ఇది- సహృదయానుభవసిద్ధమే యగుచున్నది. కనుక, "ఇచట, రసముచేత విభావాదులలో నేదియలంకరింపఁ బడును ?" అని కొందఱిచేతఁగావింపఁబడిన చోద్యము [పూర్వపక్షము] - ఇచట

[వృత్తికారునిచేత, నరపతి ప్రభావవర్ణనరూపమగు] ప్రస్తుతార్థమే- అలంకరింపఁబడఁదగినదిగాఁజెప్పఁబడి, విభావాదులలంకరింపఁబడఁదగినవిగా నంగీకరింపఁబడకుండుటచేత, పరాహత [ఖండిత] మగుచున్నది.

ప్రేయా :— భామహుఁడు ప్రేయోఽలంకారమునకుఁ గ్రింది లక్ష్యము నొసఁగి, లక్షణము నూహించుకొనవలసినదిగా నిట్లుచెప్పెను.

"ప్రేయోగృహాగతం కృష్ణమవదీద్ విదురో యథా।
అద్య యా మమ గోవిన్ద జాతా త్వయి గృహాగతే।
కాలేనైషా భవేత్ ప్రీతిస్తవైవాగమనాత్ పునః" అని.

"ఓగోవిందా! [శ్రీకృష్ణా!] ఇప్పుడునీవు మాయింటికి రాఁగా, నాకేప్రీతిగల్గినదో, ఆప్రీతి- కాలముగడచినపిమ్మట, మరల నీరాకవలననే కలుగవలయును" అనిభావము.

విదురుఁడు- తనయింటికివచ్చిన, కృష్ణునిగురించి, యెట్లుపలికెనో, అదియే- ప్రేయోఽలంకారము. [ప్రేయోఽలంకారమున కుదాహరణము.]

'లోకమునందలిప్రీతి హేతువులన్నిఁటికంటెనుగూడ- నీరాకవలనఁగలిగిన ప్రీతియేనాకు - ప్రియతరము.' అనిభావము.

తరువాత భామహునిచేత రసవదలంకార లక్షణమిట్లు చెప్పఁబడినది.

"రసవద్ దర్శిత స్పష్టశృఙ్గారాదిరసం యథా"

"ప్రదర్శితమయినదియు, స్పష్టమైనదియు, నగుశృంగారాది రసముగలది - రసవదలంకారము." అని. [ప్రస్తుతము ముద్రితములగుప్రతులయందింతమాత్రమే విషయమున్నది.]

ఉద్భట కావ్యాలంకార సంగ్రహమున, ప్రేయోఽలంకారము-ప్రేయస్వన్నామమునఁబేర్కొనఁబడి, ఆప్రేయస్వదలంకారలక్షణమిట్లు చెప్పఁబడినది.

"రత్యాదికానాం భావానా మనుభావాది సూచనైః।
యత్ కావ్యం బధ్యతే సద్భిః, తత్ప్రేయస్వదుదాహృతమ్" అని.

"ప్రతీహారేందురాజు", అనువ్యాఖ్యాత- దీనియభిప్రాయము నిట్లువిశదీకరించెను. [దాని సంగ్రహమిచట చూపఁగఁబడుచున్నది.]

"రతి" మున్నగుభావములు - స్థాయులు, వ్యభిచారులు, సాత్త్వికములు, అని - త్రివిధములు.

రతిహాసాదులు - స్థాయులు. అవి-9; నిర్వేదాదులు - వ్యభిచారులు. అవి-33; స్తంభ, ప్రళయ-రోమాంచాదులు. సాత్త్వికములు. అవి -8. త్రివిధములగు నీభావముల మొత్తము-50 అగుచున్నది.

ఈరత్యాదులగు, నీభావములను సూచించునవి - [అవగమింపఁజేయునవి] అనుభావాదులు. అవి - అనుభావము, విభావము, వ్యభిచారి, స్వశబ్దము, అనునవి. ఈయనుభావములు - ఆంగికము, వాచికము,సాత్త్వికము, ఆహార్యము, అనునభినయరూపములు. కనుక, చతుర్విధములగుచున్నవి. ఇవి - కార్యములు. కనుక, కారణభూతములగు రత్యాదులను గమింపఁజేయును. విభావము -ఆలంబనము, ఉద్దీపనము,అని ద్వివిధము. రామునకు-సీత,యాలంబన విభావము. ఋతుమాల్యానులేపనాదులుద్దీపన విభావములు. ఇవిరెండును రత్యాదులకు - కారణభూతములు. నిర్వేదాదులగు వ్యభిచారులు - రత్యాదులగు స్థాయిభావములయవస్థావిశేషములేయగును. ఇవి - సహచారులు. [సహకారులు]. స్వశబ్దముకూడ - రత్యాదుల నవగమింపఁజేయును. ఇట్లీభావములనవగమింపఁజేయునవియగు హేతువులు - నాలుగైయున్నవి. ఏకావ్యమునరత్యాదులీయనుభావాదులచేత నవగమింపఁజేయఁబడునో, ఆకావ్యము - ప్రేయస్వంతమని లక్షణచేతఁ జెప్పఁబడును.

రత్యాదులీ కావ్యమున ననుభావాదులచేత నవగమింపఁజేయఁబడును.కనుక, నిదిభావకావ్యమగుచున్నది. ఈభావకావ్యమే-లక్షణచేత ప్రేయస్వంతమని చెప్పఁబడును. ఇచట,'భావములలంకారములు, కావ్యమలంకార్యము,అగును'అని."భావకవిత్వము" అనువ్యవహారమిట్లు ప్రాచీనాలంకారికప్రసిద్ధమేయగుచున్నదని నవ్యకవులెఱుఁగునది.

ఉద్భటునిచేత రసవదలంకార లక్షణమిట్లు చెప్పఁబడినది.

"రసవద్ దర్శిత స్పష్టశృంగారాది రసోదయమ్"

దీనికి ప్రతీహారేందురాజ వ్యాఖ్యావంగ్రహమిట్లున్నది.

"మీఁదఁదెలుపఁబడిన, రత్యాది స్థాయిభావములే - అనుభావాదులచేత - పరిపోషము నొందింపఁబడునపుడు, అవి - శృంగారాదులగు నవరసములగును. రసనము [ఆస్వాదింపఁబడుట] వలన నివి - రసములగుచున్నవి. నిర్వేదాదులకిట్టి యాస్వాద్యతలేదు. కావున నవి - భావములేయగును. ఏకావ్యమున, అనుభావాదులచేత - స్పష్టరూపమున శృంగారాది రసావిర్భావము కలుగునో, ఆకావ్యము-రసవంతమని చెప్పఁబడును. రసములు - దానికలంకారములు" అని.

## — ఫలితార్థము —

రసవదాదుల విషయమున, లోచనాభిమతమగు భామహమతమునను, ఉద్భటానుయాయిమతమునను, గల యభిప్రాయము నిట్లెఱుఁగునది. భామహమతమునను సరించి, రసవదాదులగు నలంకారముల లక్షణము నిట్లు చెప్పవలయును.

"గురుదేవతా నరపత్యాది విషయకమగు ప్రీతివర్ణనమే - ప్రేయోఽలంకారము. చాటువులందు, నరపతివిషయకమగుప్రీతి వర్ణనము-ప్రధానము. అయినను, తత్ప్రీతికిఁగాని, తద్విషయమగు నరపతి ప్రభావాదికమునకుఁగాని, రసాదులంగములగుటవలన, నవి - రసవదాద్యలంకారములగుచుండును" అని. ఉద్భటానుయాయిమతమున - మీది వాక్యార్థమునిట్లు సమన్వయింపవలయును. "రతిహాసాది భావవర్ణనమే - భావాలంకారము. అదియే-ప్రేయస్వదలంకారమని చెప్పఁబడును. 'పరిహాసమ్మిదియేల?' అనుచాటు స్థలమున, నరపతి విషయకమగు రతిభావము-ప్రధానము. అచట, కరుణరసముకూడ నుండుటవలన - రసవదలంకారమును. నరపతివిషయకరతిభావముండుటవలన, - ప్రేయోఽలంకారమును, అనఁగా, భావాలంకారమును, గూడ, నుండును." అని.

## — ధ్వనివాదికృతమగురసవదాద్యలంకార సిద్ధాంతము —

"రసవదాదులు - వాక్యార్థములు. కనుక, నవి-ప్రధానములేయగును." అనునది-ఉద్భటానుయాయుల పూర్వపక్షము. "రసాదులు - ప్రధానముగా, వ్యంగ్యములగునపుడు - ధ్వనులేయగును. ఆరసాదులే - ప్రధానములుకానివై, ప్రధానమగు వేరొకయర్థమునకు, అనఁగా, రసమునకుఁగాని, భావాదులకుఁగాని, వ్యంగ్యవస్త్వలంకారములకుఁగాని, వాచ్యములగు వస్త్వలంకారములకుఁగాని, యంగములగునపుడే, యలంకారములగును. అలంకారములగు రసాదులు - అలంకార్యములగువాక్యార్థములుకావు. అలంకారమునకు రసత్త్వముండదు. అయినను,

బ్రాహ్మణశ్రమణ న్యాయమున, 'రసాలంకారము'లను వ్యవహారము - స్వీకరింపఁ బడవచ్చును'', అనునది - ధ్వనివాదుల సిద్ధాంతము. మఱియు, నుద్భటమతాను సారులు - వృత్తియందు, ''వాక్యార్థమై యుండిననుగూడ'' అనుచోనున్న ''కూడ'' అనుశబ్దమును - భిన్నక్రమమునుకొని, వృత్తియందు, ''చాటువులందు'' అనుచోటనున్న సప్తమిని - షష్ఠ్యర్థకముగా సన్వయించి, చాటువులకు వాక్యార్థత్వమున్నను, ప్రేయోలంకారమునకుఁ గూడ వాక్యార్థత్వమున్నదని తలఁచి, ''పరిహాసమ్మిదియేలః'' అనుచోట, రసవదలంకారమును, ప్రేయోలంకారమును, గూడ నగుననుచున్నారు.

కాని, చాటువులందు, అనుసప్తమికి - షష్ఠ్యర్థకల్పనము-క్లిష్టమగు సమన్వయము. కనుక, భామహానుసారియగు వ్యాఖ్యానమే - సమీచీనమని తెలియునది. సత్యమేమనిన :— చాటువులందు, గురుదేవతానరపత్యాది విషయకరతిభావము - తాను ప్రధానమగుటవలన - ప్రేయోఽలంకారమగుటలేదు. ప్రధానమగు నారతి భావమునకు - వేరొకభావమంగమగునపుడు - అంగమగు నాభావమే- ప్రేయోఽలంకారము - [అనఁగా; భావాలంకారము] అగుచుండును.'' ''రసమంగమగునపుడు - అంగమగు నారసమే - రసవదలంకారమగును.'' అని, సమీక్షింపవలయును.

—• రసాదిధ్వనులకును -
రసవదాద్యలంకారములకును-గలభేదము. రసవదాదుల వివరణము. •—

'విభావము, అనుభావము, వ్యభిచారిభావము. అనువానిచేత నభివ్యంజితమగు - రతి, హాసము, శోకము, మున్నగు చిత్తవృత్తి విశేషము - సహృదయాస్వాద్యమై, ప్రధానమగునపుడు - రసమగును. అనేకములగు విభావములచేత - పరిపోషమునొందని, రత్యాదులుకూడ - వ్యభిచారిభావములేయగును. ఈభావాదులు-ప్రధానములగునపుడు - భావాదిధ్వనులగును. ఇంకొకయర్థము [వేరొకరసము, భావము, మున్నగునది -] ప్రధానమగునపుడు, దానికి శృంగారాదిరసము తానంగమై, దానినలంకరించునపుడు, రసవదలంకారమగును. విభావానుభావముల చేత నభివ్యంజితమైన, నిర్వేదాది వ్యభిచారిభావమును, అప్రధానముగా వ్యంజితమగు రత్యాదిభావమును, దేవతాదివిషయకమగు రతిభావమును, భావమని చెప్పఁబడును. ఈభావములును, ఈభావములకు సంబంధించిన శాంత్యాదులును, ప్రధానములుగా నభివ్యంజితములగునపుడు - అవి - భావాదిధ్వనులగును. ఈరత్యాది భావమును, నిర్వేదాదిభావమును, దేవతాగురుశిష్యద్విజపుత్త్రాది విషయమున

నభివ్యంజితమగు రతిభావమును, వేరొకయర్థమున కంగమై, దానినలంకరించునపుడది - భావాలంకారము, లేక ప్రేయోఽలంకారమగును. అనుచితమగు నట్లు ప్రవర్తించిన, రసము - రసాభాసమనియు, భావము-భావాభాసమనియుఁజెప్పఁబడును, రసాభాస, భావాభాసములలో-నేదయినను, వేఱొకయర్థమున కంగమగునపుడది- 'ఊర్జస్వి' అను నలంకారమగును. భావమునకగు ప్రశామ్యదవస్థ - భావశాంతి. అది - వేరొకయర్థమున కంగమగునపుడు, సమాహితాలంకారమగును. భావమున కుద్గమావస్థ - భావోదయము. అది - వేరొకయర్థమున కంగమగునపుడది- భావోదయాలంకారమగును. విరుద్ధములగు భావములురెండు - పరస్పర స్పర్ధలేనివగుచుండుట - భావసంధి. అదియు, నితరమున కంగమగునపుడు, భావసంధ్యలంకారమగును. పెక్కుభావములు-పూర్వపూర్వముల, నుపమర్దించుచు, నుదయించుట భావశబలత. ఈభావశబలతకూడ - ఇతరమున కంగమగునపుడు భావశబలతాలంకారమగును. రసవదాదులగు నలంకారములేడును, గుణీభూత వ్యంగ్యభేదములగు నపరాంగములుగాఁ జెప్పఁబడును. అపరాంగములగుటవలన - అలంకారములగు రసాదులు- మధ్యమకావ్యముగాను, అంగులగుటవలన నలంకార్యము [ప్రధానము]లగు, రసాదులు ఉత్తమకావ్యముగాను, వ్యంగ్యార్థస్పర్శలేని శబ్దార్థమయమాత్రమగు కావ్యము-అధమకావ్యముగాను, జెప్పఁబడును. చిత్రము (బొమ్మ) వంటిదికనుక, నీయధమ కావ్యము - చిత్రకావ్యమనియుఁ జెప్పఁబడును. ప్రధానవాక్యార్థములగు శృంగారాదిరసములు. [స్థితిరూపములగు] భావములు, రసాభాస, భావాభాసములు, భావశాంతి, భావోదయము, భావసంధి, భావశబలత, అను నలక్ష్యక్రమధ్వనులు-అంగులు. కనుక, నలంకార్యములగును. అంగములగుటవలన, గుణీభూతములగు రసాదులు - అలంకారములగును. అవియే- రసవదాదులు. అనునది ఫలితార్థము. ప్రభామతి ప్రసారితమగు నీఫలితార్థము నెఱిఁగిన పాఠకులకు-రసాదిధ్వనులకును, రసవదాద్యలంకృతులకును, గల భేదము-సులభముగాఁదెలియును.

లోచనము :— "ఇత్లే, ఇటువంటి స్థలములయందు" అను, వృత్తివాక్యమునందలి, "ఇత్లే" అనుదానిచేత - 'ఈయర్థము - లక్ష్యమునందు, విస్తృతమై యున్న'దని ప్రదర్శింపఁబడినది. "ఇటువంటిస్థలములందు" అనఁగా; "రాజాదులయొక్క ప్రభావఖ్యాపనముగల, యుదాహృతులయందు" అనియర్థము.

ప్రభా :— రాజాది ప్రభావఖ్యాపనముగల, యుదాహృతులందు - రాజప్రభావాతిశయ ప్రఖ్యాపనమునకు - కరుణరసమేకాక, తదితరములగు రసములు గూడ - అంగములుగానుండుట, స్పష్టమేయగుచున్నదని భావము.

(14) మూలము :— సంకీర్ణమగు రసాదిక మంగభూతమగుటకు [అలంకారమగుటకు] ఉదాహరణము.

మ॥ కరమంటన్ విదలించి, చీరచెఱఁగున్ గైకొన్న మర్దించి, పె
న్నెరిఁగొన్నన్ వదలించి, కాళ్లఁబడినన్- వీక్షింప,కాశ్లేషమున్
దరలన్ జేసి, సబాష్పమౌ, త్రిపురకాంతాశ్రేణియం,దార్ద్ర దో
షి, రతుంబోలు, శివాశుగాగ్ని-దురితక్షిప్తిన్, మిమున్ బ్రోచె
డిన్!.

అనునిచట త్రిపురరిపు (శివ) ప్రభావాతిశయము-వాక్యార్థ [ప్రధాన] మగుచుండ - శ్లేషసహితమగు, నీర్ష్యావిప్రలంభము - దానికంగమగుచున్నది.కనుక, రసవదలంకారమునకు న్యాయ్యమగు విషయము - ఇట్టిదియేయగును. కావుననే - [ఈర్ష్యావిప్రలంభ, కరుణములు-విరుద్ధములైనను, నిచట వేరొక వాక్యార్థమునకవి] - అంగములుగా వ్యవస్థాపింపఁబడుటవలన, నిచట - ఈర్ష్యావిప్రలంభ శృంగార-కరుణములకగు సమావేశమున, దోషములేదు.

ప్రభా :— ఇది . అమరుక కావ్యమునందలి, శ్లోకమున కాంధ్రీకరణ రూపము. సాహిత్యశాస్త్రగ్రంథములందు - తఱచుగా నుదాహృతమగునదియగు. దీనిమూలశ్లోకమిట్లున్నది.

"క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోఽంశుకాన్తం,
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణ నిపతితో నేక్షితః సంభ్రమేణ।
ఆలిఙ్గన్ యోఽవధూతస్త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః,
కామీవార్ద్రాపరాధః సదహతుదురితం శామ్భవో వః శరాగ్నిః.

"శివుఁడు త్రిపురాసుర సంహారము నొనర్చునపుడు-ఘోరమగు, బాణాగ్ని ప్రయోగము నొనర్చెను. అగ్నివంటిదగు, నాబాణసమూహము- త్రిపురములందు నొగల యసురుల హృదయములను భేదించియు, అంతతోనాగక, ఆయసుర యువతుల కరములందును, వస్త్రాంతములందును, కేశపాశములందును, పాదముల యందును, సర్వాంగములయందునుగూడఁ బ్రసరించెనో, ఆబాణాగ్ని - మీదురిత

మును దహించుఁగాక!'' అని యిచట, త్రిపురరిపువగు శివుని ప్రభావాతిశయము, వర్ణింపఁబడినది.

లోచనము :— ఇచట, కామిపక్షమునను, బాణాగ్నిపక్షమునను గల, యిందలి యర్థద్వయమును, క్రమముగా నిశ్లేషించుచున్నది. [కరమంటన్] 'విదళించి = [కాముకుఁడు ప్రియురాలి పాణిని గ్రహింపఁగా] ఆదరింపక, [బాణాగ్ని, త్రిపురకాంతల చేతిమీదకుఁ బ్రసరింపగా] దానినిజిమ్మివైచి, ఆశ్లేషమున్ దరలన్ జేసి = కాముకుఁడు కౌగిలింపఁగా, తత్ప్రియురాలు-ప్రత్యాలింగనమునొనర్పక, తిరస్కరించి; తమసర్వాంగములందును వ్యాపింపఁగా, త్రిపురకాంతలాబాణాగ్నిని తొలఁగించి; అనియర్థము. కామిపక్షమున, ఈర్ష్యచేత, తత్ప్రియాంగన - సబాష్ప [కన్నీటిని వెలార్చునది] యయినదనియు, బాణాగ్నిపక్షమున, నిష్ప్రత్యాశచేత, త్రిపురకాంతలు - సబాష్పలయిరనియు, గ్రహించునది. ['మర్దించి' మున్నగువాని యర్థముల, నిట్లే, సమన్వయించుకొనునది.]

ప్రభా :— కామిపక్షమునను, బాణాగ్నిపక్షమునను, సంపూర్ణమగునిందలి యర్థద్వయమును - గ్రమముగా నిట్లెఱుగునది. మీఁది పద్యమున కాముకుఁడు-రతుఁడని చెప్పఁబడెను. "ఆర్ద్రాదోషి, రతుఁడు'' అనఁగా; స్వల్పకాలమునకు ముందే, యొనర్పఁబడుటవలనఁ గప్పిపుచ్చుటకు వీలుపడని, యేదోయొక యపరాధము నొనర్చిన, కామి. "[కాముకుఁడగు ప్రియుఁడు] - తనప్రియకాంతను లాలించి, తత్సమ్మేళనము నొందుటకు, మొదటనామె పాణిని మెల్లగా గ్రహించెను. అతనియపరాధము నెఱిఁగి, విస్మరింపకుండిన, యాప్రియకాంత- అతఁడొనర్చిన పాణిగ్రహణము నాదరింపకుండుటవలన, నతనిచేతిని - తనచేతినుండి వేఱు పఱచినది. అపుడాకామి - ఆయువతి చీరచెఱఁగును- బట్టుకొనఁగా, నామె యాతనిని మర్దించినది. అతఁడు - అప్పుడాలలన కేశపాశమును - గ్రహింపగా, నామె యతనిచేతిని- కేశపాశమునుండి తొలఁగించినది. ఇంకొకతీరున, లాలింపఁదలఁచి-యాకామి - ఆకాంత పాదములచెంత వ్రాలఁగా, నామె-యతనిని జూడక, యుపేక్షించినది. ఇఁక, లాభములేదని, తొందరపడి, యతఁడామెను గట్టిగా నాలింగన మొనర్ప, ఆమె, యతనిని ద్రోసివైచి, కన్నీటితోఁగూడిన కలువకంటియైనది.'' ఇచట, విభావానుభావాదులచేత, నీర్ష్యావిప్రలంభ శృంగారము - వ్యంజితమగుచున్నది. శివబాణాగ్ని - ఆర్ద్రాదోషియయిన, యీ కాముకునితోఁబోల్పఁబడినది. అనఁగా, ఈర్ష్యాకషాయిత స్వాంతయగు, ప్రియకాంతయందు-కామివలె, త్రిపురకాంతలయందు - శివబాణాగ్ని - ప్రవర్తించినట్లు చెప్పఁబడినది. బాణాగ్నిపక్షమునఁగూడ - మీఁది పదముల యర్థమును సమన్వయింపవలసియున్నది. కనుక,

బాణాగ్ని పక్షమునందలి యర్థము నిట్లెఱుఁగునది.

"శివబాణాగ్ని-[త్రిపురాసుర పురుషులను ఖండించుటతోనాగక] త్రిపురాసుర స్త్రీలమీఁదికిఁగూడఁ బ్రసరించినది. మొదట, వారిహస్తములమీఁదికిఁబ్రసరింప-వారాబాణాగ్నిని [అగ్నివంటి బాణసముదాయమును] చిమ్మివైచిరి. మరల, నా బాణాగ్ని - అకాంతలయంశుకాంతములఁ బ్రసరింప- వారుదానిని దప్పించుకొనిరి. ఇంకను వదలని, యాబాణాగ్ని - వారిపాదములచెంతఁబడఁగా, వారు - సంభ్రమముచేత, దానిని జూడరైరి. అంతతోనాగక, ఆబాణాగ్ని - వారి సర్వాంగములందును బ్రసరింప, వారు కంగారుపడి, దానినెట్లో తప్పించుకొని, బాష్పపూర్ణనేత్రోత్పలలైరి. ప్రియురాలిని లాలింపఁగోరిన కామివలె, త్రిపురకాంతల విషయమునఁ బ్రసరించిన శివబాణాగ్ని - భక్తులగు మీపాపములను దహించి, మిమ్ము రక్షించుగాక!" అని, యిచట ప్రధానముగా త్రిపురరిపు శివప్రభావాతిశయము - వర్ణింపఁబడినది.

లోచనము :— "రతున్ బోలు శివాశుగాగ్ని" అనఁగా; 'కాముకునివంటి శివబాణాగ్ని' అను నుపమానమిచట, శ్లేషచేతననుగ్రహింపఁబడినది. ఆయుపమానముచేత, ఈర్ష్యావిప్రలంభ మాకర్షింపఁబడినది. కనుక, నిచట శ్లేషోపమాసహితమగు నీర్ష్యావిప్రలంభము - త్రిపురరిపు ప్రభావాతిశయరూపమగు ప్రధానవాక్యార్థమున కంగమగుచున్నది. కాని, కేవలమగు నీర్ష్యావిప్రలంభము మాత్రమే - దానికంగమగుటలేదు. వాస్తవమగు కరుణరసముకూడ - ఇచటనున్నది. అయిన, నాకరుణరసము-ఈర్ష్యావిప్రలంభమునకు, చారుత్వప్రతీతిని సంఘటించుటలేదు. [ఆకరుణము - విప్రలంభమున కంగమగుటలేదు.] అనునభిప్రాయముచేత, వృత్తికర్త - కరుణమను నంగముతోఁగూడిన, విప్రలంభమును, త్రిపురరిపు ప్రభావాతిశయమున కంగముగాఁజెప్పక, శ్లేషసహితమగు, [అనఁగా, శ్లేషోపమాసహితమగు] ఈర్ష్యావిప్రలంభమునే, త్రిపురరిపు ప్రభావాతిశయమున కంగముగాఁ జెప్పెను. అపూర్వమగునట్లుత్ప్రేక్షింపఁబడిన యీయర్థమునే - దృఢీకరించుటకు, రసవదలంకారమున కిటువంటిదియే- న్యాయ్యమగు విషయమని చెప్పెను. "కావుననే" అనువృత్తివాక్యమున కిదియర్థము :— "ఏకారణమువలన, నిచట ఈర్ష్యావిప్రలంభ శృంగారమలంకారమేగాని, వాక్యార్థము - [అలంకార్యమగు ప్రధానార్థము-]కాకున్నదో, ఆకారణమువలననే, ఈర్ష్యావిప్రలంభ శృంగార-కరుణములు, రెండునుగూడ - ప్రధానమగు త్రిపురరిపు ప్రభావాతిశయమున కంగములుగా మరడుటవలన-[ఈరసములొకదాని,కొకటి విరుద్ధములైననుగూడ] వానికగుసమావేశము-[ఏకత్రావస్థానము]-దుష్టముకాదనిచెప్పఁబడినది. ఈవిప్రలంభ, కరుణము

లలో, నొకరసమున కిచట, [సమ] ప్రాధాన్యముండినయెడల. రెండవదియగు రసమునకు దానితోడి సమావేశము-కలిగియుండెడిదికాదుగదా। ఏలయనిన :— రతిని, స్థాయియగుభావముగాఁ గలిగియుండుటవలన, విప్రలంభశృంగారము - సాపేక్షభావమును, [అనఁగా; సమాగమాశగలదియు,] శోకమును-స్థాయిభావము గాఁగలిగియుండుటవలన కరుణము - నిరపేక్షభావమును, [పునస్సమాగమాశ లేనిదియు] నగుచున్నది. సాపేక్ష భావముగల విప్రలంభము-నిరపేక్షభావముగల కరుణముతోఁగూడి - యొకేకావ్యమునందుండుట - విరుద్ధమేగదా।

ప్రభా :— ఈయంశము - [విరోధిరసములకగు సమావేశనిరూపణమున] తృతీయోద్ద్యోతమునందు సమీక్షింపనగును.

[ద్వితీయభాగము 128-134 పేజీలు]

అచట, వేరొకయర్థము ప్రధానమగునపుడు, పరాంగములగు విరుద్ధరసము లకగు సన్నివేశము - దోషావహము కాదనియు, విరుద్ధరసములు - వేరొకయర్థ మున కంగములు కానియెడల, వాని సమావేశము - దుష్టమేయగుననియుఁ, జెప్పఁ బడినది.

లోచనము : అవ :— అలంకారశబ్ద ప్రసంగమున నిట్లు [విరుద్ధరస] సమావేశమును ప్రసాధించి, "ఇటువంటిదియే" అనువృత్తివాక్యమున, నేదిచెప్పఁ బడినదో, అచటి 'యే'కారమునకు సంబంధించిన, యభిప్రాయమును [వృత్తికా రుఁడే] విశదీకరించుచున్నాఁడు.

(15) మూలము : — [పూర్వోక్తవిధమున ప్రధానవాక్యా ర్థమునకుఁ దానంగముగాక] ఎచ్చట, రసమే - వ్యాఖ్యార్థమగు చుండునో, అచ్చట, నది - యలంకారమెట్లగును ? అలంకారము- చారుత్వహేతువని ప్రసిద్ధముగదా ! [ఆత్మయగు] రసము - తానే, తనకు చారుత్వహేతువు కాదుగదా !.

కావున, నీయంశమిచట - నిట్లు, సంక్షేపింపఁబడుచున్నది. [పరికరపద్యము]

క॥ "రస, భావముఖ్య, తాత్ప
ర్య సమాశ్రియములయి యుండునట్లుగనగు, వి

న్న్యసనమె. అలంకరణ కా
ర్యసాధనమ్మగు నలంకి్రియల కన్నిఁటికిన్"

ప్రభా :— ఇది - పూర్వోక్త విషయసారమును - సంగ్రహించునదియగు పరికరపద్యము, దీనిమూలమిది ;—

"రసభావాది తాత్పర్యమాశ్రిత్య, వినివేశనమ్।
అలఙ్కృతీనాం సర్వాసా మలఙ్కారత్వసాధనమ్॥"

అవ :— " 'అలంకి్రియల కన్నిఁటికిన్' అనుచోట - 'రసవదాదులగు నలంకృతులకు' అనియేయర్థము'' అను భ్రమకలుగవచ్చు''నని, లోచనకర్త - దీనిని గూడ, వ్యాఖ్యానించుచున్నాఁడు.

లోచనము : అవ :— దీనియందలి భావమిది :- ఉపమాదులలంకారము లగుట కెట్టిది - హేతువగుచుండునో, రసాదులలంకారములగుటకుఁగూడ నట్టి దియే - హేతువగుచుండును.

ప్రభా :— "ఉపమాదులును, రసవదాదులునుగూడ, రస, భావాదితాత్ప ర్యము నాశ్రయించి, [అన్యమున కుపస్కారకములగునట్లు] నివేశింపఁబడునప్డే- అలంకారములగును.'' అనిభావము.

లోచనము :— కనుక, వీనిచేత నలంకరింపఁదగిన, వేరొకయర్థమవశ్య ముగా నుండవలయును. అలంకార్యమగునది - [నరపతి ప్రభావాది] వస్తుమా త్రముకూడ - కావచ్చును. అయిన, నదికూడ - తిరుగ, విభావాదిరూపమునఁ బర్యవసించుటవలన,రసాదితాత్పర్యముగలదియేయగుచుండును. కనుక, నంతటను గూడ- రసధ్వనియే-[రస, భావాదిధ్వనులే] ఆత్మయగుచుండును. ఈయంశమే_ "రస, భావముఖ్య,తాత్పర్య సమాశ్రయములయి యుండునట్లుగ'' అని చెప్పఁ బడినది.

ప్రభా :— "పరిహాసమ్మిదియేల ?'' ఇత్యాదులయందు, వర్ణింపఁబడు చున్న, రాజాదివిషయకమగు రతిభావమే - వక్తృగతము. ఆరతిభావము-రాజాది ప్రభావముచేత విభావముగలదిగాఁ జేయఁబడి, ప్రధానముగుచుండును. కాఁగా, తుదకెచ్చటనైనను, రసాదికమే - కావ్యాత్మయగుట - తప్పదనితెలియునది.

(16) మూలము :- కనుక, నెచట రసాదులు - వాక్యార్థీభూతములో; [ప్రధానములో] అచట నా రసాదులన్నియు రసాదికర్తృకమగు నలంకారతకు [రసాదులకగు నలంకారతకు] విషయములుకావు. [ప్రధానవాక్యార్థములగు రసభావాదులన్నియుఁగూడ- రసవదాద్యలంకారములుకావు.] అవి- [రసాదులగు] ధ్వనిప్రభేదములు - దానికి [ఆరసాదిధ్వనికి] ఉపమాదులు- అలంకారములు.

లోచ :— ''నసర్వః నరసాదేరలఙ్కారతాయావిషయః'' అనుచోనున్న వ్యధికరణ షష్ఠులకు - (ఆరసాదులన్నియు,) రసాదికర్తృకమగు నలంకరణ క్రియాస్వరూపమునకు (విషయములుకావు) అనిఅర్థము. 'దానికి' అనఁగా; 'ప్రధానమును, ఆత్మభూతమును, నగు, రసాదిధ్వనికి' అనియర్థము. ఈఁది వృత్తివాక్యముచేతఁ జెప్పఁబడినది - యిది :— ''ఉపమాదులచేత - వాచ్యార్థము అలంకరింపఁబడుట సత్యమేయగును. అయినను, ఉపమాదులు వాచ్యార్థము నలంకరించుట యనఁగా; ఆవాచ్యార్థమునను -వ్యంగ్యమగు[రసాదిరూపమగు] నర్థము నభివ్యంజింపఁజేయునదియగు, సామర్థ్యమును గలిగించుటయేయగును. కనుక, పరమార్థస్థితిచేత, రసాదిధ్వనిరూపమగు నాత్మయే - అలంకార్యము. శరీరమునకు నాయములగు కటకకేయూరాదులుకూడ[శరీరమునుగాక] వారివారి[ఆయాయాత్మల] చిత్తవృత్తివిశేషమునకు సంబంధించిన యౌచిత్యమునుసూచించునదియగు,స్వరూపమునుగలిగి, చేతనుఁడగునాత్మనేయలంకరించుచుండునుగదా !.

అదెట్లనిన :— అచేతనమగు శవశరీరము-కడియములు, కుండలములు, మొదలగు నలంకారములతోఁ గూడియుండినను గూడ, భాసింపదుగదా!. ఏల ? ఆశవశరీరము - చేతనమగు నాత్మలేనిదగుటవలన, అలంకార్యముకాదు. కనుక, అలంకృతమైనను భాసించుటలేదు. [కనుక,] చేతనమగు నాత్మయే, కటకాదుల చేత, శరీరద్వారమున, అలంకార్యము = అలంకరింపఁదగినది.'' అనునది-ఫలితార్థము. అలంకార్యుఁడగు యత్యాత్మకుచితములగు నలంకారములు కాకుండుట వలన, యతిశరీరము - కటకాదులచేత నలంకరింపఁబడినపుడు, నవ్వుపుట్టించును.

ప్రభా :— కటకాదులు- రాగికే, ఉచితములగు నలంకారములగుచున్నవి. యతి - రాగిగానుండుట-యనుచితము. కనుక, యతిశరీరగతములగు, కటకకుండలహారాదులు,అంగీలు, మున్నగునవి-ప్రేక్షకులకు నవ్వునే పుట్టించునని భావము.

లోచనము :— ఏయలంకారముచేతనైననుగూడ నలంకరింపఁబడుటకు, దేహమున కనౌచిత్యమించుకయు లేకుండుటవలన, [వస్తుతః] పరమార్థస్థితిచేత, ఆత్మయే - అలంకార్యము. [అలంకరింపఁదగినది - ఆత్మయే.] (మఱియు) ''నేనలంకరింపఁబడినాను'' అనునభిమానమువలన - అదియే - అలంకార్యము.

ప్రభా :— ''వేరొకవస్తువునుగాని, రసాదికమునుగాని, యలంకరించునవి - అలంకారములు. ఆయలంకారములచేత, నలంకరింపఁబడునది - అలంకార్యము. ప్రధానముగా వర్ణింపఁబడునవియగు, వాచ్యార్థములు - ఉపమాదులగు నలంకారములచేత నలంకరింపఁబడును. ఉపమాద్యలంకృతములగు, నావాచ్యార్థములు-కవిగతమగు [చిత్తవృత్తివిశేషరూప] భావమునుగాని, కవిచేత నిబంధింపఁబడిన, వ్యక్తియందగుభావమునుగాని, రసాదిరూపమగు నర్థమునుగాని, వ్యంజింపఁజేయును. కనుక, ఉపమాదులు - వాచ్యార్థము నలంకరించుట యనఁగా; వ్యంగ్యరసాదివ్యంజనమున కావశ్యకమగు సామర్థ్యమును వాచ్యమునందొదవించుటయే యగును. ప్రధానమగు, నలంకార్యము - స్వాత్మయగు రసాదికమేగాని, యింకొకటికాదు ఆత్మలేని, శవశరీరము - మణిహారాది నమలంకృతమైనను, శోభింపనట్లు, రసాది ధ్వన్యాత్మలేని, కావ్యము - ఉపమాద్యలంకృతమైనను శోభింపదు. కనుక, ఆత్మయే - వస్త్రములు, భూషణములు, మున్నగువానిచేత - అలంకరింపఁదగినది. అలంకారములు - ఆయాయాత్మల కుచితములగు చిత్తవృత్తివిశేషములగు రాగాదులను - సూచించు స్వభావమును గలిగియుండును. అదెట్లనిన :— యతికుచితమగు వైరాగ్యము - దండము, కాషాయవస్త్రము, మున్నగు నలంకారములచేత, సూచింపఁబడునుగాని, హారాకేయూరాదులచేత - సూచింపఁబడునది కాదు. సరిగదా, హారకేయూరాద్యలంకృతమగు యతివేషము - లోకులకునవ్వునే పుట్టించును. ఇట్లు నవ్వుపుట్టించుటకు హేతువు-రాగిత్వసూచకములగు హారాదులు-విరాగియగు యత్యాత్మకుచితములు గాకుండుటయేగదాః.

అనుభవము ననుసరించి, సమీక్షించునపుడుగూడ - ''నేనలంకరించుకొన్నాను'' అనునభిమానమాత్మకేకాని, శరీరమునకులేదు. కనుక, ఈలోకమున మానవాత్మవలె, సాహిత్యలోకమున, కావ్యాత్మయగు రసాద్యాత్మయే - అలంకార్యము, కాగా; ఉపమాదులు - వాచ్యద్వారమున, కావ్యాత్మయగు, రసాదులనే-యలంకరించును.'' అనునది ఫలితార్థము.

(17) మూలము :— రసాదులు-వాక్యార్థములు గాకుండునపుడు, వేఱొకయర్థమునకు ప్రధానముగా వాక్యార్థీభావముండు

స్థలమునందుమాత్రము - ['ఆ'ప్రధాన వాక్యార్థమునకు] రసాదులచేత - చారుతానిష్పత్తి కావింపఁబడునెడల; అది- [ఆకావ్యము] రసాదికర్తృకమగు నలంకారతకు [రసాదు లలంకారములగుటకు] విషయము. ["రసాదులచేత నొనర్పఁబడు నలంకరణమునకు విషయము - అనఁగా; అదియే - రసవదలంకారకావ్యము."] అని భావము.

లోచనము :— ''స, రసాదే, రలఙ్కారతాయా, విషయః'' అనుచోట, రసాదేః, అలఙ్కారతాయాః, అనునవి- (వెనుకటివానివలెనే) వ్యధికరణషష్ఠులు. [ఆపదములు - సమానాధికరణములుకావు.] రసాదులకేయలంకారతకలదో, ఆయలంకారత, కాకావ్యమేవిషయము.'' [ఆశ్రయము.] అనునది వానియర్థము.

ప్రభా :— ''సరసాదేరలఙ్కారతాయావిషయః'' అనుమూలము-''అది - రసాదికర్తృకమగు నలంకారతకు విషయము'' అని తెనిఁగింపఁబడినది. ''ఆకావ్యము - రసాదులొనరించునదియగు నలంకరణక్రియ కాశ్రయము'' అనిదీని యర్థము.

(18) మూలము : — ఇట్లు (రసాది) ధ్వనికిని, నుపమాదులకును, రసవదలంకారమునకును, [రసవదాదులకును] విషయవిభాగమేర్పడుచున్నది.

లోచనము :— ''ఇట్లు'' అనఁగా; ''మాచేతఁదెలుపబడిన విషయభాగముచేత'' అనియర్థము. ''ఎచట, రసమలంకార్యమైయుండునపుడు, వేరొకరసమంగముకాకుండునో, అచట, ఉపమాదులు - శుద్ధములేయగును. అచట, [రసవదాదులతోడి] సంసృష్టిచేత - ఉపమానుల విషయమపహరింపఁబడునదికాదు.'' అనిభావము. ''రసవదలంకారమునకును'' అనుదానిచేత, ప్రేయస్వి, ఊర్జస్వి, సమాహితము, అను భావాద్యలంకారములుకూడ గ్రహింపఁబడుచున్నవి.

ప్రభా :— ''భావము - అపరాంగమగునపుడు, [వేరొకప్రధానవాక్యార్థమునకంగమగునపుడది - ] 'భావాలంకారము, అనిచెప్పఁబడును. ఈభావాలంకారమే - ప్రేయస్సు, ప్రేయస్వి, ప్రేయస్విదలంకారము అనిచెప్పఁబడును. ఉద్భటాలంకారముననిది-ప్రేయస్వదలంకారమని చెప్పఁబడినది. రసాభాసమును,

భావాభాసమును, నిక్షేపపరాంగములగునపుడవి-ఊర్జస్వి అను నలంకారమగును. భావశాంతి - అపరాంగమగునపుడు, 'సమాహిత'మని చెప్పఁబడును. లోచనమున "ప్రేయస్వ్యూర్జస్వి సమాహితాః" అను పాఠమును ననుసరించి, ప్రేయస్వి, ఊర్జస్వి సమాహితము, అను నలంకారములు - మూఁడింటినే, రసవదలంకారముతోఁ జేర్చునెడల; రసవదాదులగు నలంకారములు - నాలుగేయగును. "సమాహితాః" అను టకుబదులు, లోచనమునందే, "సమాహితాదయః" అను నింకొక పాఠమున్నది. కనుక, దానిననుసరించునప్పుడు, భావోదయము, భావసంధి, భావశబలత, అను నలంకారములనుగూడ వీనితోఁజేర్చుటకు వీలుపడును. అప్పుడు రసవదలంకారమునుగూడ వీనితోఁజేర్చుటకు వీలుపడును. అప్పుడు రసవదాదులసంఖ్య - యేడగును." అనితెలియునది.

లోచనము :— భావాద్యలంకారములయందు, శుద్ధమగు భావాలంకారమునకు [ప్రేయస్వికి] ఉదా :—

చం॥ తలి! శతపత్రి మృదుతామ్రితలమ్ము. భవత్పదమ్ము, చం
చలకలహంసనూపుర వినోదితలధ్వనిభూషితమ్ము, దా,
నేఁ మహిషాహ్వయుండగు, మహాసురశీర్షమునన్ హఠాత్తుగా,
నిలిచి, మహాసువర్ణ భరణీధ్రగురుత్వము నెట్లుపొందెనో ?
[అభినవగుప్తకృతమగు దేవీస్తోత్రమునందలిది.]

అనునిచట, దేవీస్తోత్రము - [ప్రధానమగుటవలన,] వాక్యార్థమగుచుండ, ['అతిమృదులమగు నీపదము, మెట్లు మేరుపర్వతభారమువంటి భారముగలదియైనదిః' అను] దానిచేత, గమ్యమగు- వితర్కము, విస్మయము, మున్నగుభావము- దానికి చారుత్వహేతువగుచున్నది. కనుక, [నిచట, దేవీప్రభావమునకుఁగాని, దేవీవిషయకభక్తిభావమునకుఁగాని] ఆవితర్కాదిభావమంగమగుటవలన, నిది, భావాలంకారమునకు [ప్రేయోఽలంకారమునకు] విషయమగుచున్నది. [ఇదియే- భావశబలత్వమున కుదాహరణమని తెలియునది.]

రసాభాసకృతమగు నలంకారతకు [రసాభాసము - పరాంగమగుటకు, అనఁగా; ఊర్జస్వియను నలంకారమునకు,] నేను [అభినవగుప్తపాదులు] రచించిన స్తోత్రమునందలిదియేయగు నుదాహరణము :—

"నవలా" అను జాతీయమగుపద్యము :- [ప్రభాషుని పరిసరణము,]

సమస్తగుణ సంపదలో వాణీ! ప్రశస్తాలంకారగణమ్ములతో
సమరి, నీకుభూషణమగుచున్నవి, యైననీవు శోభింపకున్నావు!
ప్రమదహృదయుండుగ, శివునినీహృదయవల్లభు,నెట్లైనను రంజింపుము!!
రమణమిదియె - నీకఖిలలోకోత్తరమగు విభూషణమని యాలింపుము!

ప్రతిభా :— శ్రీమదభినవగుప్తాచార్యుండు - స్వవిరచితమగు [దేవతా] స్తోత్రమున, నిజకవితావాణిని - పరమేశ్వరుండను నాయకునకు, నాయికనుగా నారోపించి, ఆకవితావాణితో ననుచున్నాడు. ఇచట, కవితాపక్షమునను, వాణి యను నాయికాపక్షమునను, గలయర్థద్వయము శ్లిష్టమగునది.

"ఓ వాణీ = ఓకవితావాణీ!, వాణియనునోకాంతా! సమస్తగుణసంపదలు = మొత్తమువైయున్న మాధుర్యాదిగుణవిభూతులు. లేక సౌందర్యశీలాదిగుణవైభవములు. ఇవియన్నియు, ప్రశస్తాలంకారగణమ్ములతో = ప్రశంసార్హములగు, అనుప్రాసము, ఉపమ, మొదలగు నలంకార సముదాయముతో, లేక, కొనియాడందగిన కటకకేయూరాదిభూషణస్తోమముతో, సమరి = కూడి, నీకుభూషణమగుచున్నవి. ఇవి యున్నయుం గూడి, యిట్లునిన్నలంకరించుచున్నను గూడ, నీవుశోభనొందకున్నావు. "ఎట్లైనను నేనెట్లు శోభింతును?" అనియడుగుదువా? ఇది - వినుము నీవు - సర్వమునకును నాత్మయగుటవలన, నీకును నాత్మయగుచు, ప్రియుండగుటవలన హృదయవల్లభుండగు శివుని, లేక; మంగళాకారుండగు నీప్రియతముని; ఎట్లైనను = కీర్తించుటచేతనో, వ్యాఖ్యానించుటచేతనో, లేక; సేవించుటచేతనో, లాలించుటచేతనో; యెట్లో, నీయందుదయగలిగి, నీయందనురక్తుండయి, ప్రమోదముం గలహృదయముగలవాండగునట్లు; రంజింపంజేయుము! రమణమిదియె = ఇట్లాతనిని రమింపంజేయుటయే :- నీకు సర్వలోకోత్తరమగు భూషణము. నాయికయగు స్త్రీకి - సౌందర్యాదిగుణములును, విచిత్రవస్త్రాలంకారములును, భూషణములు కాక, హృదయేశ్వరుండగు భర్తనెట్లో యనురంజింపంజేసి, రమింపంజేయుటయే- పరమార్థమగు భూషణమగునట్లు, కవితారూపిణియగు వాణికి - గుణాలంకారసాహిత్యమే - భూషణముగాక, పరమేశ్వరకీర్తనముచేతనో, సేవచేతనో, యెట్లో, పరమశివానుగ్రహమును సంపాదించుటయే - భూషణమనిభావము.

లోచనము :— "ఇచట [కవితాస్వరూపిణియగు] వాణికి, పరమేశస్తుతి మాత్రమే - పరమోపాదేయము" అనునది - వాచ్యార్థము. ఈవాచ్యార్థమునకు- శ్లేషసహితమగు శృంగారాభాసము - చారుతాహేతువగుచున్నది. నాయిక - నిర్గుణయు, నిరలంకారయు, నగుటవలన, నిచటి శృంగారము-పూర్ణముకాదు. ["పర

మేశ్వరస్తుతిమాత్రమే - స్వీకరింపఁదగినదె'' అను ప్రధాన వాక్యార్థమునకంగము గుచు, సౌందర్య హేతువగు నాయికా శృంగారమిచట నాభాసమేయగును.]

''ఉత్తమయువ ప్రకృతి రుజ్జ్వల వేషాత్మకః''

''ఉత్తమ యువతీయువకులు విభావములుగానుండి ''ఉజ్జ్వలమగు వేషము'' అనఁగా; ఆజంట,-అలంకారములచేత పరిపూర్ణమగు వేషము [ఉద్దీపనవిభావము] స్వరూపముగాఁ గలిగియుండునపుడు, స్ఫురించునదియగు రసము-శృంగారము'' అనిభరతముని ప్రవచనముగదా!

[వేరొక వాక్యార్థమును, భగవత్ ప్రభావవిభావితమును, నగురతికి-అనఁగా, ప్రధానమగు భగవద్ భక్తికి] భావాభాసమంగమగుట కుదా :—

అమృతుండెవ్వఁడు తుంపగామిగులు దైత్యశ్రేణి - తద్వర్ణతు
ల్యమనోజ్ఞాంజన రంజితమ్ములగుటన్, లావణ్యసౌందర్య యు
క్తములైనన్, నిజకామినీ నయనముల్ దర్శించి, సర్వాంగకం
పమునార్జింతురో: 'వాఁడు' కృష్ణుఁడు- కృపన్ బాలించుఁగాతన్ మిమున్!.

ప్రతి :— ఏ శ్రీకృష్ణునిచేతఁ జంపఁబడఁగా, మిగిలిన దైత్యులు-తమకాంతల నయనోత్పలములనుజూచి, అవి - లావణ్యసౌందర్యములనుగలిగి, సస్పృహములైయుండినను, శ్రీకృష్ణునిరంగువంటి రంగుగలకాటుకచేత - అలంకరింపఁబడియుండుటవలన, [కలిగినత్రాసముచేత] సర్వాంగకంపమునొందుచుందురో, భగవానుఁడగు నాకృష్ణుఁడు - మిమ్ముఁబాలించుఁగాక ! అనియర్థము.

లోచనము :— ఇచట, కామినులగు, తమకాంతల నయనోత్పలములను జూచునపుడు; రౌద్రప్రకృతులగు దైత్యులకొదవిన త్రాసము - అనుచితము. అనుచితమగు నీత్రాసము - భగవత్ ప్రభావకారణకృతము. కనుక, నిది భావాభాసమగుచున్నది.

ప్రభా :— రౌద్రప్రకృతులగు దైత్యులకనుచితమగుటవలననిచటిత్రాసము - భావాభాసము, ఇది-భగవత్ప్రభావము-విభావముగాఁగల,కవిగత, శ్రీకృష్ణభక్తిభావమున కంగమగుచున్నది. ఇట్లిచట, శ్రీకృష్ణునియందు, కవికిఁగల భక్తికి - భావాభాసమంగమగుటవలన, నిది - 'ఊర్జస్వి' అను నలంకారమగునని తెలియునది.

లోచనము :— ఇట్లే, తత్ప్రశాంతికూడ - వేరొకవాక్యార్థముం గనక

మగుట - [సమాహితమను నలంకారమగుట.] ఉదాహరింపఁదగును.

అవ :— "తామలంకారమనునది మామతమ్ము" అనుటచేత - మామతముకంటె పరతమము వేరుగానున్నది" అనిసూచింపఁబడినది . అట్లుసూచింపఁబడిన పరమతమును-దూషించుటకుపన్యసించుచున్నాఁడు.

(19) మూలము : - [రసాది ధ్వనులకును, నుపమాదులకును, రసవదాద్యలంకారములకును, నిట్లు మేముతెల్పిన విషయవిభాగము నితరులంగీకరింపక]"చేతనములకగు, వాక్యార్థీభావము-[ప్రధానమగు చేతనవర్ణనము] రసవదాద్యలంకారమునకు విషయము" అనిచెప్పునెడల,"ఉపమాదులు ప్రవిరలవిషయములు"అనిగాని, "నిర్విషయములు" అనిగాని, [అల్పమగు విషయముగలవనిగాని, విషయమేలేనివనిగాని,] చెప్పినట్లగును.

లోచనము :— "చెప్పునెడల" అనఁగా, "చెప్పుటవలన" అనియర్థము.

ప్రభా :— "చేతనవృత్త వర్ణనమే-రసవదాద్యలంకారము" అనిచెప్పుటవలన, "ఉపమాదులు స్వల్పవిషయకములగుటఁగాని, అసలేలేకుండుటగాని, సంభవించును." అనిభావము.

అవ : ప్రశ్న :— "అయ్యా! అచేతనవర్ణనము - ఉపమాదులకు విషయమనునది - మామతము. కనుక, ఉపమాదులు ప్రవిరళవిషయములనిగాని, నిర్విషయములనిగాని. మేము చెప్పుటలేదు," అని పరమతమునాశంకించి, ఉపమాదులు స్వల్పవిషయకములగుటకుఁగాని, లేకుండుటకుఁగాని, ఏది హేతువో, దానిని దెలుపుచున్నాఁడు.

(20) మూలము :— ["చేతనవర్ణనము - వాక్యార్థమగునపుడు, రసవదాద్యలంకారమగును" అని యితరులనునెడల, అప్పుడీయుపమాదులు - ప్రవిరళవిషయములుగాని, నిర్విషయములుగాని, యగును." అని, మేమనుటకు] హేతువేమనిన, "అచేతనవస్తువృత్తము - వాక్యార్థమగునపుడు, చేతనవస్తువృత్తాంతమును-

తిరుగ, సంశ్లిష్టమైనను [విభావాదిరూపమున] యోజింపవలసినదే యుండును." అనునదియే.

లోచనము :— "ఎట్లయినను, అనఁగా; విభావము, మున్నగురూపమున"నని యర్థము,

ప్రభా :— ఇపుడు, పూర్వపక్షికి సంబంధించిన యభిప్రాయమును దెలిపి, దానిని దూషించుచున్నాఁడు.

(21) మూలము :— "అచేతనవస్తువృత్తాంతమున - చేతనవృత్తాంతయోజనముండినను, ఏకావ్యమున, నచేతనములకు [అచేతనవస్తువృత్తములకు] వాక్యార్థీభావముండునో. ఆకావ్యము - రసవదాద్యలంకారమునకు విషయముకాదు". అనునెడల రసనిధానభూతములగు కావ్యప్రబంధములు, పెక్కులు - [వారిమతమున ననుసరించునపుడు] నీరసములుగాఁ జెప్పఁబడవలసివచ్చును.

లోచనము :— "ఎప్పుడు రసముండునో, అప్పుడు రసవదలంకారమువర్తి ముగానుండును" అనునదిగదా పరమతము: అట్లయినచో, "రసవదలంకారము లేని యెడల. ఆకావ్యము సత్యముగా రసములేనిదిగా నేర్పడును. కనుక, వారిమతమున రసవదాద్యలంకారములేని, కావ్యములు, పెక్కులు - మామతమున రసనిధానభూతములైయున్నను, వారిమతమననుసరించునపుడు - నీరసములుగాఁ జెప్పఁబడవలసివచ్చును". అని మీఁదివృత్తికారవాక్యము-పరమతమనుసరించి, చెప్పఁబడినది. మామతమునందన్ననో; రసవదాద్యలంకారము లేకున్నను గూడ, అచేతనవర్ణనముగల, కావ్యము - నీరసముకాదు ఇంకెప్పుడది నీరసమగుననిన; ధ్వన్యాత్మభూతమగు రసములేనప్పుడే - అది నీరసమగును. కాని ధ్వన్యాత్మభూతమగు రసమప్పుడుఁగూడ [అచేతనవృత్తముగల మీఁది స్థలములయందుఁగూడ] నుండునదియే యగును.

ప్రభా :— "రసాదులు-ప్రధానము [వాక్యార్థము]లగు, కావ్యమునందే- రసవదాదులలంకారములగును." అనునది-అనఁగా; 'అచేతనవృత్తములకు ప్రాధాన్యములేనిచోట, మీమతమునఁ జెప్పఁబడిన రసాదులే - మామతమున జెప్పఁబడిన రసవదాదులు" అనునది - ఉద్భటానుయాయులమతము. జడపదార్థములయందు,

స్థాయిభావసంవలిత చిద్రూపములగు, రసములును- చిత్తవృత్తివిశేషరూపములగు వితర్కాదిభావములును - సంభవింపవు. కావున, నచేతనవృత్తము - వర్ణింపఁబడు నపుడు, రసవదాదులు - సంభవింపవు'' అని, వారుచెప్పుదురు. కాఁగా; వారిమత మున, రసవదాదులగు నలంకారములు లేనికావ్యము-రసాదులులేనిదిగా నేర్పడు చున్నది. కావున, మాకంటె నితరులగు వారిమతముననుసరించునపుడట్టి కావ్య మును- నీరసముగాఁ [రసాదులులేనిదిగాఁ] జెప్పవలసివచ్చును. మామతముననో, రసాదులకంటె, రసవదాద్యలంకారములు - వేరుగానున్నవి. కావున, ప్రధానము లగు రసాదిధ్వనులుండునపుడు, రసవదాదులులేనికావ్యముకూడ - నీరసమగునది కాదు. మహాకవికావ్యములు - రసైక జీవితములు. వానియందుఁగూడ - అచేతన నదీనగరసముద్రాదివర్ణనము - తఱచుగాఁగాన్పించుచుండును. ఆయచేతన, నగ రాది, వర్ణనముకూడ - విభావాదిరూపమున, రసవ్యంజకమగుచునేయుండును. కనుక, అచేతనవర్ణనముగలకావ్యము - నీరసకావ్యము - కాదు. ఉద్భటానుయా యులుకూడ, దానిని - నీరసమనుట యుక్తముకాదు.'' అనిభావము.

(22) మూలము :— అదెట్లనిన :- [చేతనవృత్తాంతయోజ నములేని, అచేతనవస్తువృత్తముండదనుట కుదాహరణము.]

మంజరి :—

బహుతరంగ భ్రూవిభంగయై, క్షుభిత
కలవిహంగశ్రేణి కాంచియై, యధిక
సంరంభశిథిలమై, జారునంశుకము
వలెనున్న ఫేనమ్ము బలిమిఁగైకొనుచు।
కౌటిల్యమును వీడక యనేకములుగ
స్ఖలితముల్ దనయందుఁగాంచుచున్ మిగుల,
నసహనమ్మువహించి, ఆప్రియాంగనయె-
నదిగా, పరిణమించినది, నిశ్చయముగ.

పరిభా :— మీఁది ''మంజరి''- మహాకవికాళిదాసకృత, విక్రమోర్వశీయ నాటకశ్లోకమున కాంధ్రీకృతిరూపము. పురూరవుఁడొకనదినిగాంచి, దానిసూర్వశిగా సంభావించుచున్నాఁడు. దీనియందలియర్థము నిట్లైయుఁగునది.

బహుతరంగభ్రూవిభంగమై = పలుతీరులగు కెరటములే, కనుబొమముడు లుగాఁగలదియై, క్షుభితకలవిహంగ శ్రేణీకాంచియై, = కెరటాలతాకిడిచేతఁగద లింపఁబడుచున్నదియు, అవ్యక్తమధురధ్వనిగలదియు, నగు పక్షిపంక్తియే- మొల తాడుగాఁగలదియై, 'సంరంభశిథిలమై, జారునంశుకమువలెనున్న ఫేనమ్ము బలిమిఁగైకొనుచు'= ప్రణయకోపవేగముచేత విడువఁబడిన బంధముఁగలిగి, దిగ జారుచున్న కట్టుచీరనువలె, అధికవేగముచేత ముక్కలుగాఁజేయఁబడి, విడిపోవు చున్న ఫేనమును, ప్రియతముఁడనగు, నేను - గ్రహింతునను శంకచేతనువలె, తరంగకృతమగు వేగముచేత - లాగికొనుచు, 'కౌటిల్యమునువీడక' = (నది - తనకుసహజమగు) కుటిలమగు స్వభావమునువలె, (ఆయూర్వశి) వంకరనడక నతిక్రమింపక, అనేకములుగ, స్ఖలితముల్ దనయందుఁగాంచుచున్ = శిలాదుల చేతనగు గతిభంగములను నిజస్వరూపమునఁబడయుచున్నదివలె, అనేకములగు నాయపరాధములను, తనహృదయమున నొకటిఁగాజేసి, ధ్యానించుచు, అసహన నమ్ముపహించి = మానిని కనుక, సహింపఁజాలక, ఆప్రియాంగనయె = 'ఆ' నాప్రేయసియగు నూర్వశియే-నదిగాఁబరిణమించినది. అనఁగా; నదిరూపునొంది యున్నది. అని, సంభావింపఁబడుచున్నది, ''నిశ్చయముగన్'' అనునదియుత్ప్రే క్షావాచకము. నాచేత-నిపుడు చూఁడఁబడుచున్నయిది - నదికాదు. ఇంకేదియనిన; ఇది - నాయూర్వశియే. అనిపూరూరవునిచేత సంభావింపబడినదని తెలియునది. ఇట్లిచట, నదీచరితమున, మానవచరిత మారోపింపఁబడినది. కనుక దానిచేత సర సత్వమనుభూతమగుచున్నది.

లోచనము :— ''దేనికి - తరంగములే, భ్రూభంగములో, ఆయూర్వశి - తరంగభ్రూభంగ.'' ప్రియతమాలంబన నిషేధముకొఱకు, విలంబమానమగు నంశు కమును, బలాత్కారమున, నాకర్షించునదియై, నాయపరాధములను పెక్కులుగా, నిజహృదయమున నేకీకరించి - అసహమానయై, అనఁగా; మానినియై,యున్నది'' అనియర్థము. [''ఆయీనాయూర్వశియే] నావియోగమువలని, పశ్చాత్తాపమును సహింపనేరనిదై, నదీభావమునొందినది.'' అనిభావము

ప్రభామతి :— ఇచట,అచేతనవర్ణనముండుటవలన-పరమతమున, నిది- నీరసమనిచెప్పఁబడవలసివచ్చును. ఇచట, నచేతనమగు నదీవృత్తవర్ణనమున, చేత నవృత్తాంతయోజనమున్నది. కనుక, సరసత్వమనుభూతమగుచున్నది. ఇట్టిచోట్ల వారి యభిమతము - సమ్మతము కాఁదగదనునది మాయభిమతము.

(23) మూలము : — ఇంకొక యుదాహరణము :—

సీ॥ తన్వి వారిదజలార్ద్రికిసాలయగుటను బాష్పాంబు ధౌతోష్ఠ
వతియుఁబోలె,
స్వసమయాపగమంబు - సంభవించుటవల్ల, పుష్పోద్గమము
శ్రాంతిఁబొందియుండ,
ఆభరణాలంక్రియాశూన్యయయ్యును, నలరారుచుండిన
యదియుఁబోలె,
భ్రమరనినాద సంబంధమ్ము లేమిఁజింతామౌనము భజించి
నదియుఁబోలె,

గీ॥ 'ఆ'రుషామూర్తి - పాదమ్ములందు, వ్రాలి,
ప్రణతినగునన్ను, నపుడు తిరస్కరించి,
యిప్పుడనుతాపము - సమాశ్రయించినదియుఁ
బోలె, నెదుటనె గాన్పించు నాలతాంగి.

వ్రిభా :— ఇదియు, విక్రమోర్వశీయమునందలిదే యగుచున్నది. ఊర్వశీ, విరహమున ఉన్మాదాక్రాంతుఁడగు పురూరవసుఁడు-మిత్రునికొకలతను జూపి-ఆలతనూర్వశిగా సంభావించి, యనుచున్నాఁడు.("కృశించిననాయూర్వశి, వలె) కోమలయగు, నీలత - మేఘమువర్షించిన నీటిచేతఁదడిసిన, చిగురుటాకులు గలదియగుటవలన - కన్నీటిచేత ధౌతమగు కెమ్మోవిగలదివలెను, పూలుపూచు నదియగు కాలముకాకుండుటవలన - పుష్పోదయము లేకుండువలన, ఆభరణశూన్యవలెను, మధుకర శబ్దములు లేకుండుటవలన - మత్సమాగమోపాయమును విచారించుటచేతనగు మౌనము నాశ్రయించునదివలెను, గాన్పించుచున్నది." అని యిచట, ఉత్ప్రేక్షాత్రయము చెప్పఁబడినది. ఇచట, సచేతనమగు, లతాచరిత మున, కలహాంతరితా వృత్తమారోపింపఁబడుటవలన, సహృదయులచేత - సరసత్వ మనుభవింపఁబడుచున్నది.

లోచనము :— విరహిణి - వియోగకార్శ్యమువలనను, పశ్చాత్తాపమువల నను గూడ - ఆభరణములను త్యజించును. వసంత గ్రీష్మ ప్రాయమగు కాలము - పుష్పోదయమునకు-స్వకాలముగాఁ జెప్పఁబడును [నాతోడిదూటమికి] ఉపాయమును జింతించుటకై మౌనమును భజించునదివలెఁ, గాన్పించు

చున్నది. "అయ్యో! పాదపతితుఁడయ్యుననుగూడ, నాదయితుని నే నేల తిరస్కరించితిని." అని చింతించుటచేతఁగూడ - మౌనము సంభవింపవచ్చును. రుషామూర్తి = చండి = కోపన. "బహుతరంగ" అనుశ్లోకము - నదీవర్ణన పరము. "తన్వి వారిదజలార్ద్రి కిసాల" అనుమీఁది శ్లోకము - లతావర్ణనపరము. ఇవిరెండునుగూడ - [ఊర్వశియందలి] తాత్పర్యమున, ఉన్మాదాక్రాంతుఁడగు పురూరవునిచేతఁ బలుకఁబడినవి.

ప్రశ్న :— అచేతనవర్ణనముండుటవలన, ని చ ట రసములేదనుట - సముచితమా ? వీనియందలి రసమునను భవింపనివాఁడు - రసజ్ఞుఁడా?

(24) మూలము :— ఇంకొక యుదాహరణము :—

ప్రమతుల్, గోపవధూవిలాస సహృదుల్, రాధారహస్సాక్షు లా
యమునాతీర లతాగృహమ్ములకు-భద్రా! క్షేమమా! తత్ కిసా
లము, లిష్టాస్మరతల్పయోగ సుకుమారచ్ఛేద సాఫల్య భం
గమునన్ జీర్ణములై, అనీలరుచులై, కాన్పించు నంచెంచెదన్!.

లోచనము :— [శ్రీకృష్ణుఁడనుచున్నాఁడు] ఓభద్రా! 'ఆ'యమునా తీర లతాగృహములు - నాహృదయమునందే, నెలకొనియున్నవి. అవి -[ప్రకృ ష్టమగు బుద్ధిగలవి,] గోపికలకు - "విలాస సహృదులు" = నర్మసచివులు. ప్రచ్ఛన్నానురాగిణులకు, -వేరొకఁడు నర్మసుహృదుఁడుకాఁడు గదా! "రాధ - [తనకు] సాతిశయమగు ప్రేమస్థానము." కనుక, [విశేషించి] చెప్పచున్నాఁడు. రాధాసంభోగములనవి - సాక్షాత్తుగా జూచియున్నవి. కనుక, రాధారహస్సాక్షులు. ఆయమునాతీర లతాగృహములకుక్షేమమా! అనునది- కాకువుతోఁగూడిన, కుశల ప్రశ్నము. ఇట్లు ద్వారకయందున్న, శ్రీకృష్ణభగవానుఁడు-[భద్రుఁడను పేరుగల] వానినడిగి, తద్గోపాల సందర్శనమున [హృదయగతములగు] సంస్కారములు- మిగుల మేలుకొలుపఁబడఁగా, ఆలంబనోద్దీపనవిభావ స్మరణమున, గోపీవిషయక మగు రతిభావము - ప్రబుద్ధము కాఁగా; ఔత్సుక్యగర్భమును, ఆత్మగతమును నగు, ఆరతిభావమును - వెలువరించుచున్నాఁడు. "స్మరతల్పయోగ సుకుమార చ్ఛేదసాఫల్యభంగమునన్, జీర్ణములై, యనీలరుచులై," కాన్పించును + అంచున్ + ఎంచెదన్." అని- మదనశయ్యను గూర్చుటకొఱకు, సుకుమారముగాఁ ద్రెంపు టయను నుపయోగమే-లతాగృహకిసాలములకు సాఫల్యము- లేక,స్మరశయ్యగా

పల్లవములను జల్లుటయే - ఉత్కృష్టచ్ఛేదోపయోగము - అనఁగా, త్రెంపుటవలని ఫలము. ఇప్పుడు, నేనచట లేకుండుటవలన - స్మరతల్పయోగమును లేకున్నది. దానివలన వానిసాఫల్యము విచ్ఛిన్నమగును''అని. కనుక, పరస్పరానురాగనిశ్చయగర్భముగానే, [శ్రీకృష్ణుఁడు] చెప్పుచున్నాఁడు.

ప్రశ్న :- ఎట్లు ?

ఉ :— ''జీర్ణములై, యనీలరుచులై, కాస్పించునంచున్'' అనువాక్యార్థమును- ''ఎంచెదన్'' అనుక్రియకు కర్మగాఁజేసి చెప్పుచున్నాఁడు.

ప్రశ్న :— ఏమని ?

ఉ : - ''ఆలతాగృహపల్లవములు - నేనచటనున్నప్పు డెప్పుడునుగూడ, స్మరతల్పకల్పనమున కుపయోగింపఁబడుటవలన - జరచేత జీర్ణములై వైవర్ణ్యము నొందెడివికావు. అవి-యిప్పుడు తమకుఁగల వినీలకాంతిని బాసియుండునని తలఁచుచున్నాను''. అనిచెప్పుచున్నాడు. దీనిచేత - కతిపయకాలప్రోషితుఁడైయున్నను గూడ, శ్రీకృష్ణుని కొదవిన ఔత్సుక్యనిర్భరత్వము-[ఉత్కంఠాతిశయము] ధ్వనింపఁజేయఁబడినది.

ప్రభా :— శ్రీకృష్ణభగవానుఁడు - తనకును, గోపికలకును, గల పరస్పరాలంబనమగు ననురాగమును నిశ్చయించి - ''ఇప్పుడాలతాగృహపల్లవముల కుపయోగములేకుండుటవలన సఫలతలేదు. కనుక నవి - జీర్ణములయి. విగళన్నీలకాంతులై, యుండునని తలఁచెదను''. అనిచెప్పెను. ''ఆగోపికలు - ఇంకెవ్వరిని ప్రేమింపరు. తన్నే ప్రేమింతురు.'' అను పరస్పరానురాగ నిశ్చయములేనియెడలనో, ఇట్లుచెప్పుట కుదురదు. ఏలయనిన; ఆగోపికలకు - పురుషాంతర రమణమున్నయెడల, ఆలతాగృహపల్లవముల కుపయోగము కలుగవచ్చును. అప్పుడవి - జరాజీర్ణములై, వినీలకాంతులను బాసియుండనక్కరలేదుగదా !

లోచనము :— ఈభగవద్వాక్యము- ఆత్మగతముగాని, గోపునుద్దేశించునదియేయగు,సంప్రధారణోక్తిగాని, కావచ్చును.

ప్రభా :— ''భద్ర!'' అను సంబోధనమువలన, ఈవాక్యము గోపునుద్దేశించునదియే యగుననుట సముచితము. ఇది - ఏకావ్యమునందలిదో తెలియుటలేదు.

లోచనము :— ‘‘రసనిధాన భూతములగు, కావ్యప్రబంధములు, పెక్కులు-నీరసములుగా, చెప్పఁబడవలసివచ్చును.’’అని,[వృత్తియందు]యేదిచెప్పఁబడెనో, అది - మీఁది యుదాహరణములు, మూడింటిచేతను - సూచింపఁబడినది.

(25) మూలము :— ఇత్యాదికమగు నిట్టివిషయమునందచేతనములకు - వాక్యార్థిభావముండినను, చేతన వస్తువృత్తాంత యోజన-ఉండనేయున్నది. ఎచ్చట, చేతనవస్తువృత్తాంత యోజన యుండునో, అచ్చటనే రసవదాద్యలంకారముండునననినయెడల; ఉపమాదులు - నిర్విషయములుగాని, ప్రవిరళ విషయములుగాని, కావలసివచ్చును.

లోచనము :— ‘చేతనవస్తువృత్తాంతయోజనమున్న స్థలమున, నీరసత్వము కలుగఁగూడదు’’ అను నభిప్రాయమున, [పూర్వపక్షి అచ్చటనే, రసవదాద్యలంకారస్థితి నంగీకరించినయెడల, ఉపమాదులకు విషయము లేకపోవుటఁగాని, విషయమున్నను నత్యల్పమగుటగాని, సంభవింపవలసివచ్చును, అనియభిప్రాయము.]

అవ :— ‘‘అయ్యా! సర్వవిధములచేతనుగూడ, చేతనవృత్తమునకెచ్చట ననుప్రవేశముండదో, [మామతమున] అది - ఉపమాదులకు విషయము కాఁగలుగును,’’ అనియాశంకించి, చెప్పుచున్నాఁడు.

(26) మూలము :— చేతనవస్తువృత్తాంతయోజనము-చివరకు విభావముగానైనను లేని అచేతన వస్తువృత్తాంత మెచ్చటను గూడ నుండునదికాదు. కనుక, చేతనవృత్తాంతమునకనుప్రవేశము లేని, స్థలమే - ఉపమాదులకు విషయమని చెప్పుటకు వీలుపడదు.

లోచనము: — స్తంభము, గగుర్పాటు, మున్నగునచేతనమును వర్ణించినను గూడ - అది - అనుభావమగుటవలన, చేతనము - నాక్షేపించునదియే యగును గదా! [అనుభావము - భావమును స్ఫురింపఁజేయును. కనుక] ఇచటఁ జెప్పవలసినదేమియును లేదు. అతిజడమగు చంద్రుఁడు, ఉద్యానము, మున్నగువస్తువు గూడ - వర్ణింపఁబడి, స్వవిశ్రాంతమసుచున్నను, [ఏదయిన] చిత్తవృత్తికి - [అనఁగా: భావమునకు] విభావముగానే యగుచుండును ఇట్లది - హర్షాది భావమునకు - [ఉద్దీపన] విభావమే కానియెడల, కావ్యమున, ప్రస్తావింపఁదగనిదియే

కావలసివచ్చును. శాస్త్రేతిహాసములందుఁగూడ - నది - విభావము కానియెడల, ప్రశంసార్థముకానిదియే యగును.

ప్రభా :— "చిత్తవృత్తి విశేషమునుద్బోధింపని వస్తువేదియునుండదు" అనిభావము.

లోచనము : అవ :— ఇట్లు, పరమతమునుదూషించి, ప్రత్యామ్నాయముతో, [వేదమునందువలె తెలిపినయంశమునే - ప్రమాణముగాఁదిరుగఁదెలుపుటతో,] ఉపసంహరించుచున్నాఁడు.

(27) మూలము :— ఆకారణమువలన, సంగములగునప్పుడే, రసాదులలంకారములగును. అట్లుగాక, అంగియగునపుడు మాత్రము - రసముగాని, భావముగాని, [రసాభాసాదికముగాని] సర్వాకారముగా, అలంకార్యము. కనుకనే, అది - ధ్వన్యాత్మ [కావ్యాత్మ] యగును.

ప్రభా :— అంగియగు రసాదిధ్వని - ఎప్పుడును సలంకారముకాదు. అది - సర్వప్రకారములచేతనుగూడ - అలంకార్యమేయగును. కనుక, అదియే-కావ్యాత్మ.

లోచనము :— ఏకారణమువలన, పరులచేతఁదెలుపఁబడిన విషయవిభాగము - యుక్తముకానిదిగానున్నదో, ఆకారణమువలన, అంగములగునపుడే; రసాదులలంకారములగును. "రసముగాని" అనుచోనున్న వికల్పగ్రహణమువలన, తదాభాస. తత్ప్రశమాదులను గ్రహింపఁదగును. "సర్వాకారముగా" అనునది - క్రియావిశేషణము. కనుక, "సర్వప్రకారములచేతను" అనునది దానియర్థము. అలంకార్యము = అలంకరింపఁదగినది. కనుకనే, "అలంకార్యమేకాని, అలంకారము [అలంకరించునది]కాదు". అనిభావము. "అలంకార్యముకంటె వేరయినదియే- అలంకారముగా నంగీకరింపఁదగినది. లోకమునందట్లే, ప్రసిద్ధముగదా. అదెట్లనిన :- గుణికంటె, వేరుగా - గుణమంగీకరింపఁదగునట్లు - అలంకార్యముకంటె, వేరుగా - అలంకారమంగీకరింపఁదగినది. గుణియు, అలంకార్యవస్తువు, [వేరుగా] నుండునప్పుడే గుణము, అలంకారము, అనువ్యవహారము యుక్తమగును. ఆగుణాలంకార

వ్యవహారముకూడ - అస్మత్ పక్షమునందే కుదురును.'' అనునభిప్రాయ ద్వయమునఁ జెప్పుచున్నాఁడు.

(28) మూలము :— కిఞ్చ,

[కా] తమర్థమవలమ్బన్తే యేఽఙ్గినం, తే గుణాః స్మృతాః।
అఙ్గాశ్రితాస్త్వలఙ్కారా మన్తవ్యాః కటకాదివత్. (6)

మఱియు,

'అంగి రసాద్యవలంబన
ముంగలవి గుణమ్మ'లనుచు బుధులెంతురు. "తదీ
యాంగగతుల - వలయాదుల
భంగి నలంకారము"లని భావింపఁదగున్.

లోచనము :— "మఱియు," అనుసముచ్చయార్థమేమనఁగా; "రసము- అంగి. అని నిరూపించుటకుఁగల- యుక్తిసమూహమింత మాత్రమేకాదు. ఇంకను గూడ, నన్యమగు యుక్తిజాతమున్నది'' - అనునది. ఈకారికనుగూడ మీఁదఁ దెలిపిన యభిప్రాయ ద్వయముతోనే - యోజింపవలయును. [''అలంకార్యము కంటె వేరయినదియే - అలంకారముగా నంగీకరింపఁదగినది.'' అను] ప్రథమాభిప్రాయమునందు- గుణికంటె వేఱుగా గుణమంగీకరింపఁబడునట్లు'' అనునర్థము గల కారికయందలి మొదటియర్థమును, కేవలమును దృష్టాంతముగా వ్యాఖ్యానింపఁదగును. వృత్తిగ్రంథమునుగూడ నిట్లేయోజింపవలయును.

ప్రభా :— "గుణికంటె గుణము వేరయినట్లు. అలంకార్యముకంటె, నలంకారము వేరగును'' అనునది ప్రథమాభిప్రాయము. "అంగియగు గుణినాశ్రయించునవి గుణములు. అంగమగు నలంకార్యము (వాచ్యవాచకరూపావయవము) నాశ్రయించునవి యలంకారములు'' అనునది - ద్వితీయాభిప్రాయము.

అవ :— వృత్తికర్త - మీఁది కారికను వ్యాఖ్యానించుచున్నాఁడు.

(29) మూలము :— రసాదిలక్షణమగు నర్థమంగి [ఆత్మ] యగువప్పుడు, దానినవలంబించునవి - శౌర్యాదులవలె, గుణములగు

ననియు, వాచ్యవాచక లక్షణములగు సంగములను మాత్రమే యాశ్రయించునవి - కటకాదులవలె, నలంకారములగుననియుఁ, దెలుపవలయును.

ప్రభా :— లోకమునఁ బ్రసిద్ధములగు, శౌర్యాదిగుణములు - గుణియగు నాత్మ నాశ్రయించునట్లు, మాధుర్యాది గుణములు - కావ్యాత్మయగుటవలన గుణియగు రసాదికము నాశ్రయించుననియు, హారాద్యలంకారములు - అలంకార్యములగు కామినీకంఠాద్యవయవముల నాశ్రయించునట్లు, యమకోపమాదులగు, నలంకారములు - వాచ్యవాచకరూపములగు [శబ్దార్థములగు] సంగముల [అలంకార్యముల] నాశ్రయించుననియుఁ దెలియునది.

లోచనము :— "అయ్యా! మాధుర్యాదులు - శబ్దార్థములకు సంబంధించిన గుణములైయున్నవి. [మీఁదికారికయందు] "అంగియగు రసాదికము నాశ్రయించునవి-గుణములు" అనిచెప్పుటయెట్లు సంగతమగును ?" అనియాశంకించి చెప్పుచున్నాఁడు.

ప్రభా : అవ :— "మాధుర్యాదులు - శబ్దార్థగుణములుకావు. అవి - రసగుణములేయగును". అనుచున్నాఁడు.

(30) మూలము :— తథాచ,

[కా] శృఙ్గార ఏవ మధురః, పరః ప్రహ్లాదనో రసః।
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి. (7)

["గుణములు - రసాద్యాశ్రితములు" అని యేదిచెప్పఁబడినదో,] అదియుక్తమే.

గీ॥ అతిశయముగఁ బ్రహ్లాదనమ్మగుటవలన,
రసము, శృంగారమే - మధురమ్ము, తన్మ
యమ్మయితనరుచుండు కావ్యమ్ము ప్రాపు
నంది, మాధుర్యము - ప్రతిష్ఠనొందుచుండు। (7)

లోచనము :— "తదియుక్తమే." అనఁగా; "గుణములు - అంగిరసాదుల నాశ్రయించును." అనునది - ముందుచెప్పఁబడునదియు. బుద్ధియందున్నదియు, నగు, పరిహారప్రకారముచేత సంగతమేయగును." అనియర్థము. "రసము శృంగారమే - మధురమ్ము" అనుటకు హేతువు - 'అతిశయముగ ప్రహ్లాదనమ్మగుటవలన,' అని చెప్పఁబడినది.

ప్రభా :— "శృంగారమే - మధురమ్ము" అనఁగా; "శృంగారరసమే- మాధుర్యగుణవిశిష్టము. కాని, వస్తుతః, శబ్దార్థములు - మాధుర్యగుణ విశిష్టములు కావు." అనిభావము. తన్మయమ్మయి దనర్చుచుండుకావ్యము"అనఁగా; శృంగారరసాత్మకమగు కావ్యము.[అనఁగాశృంగార వ్యంజకశబ్దార్థములు.]"దానిప్రాపునంది" అనఁగా; "శృంగార రసవ్యంజకములగు శబ్దార్థముల నాశ్రయించి," అనియర్థము.

లోచనము :— దేవ, తిర్యఙ్మనుష్యాది జాతులన్నింటియందును, గూఢ-రతివిషయకమగు అవిచ్ఛిన్నమగువాసన [సంస్కారమను మాఱుపేరుగల సూక్ష్మవస్తు]యుండును. కనుక, రతి - స్ఫురింపఁజేయఁబడునపుడు, ఆరతివిషయమున, ప్రచురమగు హృదయసంవాదమును [హృదయమునంపగల రూపసామ్యమును] గిలిగియుండని వాఁడెవ్వఁడును నుండఁడు. యతికిఁగూడ - తచ్చమత్కారము [జన్మాంతరీయమగు, రత్యనుభవము అనఁగా; రతియందగుహృదయసంవాదము] ఉండనేయుండునుగదా!. కనుకనే; శృంగారమే - మధురమని [మాధుర్యగుణముతోఁ గూడినదని] చెప్పఁబడినది. మధురమగు, శర్కరాదిరసము-వివేకికైనను, అవివేకికైనను, స్వస్థునకైనను, ఆతురునికైనను, [ఎవరికైననుగూడ] నాలుకమీఁదఁబడినవెంటనే, ఎట్లభిలషణీయమగుచుండునో, అట్లే శృంగారముకూడ-అభిలషణీయమనుచుండును గదా!. "తన్మయమ్ము"-వ్యంగ్యతచేత, ఆత్మగా నెచట శృంగారము ప్రకృతమో, ప్రకృతమగు నాశృంగారము గలకావ్యము - "తన్మయము" అనిచెప్పఁబడినది. కావ్యమనఁగా; 'శబ్దార్థములు'అనియర్థము.[శృంగారరసాది గుణమగు, మాధుర్యము - శృంగారమయ శబ్దార్థములను-ఉపచారముచేత నాశ్రయించి] 'ప్రతిష్ఠనొందుచుండును.' అనిభావము.

ప్రభా : అవ :— కారికాభావార్థమును దెలుపుచున్నాఁడు.

లోచనము :— వాస్తవస్థితిచేత, మాధుర్యమనునది- శృంగారాది రసమునకే గుణమగుచున్నది. ఆమాధుర్యగుణము [రసధర్మమైయున్నను] మధురరసాభివ్యంజకములగు శబ్దార్థములయందుపచరిత (ఆరోపిత) మగుచున్నది. కనుకనే, 'శబ్దార్థములు - మధురములు' అనువ్యవహార మేర్పడుచున్నది. ["శబ్దార్థములు

మధురములు'' అనఁగా; ''శబ్దార్థములు - మాధుర్యగుణవిశిష్టమగు శృంగారాదిరసము నభివ్యంజింపజేయుటకు సమర్థములు'' అను నర్థము నెఱుఁగునది.] కాఁగా శబ్దార్థగతమాధుర్యమునకు లక్షణము - [స్వరూపము] మధురశృంగార రసాభివ్యక్తి సమర్థతయేయగును. కనుక, అంగిరసాద్యవలంబనముంగలవి గుణమ్ములు'' అని, యుక్తముగనే చెప్పఁబడియెను.

అవ : — కారికార్థమును వృత్తిచేతఁ దెలుపుచున్నాఁడు.

(31) మూలము : — తదితర రసములకంటె ప్రకృష్టమగు నాహ్లాదమునకు హేతువగుటవలన, శృంగారమే- మధురము. [మాధుర్యగుణ విశిష్టమగు రసము - శృంగారమేకాని, శబ్దార్థరూపమగు కావ్యము - మాధుర్య గుణవిశిష్టముకాదు.] తద్రసప్రకాశన పరములగు శబ్దార్థములు స్వభావముగాఁ గలదగుటచేత, కావ్యమునకు, (శబ్దార్థములకు) అది - మాధుర్య లక్షణమగు గుణమగుచున్నది.

ప్రభా : -- వృత్తిగతమగు నీవాక్యార్థము- 'వాస్తవస్థితిచేత' అను మీఁది లోచనమునఁదెలుపఁబడినది. మాధుర్యాదులు-సాక్షాత్తుగా, శృంగారాదిరసధర్మము (గుణము) లైయున్నవి. అయినను, శృంగారాదిరసవ్యంజక శబ్దార్థ [కావ్య] నిష్ఠములుగా నుపచరితములగుచున్నవి. కాఁగా; ''శృంగారాదిరసమే - మాధుర్యాది గుణవిశిష్టముగాని, శబ్దార్థరూపమగు కావ్యము - మాధుర్య గుణవిశిష్టముకాదు'' అనునది - వృత్తికర్త్రయాశయమని తెలియఁదగును.

లోచనము : అవ :— ''అయ్యా! 'శ్రవ్యం నాతిసమస్తార్థశబ్దం మధురమిష్యతే' -శ్రవ్యమును, అతిసమస్తములగు నర్థములుగల శబ్దములు (సమాసజటిలత) లేనిదియు, నగు కావ్యము - మధురము. అని చెప్పఁబడును.' అనునదియే- [భామహోక్తమే] గదామాధుర్యమునకు లక్షణము.'' అని యాశంకించి, [అతివ్యాప్తి కలుగుటవలన, నది లక్షణము] 'కా'దనుచున్నాఁడు.

(32) మూలము : — [సాతిశయమగు ప్రహ్లాదమును గూర్చుటయే మాధుర్యగుణమునకు లక్షణము.] [భామహోక్తమగు]

శ్రవ్యత్వమన్ననో, అదియోజోగుణమునకుఁ గూడ- సాధారణమై యున్నది. కనుకనది మాధుర్యమున కసాధారణమగు లక్షణము కాదు.

లోచనము :— "శ్రవ్యత్వమన్ననో" అనుదానిచేత- శ్రవ్యత్వమేకాక, [శ్రవ్యమును,సమాసజటిలతలేనియర్థములుగల శబ్దములుగలదియు,నగు కావ్యము మధురము"అను] లక్షణము - సర్వమును, నుపలక్షితము· [అది మాధుర్యమునకు మాత్రమే లక్షణమగుటలేదు.] అదెట్లనిన; "పాంచచప్యాహు, అనునోజో గుణవిశిష్టమగు కావ్యముకూడ- శ్రవ్యమును, [శ్రవణానుద్వేజకమును,]సమాస రహితమును, నగుచున్నదిగదా." అనిభావము.

ప్రభా :— "ప్రాంచద్బాహు" అనుపద్యమును వృత్తికారుఁడు-ముందుదాహరించును. అది - వినికికుద్వేగమును గలిగించుటలేదు. అందును, సమాస జటిలతలేదు. అయిన, నది - యోజోగుణమున కుదాహరణమగుచున్నది.

లోచనము : అవ :— "[సంభోగ శృంగారము - మధురము] అసంభోగశృంగారముకంటె విప్రలంభశృంగారము - మధురతరము. దానికంటెను గూడ, కరుణరసము - మధురతమము. కనుక, శబ్దార్థములయందుఁగల, తదభివ్యంజనకౌశలము - [అనఁగా; మధురతరమును, మధురతమమును, నగు విప్రలంభ శృంగార, కరుణరసముల నభివ్యంజింపఁ జేయునదియగు సమర్థత - ] ఆశబ్దార్థములనే, మధురతరములుగను, మధురతమములుగను, దోపింపఁజేయుచుండును" అని చెప్పుచున్నాఁడు.

(33) మూలము :—

[కా] శృఙ్గారే, విప్రలమ్భాఖ్యే, కరుణేచ, ప్రకర్షవత్।
మాధుర్యమార్ద్రతాంయాతి, యతస్తత్రాధికంమనః.(8)

గీ॥ లలిత శృంగారమగు విప్రలంభమందు,
కరుణరసమందుఁ, గ్రమత బ్రకర్షవంత
మగును మాధుర్య; మేలన, నచట-మనసు
క్రమత నధికమౌ నార్ద్రతఁగనును గనుక.

"సహృదయ హృదయము నావర్జించుట" అను నతిశయము నకు నిమిత్తమగుటవలన- [సహృదయ హృదయమును క్రమాధిక మగు నార్ద్రత నొందించుటవలన] సంభోగశృంగారమునందుకంటె, విప్రలంభ శృంగార కరుణములందే - మాధుర్యము - ప్రకర్ష వంతమగుచుండును. [క్రమముగా నధికమగు ప్రకర్షముగలదియగు చుండును.]

లోచనము :— [మూలకారికయందు] "కరుణేచ" అనుచోనున్న 'చ' శబ్దము-క్రమమును దెలుపును. "ప్రకర్షవంతమగును" అనఁగా; తర, తమ, యోగముచేత మొదటఁదెలుపఁబడిన రసమునందుకంటె, దానితరువాతఁదెలుపఁ బడిన రసమునందుగల మాధుర్యము - అధికమగుచుండునని భావము.

"ఆర్ద్రతఁగనుటవలన" అనఁగా; "సహృదయుని మనస్సు-[చేతము] స్వాభావికమును, అనావిష్టత్వరూపమును, నగు కాఠిన్యమును, క్రోధాదిదీప్తరూపత్వమును, విస్మయహాసాది రాగిత్వమును, త్యజించుటవలన" అనియర్థము. [మూలకారికయందు] "అధికమ్" అనుచోట "క్రమముగా నధికమగు" అనియర్థము నెఱుఁగునది. ఇట్లు చెప్పుటచేత, కరుణరసమునందుఁగూడ- [తదితరరసములందు కంటె] అత్యధికముగనే, చిత్తము ద్రవించునని, చెప్పఁబడినదగుచున్నది.

ప్రభా :— ప్రాచీనాలంకారికులు, కొందఱు - శ్లేషము, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఔదార్యము, ఓజస్సు, కాంతి, సమాధి, అను నామములుగల పది, శబ్దగుణములను, పది, యర్థగుణములను చెప్పిరి భోజమహారాజు - వీనిని మఱింత విస్తరించెను శ్రీమదానందవర్ధనాచార్యుఁడును, శ్రీమదభినవగుప్తుఁడును, మమ్మటాచార్యుఁడును, విశ్వనాథప్రభృతులును, మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము. అనుగుణములను మూఁటిని మాత్రమే - చెప్పిరి. [వీనియందు, తదితరములంతర్భవించుననునది- వారి యభిమతము.] ఈ గుణములు మూఁడును- వారిచేత కావ్యాత్మరసనిష్ఠములుగాఁ జెప్పఁబడినవి. కాని, శబ్దార్థనిష్ఠములుగాఁ జెప్పఁబడినవికావు.

"ద్రుతికారణమగు, నాహ్లాదకత్వము-[ఆనందరూపత్వము] మాధుర్యము" అని మమ్మటాచార్యునిచేత మాధుర్యలక్షణము. చెప్పఁబడినది. ఈలక్షణము-ధ్వని మతానుసారియైయున్నది. "శృంగార, విప్రలంభ, కరుణరసములయందు సహృ

దయహృదయము - క్రమముగా, నుత్తరోత్తరమగు నార్ద్రితఁ బొందును. కనుక, వానియందలి మాధుర్యము-క్రమాతధిమగు, 'విచ్ఛిత్తి విశేషకారియగుచుండును.'' అని మీఁది కారికయందుగ్గడింపఁబడినవి.

లోచనకర్త - ''చిత్తము - స్వభావముచేత, ఆవేశములేనిదై, కఠినముగా నుండును.'' అనిచెప్పెను దీనిననుసరించి, ఇట్లే, 'చిత్తమనుద్రవ్యము - లక్క-వలె స్వభావముచేత కఠినమైయుండును'. అనునంశము. ''భక్తిరసాయన''మను గ్రంథమున శ్రీమధుసూదన సరస్వతిచేత విస్తృతముగాఁ జెప్పఁబడినది. లోచన కర్త - ''[కావ్యశ్రవణము వలనగాని, అభినయదర్శనమునఁగాని] సహృదయ చేతము - తనకు స్వాభావికమగు కాఠిన్యమును, క్రోధాదులచేతనగు దీప్తతను, విస్మయము, హాసము, మున్నగువానిచేతఁగూర్పఁబడిన, రాగిత్వమును, అనఁగా; విస్మయాదులచేతనగు విక్షేపమును, విడుచును'' అనిచెప్పెను. కనుక, సంభోగ శృంగారమునుగాని, విప్రలంభ శృంగారమునుగాని, కరుణరసమునుగాని, యా స్వాదించుటవలన నుదయించునదియగు, కాఠిన్యాది త్యాగముగాని, అకాఠిన్యాది పరిత్యాగముచేతనగు, 'ద్రుతి' [కఱఁగుట] అను వృత్తివిశేషముగాని, 'ఆర్ద్రిత' యని చెప్పఁబడినదైనది. ఆర్ద్రితయను నీద్రుతియొక్క క్రమాధికతవలన,సంభోగ శృంగారముకంటె, విప్రలంభమును, విప్రలంభముకంటె, కరుణమును, తర, తమ, యుక్తమగు నాధిక్యముగల [అతిశయముగల] మాధుర్యముగలవిగా, నిరూపింపఁబడుటకుఁదగిన వగుచున్నవి. కావ్యప్రకాశకర్త - మఱికొంతవిశేషమును గని, శాంతరసము - మీఁది రసములన్నిఁటికంటెనుఁగూడ - మధురమని చెప్పెను. "ఓజోగుణమును, ప్రసాదగుణమును, గూడ - శ్రవణానుద్వేజకములును, దీర్ఘ సమాసములులేనివియుఁగూడ నగుచుండును.కనుక, భామహోక్తమగు లక్షణము మాధుర్యమున కసాధారణమగు లక్షణముకాదు'అనివృత్తికర్తచేతఁజెప్పబడియెను.

లోచనము : పూర్వపక్షి :— అయ్యా! కరుణరసమునందుఁగూడ- మధురిమ [మాధుర్యము] యుండునెడల, పూర్వకారికయందు ['అతిశయముగ'అను కారికయందు] ''శృంగారమే - మధురమ్మ'' అనుచోట, 'శృంగారమే' అను నవధారణమునకుఁగల [ఏకారమునకుఁగల] అర్థమేమో చెప్పుదురా ?

సిద్ధాంతి :— చెప్పుచున్నాము. ''శృంగారమే'' అనుచోటనున్న, అవధారణముచేత - ['ఏ'కారముచేత-] ''శృంగారముకంటె నితరములగు రసములు-మధురములుకావు'' అని, నిరాకరింపఁబడుటలేదు. ఇంకేమనిన :- ''పరమార్థమున, మాధుర్యములు - కావ్యమున కాత్మభూతమగు, రసమునకే - గుణములు.

కాని, [కావ్యరూప] శబ్దార్థములకు గుణములుకావు. అయినను, నుపచారముచేత, శబ్దార్థగుణములుగా వ్యవహరింపఁబడును.'' అనునర్థము. [శృంగారఏవ] ''శృంగారమే'' అనుచోనున్న యేవకారార్థముచేత స్ఫురింపఁజేయఁబడుచున్నది.

పరిభా :— ''శృంగారమే - మధురము'' అనువాక్యమునకు - ''శృంగారమే - మాధుర్యగుణ విశిష్టమగు రసముగాని, తదితరములు - మాధుర్యగుణ విశిష్టములుకావు'' అనియర్థముకాదు. ''మాధుర్యాదులు - గుణములు. కనుక, 'ఆత్మ'యగుటవలన గుణియగు శృంగారాదిరసమునకే, అవిగుణములుగాని, కావ్యశరీరమగు శబ్దాదులకు గుణములుకావు. అయినను, శబ్దము - మధురము అర్థము - మధురము, మున్నగు లోకవ్యవహారముపచారవశమున సంభవింప వచ్చును.''అనునర్థమును దెలుపుటకిచట నియమపధారణార్థకము[ఏకారము] ప్రయోగింపఁబడినదని తెలియునది. కనుకనే, కావ్యప్రకాశమున, సంభోగశృంగారముకంటె - కరుణమును, కరుణముకంటె - విప్రలంభశృంగారమును, విప్రలంభముకంటె - శాంతమును, ఉత్తరోత్తరమగు నతిశయముతోఁగూడిన. మాధుర్యగుణముగలవిగాఁ జెప్పఁబడినవి. ఓజస్సునందు శ్రవ్యత్వమున్నను, క్రోధాదికృతమగు దీప్తతయేకాని, మాధుర్యము - స్ఫురింపదు. ప్రసాదమునందు నియతములగు వర్ణములులేకుండుటవలన, మా ర్యాభివ్యక్తికలుగదు. కనుక. మాధుర్యముదాని కంటె భిన్నమేయగునని తెలియునది.

అవ :- ఇట్లు, మాధుర్యగుణ నిరూపణప్రసంగమున, క్రమముగా, నోజోగుణ, ప్రసాదగుణముల, లక్షణములను, వాని యాశ్రయములను దెలుపుచున్నాఁడు.

(34) మూలము : —

రౌద్రాదయో రసాదీప్త్యాలక్ష్యన్తే కావ్యవర్తినః।
తద్వ్యక్తి హేతూశబ్దార్థా వాశ్రిత్యోజో వ్యవస్థితమ్.(9)

గీ॥ కావ్యవర్తులు-రౌద్రాదితమ్ములయిన
రసములయ్యవి - దీప్తిచే లక్షితములు.
తత్ ప్రకాశనహేతు శబ్దార్థముల న
మాశ్రయించి, ఓజోగుణమ్ములరుచుండు.

రౌద్రాదులగు రసములు - ఉత్కృష్టమగు దీప్తిని, అనఁగా; ఉజ్జ్వలతను, జనింపఁజేయుటవలన, లక్షణచేతనవియే-'దీప్తి' అని చెప్పఁబడును.

లోచనము :— "రౌద్రాదులు" అనుచోనున్న, ఆదిశబ్దము - ప్రకారమును - [అనఁగా; 'రౌద్రరసమువంటి రసములు' అనిసాదృశ్యమును]- దెలుపును. [సాదృశ్యమును దెలుపునదియగు] దానిచేత - వీరాద్భుతములనుగూడ [వీరభీభత్సములనుగూడ] గ్రహింపవలయును. దీప్తియనునది - జ్ఞాతయొక్క హృదయమునందగు వికాసవిస్తార ప్రజ్వలన స్వభావము. [ఒకానొక చిత్తవృత్తి] ఆదీప్తికూడ-ముఖ్యముగా, ఓజశ్శబ్దముచేత వాచ్యమగుచుండును. తదాస్వాదమయములగు [దీప్తరూపమగు చిత్తవృత్తిని జనింపఁజేయుటకు కారణములగు]రౌద్రాదులు- ఆస్వాదవిశేషాత్మికయు, [అనఁగా, చిత్తవృత్తివిశేషరూపయు,] కార్యరూపయు, [రౌద్రాది రసచర్వణచేత నుదయించునదియు] నగు, నాదీప్తిచేత - తదితర [శృంగారాది] రసములకంటె - భిన్నములుగా లక్షింప[ప్రకాశింపఁ] జేయఁబడుచుండును. కావుననే, కారణమునందగు కార్యోపచారమువలననే, [కారణమునే, కావ్యముగానుపచరింపఁజేయురూపముగల, లక్షణచేత] రౌద్రాదులుకూడ-ఓజశ్శబ్దముచేతఁ (ఓజస్సనియు, దీప్తిశబ్దముచేత-దీప్తియనియుఁ] జెప్పఁబడును.

ప్రభా :— "ఈకావ్యము- ఓజస్వి" అనువ్యవహారమునందుఁగల యోజః పదము - లక్షణచేత, రౌద్రాదులను దెలుపును. "ఆయుర్ఘృతమ్" అనునపుడు ఆయువునకు కారణమగు ఘృతము, కార్యమగు నాయువుగా వ్యవహరింపఁబడునట్లు, ఓజస్సను పేరుగల దీప్తికి - కారణములగు రౌద్రాదులుకూడ- కార్యమగు, ఓజస్సుగా [దీప్తిగా] వ్యవహరింపఁబడుననియర్థము. వేణీసంహారమున, భీముఁడు. ద్రౌపదితోననుచున్న దీర్ఘసమాస రచనగలవాక్యము - దీనికుదాహరణముగాఁ జెప్పఁబడుచున్నది.

(35) మూలము : — తత్ప్రకాశన పరమగుశబ్దముకూడ, అనఁగా; దీర్ఘసమాస రచనాలంకృతమగు వాక్యముకూడ [లక్షితలక్షణచేత] దీప్తియని జెప్పఁబడును. [దీప్తియని చెప్పఁబడు, దీర్ఘసమాస రచనాలంకృత వాక్యమున కుదా :-] "సమ్మెట" అను జాతీయపద్యము. (ప్రభామతి ప్రసారితము)

చంచన్నిజ భుజభ్రామిత • చండ గదాభిఘాతకృతి
సంచూర్ణిత మహోరుయుగ • శాలి-సుయోధనుఁడుగ, స్త్యా
నాంచితబద్ధ ఘనశోణి • తారుణపాణి, భవత్కచ
సంచయ ముత్తంసయుతము • సలుపునుదేవీః భీముఁడు.

లోచనము : కనుక, లక్షితలక్షణచేత, [లక్షితమగు నర్థముచేతనగు లక్షణచేత, లేక శక్యార్థమునకుఁగల పరంపరాసంబంధరూపముచేత] తత్ప్రకాశన పరమగు [రౌద్రవీర భీభత్సరస వ్యంజకమగు] శబ్దముకూడ - అనఁగా; దీర్ఘసమా సరచనముగల వాక్యరూపముకూడ - దీప్తియని [ఓజస్వియని] చెప్పఁబడును.

ప్రభా :— ఇచట, దీప్తియను పదమోజస్సున కుపలక్షకము. అనఁగా; 'దీప్తిపదము - ఓజస్సునుగూడ గ్రహించు'నని యర్థము.

లోచనము :— "చంచన్నిజ భుజభ్రామిత" అను మీఁది పద్యము - దీని కుదాహరణము. [దీనియర్థము నిట్లుఁగునది] ఆసుయోధనుఁడు - మిక్కిలి వేగ మున, నావర్తమానములగుచున్న భుజములచేతఁ, ద్రిప్పఁబడుచున్న దారుణమగు గదచేత - నలియఁగొట్టఁబడుటచేతఁ, దిరుగలేచుటకు వీలుకలుగనట్లు, బాగుగాఁ జూర్ణమొనర్పఁబడిన యూరువులు రెండునుగలవాఁడు కాఁగా; వానినాదరింపకయేః స్త్యానముచేత ననఁగా; కాలాంతర శుష్కతచేతఁగాక, ఆశ్యానతచేత - [అనఁగాః ఘనీభవించి పచ్చిగానుండుటచేత] "అంచితబద్ధమై" అనఁగా; 'హస్తములనుండి గళితముగా కుండునట్లు. చక్కగాబంధింపఁబడినదియై,' అనియర్థము. మిక్కిలి లోపలనుండుటవలన రస (ద్రవ) మాత్రస్వభావముగలదిగాక, ఘనీభవించి యున్న, యెఱ్ఱనిరక్తముచేత, నెఱ్ఱనైనచేతులుగలవాఁడు, కనుకనే, భీముఁడు-కాత రత్రాసదాయి. [అనఁగా, భీరువులగు శత్రువులకు భయమునుగలిగించువాఁడు.] ఆభీముఁడు - " 'ఏ'నీకు - [కృతాభిషేకయగు] దేవికుచితముగానిదియగు నా, యా, యవమాన జాతమొనర్పఁబడినదో; 'ఆ'నీకుసంబంధించిన కచములనుత్తం సవంతముల నొనర్చును." అనఁగా; "వేణిగానుండుటను దొలఁగించి, నీకేశపా శమును స్వహస్తములనుండి విచ్యుతములగు (జారుచుండిన) శోణితశకలముల చేత - లోహితపుష్పమాలచేతను, వలె సంఘటింపఁగలఁడు", అని యుత్ప్రేక్షింపఁ బడినది. దేవీః అనుపదము - కులకళత్రభిలీకారమును [దుర్యోధన ప్రేరితదుశ్శా సన కర్తృకకులపత్ని కేశాకర్షణాది రూపమగు నపకారమును] స్మరించునది. కనుక, నీపదము - క్రోధమునకే, యుద్దీపనవిభావముగాఁ జేయఁబడినది. [కనుక

నిచటి రసము - రౌద్రమే యగును.] కనుక, నిచట, శృంగారము - రసమని శంకింపఁదగదు. సుయోధనునాదరింపకుండుట యనఁగా; ద్వితీయ గదాఘాత దానాదికమున కుద్యమింపకుండుటయే - యగును. [సుయోధనుఁడు- ఘోరమగు నొకేగదాఘాతముచేత] సంచూర్ణితోరుయుగ శాలిగాఁ జెప్పఁబడుటవలననే, ఆయ నాదరము- ప్రకాశింపఁజేయఁబడుచున్నది. [పచ్చిముద్దగానుండుట యనునర్థము గల] ''స్త్యాన'' అనుశబ్దమును గ్రహించుటచేత - ద్రౌపదీమన్యు ప్రక్షాళనమున భీమునికిఁగల త్వర-సూచింపఁబడినది.

ప్రభా :— ఘనీభవించి పచ్చిగానున్న సుయోధన రక్తముతోఁ గూడిన స్వహస్తములతో - ద్రౌపదీకచములను ముడిచినపుడే - ఆమె కోపకాలుష్యము ప్రక్షాళితమగును గదా!

లోచనము :— ఇచటి సమాసము - అవిచ్ఛిన్నమగు వేగమునుపహించు నదియగు స్వభావమును గలిగియున్నది. కనుక, [''చంచద్భుజభ్రమిత''అను సుదీర్ఘ] సమాసముచేత - భుజములచేత గదను త్రిప్పుట మొదలుకొని, చూర్ణమొ నర్పఁబడిన యూరుద్వయముగల సుయోధనుని నాదరింపకుండుటవఱకును గలది యగు నేయర్థము స్ఫురింపఁజేయఁబడినదో, ఆయర్థప్రతీతికూడ - ఆసమాసము నంతవేగముగలదియేయగుచు, నడుమను విశ్రాంతినొందక, ఏకరూపమే యగు చుండుటవలన, [ధీరోద్ధతుఁడగు వక్తయగు భీముని] ఔద్ధత్యమునకు మిక్కిలి పరి పోషకమగుచున్నది. కొందఱిచట [సుయోధనునాదరింపక అనునర్థమును జెప్పక] ''సుయోధనునికి సంబంధించిన స్త్యానాంచిత బద్ధఘనమగు, శోణితమేదికలదో, దానిచేత శోణములగు పాణులుగలవాఁడు'' అని (యేకదేశాన్వయమును) చెప్పు చున్నారు.

ప్రభా :— ఆంధ్రీకృత పద్యమునకు మూలమగు వేణీసంహార నాటక మునందలి శ్లోకము.

> ''చఞ్చద్భుజ భ్రమితచణ్డగదాభిఘాత
> సఞ్చూర్ణితోరు యుగళస్య సుయోధనస్య।
> స్త్యానావబద్ధ ఘనశోణిత శోణపాణి
> రుత్తంసయిష్యతి, కచాంస్తవదేవి! భీమః.'' అనునది.

ఇచ్చట, కొందఱు [సంస్కృత మూలమునందుఁగల] ''సుయోధనస్య'' [సుయోధనునియొక్క] అనుపదమును - ''స్త్యానావబద్ధ'' అను, సమాసము

నందలి ''శోణిత'' అను నేకదేశముతో [సమాసమధ్యమునందలి పదముతో] నన్వయించుచున్నారు, ఇట్లు, కక్కారితిపడి - యేకదేశాన్వయము నొనర్చినను, దీనిచేత చమత్కారకారియగు, నర్థమేదియు, బ్రకాశింపఁజేయఁబడకుండుటవల న లోచనకర్త - దీనియందు - తనకుఁగల యరుచిని - సూచించెనని తెలియునది.

(36) మూలము :— ప్రసన్న వాచకాభిధేయమును, దీర్ఘసమాస రచనము నపేక్షింపనిదియు, నగుచున్నను, గూడ - తత్ ప్రకాశనపరమగు, [రౌద్రాదిరసవ్యంజకమగు] నర్థముకూడ - దీప్తియని [ఓజస్సని] చెప్పఁబడును. ప్రసన్నవాచకాభిదేయమును, సమాస రచనము నపేక్షింపనిదియునగు నాయర్థమున కుదా :—

శా॥ ప్రాంచద్ బాహుమదాఢ్యుఁ, బాండవచమూబాహ్రజిష్ణు,
శస్త్రాన్వితున్;
బాంచాలాన్వయు. వృద్ధునిన్, శిశువు, గర్భస్థున్; రణ
మ్మందు, మ
త్సంచార ప్రతికూలుఁడెవ్వఁ, డతనిన్; దత్కర్మ
సాక్షిన్; జగాల్
త్రుంచంజాలిన వానినే; నొకఁడనై, త్రుంతున్, రు
షాంధుండనై.

క్రింద నీయఁబడినది-ప్రథమ ముద్రణము నందలి పాఠము.

ఉ॥ "పాండవసేన శస్త్రమునుబట్టు స్వబాహుమదాంధుఁడెవ్వఁ, డె
వ్వండని నాకునడ్డుపడువాఁడగు, గర్భగతుండు,వృద్ధు, పా।
పండగుఁగాక, ఆ ద్రుపద - వంశ్యుఁడు; తత్కృతిసాక్షి,
యెవ్వఁడు
ద్దండరుషాప్తి - వాని జగదంతకునైన వధింతు నొక్కఁడన్"

ఇత్యాదులగు [మీఁది పద్యములు] రెండింటను నోజోగుణ విశిష్టతయున్నది.

పరీక్షా :— మీఁది పద్యములలో “చంచద్భుజ భ్రమిత” అను మొదటి పద్యమున, దీర్ఘసమాస రచనగల వాక్యరూపమగు శబ్దమును, “ప్రోంచద్బాహు మదాఢ్య,” లేక ‘పాండవసేన’ అను, రెండవపద్యమున, దీర్ఘసమాసము నపేక్షింపకున్నను, నుద్ధతమగు నర్థమును, ఓజోగుణవ్యంజకములగుటవలన, నవి రెండునుగూడ - ఓజోగుణవిశిష్టములుగా నారోపింపఁబడుచున్నవని తెలియునది. ఈరెండింటియందునుగూడ, ధ్వనింపఁజేయఁబడిన రౌద్రరసము - ఓజోవిశిష్టమని తెలియునది.

లోచనము :— “ప్రోంచద్.... శస్త్రాన్వితున్” అనఁగా; “పాండవసేనలనడుమ, నర్జునుఁడున్నగునెవ్వఁడెవ్వఁడు స్వబాహువులయందతిశయించుచున్న మదమును గలిగియుండునో, [శస్త్రమును ధరించి- పాండవసేనలోనున్న] వానిని” అనియర్థము. “పాంచాలాన్వయు.... గర్భస్థున్” పాంచాల రాజపుత్త్రుఁడగు ధృష్టద్యుమ్నుఁడు - ద్రోణునిజంపుటవలన, వానికులమున, [పాంచాలాన్వయమున] నశ్వత్థామకు- క్రోధావేశమధికము. [కనుక, “పాంచాలాన్వయుఁడు- వృద్ధుఁడైనను, శిశువైనను, గర్భస్థుఁడైనను, వానిని”] “తత్కర్మసాక్షిన్” అనఁగా; ఆకర్మకు - [ద్రోణునిశిరమును దన్నుటయను నసహ్యమగుకర్మకు-] ‘కర్ణుఁడు’ మున్నగు నెవ్వఁడుసాక్షియో వానిని, అనియర్థము. “రణమ్మందు మత్సంచార ప్రతికూలుఁడెవ్వఁ, డతనిన్” అనఁగా, “యుద్ధము - కర్తవ్యమైయుండ, నాకెవఁడు, సమరవిఘ్నము నొనర్చునో, వానిని,” అనిగాని, “యుద్ధమున, నేను - చరించునపుడెవ్వఁడు, నాకు-ప్రతికూలుఁడుగానుండునో, వానిని” అనిగాని, యర్థము. “ఇట్టివాఁడగువాఁడు - సకల జగదంతకుఁడైనను, సరియే. నేనున్వయమునసే వానికిఁగూడ, నంతకుఁడనై, వానిని వధింతును. అన్యుఁడగు, మనుష్యునిగాని, దేవునిగాని, వధింతునని వేఱుగా చెప్పనేల?” అని సమన్వయించునది. ఇచ్చట, [మీఁదిపద్యమునందు] ప్రతిపదమునందును-వేరువేరయినవియు, క్రమక్రమముగా వక్తచేత - విమర్శింపఁబడినవియు, నగు నర్థములచేత, వక్తయందుఁగల క్రోధము - మిక్కుటమగు ధారను [దీప్తిని] సమాశ్రయించినట్లు, సహృదయులకు భాసించుచున్నది. కనుక, నిచట, అసమస్తతయే - [పదములు -సమాసము లేనివిగాని, అల్పసమాసము గలవిగాని, యగుచు, దీర్ఘసమాసముగలవి కాకుండుటయే] దీప్తికి [ఓజస్సునకు] నిబంధన [వ్యంజక] మైయున్నది. ఇట్లు, పరస్పర ప్రతిద్వంద్వులుగా [విరోధులుగా] నున్న మాధుర్య - దీప్తులు (యథాక్రమముగా] శృంగారాదిగతముగను, రౌద్రాదిగతముగను, ప్రదర్శింపఁబడుట వలన, హాస్య, భయానక, భీభత్స, [అద్భుత] శాంతముల, యందీమాధుర్యదీప్తుల సమావేశము - విచిత్రముగా నుండునని, ప్రదర్శించినట్లైనది.

ప్రభా :— ప్రసంగవశమున, హాస్యాదులయందీ మాధుర్య - దీప్తుల, సమావేశవైచిత్ర్యమెట్లుండుననియుఁ జెప్పుచున్నాఁడు.

లోచనము :— హాస్యము- శృంగారమునకంగము. కనుక, మాధుర్యము- ప్రకృష్టముగానుండును. ఈరసము - [హృదయాది] వికాసము నొనర్చునది· కనుక. దీనియందు - ఓజస్సుగూడ - ప్రకృష్టముగానే యుండును. కనుకనిచట, మాధుర్యమును, నోజస్సును, గూడ - సమానములే యగుచుండును.

భయానకరసము - మగ్నమయిన, [అణఁగియున్న] చిత్తవృత్తియే- స్వభావముగాఁగలది. అయినను, దాని విభావము- దీప్తిగలది. కనుక, నచట, ఓజస్సు- ప్రకృష్టముగను, మాధుర్యము - స్వల్పముగను, నుండును. భీభత్సమునందు, గూడ - [చిత్తవృత్తియు, విభావమును,] నిట్లేయుండును. కనుక, భీభత్సమునందుఁగూడ, ఓజస్సధికముగను, మాధుర్యమల్పముగను నుండును. శాంతమునందు మాత్రము, విభావవైచిత్ర్యమువలన, నొకప్పుడోజస్సు-ప్రకృష్టముగా నుండును, ఒకప్పుడు, మాధుర్యమే - ప్రకృష్టమగుచుండును.

ప్రభా :— శాంతరస విభావము- దీప్తమగునపుడు, దానియందోజస్సున కాధిక్యముకలుగును. దాని విభావము-సుకుమారమగునపు, డచట, మాధుర్యమున కాధిక్యమేర్పడును. కనుక, మాధుర్యము, ఓజస్సు, అను నీగుణములు -న ర్వరస సాధారణములుకావు. శృంగార, విప్రలంభ, కరుణ, [శాంత] ములయందు మాధుర్యమును, వీర, భీభత్స, రౌద్రముల యందోజస్సును, నతిశయాన్వితములగుచుండును. ఓజస్సు, చిత్తమునకు వికాసరూపమగు విస్తారము-అనఁగా; ప్రజ్వలనము, స్వభావముగాగలదియగు దీప్తత్వము. కనుక,"దీప్తి" యనికూడ చెప్పఁబడును. లోచనమునందు "వీరాద్భుతములను గూడ గ్రహింపవలయును." అను పాఠమునకు బదులుగా - "వీరభీభత్సములనుగూడ గ్రహింపవలయును," పాఠముండుట- సముచితము. వెనుక, లోచనమునందు,"క్రోధాదిదీప్తరూపత్వమును, విస్మయ హాసాదిరాగిత్వమును," అని చెప్పఁబడినది. క్రోధాదులయందు అద్భుత స్థాయిభావమగు విస్మయముండగా, మరల, విస్మయమును బఠించుట, నంగతము కాదు కనుక, క్రోధాదిశబ్దముచేతఁ జెప్పఁబడిన రసములు - వీరభీభత్సములనుటయే సముచితము. ఇట్లే, లోచనమునందుఁగల, "హాస్యభయానక, భీభత్సములయందు," అనుచోటను, "భీభత్సమునందుఁగూడ - ఇట్లేయుండును." అను చోటను, భీభత్సపదమున్నచోట, అద్భుతపదము - పఠింపఁబడుట- సముచితము. అట్లయినయెడల, కావ్యప్రకాశాదులయందీ యంశమునఁ జెప్పఁబడిన, యభిప్రా

యమునకును, నిందలి యభిప్రాయమునకును, సంవాదము [పోలిక] కూడ - సిద్ధించును.

(37) మూలము : —

[కా] సమర్పకత్వం కావ్యస్యయత్తు సర్వరసాన్ ప్రతి।
స ప్రసాదో గుణో జ్ఞేయః, సర్వసాధారణ క్రియః.(10)

గీ॥ "కావ్య, మఖిల రససమర్పకమగు చునికి,
అది - ప్రసాదమ్మనెడి గుణ, మ్మదియె-రచన
నెల్ల సాధారణక్రియ నెసగుచుండు;"
ననుచు, సాహిత్యకోవిదు లరయ వలయు.

లోచనము :— "[శబ్దార్థరూపమగు కావ్యము - సర్వరసములనుగూడ] సమర్పకమగుచునికి" అనఁగా; 'చక్కఁగా నర్పించునదియగుచుండుట-అనఁగా; ఎండుకట్టెలయందగ్నివలెను, స్వచ్ఛమగు వస్త్రములందు నిర్మలమగు జలము వలెను, [సహృదయ - శ్రోతృ, సామాజిక] జ్ఞాతలహృదయములందు, హృదయ సంవాదముచేతనగు స్వాత్మావేశముచేత శీఘ్రముగా వ్యాపించుట - ప్రసాదమను గుణము. అనియర్థము. [స్వాత్మావేశముచేత నిట్లు వ్యాపించుటయను] అయకా లుష్యము - అనఁగా; [స్వచ్ఛత్వమను] ప్రసన్నత్వము - సర్వరసములకును [సాధారణమగు] గుణమైయున్నది. శబ్దార్థములందుగల, తథావిధ [రసాది] వ్యంగ్యార్థ సమర్పకత్వము - [అనుగుణము -] వానియందుఁ గూడ - ప్రసాద మగుచున్నది.

ప్రభా :— శబ్దార్థములు - రసాది వ్యంజకములగుటవలన, ప్రసాద గుణము - శబ్దార్థగతముగా నుపచరింపఁబడునని భావము.

అవ :— ఆయంశమునే వ్యాఖ్యానించు చున్నాఁడు.

(38) మూలము :— శబ్దార్థముల యందగు స్వచ్ఛత [ప్రసన్నత] మాత్రమే - ప్రసాదము. అదియే సర్వరససాధారణ మగుగుణము. అదియే-సర్వరచనా సాధారణముకూడ నగుగుణము.

అది - ముఖ్యముగా [రసాది] వ్యంగ్యార్థము నపేక్షించియే, వ్యవస్థితమని [అది - ముఖ్యముగా రసనిష్ఠమేయని] తలంపఁదగినది.

లోచనము : — "సచసర్వరససాధారణో గుణః" అనువృత్తియందుఁ గల 'చ'శబ్దము - అవధారణార్థకము. [ఏవకారార్థముగలది.]

ప్రభా : — కనుకనే, ఆంధ్రీకృతియందు - అదియే - సర్వరస సాధారణమగుగుణము. అని స్ఫుటీకృతము.

లోచనము :— సర్వరస సాధారణ్యమను- గుణమదియే, ఏవంవిధమగు, [సర్వరస సాధారణమగు] గుణమదియే. ఆదియే - శబ్దగతమును, అర్థగతమును, సమస్తమును, అసమస్తమును, నగురచన యేదికలవో, ఆరచనయందంతటనుగూడ, సాధారణమగుచుండును. ["అది - ముఖ్యముగా." అనువాక్యమునకిదియర్థము.] అర్థమునందు - [వాచ్యార్థమున -] రసాదివ్యంగ్యమును సమర్పించుటయే- సంభవించునుగాని, వేరొకటి సంభవింపదు. [కనుక, వ్యంగ్యార్థసమర్పకత్వము - అర్థమునందగు గుణముకాదు. శబ్దమునకుఁగూడ - స్వవాచ్యార్థమును సమర్పించుటయే సంభవించును. అది - [స్వవాచ్యమగు నర్థమును సమర్పించుట] ఎంతమాత్రమునుగూడ అలౌకికముకాదు కనుక, స్వవాచ్యార్థ సమర్పణమున శబ్దము - గుణమెట్లగును ?

ప్రభా :— స్వచ్ఛమగు నర్థము - సర్వరసములను- స్వచ్ఛమగు శబ్దము- స్వవాచ్యమును- నమర్పించుటవలన - ప్రసాదము - శబ్దార్థగుణమని తలఁపఁగూడదు. సమర్పకత్వమనఁగా; రసములు - స్వస్వరూపావేశమున, సహృదయ (జ్ఞాతృ) హృదయమున శీఘ్రముగా వ్యాపించుటయేయగును. కనుక, నట్లు శీఘ్రముగా సహృదయ హృదయమునందు వ్యాపించుటయను ప్రసాదగుణము - ముఖ్యతచేత రసములందుండునదియేగాని, శబ్దార్థములందుండునదికాదు. అయినను, ఉపచారమువలన, "శబ్దము - ప్రసాదభరితము" "అర్థము - ప్రసాద లలితము" అని వ్యవహరింపఁబడును." అనితెలియునది.

"రచన మధురము. 'బంధమోజస్వి' (దీప్తము) ఇత్యాది వ్యవహారములు - 'దీని యాకారము - శూరము,' మున్నగు వ్యవహారమువలె, నౌపచారికములు." అని, యిట్లే మమ్మటాచార్యాదులుకూడఁ జెప్పియున్నారు. [శబ్దార్థములయందుఁగూడ నీదృశమగు మాధుర్యాదులుండుటవలన, 'రచన-మధు

రము' మున్నగు వ్యవహారము ఔపచారికములుకావు. అని శ్రీ పండిత జగన్నాథ రాయాభిమతము.] జరత్తరులు. [అనఁగా, కొందఱు ప్రాచీనులగు నాలంకారికులు -] శ్లేషము, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత. అర్థవ్యక్తి. ఉదారత. ఓజస్సు, కాంతి, సమాధి. అనునామములుగల శబ్దగుణములను పదింటిని, అర్థగుణములను పదింటిని జెప్పిరి.

లోచనము :— భామహాభిప్రాయముచేత, నిట్లు మాధుర్యౌజః ప్రసాదము లను గుణములు - మూఁడే - ఉపపన్నములగును.

ఆ మాధుర్యాదులుకూడ-ముఖ్యముగా, సహృదయ హృదయమున, [ద్రుతి, దీప్తి, ప్రసాద, రూపచిత్తవృత్తి విశేషరూపములగు] ఆస్వాద స్వరూపములైయున్నవి. కనుకనే, ఈమాధుర్యాదులు - [తదాస్వాదములు - తత్తద్రస చర్వణా, జన్యములని] ఆస్వాద్యమగు, రసమునందుపచరితములగుచుండును. తదుపరి- శబ్దార్థములు - తత్తద్ రసచర్వణా ప్రయోజకములు కనుక, తద్రసవ్యంజకము లగు శబ్దార్థములయందుపచరితములగుచుండును. అనితాత్పర్యము.

ప్రభా :— లోకమున నంగియగు నాత్మకుత్కర్ష హేతువులగుటవలన, శౌర్యాదులు - గుణములగునట్లు, కావ్యమున నంగియగు రసమునకు అనఁగా; కావ్యాత్మకుత్కర్షహేతువు లగుటవలన, దానిధర్మములగు [స్వరూపవిశేషము లగు] మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము, అనునవి-గుణములగుచున్నవి. అందు చిత్తద్రవీభావమయమగు, నాహ్లాదము - మాధుర్యమని చెప్పఁబడును. 'గూఢ విషయములయందుఁ బ్రవేశింపఁజాలకుండుట' యను స్వరూపముఁగల కాఠిన్యము చిత్తమునకు స్వాభావికమైయున్నది. శృంగార, విప్రలంభ, కరుణ [శాంత] ములు - శబ్దార్థవ్యంజితము లగునపుడు, సహృదయహృదయము-ఈకాఠిన్యమును, క్రోధాదికృతమగు దీప్తతను, [ఉజ్జ్వలతను] విస్మయము, హాసము, భయము, మున్నగువానిచేతఁ గలిగింపఁబడిన, విక్షేపమును, [అన్యవిషయగ్రాహిత్వమును] పరిత్యజించి, రత్యాదివిషయములతోఁ గూడనదియగు, నానందోద్బోధముచేత, అనఁగా; రసాస్వాదముచేతనగు నార్ద్రతను బొందును. ఈయార్ద్రతయే - ద్రుతి యని [ద్రవీభావమని] చెప్పఁబడును. శృంగారాదిరసచర్వణవలన - జనించునది యగు నీమాధుర్యము - ద్రుతిరూపమేయగుచున్నది. కనుక, మాధుర్యము - ద్రుతికిఁగారణమను కావ్యప్రకాశమతము - విశ్వనాథ కవిరాజుచేత - దూషింపఁబడినది. కాఁగా; ద్రుతిరూపమగు నాహ్లాదమే- మాధుర్యపదార్థమని తెలియనగును. కనుక, శృంగార, విప్రలంభ, కరుణ [శాంత] రసాస్వాదమున, జనించు ద్రుతి

రూపమగు నాస్వాదానుభవమే - మాధుర్యమనునది - ఫలితార్థమని తెలియునది. ఇది-శృంగార, విప్రలంభ, కరుణ [శాంత]ములయందు, క్రమముగా ప్రకర్షాతిశయాన్వితమైయుండును. సహృదయ జ్ఞాతృహృదయమునందగు విస్తారరూపమగు ప్రజ్వలనము - స్వరూపముగాఁగల, దీప్తి - ఓజస్సని చెప్పఁబడును. "వీరాద్భుత రౌద్రరసచర్వణనుండి జనించునదియగు, దీప్తతయే - ఓజస్సు. కనుక, నాయోజస్సు - దీప్తికి కారణము" అను మమ్మటోక్తి - సంగతముకానేరదు, ఇది - వీర, భీభత్స, రౌద్రరసములయందుత్తరోత్తరమగు, ప్రకర్షాతిశయమును గలిగియుండును. ఎండుకట్టె నగ్నివలెను, స్వచ్ఛవస్త్రము నుదకమువలెను, సహృదయ హృదయమును వ్యాపించునదియగు గుణము - ప్రసాదమని చెప్పఁబడును. ఈ ప్రసాదము - వికాసరూపము. శబ్దము - శీఘ్రముగా స్వవాచ్యార్థమును దెలుపునపుడది - స్వచ్ఛమగును. అర్థమో, శీఘ్రముగా నుపస్థితి విషయమగునపుడు, స్వచ్ఛమగును. ఇట్లు శబ్దార్థములు రెండునుగూడ-స్వచ్ఛములగుటయే ప్రసన్నత. అట్టిశబ్దార్థములే - ప్రసన్నములని, వ్యవహరింపఁబడును. ఇట్లు- ప్రసన్నములగు అనఁగా; స్వచ్ఛములగు, శబ్దార్థములే,- సర్వరస సమర్పకములగుచుండును. అవి సర్వసమర్పకము లగునపుడు, అనఁగా; నవి-యేరసమునైనను గూడ, శీఘ్రముగా స్ఫురింపఁజేయునపుడు - తద్రసనిష్ఠమగు, నేగుణముచేత - సహృదయహృదయమున, [స్వచ్ఛములగు శబ్దార్థములచేత వ్యంజితములగు] రసములు - శీఘ్రముగా వ్యాపించునో, ఆగుణమే - ప్రసాదమనునది - ఫలితార్థము. ప్రసాదమను, నీగుణము - శృంగారాదులగు సర్వరసములందును, ఆధారాధేయత్వ సంబంధముతోను, పదసంఘటనారూపములగు, రచనలన్నింటియందును, వ్యంగ్యవ్యంజకత్వ సంబంధముతోను, నుండును. కనుక, నీప్రసాదము మాత్రమే - సర్వరససాధారణమును, సర్వరచనాసాధారణమును, నగుగుణమగుచున్నది. మాధుర్యవ్యంజకములగు వర్ణములును, ఓజోవ్యంజకములగు వర్ణములును, సాహిత్యదర్పణాది గ్రంథములయందుఁ జెప్పఁబడినవి. ఓజోమాధుర్యములకువలె ప్రసాదగుణమునకు వ్యంజకమగు నియతరచనా విశేషమేదియులేదు. కారణములగు, రసములు- కార్యములగు దీప్త్యాదులుగా, నారోపింపఁబడి, (ఉపచరితములై) వ్యవహరింపఁబడుచుండును.

ప్రశ్న :— అయ్యా! ద్రుతి, దీప్తి, వికాస, రూప చిత్తవృత్తివిశేషరూపములగు, మాధుర్యౌజః ప్రసాదములు- ముఖ్యముగా రసధర్మములైనను, సాహితీశాస్త్రవేత్తలు - ఈమాధుర్యాదిగుణములను శబ్దార్థధర్మములుగా వ్యవహరించుచున్నారు.

"సగుణౌ, సాలంకారౌ, శబ్దార్థౌ కావ్యమ్."

అను కావ్యలక్షణమునఁగూడ - కావ్యరూప శబ్దార్థములు - సగుణములని [గుణవిశిష్టములని] వ్యవహరింపఁబడినవి. ఇదియెట్లు సంగతమగును ?

ఉత్తరము :— ఈసంసారమున, ఆత్మగుణములగు శౌర్యాదులను, స్థూల శరీరమునందారోపించి, వ్యవహరించునట్లును, స్థూలత్వాదులగు శరీరధర్మముల నాత్మయందారోపించి - వ్యవహరించునట్లును, రసనిష్ఠములగు, గుణములను, రస వ్యంజక శబ్దార్థములయందారోపించి, [శబ్దము - మధురము, అర్థము- మధురము, ఇత్యాదిగా] వ్యవహరించుచున్నారు. కనుక, 'నీవ్యవహారమౌపచారికమే'యని తెలియవలయును.

లోచనము : అవ :— "అస్మత్పక్షమునందే, యిట్లు గుణాలంకార వ్యవహారమునకు విభాగము - కుదురును." అని ప్రదర్శించి, "అస్మత్పక్షము నందే దోషములను - నిత్యములుగను, అనిత్యములుగను, విభజించుటకూడ - సంగతమగును" అని ప్రదర్శించుటకై, చెప్పుచున్నాఁడు.

(38) మూలము :—

శ్రుతి దుష్టాదయోదోషా, అనిత్యాయేచదర్శితాః।
ధ్వన్యాత్మన్యేవ శృఙ్గారే, తేహేయాఇత్యుదాహృతాః.(11)

కం॥ శ్రుతి దుష్టాదులెవి, అని
త్యతగల దోషములు-సూచితములో; అవి-యుదా
హృతములు ధ్వన్యాత్మగ- ౘని
హితమగు శృంగారమందె, హేయమ్ములుగన్,

శ్రుతి దుష్టము [శ్రుతిదుష్టత] మొదలగు నేవి - దోషములు గను, అనిత్యములుగను, సూచింపఁబడినవో, అవి - వాచ్యమగు నర్థమాత్రమునందును, శృంగార వ్యతిరేకులగు రసములు-వ్యంగ్య ములగునపుడును, ధ్వన్యాత్మభూతముకాని శృంగారమునందును గూడ దోషములు కాకుండుటవలన, విడువఁదగినవికావు. ఇంకెచట

విడువఁదగినవనిన; అంగిగా వ్యంగ్యమగు, ధ్వన్యాత్మయగు శృంగారమునందే - [శృంగార, విప్రలంభ, కరుణ, శాంతాదులయందే] హేయములుగా నుదాహరింపఁబడినవి. అట్లుకానియెడల నవి - అనిత్యదోషములగుటయే- సంభవింపదుగదా! ఇట్లనంలక్ష్యకప్రియోద్ద్యోతమగు ధ్వన్యాత్మ - [ధ్వనియొక్క స్వరూపము] సామాన్యరూపమునఁ బ్రదర్శితము.

లోచనము :— అసభ్యమగు స్మృతికి హేతువులగు వాంతాదులు- శ్రుతిదుష్టములు. వాక్యార్థబలమువలన, నశ్లీలార్థప్రతిపత్తిని గలిగించునవి - అర్థదుష్టములు. దీని కుదాహరణము :—

"ఛిద్రాన్వేషీ మహాంస్తబ్ధో, ఘాతాయైవోపసర్పతి."

"పరుని దోషములను వెదకువాఁడును, స్తబ్ధుఁడును ["ఆత్మోన్నతికిఁ బ్రయత్నింపనివాఁడును.] నగు వ్యక్తి - పరవినాశమునకై యుపసర్పణ మొనర్చును" [ఇచటి దోషమును గ్రింది ప్రభామతియందుఁ జూచునది.] పదద్వయకల్పనచేతనగునవి - కల్పనాదోషములు. కల్పనాదుష్టమున కుదా :- "రుచిం కురు"అనునది. "కురు రుచిమ్" అనుపదముల క్రమమును-తారుమారుచేయునపుడిది యేర్పడును. శ్రుతి కష్టమునకో- అధాక్షీత్, అక్షీప్సీత్, తృణేఢి, ఇత్యాదులుదాహరణములు.

ప్రభా :— "శ్రుతిదుష్టము, అర్థదుష్టము, కల్పనాదుష్టము, శ్రుతికష్టము" అనుదోషములు- భామహాచార్యునిచేతఁ జెప్పఁబడినవి. ఛిద్రపదముచేత పురుషశేఫరూపమగు నర్థము- ప్రతీతమగుటవలన అసభ్యస్మృతికలుగును. "కురు రుచిమ్" (రుచినొనర్పుము.) అని ప్రయోగింపక, పదములనుమార్చి ప్రయోగించునపుడు "రుచిమ్‌కురు" అనియగును, ఇచట, పదాంత - పదాది వర్ణములచేరికవలననేర్పడిన "చింకు" అనుపదము - యోన్యంతర్గతమగు నంకురమును బోధించుటవలన - కల్పనాదుష్టమగును. చెవికి కటువుగా వినిపించునదియగు పదము- శ్రుతికష్టమని చెప్పఁబడును. "అధాక్షీత్" మున్నగుపదములు - దీనికుదాహరణములగును.

లోచనము :— శృంగారమునందేకాక, వీర, శాంతాద్భుతాది రసము

లందుఁగూడ - అనిత్యదోషములగు శ్రుతిదుష్టత్వాదులు- విడువఁబడును. కనుక, 'శృంగారమునందే' అనుచోటనున్న శృంగారపదము-సముచితములగు మఱికొన్ని రసములకుఁగూడ నుపలక్షణమని తెలియునది.

ప్రభా :— "శృంగారమునందే విడువఁదగును." అనఁగా; శృంగార, వీర, శాంతాద్భుతాదులయందే - అనిత్యదోషములుగా సూచింపఁబడిన, శ్రుతి దుష్టత్వాది దోషములు - విడువఁదగినవి. అనియర్థము. మూలకారికయందు "దర్శితాః" [దర్శితములు.] అనుపదము వృత్తికర్తచేత, "సూచితాః" [సూచితములు] అని వ్యాఖ్యానింపఁబడుటవలన - ఆంధ్రీకృత కారికయందుఁగూడ - ["దర్శితములు" అని ప్రయోగించుటకు వీలున్నను] "సూచితములు" అని ప్రయోగింపఁబడినది. మూలము ననుసరింపఁదలఁచు, పాఠకులు-"దర్శితములో" అని, పఠించుకొనవచ్చును.

అవ :— "దర్శితములనఁగా; వృత్తికర్తచెప్పినట్లు సూచితములనునర్థమే-స్వీకరింపఁదగినది." అని, లోచనకర్త - హేతుప్రదర్శన పురస్సరముగా విశదీకరించుచున్నాఁడు.

లోచనము :— "భిన్నవృత్తము" మున్నగుదోషములుకూడ - భామహాదులచేతఁ జెప్పఁబడినవి. కాని, వీని విషయములు - విభజించి, ప్రదర్శింపఁబడి, అభిన్నవృత్తాది దోషములకంటె - ఈశ్రుతి దుష్టాదిదోషములకుఁగల వివిక్తమగు ననిత్యత్వము - వారిచేతఁ బ్రదర్శింపబడుటలేదు. అట్లని, యివి - గుణములకంటె వ్యతిరిక్తములని కూడ ప్రదర్శింపఁబడుటలేదు. [కనుకనే] మేము మాత్రము - భీభత్స, హాస్య, రౌద్రాదులయందు [ఇవి గుణములగుటవలన] వీని నంగీకరించి, శృంగారాదులయందు [దోషములగుటవలన] పరిత్యజించి, ["ధ్వన్యాత్మగా విని హితమగు శృంగారమందె హేయమ్ములుగన్" అనువాక్యముచేత] ఈయీదోషములందుఁగల యనిత్యత్వమును, దోషత్వమును, సమర్థించియేయున్నాము".అని భావము.

ప్రభా :— వక్తృ, ప్రతిపాద్య, వ్యంగ్య, వాచ్య, ప్రకరణాది మహిమచేత, కొన్నిచోట్ల దోషముకూడ-గుణమగును. కొన్ని స్థలములయందిదోషములు-గుణమును. దోషమును, గూడఁ - గాకుండును. రౌద్రాదులగు రసములు -ప్రధానముగా నంగులగు (వ్యంగ్యములగు)నపుడు, శ్రుతికష్టత్వాదులు-గుణములగును. అంగిత్వమునొందిన, శృంగారాదులయందే-యివి- దోషములగును. ఇట్లొకచోట-

దోషమైనది - ఇంకొకచోట గుణమగుటవలన, దోషములకు- నిత్యానిత్యత్వవిభాగ మేర్పడినది. ఇది - ప్రాచీనాలంకారికులచేత, సూచింపఁబడినది. మాచేత, సమర్థింపఁబడినది, ఇట్లు, దోషములకనిత్యతను సమర్థించుటవలన, గుణములకు సంబంధించిన గుణత్వము - రసప్రాధాన్యము ననుసరించి, యేర్పడినట్లు, దోషములకు సంబంధించిన, దోషత్వముకూడ - రసప్రాధాన్యము ననుసరించియే - యేర్పడునని సిద్ధించునుగదా!. దీనివలన, నసంలక్ష్యక్రమ వ్యంగ్యములగు రసాదులకుఁగల ప్రాధాన్యమును, నలంకార్యతయు, సిద్ధాంతితమగుచున్నది. కనుక, "రసము ప్రధానముగా వ్యంగ్యమగునపుడలంకార్యమే యగును. కాని, రసవదాద్యలంకారముకాదు." అను నిర్ణయము - "మాచేతఁగావింపఁబడిన, యీదోషముల నిత్యానిత్యత్వవిభాగమువలన సిద్ధించును" అనిభావము. కాఁగా; రసాదులు- కావ్యాత్మ కనుక ప్రధానత చేత నంగియగును. "గుణములు - స్వాత్మాశ్రయములగు శౌర్యాదులవలె, నారసాదులకు గుణములు. అవయవాశ్రితములగు, నలంకారములవలె, కావ్యాంగాశ్రితములగు నలంకారములు - రసాదులకలంకారములు." అనువిభాగమిట్లు మా మతమునందే - కుదురును. అనిభావము.

—• రసాది ధ్వనిభేదములనంతములు. కనుక, వానిమొత్తము తెలియదు •-

(39) మూలము : —

[కా] తస్యాఙ్గానాం ప్రభేదా యేప్రభేదాః స్వగతాశ్చయే।
తేషామానన్త్యం, మన్యోన్య సమ్బన్ధ పరికల్పనే. (12)

గీ॥ తదప్రసాంగ భేదములను, దానికి స్వగ
తములగు ప్రభేదములను, భేద - ప్రభేద
ములను గూర్పఁగనగు భేదములను, వెరసిఁ
గొని - రసాదిధ్వనులయంతుఁ గనఁదరమె? ॥

అంగిగా [ప్రధానతచేత] వ్యంగ్యమును, వివక్షితాన్యపరవాచ్యమును, ధ్వనికి, ముఖ్యమగు నాత్మయు, [వివక్షితాన్య పరవాచ్య ప్రభేదములందొక ప్రభేదమగు నసంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వనికి సంబంధించిన ప్రభేదమును] నగు రసాదికము తెలుపఁబడినదిగదా!

ఆరసాదిధ్వనికంగములును, వాచ్యవాచకములననుసరించునవియు, నగునలంకారములకు సంబంధించిన ప్రిభేదములు - నిరవధులైయున్నవి. మఱియు, నంగియగు నారసాదిధ్వనికి [శృంగారాది రస ధ్వనులకు] రస, భావ, తదాభాస, తత్ప్రశమ [భావశాంతి, భావోదయ, భావసంధి, భావశబలతా] లక్షణములగు స్వగతభేదములు- [పెక్కులు-] విభావానుభావ వ్యభిచారిభావ ప్రతిపాదన సహితములగుటవలన, ననంతములగుచున్నవి. వానికన్నిఁటికిని-స్వాశ్రయము [స్త్రీపురుష ప్రికృత్యౌచిత్యాదుల] నపేక్షించుటచేతనగు విశేషములు- [భేదములు] హద్దులేనివైయున్నవి. వానికన్నిఁటికిని - మరలనన్యోన్యసంబంధ పరికల్పన మొనర్పఁబడునెడల, వానియందొక్క రసమునకు సంబంధించిన, భేదములుకూడ - పూర్తిగా లెక్కించుటకు శక్యములుగాకుండును. అట్టిచో, సర్వరసములకునుగూడ, సంబంధించిన భేదములు - పరిగణింపఁబడుట కెట్లు సాధ్యములగును ?.

లోచనము :— స్వగతము లనఁగా; ఆత్మగతములు. శృంగారాదిరసముల కాత్మగతములగు భేదములు - సంభోగ, విప్రిలంభాదులు. ఆత్మీయగతములగు భేదములు - విభావాదగతములు.

కనుక "లోష్ట ప్రిస్తారము [వృత్తవిశేషములను దెలుపు ప్రిస్తారమువంటి ప్రిస్తారము] చేత, అంగాంగిభావమునందగు, [రసాదిధ్వనిభేద] పరిగణనము - ఇచట శక్యముకాదు " అనిభావము. స్వాశ్రియమనఁగా; 'స్త్రీపురుష ప్రికృత్యౌచిత్యము' మున్నగునది.

(40) మూలము :— అదెట్లనిన; [ఒకరసమునకు సంబంధించిన భేదములనుగూడ - పూర్ణముగా లెక్కించుటకు శక్యముకాకుండుటెట్లనిన;] అంగియగు, శృంగారమునకు, - సంభోగము, విప్రిలంభము అని, ఆద్యములగు భేదములు - రెండున్నవిగదా!. సంభోగమునకు-పరస్పర ప్రేమదర్శనము, సురతము, విహారము, మున్నగు లక్షణములుగల ప్రికారములున్నవి. విప్రిలంభమునకుఁ

గూడ - అభిలాషవిప్రలంభము, ఈర్ష్యావిప్రలంభము, విరహవిప్రలంభము, ప్రవాస విప్రలంభము, మున్నగుభేదములున్నవి. వానిలో నొక్కొక్కదానినికిగూడ-విభా,వానుభావ,వ్యభిచారి, భేదమున్నది. వానికిఁగూడ-దేశకాలాది [కృత] భేదమును, ఆశ్రయావస్థా [కృత] భేదమునుగలవు. కనుక, స్వగతభేదముల నపేక్షించిననుగూడ, ఆశృంగార రసమొక్కటియే-పరిమితిలేనంతదిగానున్నది. అట్టిచో; దానికిఁగల, యంగప్రభేదములనుగూడ - గ్రహించునపుడు, దాని యపరిమేయత్వమును జెప్పుటకు వీలగునా ? ఆ యంగప్రభేదము లలో, నొక్కొక్కటియుఁగూడ- మరల, నంగి ప్రభేదములతోఁ జేర్పఁబడిన యెడల, నపుడేర్పడిన భేదములు - ఆనంత్యమునే పొందునుగదా!.

లోచనము :— పరస్పర ప్రేమదర్శనమనఁగా; [నాయికా నాయకులు] ప్రేమచేత, నొకరినొకరు చూచుకొనుట. ఇది - సంభాషణాములకుఁగూడ నుపలక్షణము.

ప్రభా :— “ప్రేమ దర్శనము అనుదానిచేత, సంభాషణము, ప్రేమ లేఖారచనము, మున్నగువానిని, పెక్కింటిని-గ్రహింపవలయును.” అనిభావము,

లోచనము :— సురతమనఁగా; ఆలింగనాదికము. అది-అరువదినాలుగు భేదములు గలిగియున్నది.

ప్రభా :— ఆలింగనము, చుంబనము, నఖచ్ఛేద్యము, దశనచ్ఛేద్యము, సంవేశనము, సీత్కృతము, పురుషాయితము, ఔపరిష్టకము, అను, సురతభేదము లెనిమిదియు, ప్రత్యేకములగు నెనిమిదేసి భేదములచేత - అరువదినాలుగగును. వాత్స్యాయన కామసూత్రమునందలి, ద్వితీయాధికరణమున, సవిస్తరముగ వీనిని గ్రహింపనగును.

లోచనము :— విహరణమనఁగా; ఉద్యానగమనము. “మున్నగు” అను పదముచేత, జలక్రీడ, మధుపానము, చంద్రోదయము, క్రీడ, మున్నగువానిని గ్రహించునది.

అభిలాష విప్రలంభము :— తమకు జీవితసర్వస్వముగా నభిమానింపఁబడు నదియగు స్వరూపముగల, రతి - [ప్రేమ], నాయికానాయకు లిరువురికినిగూడ నుదయించినను గూడ, ఏదో హేతువువలన వారికి సమాగమము కలుగనపుడు, స్ఫురింపఁజేయఁబడునది.

అదెట్లనిన :— "సుఖయతీతి కిముచ్యతే" "సుఖింపఁజేయుచున్నదని చెప్పవలయునేమి ?" అనువాక్యము మొదలుకొని, వత్సరాజ - రత్నావళుల, కభిలాషవిప్రలంభము స్ఫురింపఁజేయఁబడినది.

ప్రభా :— ఇది - హర్షచక్రవర్తి కృతమగు రత్నావళీనాటికయందలి వాక్యము. సాగరిక - [రత్నావళి-] సుసంగతతోననిన మాటలను - సారిక (గోరువంకపిట్ట) నోటినుండి, వత్సరాజు - వినెను. మఱియు, తనచిత్రమును-సుసంగత చేత లిఖింపఁబడిన, సాగరిక చిత్రమును-గల చిత్రఫలకమునుజూచి, సాగరికకు-తనయందుఁగలిగిన, యనురాగమును నిశ్చయించెను. తదుపరి, "సాగరికచేత - లిఖింపఁబడిన, ఈకన్యయొక్క చిత్రము - నీలోచనమును సుఖింపఁజేయుచున్నదా ?" అనియడిగిన, విదూషకునితో, వత్సరాజగు నుదయనుఁడు-"సుఖింపఁజేయుచున్నదని చెప్పవలయునేమి ?" అనినుడివెను. ఉదయనుఁడు నుడివిన యీ వాక్యమును - సుసంగతతోఁగలిసి, యచటికేతెంచిన సాగరిక-[రత్నావళి-] వినెను.

లోచనము :— ఈ వాక్యమును వినుటకు ముందు రత్నావళి కభిలాష విప్రలంభము - లేనేలేదు.

ప్రభా :— శ్రవణామృతమగు నీవాక్యమును వినిన పిమ్మటనే, యుదయనునికిఁ దనయందనురాగమున్నదను నిశ్చయము - రత్నావళి కొదవినది.

లోచనము :— అంతకుముందు రతిలేదు. కనుక, నపుడొదవినది - కామావస్థామాత్రమే యగును.

ప్రభా :— "నన్ను రత్నావళి ప్రేమించినది. నన్నుదయనుఁడు ప్రేమించెను" ఇత్యాదిగా, నాయికానాయకు లొకరియందొకరికిఁగల ప్రీతిని - నిశ్చయించుకొనినప్పుడు - ఆరతియే - శృంగారరసమున, స్థాయియగు భావమగును. కనుక, నుదయనుఁడు - నుడివిన, యీ వాక్యమును వినకముందు - ఆమెకతనియందొదవినది - వాంఛామాత్రమేకాని, రతి[ప్రేమ]కాదు." అనిభావము.

ఈర్ష్యావిప్రలంభము :— ప్రణయ [స్నేహ] ఖండనాదులచేత [నాయకునకు] ఖండితనాయికతో నేర్పడునది.

ప్రభా :— అన్యాసంభోగ చిహ్నితుఁడగు ప్రియుఁడు-తనచెంతకువచ్చునపుడు - ఈర్ష్యాకషాయితయగు, వాని ప్రియురాలు - "ఖండిత". అనిచెప్పఁబడును. కనుక, నొకానొక నాయకునకిఖండితతోడి, ప్రణయఖండనాదికము - వర్ణింపఁబడునపుడది - ఈర్ష్యావిప్రలంభమగును.

లోచనము : విరహ విప్రలంభము :— అఖండితనాయిక - ప్రసన్నగాఁ జేయఁబడిననుగూడ, ప్రసాదము ననుగ్రహింపక, నాయకుఁడు - వెళ్లినపిమ్మట, పశ్చాత్తాప పరీతతచేత- [పశ్చాత్తాప పరీతయగునపుడు] ఆవిరహోత్కంఠితతో [కలహాంతరితతో] నాయకున కేర్పడునది.

ప్రభా : — "ఒకప్రేయసుఁడు - తనప్రియురాలికడకు రాఁదలచియుఁ జాలకాలము జాగుచేయునపుడు, ఉన్మనస్కురాలగునది- (తహతహనొందునది-) విరహోత్కంఠిత" అని చెప్పఁబడును. "బ్రతిమాలుచున్న, ప్రాణప్రియుని, కోపోద్రేకమునఁ బొమ్మని వెళ్లఁగొట్టి, వాడువెళ్లినపిమ్మట పశ్చాత్తాపము నొందునది - కలహాంతరిత." అనిచెప్పఁబడును. కనుక. మీఁది లోచనమున, "విరహోత్కంఠితతో" అనుటకు బదులు - "కలహాంతరితతో" అనుపాఠముండుట- సమీచీనమగును. లేక, "పశ్చాత్తాప పరీతతచేతనగు విరహముచేత - నుత్కంఠ నొందింపఁబడినది కాఁగా, [విరహోత్కంఠితయగు] నామెతో నాయకున కేర్పడునది - విరహవిప్రలంభము." అని సమన్వయించుకొననగును.

లోచనము : ప్రవాస విప్రలంభము :— "ప్రోషితభర్తృకయగు నాయికతో, నాయకునకు వర్ణింపఁబడునది." అనునది - [విప్రలంభ శృంగార] విభాగము.

ప్రభా :— కాంతుఁడు - దేశాంతరగతుఁడగునపుడు ఖిన్నురాలగునది- ప్రోషితభర్తృక. ఆమెతో, నాయకుని కేర్పడునది - ప్రవాసవిప్రలంభము.

లోచనము :— "మున్నగు" అనుపదముచేత, శాపాదికృతమగు, విప్రలంభమును - గ్రహింపఁదగును. 'విప్రలంభము' [వంచన] వంటిది. కనుక, ['వియోగము] విప్రలంభము.' అని చెప్పబడినది. వంచనయందభిలషితమగు విష

యము - లభింపదుగదా. ఇట్లేయిచటఁగూడ, [అభిలషితము - సిద్ధింపదు.]

వ్రిభా :— "అభిలాషాదులయందగు, వియోగము - విప్రలంభమువలె నుండును. అనఁగా; వంచనవలె, నుండును. వంచనయందభిలషితమగు విషయములభింపనట్లు, అభిలాషాదులయందగు విప్రలంభమునందుఁగూడ, అభిలషితమగు సమ్మేళనము-లభింపకుండును. ఇట్లువంచనమునకును, విప్రలంభమునకును, సామ్యమేర్పడియున్నది. కనుకనే, వంచనవంటిదగు వియోగము - విప్రలంభమని వ్యవహరింపఁబడుచున్నది." అనిభావము.

లోచనము :— "వానిలో నొక్కొక్కదానికినిగూడ" అనఁగా; సంభోగాదులలో [ప్రతిరసమునకునుగూడ" అనియర్థము

వ్రిభా : అవ :— "దేశకాలాది భేదమును, ఆశ్రయావస్థాభేదమును," అనువృత్తియందలి, ఆశ్రయపదమున, కింకొకరొసర్చిన వ్యాఖ్యానము-యుక్తము కాదు" అనుచున్నాఁడు.

లోచనము :— "ఆశ్రియమనఁగా; మారుతము, [గాలి] మున్నగు, [ఉద్దీపన] విభావముల కాశ్రయమగు, మలయాదికము" అనిచెప్పఁబడిన యర్థము- దేశశబ్దముచేత గతార్థమగుచున్నది. [మీఁది యర్థమిట్లు, పునరుక్తమగుచున్నది. కనుక సముచితముకాదు,] కనుక ఆశ్రియమనఁగా; కారణము. దీనియుదాహరణము నాయదియే. అదెట్లనిన ;—

గీ॥ లేమయల్లిన పూలమాలికను దీని
హృదయధామమ్మున ధరింతునే నెపుడును
శుష్కమయ్యె సుధారస సుర్భిని జెందు
నిది - విరహాహారుజలమాయించుమందు.

వ్రభా :— ఇది - విరహియగు నొకప్రియుఁడు - [ప్రియమిత్రునితోఁగాని, స్వగతముగఁగాని] వ్రివచించిన వాక్యము. చంద్రిక, మలయానిలము, పుష్పమాలిక, మున్నగుపదార్థములు - విరహతాపమునకుద్దీపకము.లేకాని, ఇంచుకయుఁగూడ, వానినిశమింపఁజేయునవికావు. మీఁది పద్యమున విరహ విప్రలంభము ననుభవించుచున్న, విరహిచేత - ధరింపఁబడిన పూలమాలిక - ప్రియురాలిచేతఁ గూర్పఁబడియుండిని వలన; నది - అతని విరహతాపమును మఱింత వి[?]ంపఁజేయునదియే యగును. కనుక వానికట్లు ధరింపవలెనే యుండెనని.

ఇంకొకపుష్పమాల - విరహికి - విరహతాప రుజలనుద్దీపించుటకు కారణమయి యుండును. కాని యిది - ప్రేయసిచేత రచింపఁబడి యుండుటయను కారణము చేత - విరహతాపరుజలను మాయించునదియగు మందగుచున్నది. కనుక, నిది - కారణకృతమగు విభావభేదమున కుదాహరణముగుచున్నది.

(41) మూలము : — [కారికా]

దిఙ్మాత్రం సూచ్యతేయేన వ్యుత్పన్నానాం సచేతసామ్।
బుద్ధిరాసాదితాలోకా సర్వత్రైవ భవిష్యతి (13)

ఆ॥వె॥ తెలుపుదుము పథమ్ము - దిఙ్మాత్రమాత్రమ్ము.
దాన విజ్ఞులయి స్వతంత్రులయిన
సహృదయుల మనీష - సర్వమ్మునందు, నా
సాదితావలోక భేదమగును.

ఇట్లు దిఙ్మాత్రకథనము చేత - ఏయొక్క రసభేదమునందైనను గూడ - అలంకారములతోడి, యంగాంగిభావ పరిజ్ఞానము వలన వ్యుత్పన్నులగు, సహృదయుల బుద్ధియే-సర్వరసములందును గూడ - ఆసాదితమగు నాలోకము [ప్రాప్తమగు జ్ఞానము] గలది-కాఁగలుగునుగదా!.

లోచనము :— ''దానన్'' అనఁగా; 'దిఙ్మాత్రకథనముచేత' అని యర్థము. 'సహృదయుల' అనఁగా; మహాకవిత్వమును, సహృదయత్వమును గూడఁ బొందఁగోరిన వారలయొక్క'' అనియర్థము. ''సర్వమ్మునందున్'' అనఁగా; ''సర్వరసములందును'' అనియర్థము. ఆసాదితావలోకమనఁగా; ''పొందఁబడిన సమ్యగ్ వ్యుత్పత్తిగలది'' అనియర్థము.

(42) మూలము : — తత్ర,

[కా] శృఙ్గారస్యాఙ్గినో యత్నా దేకరూపానుబన్ధవాన్।
సర్వేష్వేవ ప్రకారేషు నాఽనుప్రాసః ప్రకాశకః. (14)

అందు,

తే॥గీ॥ అంగిగానున్న శృంగారమందుఁగల, ప్ర
కారములు వేనికిని - వ్యంజకమ్ముగాదు
తానను ప్రాస; మేకరూపానుబంధి
వృత్తియగునపు, డది యత్నకృతము గనుక. (14)

అంగియగు శృంగారమున మాత్రము - ఏప్రభేదములు - తెలుపఁబడినవో, ఆప్రభేదములన్నిఁటికినిగూడ - [ఆప్రభేదములం దున్న యేప్రభేదమునకైననుగూడ] ఏకరూపానుబంధియగునట్లు. [ఒకేరూపము నిరంతరమగునట్లు] ప్రబంధమునఁ గూర్పబడునది యగు ననుప్రాసము - [ప్రయత్నకృతమగుటవలన] వ్యంజకము కానేరదు.

లోచనము :— "అందు" అనఁగా; [ఇట్లు] "దిఙ్మాత్రముగాఁ జెప్ప వలసియుండగా" అనియర్థము. "యత్నకృతము కనుక;" అనఁగా; "యత్న మువలనఁ జేయఁబడినది కనుక," అని హేతువును దెలుపునదియగు నర్థమభిప్రే తము. ఏకరూపమగు ననుబంధమును విడుచునపుడుమాత్రము - విచిత్రమగు ననుప్రాసము నిబంధింపఁబడిననుగూడ - దోషము కలుగదనుటకు, "ఏకరూప" అను శబ్దము గ్రహింపఁబడినది.

(43) మూలము :— "అంగిగానున్న" అనుటచేత, అంగ భూతముగానున్న శృంగారమునందు - ఏకరూపానుబంధియగు ననుప్రాసమును 'స్వేచ్ఛగా' నిబంధింపవచ్చుననుచున్నాఁడు.

ప్రభా :— మీఁది కారికార్థమునిట్లు గ్రహించునది. "శృంగారరసప్రభేద మేదయిననుగూడ - అలంకార్యమగు నంగియగునపుడు, సమానాకారము ననుస రించి, నిరంతరమగునట్లు కూర్పఁబడునదియగు, వర్ణసామ్యముగల, యనుప్రాస మును నిబంధింపఁగూడదు. అట్లు దానిని నిబంధించునపుడు - కృతిప్రణేతయగు కవి - గాఢమగు పృథక్ ప్రయత్నము నొనర్పవలసివచ్చును. అపుడాకవికి సంబంధించిన రసైకప్రకాశితయగు, దృష్టికి, విచ్ఛేదము - కలుగును. కనుక, పృథక్ ప్రయత్నకృతమగు నాయనుప్రాసము - అంగియగు శృంగారప్రభేద మును, దేనినైననుగూడ - వ్యంజింపఁజేయఁజాలునది కాకుండుటవలన. నచట

దోషమేర్పడును'' అనిభావము. "అచటఁగూడ - ఏకరూపానుబంధిగాఁగూర్పఁ బడని యనుప్రాసము - వ్యంజకముకావచ్చును. అంగముగానున్న, శృంగారరస ప్రభేదమునకును, శృంగారాదీతర ధ్వనికినిగూడ - ఏకరూపానుబంధిగాఁగూర్పఁ బడిన, యనుప్రాసముకూడ - వ్యంజకమేయగును.'' అనితెలియునది.

(44) మూలము : —

[కా] ధ్వన్యాత్మభూతే శృఙ్గారే యమకాది నిబన్ధనమ్।
శక్తావపి ప్రమాదిత్వం, విప్రలమ్భే విశేషతః (15)

కం॥ ధ్వని జీవిత శృంగారము
నను, యమకాదుల నిబంధనము - శక్తునకై
ననొసంగుఁ బ్రమాదిత్వము;
ఘనమగునది - విప్రలంభగతమగు నెడలన్.

వాచ్యవాచకములచేత - తత్పరముగాఁ [ప్రధానముగాఁ] బ్రకాశింపఁజేయఁ బడునదియు, [కనుకనే] ధ్వన్యాత్మభూతమును, నగు శృంగారమునందు - [అనఁగా; శృంగారము కావ్యాత్మగా ధ్వనింపఁజేయఁబడునపుడు] - "యమకాదుల నిబంధనము" - అనఁగా; దుష్కరశబ్దభంగ శ్లేషాదులగు యమకప్రకారముల నిబంధనము - [కృతికర్తయగు మహాకవికెంత] శక్తియుండిననుగూడ - ప్రమాదిత్వము నొదవించును. [కారికయందుఁగల] "ప్రమాదిత్వ మును" అనునీపదముచేత - ఈయంశము - దర్శితమగుచున్నది. కాకతాళీయ [న్యాయ] ముగా, ఎచ్చటనైనను, ఒకానొకప్పుడే దియో, యమకప్రకార మొకటి - నిష్పన్నమయినను, గావచ్చును గాని, [రూపకాదులగు] తదితరాలంకారములవలె, రసాంగములగు నట్లీ యమకాదుల నిబంధనము-విస్తరించి, [అధికముగా] కావింపఁ దగినదికాదు. "ఘనమగునది - విప్రలంభగతమగు నెడలన్" అను టచేత - "ఆవిప్రలంభ [శృంగార]ము-ద్యోత్యమగునపుడు- యమ

కాదులగు నంగముల నిబంధము - [కూర్పు] నియమముగా, చూపవలయును." అని చెప్పుటవలన, విప్రలంభము నందగు సౌకుమా ర్యాతిశయము - ఖ్యాపన మొనర్పఁబడినది.

లోచనము :— "యమకాదుల నిబంధనము" అనఁగా; "యమకప్రకారముల నిబంధనము" అని, యర్థము నెఱుఁగునది. ఆదిశబ్దమిచట ప్రకార వాచకము.

ప్రభా : - 'ఆదిశబ్దము - ప్రకారము - [ప్రభేదము] వ్యవస్థ, సమీపము, అవయవము. అను నర్థచతుష్కమును దెలుపును" అని మేధావిచెప్పుచున్నాఁడు." అని అభియుక్తోక్తి యున్నదిగదా!

లోచనము :— అప్రకారములు - దుష్కరములగు మురజ, చక్రబంధాదులు. [వృత్తియందు] శబ్దభంగశ్లేషమును జేర్కొనుటవలన, "శక్తినిడునీకున్" మున్నగు స్థలములయందగు నర్థశ్లేషము [అభంగశ్లేషము] దోషావహము కాదు. శబ్దభంగముచేతనగు శ్లేషమునందుఁగూడ - క్లిష్టమే - దుష్టము. కనుక, ['శోకము లేనివాఁడవు. అశోకమును మేయఁగలవాఁడవు,' అని, క్లిష్టతలేని యర్థముగలదియగు] "అశోక" ఇత్యాదులయందగు, శబ్దభంగశ్లేషముకూడ - దుష్టము కాదు.

ప్రభా : – అర్థశ్లేషమున, భంగముండదు. [విరుపుండదు] కనుక, నదియే - అభంగశ్లేషమని వ్యవహరింపఁబడును. అశోకపదము - రూఢిచేత అశోకమను వృక్షవిశేషమును - ['న + శోకము = అశోకము' అని] శబ్దమునందగుభంగమున నేర్పడునదియగు, యోగవ్యుత్పత్తిచేత - "శోకము లేనిది" అనునర్థమును - దెలుపునుగదా!. అశోకపదము - ఈయర్థద్వయము నిట్లు- క్లేశము లేకయే ప్రకాశింపఁ జేయుటవలన, శబ్దభంగశ్లేషముకూడ - క్లిష్టముకానపుడు- దుష్టముకాదు. "అది- క్లిష్టమగునపుడు - దుష్టమేయగును." విప్రలంభ శృంగారము- మిక్కిలిసుకుమారమగలది. కనుకనవి ప్రకాశింపఁజేయఁబడునపుడు, యమకప్రభేదములయందేదియుఁగూడఁ గూర్పఁదగినదికాదు.

అవ :— "అట్లయినయెడల, శృంగారాదులు - ధ్వనింపఁజేయఁబడునపుడు- దానినలంకరించునదియగు నలంకారమునెట్లు నిబంధింపవలయును ?" అను ప్రశ్నకు సమాధానము నిచ్చుచున్నాఁడు.

(45) మూలము :— ఈ యంశమున, [సర్వవ్యాపకముగ] ను — తెలుపఁబడుచున్నది.

[కా] రసాక్షిప్తతయా యస్య బన్ధః శక్యక్రియో భవేత్।
అపృథగ్యత్ననిర్వర్త్యః సోఽలఙ్కారో ధ్వనౌ మతః. (16)

కం॥ ఏది - రసాక్షేపముననె [రసావేశముననె]
సాధితమగు బంధమునఁబెనఁగు, యత్నమింతెం
డేదియులేకది యొప్పు, ర
సాదిధ్వనికది - యలంక్రియనఁ దెలియఁదగున్.

లోచనము :— యుక్తియనఁగా; "సర్వాన్వితమగు వస్తువు" అని యర్థము. మహాకవి-రససమవధానమున, విభావాదిఘటనమే, చేయుచుండునప్పుడు. [తద్ ఘటనా నిష్పాదకమగు యత్నముకంటె, వేఱుగాని, ప్రయత్నమునుండియే నిష్పత్తినొందునదియగు, నేయలంకారమును - [అహమహమిక] సమాపాదించునో, అదియే - ఈరసమార్గమునందలంకారమగును. కాని, పేరేడిదియు, నలంకారము-కాదు. కావున. నియమముగా నివియు [సంభోగ, విప్రలంభ, శృంగార రసముల యందేకాక] వీరాద్భుతాదులగు రసములన్నిఁటియందునుగూడ - కవికిని, [సహృదయ] ప్రతిపత్తకును, గూడ - రసవిఘ్నకారియే యగుచుండును.

ప్రభా :— "ప్రయత్న పురస్సరముగాఁగూర్పఁబడిన యమకాదికము-సర్వరసములయందును గూడ. కవి, సహృదయ, హృదయములయందభివ్యంజితమగు తదాస్వాదసుఖమునకు-విఘ్నమునే కలిగించును. కనుక, రసావేశసమన్వితుఁడును. రసాక్షేపణప్రయత్న సమంచితుఁడును, నగు మహాకవియొక్క వాగమృతమునుండి ప్రసరించిన యలంకారమే - ధ్వన్యమానములగు రసములన్నిఁటిని గూడ - అలంకారమగుచుండును", అనిభావము.

ప్రశ్న :— అయ్యా! కారికాకర్త - ఇంతకుముందు సంభోగశృంగారము నందును, విప్రలంభ శృంగారమునందును మాత్రమే - యమకాదినిబంధనము - ప్రమాదిత్వము నొసఁగుననిచెప్పెనుగదా! రసములన్నిఁటియందునుగూడ - యమకాదినిబంధనము - రసవిఘ్నకారియే యగునను నిది - దానికి విరుద్ధముగానున్నది. ఇది - మీమతమా? తన్మతమా?

ఉ :— ఇది - ధ్వనిసూత్రకృన్మతమే యగును. కనుకనే, మూపుతము కూడనగును. క్రింది లోచనమున సమీక్షించిన మీకేతెలియును.

లోచనము :— "గడ్డురికా ప్రవాహోపహత సహృదయ ధురాధిరోహణ విహీన లోకావర్జనాభిప్రాయముచేత మాత్రమే . [కారికాకర్తనగు నాచేత] "శృంగారమునందును, విశేషించి-విప్రలంభమునందును, యమకాదినిబంధనము-ప్రమాదిత్వము నొనఁగును" అనిచెప్పఁబడినది". అనునదియే - [సూత్రకర్త యొక్క] భావము. అదెట్లనిన : "కనుక నీయమక ప్రకారములకు, నేరసమునందు నంగభావము గలుగదు" అని ముందుచెప్పునుగదా!

ప్రభా : - "అవివేకులగు [పామరులగు] సామాన్యజనులును, వారి నానందింపఁజేయఁగోరిన కవిజనులును, యమక ప్రకారములయందుమిక్కుటమగు నభిరుచిని గలిగియుందురు. కనుక, లోచనకర్త - యిచట, మొదటి (గడ్డపు) మేకననుసరించి, వెళ్లనదియగు మేకలమందలవలె [గతానుగతికమగు] ప్రవాహముచేత, వివేకమును గోలుపోయిన, [తెలివిమాలిన] వారును, సహృదయతాగౌరవము నధిష్ఠింపలేనివారును, నగు (సామాన్య) లోకులను రంజించు నభిప్రాయముచేతనే - సూత్రకర్తనగు నేనుగూడ - తదితరరసములయందు - ఇంచుక, యమకాది ప్రకార నిబంధనము నంగీకరించి - శృంగారమునందును, విశేషించి, విప్రలంభమునందును, [మాత్రమే] యమకాది నిబంధనము - ప్రమాదిత్వము నొనఁగును" అనిచెప్పితిని. కాని, "యమకాదులను గూర్చునపుడు - పృథగ్యత్న ముండునెడల; అది - వీరరసమునందైననుగూడ - దోషమేయగును" [అది - రసాంగముకాదు.] అనునదియే - సూత్రకర్త యభిప్రాయమనిచెప్పి, దానికి ప్రమాణముగ, వృత్తికారకృతమగు పరికరశ్లోకము నొసఁగెను. దీనివలన "రసములు, వేనికినిగూడ-[పృథగ్యత్న నిష్పాద్యములగు]యమకాదులంగములుకావు" అనునంశము - వృత్తికారుని కభిమతమను నంశము - సిద్ధించుచున్నది. ఇచట లోచనకర్త- కారికాకర్తయభిమతమును స్పష్టీకరించుటకు, కారికా కారకృతమగు కారికనింకొకదాని నుదాహరింపక, వృత్తికారుని వాక్యము నుదాహరించుటవలన కారికాకార, వృత్తికారులొక్కరేయని తోచును "నోఽలంకారో ధ్వనౌమతః" అను మీఁది కారికయందు ["ధ్వనౌ"] "ధ్వనియందు" అని సామాన్య నిర్దేశము నొనర్చి, "శృంగార, విప్రలంభ ధ్వనియందు" అను విశేష నిర్దేశము నొనర్పకుండుటవలన సూత్రకారునికిఁగూడ - పృథగ్యత్న నిష్పాద్యములగు నీయమక ప్రకారములు - వీరసమునందునుగూడ - అంగములు గావనుట-సిద్ధాంతమేయని సిద్ధాంతీకరింపవచ్చును. ప్రత్యేకప్రయత్నమునఁ గూర్పఁబడని యమకప్రకార

ములుమాత్రము- తదితరరసములకు [వ్యంజకములై] అంగములగు నలంకారము లగునట్లు, సంభోగ శృంగార, విప్రలంభ శృంగారములకుఁగూడ - అంగములగు నలంకారములు కావచ్చును. సంభోగ శృంగారమునందును, విశేషించి - విప్రలంభమునందును, సౌకుమార్యము క్రమముగా నతిశయించునది యగుటవలన, నవి- ధ్వనింపఁజేయఁబడునపుడు, యమకాది నిబంధనము - ప్రమాదహేతువు. కనుక, కవికెంతశక్తియున్ననుగూడ, నచట జాగరూకుఁడై యుండవలయును'' అని యుపదేశింపఁబడినది.

అవ :— వృత్తికారుఁడు కారికార్థమును దెలుపుచున్నాఁడు.

(46) మూలము :— "నిష్పత్తియగునపుడు - ఆశ్చర్యభూతమయినను, ఏయలంకారము-రసాక్షేపణముచేతనే శక్యమయిన కూర్పుగలది యగునో, ఆయలంకారము - అసంలక్ష్యక్రమవ్యంగ్యమగు, నీ [రసాది] ధ్వని కలంకారమగును" అనునది-మూమతము. [ఇట్లు రసాదితాత్పర్యమున నేర్పడిన]ఆయలంకారమే-ముఖ్యముగా రసాంగమగును.

లోచనము :— ''నిష్పత్తియగునపుడు'' అనఁగా; ''అలంకారము-దాని నిష్పత్తి కనుకూలమగు వేరొక యత్నమున పేక్షింపకున్ననుగూడ, [కవిగత] ప్రతిభానుగ్రహమువలన స్వయముగనే, [తనంతతానే,]జనించునపుడు,''అనియర్థము ''ఆశ్చర్యభూతమయినను'' అనఁగా; ''ఇది - యెట్లు నిబంధింపఁబడినది.'' అని. అద్భుతస్థానమయినను'' అనియర్థము,

ప్రభా : అవ :— కవికి రసాక్షేపణముకంటె, నితరమగు ప్రయత్నము లేకున్నను, ఆకస్మికముగాఁ బ్రసరించినదియు, రసవిఘ్నకారి-కానిదియు, రసాంగమగునదియు, నగు నలంకారమును - ఉదాహరించుచున్నాఁడు. ఇది - ప్రణయకుపితయగు ముగ్ధనాయిక ననుయించుచున్న రసిక ప్రియునిమాటః.

(47) మూలము :— ["ఇది-కలువతీగ" అను క్రొత్త పేరుగల జాతీయపద్యము. ఖండగతిగలది. ఆంధ్రీకృతికర్తచేత- క్రొత్తగాఁ బ్రసారితము.]

బాల! పాణితలమ్ము రాయిడి - కపోలములం,
పత్త్రాళి మాయించె, నదె-కొంటివే!
వ్రాలి, నిట్టూర్పులీ - యమృతహృద్యమౌ, మోవి
రసమునంతను గ్రోలినవి, వింటివే!
వాలుగ, గళమ్మెనసి, వీలుగనురమ్మొరసి,
బాష్పమవి యూపుచున్నది, కంటివే!
మేలెఱుంగనిదాన, నీకుమన్యువె - ప్రియ
మ్మే? మమ్మ, ప్రియుఁడు' కాఁడనుకొంటివే!

ప్రిభా :— దీనికి మూలమగు శ్లోకమిట్లున్నది.

కపోలేపత్త్రాళీ కరతల నిరోధేన మృదితా
నిపీతోనిశ్వాసైరయమమృత హృద్యోఽధరరసః।
ముహుః కణ్ఠేలగ్నస్తరళయతిబాష్పః స్తనతటమ్,
ప్రియోమన్యుర్జాత స్తవ,నిరనురోధే! నతువయమ్।.

ఆంధ్రికృతిరూపమగు మీఁది నవ్యపద్యమునందలి ప్రతిపాదమునందును గూడ - ఐదేసిమాత్రిలుగలగణము లేడును, చివరనొక గురువును, నుండును. చివరి గురువుయొక్క కాలమును మూడు మాత్రిలకాలము పొడిగించి చదువవల యును. ప్రితిపాదమునను నాలుగవ గణముమీద - వడి- యుండును.

(ఇది - ప్రిథమ ముద్రిణమునందలి యాంధ్రికృతి ననుసరించిన) పాఠాం తరము.

"పాణితలమునొరసి, పాలబుగ్గలనున్న
మృదుల పత్త్రిరచన - మృదితయయ్యె
అమృతహ్లాద్యమకట! అధరరసమ్మిది,
దీని నిడుదయూర్పులానె నిపుడె."

"అదిగో! కంఠలగ్నమైనదా బాష్పము
స్తనతటమ్ముఁ - దరళితమునొనర్చు,
నిరనురోధురాల! నీకల్లమన్యువే
ప్రియము [ప్రియుఁడు] గాని, నేను-"ప్రియుఁడఁగానే?" అనునది.

లోచనము :— [ఇచట, ప్రణయకుపితయగు నాయిక] కరకిసలయన్య స్తవదనయు, శ్వాసతాంతాధరయు, ప్రవర్తమాన బాష్పభరనిరుద్ధకంఠియు, అవిచ్ఛిన్నరుదిత చంచత్ కుచతటియు, నయి- రోషమునుజ్జగింపనిదై-యున్నది, ఆమెను [అట్టినాయికనిచట, కవిచేత నిబంధింపఁబడిన వక్తయగు నాయకుఁడు-] చాటూక్తిచేత -[ప్రియాలాపములచేత] ప్రసాదింపఁ జేసికొనుచున్నాఁడు. ఎంత వఱకు నతఁడిట్లామానినిని బ్రసన్నగాఁ జేసికొనుచున్నాఁడో, అంతవఱకును, ఈర్ష్యావిప్రలంభ గతములగు ననుభావముల చర్వణయందు [మాటిమాఁటికి నను సంధించుటయందు] ఏకాగ్రమగు చేతముగల, వక్తనుండి [కవినుండి, లేక, కవిని బద్ధుఁడగు నాయకునినుండి,] ఏయత్నమును లేకయే, యుదయించినవగు, నీశ్లేష, రూపక, వ్యతిరేకాదులగు నలంకారములు-ఆస్వాదించువాఁడగు సహృదయునకుఁ గూడ - రసాస్వాద విఘ్నము నొదవించునవి కానేరకున్నవిగదా !.

—* ఇచటనున్న గుప్తలోచనాశయ ప్రసారము *—

ప్రభా :— ''నాయకుఁడు - పొలయలుకనొందిన, ప్రియురాలిని లాలించుటకీమాటలననెను. ప్రణయకోపమునందిన యతని ప్రేయసి - ముగ్ధయగు తరుణి. ఆరమణి - కెంజిగుళ్లవంటి నిజపాణులమీఁద మొగమునుంచుకొన్నది. అదిచూచి, ఆమెప్రియుఁడనుచున్నాఁడు. ''అయ్యో! బాలా! మన్యుప్రేరితమగు కరతలము - నీబుగ్గమీఁద - నేను రచించిన పత్రాళిని- [గంధఁపుఁబూతను] చెరిపి వైచినదిసుమా''. అని. ఆలలన - కెమ్మోవి- నిట్టూర్పులచేత వాడినది. దానినిగని, తత్ ప్రియుఁడనుచున్నాఁడు ''అయ్యో! అమృతమువలె, తీయనిదగు, నీయధర రసమును - మన్యుకృతములగు నిశ్వాసములు - పూర్ణముగా [నాకు మిగుల నీయక] క్రోలుచున్నవే!''అని, ఆసుందరి-ఏడుపురాగమును సాగఁదీయునపుడు- దొరలిన కన్నీటివెల్లువ - యాకలకంఠి, కంఠధ్వని నడ్డగించునపుడు- మిటారించు చున్న, స్తనతటినిగని- ఆరసికుఁడనుచున్నాఁడు. ''బాలా! మన్యుజనితమగు బాష్పము - నీచనుగవయంచుల నెట్లు కదలించుచున్నదో చూచినావా?'' అని. ''ఓనిర్దయురాలా! నీకు - నిజవృత్తిచేత - నిన్నిట్లుబాధించుచున్న మన్యువే- [మాన జనితమగు కోపమే] ప్రియము. [ప్రియుఁడు.] కాని, నిన్నిట్లు లాలించుచున్న, నేను ప్రియుఁడనుగానా?'' అని. పైఁదఁదెలుపఁబడిన వాక్యములయందు- చేతుల పైని-చెక్కిలనుంచుట, నిశ్వసించుట, కన్నీటినిదొరలించుట, అనునవి-యీర్ష్యా విప్రలంభమునకు సంబంధించినయనుభావములు. ఈయనుభావములను స్వభావన లోనాస్వాదించుచున్న కవిముఖమునుండి- లేక, చూచి, వెతనొందుచున్న కవిని బద్ధవక్తయగు నాయకుని ముఖమునుండి- ఇచట, శ్లేష, రూపక, వ్యతిరేకాదులగు

నలంకారములప్రయత్నముగనే వెలువడినవి. కనుక, సహృదయులకిచట, రసాస్వాదమునకెట్టి విఘ్నమును గలుగుటలేదు. అధరరసము - అనుచోనున్న, రసశబ్దము - ఆస్వాద్యమున్న, మాధుర్యమును, గూడఁదెలుపును. కనుక, నిచట శ్లేషమలంకారము. 'మన్యువే - ప్రియుఁడు.' అనుచోట రూపకమలంకారము, దీనిచేత - "ఆమన్యువను ప్రియుఁడు - నాయందీసుఁగొని, కరతల నిరోధమున, చందన పత్త్రరచనను జెరిపి, అధరరసము నాస్వాదించి, సాత్త్వికానుభావమగు బాష్పరూపమున స్తనయుగళీ తటముల నూపుచున్నాఁడు" అనునర్థమేర్పడుచున్నది. మీఁదియర్థమును- మన్యు [కోప] పరముగను, మన్యువను పేరుగల ప్రియుని పరముగను, సమన్వయించుటకు వీలగుచున్నది. కనుక, నిందు - అర్థశ్లేషముకూడనున్నది. "నేనుప్రియుఁడనుగానో" అనుచోట- వ్యతిరేకమలంకారము. ఈయలంకారము లన్నియుఁగూడ - ఇచట, ప్రధానమగు నీర్ష్యావిప్రలంభశృంగారధ్వని నలంకరించుచున్నవి." అనునది - ఇచటనున్న గుప్తలోచనాశయమని తెలియునది.

(48) మూలము :— అలంకారము - తాను రసమునకంగమగుటయందు వ్యాపకమగు లక్షణము- తాను వేఱొక యత్నములేకుండ నిర్వర్తింపఁబడుటయే యగును. కనుక, రసమును నిబంధించుట కధ్యవసితుఁడగు కవి - రసబంధాధ్యవసాయసంబంధిని యగు వాసనను బూర్ణముగావిడిచి- వేఱొకయత్నమునఁ బ్రవర్తించునపుడు, నిష్పన్నమగు నలంకారము - రసాంగము- [రసమునకంగము] కాదు.

లోచనము :— "లక్షణమనఁగా; వ్యాపక"మని యర్థము.

ప్రభా :— ఇచట "జ్ఞాపకమనియర్థము" అని లోచనమునందుండఁదగునని కొందఱు చెప్పుచున్నారు. "వేరొకయత్నము లేకుండ నిర్వర్తింపఁబడిన యలంకారమే - రసమున కంగమగును." అనునది-ఫలితార్థము.

(49) మూలము :— కావున, (శబ్దాలంకారమగు) యమకము - ప్రబంధముచేతఁ గావింపబడునపుడు - బుద్ధిపూర్వకముగా శబ్దవిశేషాన్వేషణరూపమగుయత్నాంతరమును(వేఱొకయత్నమును)

దప్పక పరిగ్రహింప వలసివచ్చును.

లోచనము :— బుద్ధిపూర్వకత్వము - అవశ్యంభావియగు యత్నాంతర మునకు సంబంధించినది. కనుక, "బుద్ధిపూర్వకముగా" అనునది 'ప్రబంధము చేత' అనుదానితోడి యన్వయము నొందింపఁదగినదికాదు. "యత్నాంతరము" అనఁగా; రసమునందలి యేకాగ్రతకంటె వేఱగుయత్నము.

(50) మూలము : – "అలంకారాంతరములయందుఁగూడ- [ శబ్దాలంకారములకంటె, వేఱగు-అర్థాలంకారములందుఁగూడ ] యత్నాంతర పరిగ్రహము-తుల్యమేయగును" అనునెడల, నది యట్లుకాదు. అలంకారాంతరములు - [తదితరములగు నర్థాలంకార ములు-] దుర్ఘటనములుగా నిరూపింపఁబడఁదగినవియైనను, రససమా హిత చేతస్కుఁడును, ప్రతిభాయుక్తుఁడును,నగు కవినుండి, అహం పూర్వికతో పరాపతితములగుచుండును.

లోచనము :— "(అర్థాలంకారములుకూడ) దుర్ఘటనములుగా నిరూపిం పఁబడునవియైనను," అనఁగా; "బుద్ధిపూర్వకముగా నొనరించుటకు శక్యములు కానివిగా నిరూపింపఁబడునవైనను," అనియర్థము. మఱియు, నిరూపింపఁబడు నపుడు (కవికి) దుర్ఘటనములును, "ఇవి - యెట్లు రచింపఁబడినవి?" అని విస్మ యావహములును, నగునవైనను, అనియర్థము. "అహంపూర్వికతో" అనఁగా; "ఒకదానికంటె నింకొకటి ముందుగా" అనిభావము. "నేనుముందు ప్రవర్తించె దను. నేనే ముందు ప్రవర్తించెదను"అనియర్థము. "అహంపూర్వ శబ్దముయొక్క భావము- అహమ్ పూర్వికి. అహమను నిపాతము- అస్మదర్థవృత్తియగు విభక్తి ప్రతిరూపకము.

ప్రభా :— శబ్దాలంకారములవలె ఉపమాదులగు నర్థాలంకారములుకూడ, కవికి దుర్ఘటనములుగనే నిరూపింపఁబడఁదగియున్నవి. అయినను, రసైకతానహృ దయుఁడును, ప్రతిభాన్వితుఁడును, నగు కవినుండి, యీయలంకారములు నేను ముందనిన, నేనుముందని, వాదులాడుకొని యుదయించినవివలె జనించును. ఇట్లివి నిష్పత్తినొందినపిమ్మట-విచారించునపుడు, దుష్కరములుగా భాసించుచున్నను, ఇవి - యెట్లు రచింపఁబడినవి ? అని కవిసహృదయుల కాశ్చర్యము నొదవించును. అర్థాలంకారములిట్లు నేనుముందనిన నేనుముందని వచ్చిపడుటకు హేతువు -

"ప్రతిభాన్వితుఁడగు కవికిఁగల రసబంధాధ్యవసాయము నందలి యావేశమే యగును." అనునది ఫలితార్థము.

అవ :— రసావేశవివశుఁడగు కవినుండి ప్రయత్నములేకయే యుపమాదులగు నర్థాలంకారములహంపూర్వికతో ప్రసరించుట కుదాహృతులను జూపుచున్నాఁడు.

(51) మూలము : అదెట్లనిన :— కాదంబరియందు - కాదంబరీ దర్శనావసరమునందును, సేతువునందు - మాయారామాది శిరోదర్శనముచేత - విహ్వలయగు సీతాదేవి యొనరించిన, విలాపమునందును, జూచునది.

ప్రభా :— బాణమహాకవికృతమగు కాదంబరీకథాకావ్యమునందు చంద్రాపీడుఁడు - కాదంబరిని జూచునపుడు పూర్వార్థోపాంతమునందును, ప్రవరసేనకృతమును, ప్రాకృతమయమును, నగు సేతుబంధమహాకావ్యమునందలి యేకాదశాశ్వాసకమున - మేఘనాథుని మాయచేత ఛేదింపఁబడి, చూపఁబడిన, మాయారామాది శిరస్సునుజూచి, సీతాదేవికావించిన విలాపమునందును, తత్కవివాక్కుల నుండి-యహంపూర్వికతో ప్రసరించిన యలంకారములు-రసాంగములై యున్నవి.

(52) మూలము : - ఇది-యుక్తమేయగును. ఏలయనిన, రసములు - వాచ్యవిశేషములచేతను, [విభావాదులగు నర్థముల చేతను]మఱియు,తత్ప్రతిపాదకములగు శబ్దములచేతను,మాత్రమే, ఆక్షేపింపఁదగినవి [స్ఫురింపఁజేయఁదగినవి.] గదా! రసప్రకాశకములగు నావాచ్యవిశేషములే - రూపకాదులగు నలంకారములగుచున్నవి. కనుక, రసాభివ్యక్తియందవి - బహిరంగములు (వెలుపలియంగములు)కావు. యమకాదులగు దుష్కరమార్గములుమాత్రము-బహిరంగములగుట తప్పనిదేయగును.

లోచనము :— "ఇది - యుక్తమే" అనఁగా; "అహంపూర్వికతోవచ్చిపడుట - యుక్తమే" అనియర్థము.

ప్రభా :— "వాచకశబ్దముచేతఁ దెలుపఁబడునదియగు నర్థము-వాచ్యము.

చానియందగు విశేషము - వాచ్యవిశేషము. అది - విభావాదిరూపము. వాచ్యవిశేషములగు నీవిభావాదులచేతనే - రసములు- స్ఫురింపఁజేయఁబడును. రసప్రకాశనపరములగు రూపకాద్యలంకారములుకూడ-వాచ్యవిశేషములే యగుచున్నవి రసాభిష్టుఁడగు కవినుండి, అవి- అపృథగ్యత్నముగనే ప్రసరించును. కనుక రసావేశమున పరాపతితములగు నర్థాలంకారములగు రూపకాదులు - రసవ్యంజనమున నంతరంగములేయగును. శబ్దాలంకారములగు యమకాదులు - రసావేశముచేతఁగాక, ప్రయత్నవిశేషముచేతనే సాధింపఁబడును. కనుకనవి - దుష్కరములు. కనుకనే, బహిరంగములు కాకతప్పదు.'' అనునది ఫలితార్థము.

**(53)** మూలము : — అయినను [కాళిదాసాదికృత కావ్యములయందు] యమకాదులు కొన్ని - రసవంతములుగాఁజూడఁబడుచున్నవి. కాని, యచ్చటరసాదులంగములే [అప్రధానములే]యగుచుండును. యమకాదులో [అంగులు-కాఁ గూడనివైనను] - అంగులగును.[ప్రధానములగును] రసాభాసమునందు మాత్రము - [ఈ యమకాదులు] అంగములగుటకూడ-విరుద్ధముకాదు. యమకాదులు- పృథక్ ప్రయత్నముచేతనే నిర్వర్తింపబడును. కనుక, అంగిగా వ్యంగ్యమగు రసమునందు మాత్రము - అవి యంగములగుట యుక్తముకాదు.

లోచనము :— ''కొన్ని''అనఁగా; 'కాళిదాసాదికృతములు' అనియర్థము.

ప్రభా :—. కాళిదాసాదులచటనచట, స్వసామర్థ్య ప్రకటనముకొఱకు యమకాదులను రచించియున్నారు. అవి - రసవంతములుగాఁ దోచుచుండును. కాని శృంగారాదిరసమంగిగానుండునపుడు సంఘటింపఁబడిన, యీయమకాదులు ప్రధానమగు నారసమున కంగములుగా నుండవలసినను , ప్రధానముకంటె, తామే -చమత్కారకారులగుటవలన, నంగములుగానుండక, అంగిత్వము నొందునవియగును. అంగిగానుండవలసిన రసమచట, నంగముగావలసివచ్చును. కనుక, శృంగారాది రసమంగియగునపుడు-యమకాదులనొనర్పఁగూడదు. రసాభాసమున నంతసౌకుమార్యముండదు. కనుక, నచట, యమకాదులుకూడ నంగములుకావచ్చును. కావున శబ్దార్థాలంకారములకు రసాద్యంగత్వమును జెప్పునదియగుపూర్వగ్రంథమునకిది విరుద్ధముకాదు.

ప్రభా : అవ ;— వృత్తికారుఁడగు నానందవర్ధనుఁడీయర్థము నుసంగ్రహించునవియగు శ్లోకములను మూఁడింటి నిట్లురచించెను.

రసవన్తి హి వస్తూనిసాలఙ్కారాణికానిచిత్
ఏకేనైవ ప్రయత్నేన నిర్వర్త్యన్తే మహాకవేః. (౧)

యమకాది నిబన్ధేతు పృథగ్యత్నో ఽస్యజాయతే
శక్తస్యాపి రసేఽఙ్గత్వం తస్మాదేషాం నవిద్యతే (౨)

రసాభాసాఙ్గ భావస్తుయమకాదేర్నవార్యతే
ధ్వన్యాత్మభూతే శృఙ్గారే త్వఙ్గతానోపపద్యతే'' అని. (౩)

కనుక, నివి - సంగ్రహ శ్లోకములు.

(54) మూలము :— ఈయర్థము- [మీఁది సంగ్రహశ్లోకములందుఁగలది-]క్రింది పద్యమున సంగ్రహింపఁబడుచున్నది.

సీ॥ రసవంతములును సాలంకారములునై
సొంపారుచుండు వస్తువులు కొన్ని
ఒకటేయగు ప్రయత్నమూనియున్నను, మహా
కవినుండి నిష్పత్తిఁగనుచునుండు;
యమక ప్రముఖ నిబంధమునందో, శక్తుని-
కైనఁబ్రత్యేక ప్ర-యత్నమొదవు.
కనుక, నీయమక ప్రకారమ్ములకు, నేర
సమునందు సంగభావము కలుగదు.

గీ॥ అట్లయినను రసాభాసమందునీప్ర
కారముల కంగభావమ్ము కలుగవచ్చుఁ;
గాని, ధ్వన్యాత్మభూత శృంగారమందు
సంగభావ మభావ్యమీ యమకములకు.

లోచనము :— ఈప్రకారములకనఁగా; యమకాదులకనియర్థము.అదియే-

ప్రధానము, కనుక, ధ్వన్యాత్మభూతమగు(ప్రధానమగు శృంగారమునమాత్రము-యమకాదికమున కంగత్వముండదని పద్యార్థమున సంగ్రహింపఁబడినది.

(55) మూలము :— ఇప్పుడు - ధ్వన్యాత్మ భూతమగు శృంగారమునకు వ్యంజకమగు నలంకారవర్గ మాఖ్యానింపఁబడును.

లోచనము :— "ఇప్పుడు" అనఁగా; "హేయవర్గము - చెప్పఁబడినది. కాని, ఉపాదేయవర్గము-చెప్పఁదగియున్నది కనుక" అనిభావము "వ్యంజకమగు నలంకారమాఖ్యానింపఁబడును." అనఁగా; ఏయలంకారమెట్లు వ్యంజకమగునో, ఆయలంకారమట్లు తెలుపఁబడును." అను నధ్యాహారముతోఁగూడిన యర్థము నెఱుఁగునది.

(56) మూలము : —

[కా] ధ్వన్యాత్మభూతే శృఙ్గారే సమీక్ష్యవినివేశితః।
రూపకాదిరలఙ్కారవర్గ ఏతియథార్థతామ్. (17)

కం॥ శృంగార రసమ్మ - ధ్వనిం
పంగ - సమీక్షించి, తన్నిబద్ధములగుచుం
డంగ నుపమాద్యలంకృతు
లంగూర్ప, యథార్థతను జెలంగున వెల్లన్.

లోచనము :— "యథార్థత" అనఁగా; చారుతాహేతుత్వము. [సౌందర్య కారణమగుట.]

(57) మూలము : — రూపకాద్యలంకారము - బాహ్యమగు నలంకారముతోడి సామ్యమువలన, అంగికి(రసాదికమునకు) సౌందర్యహేతువుగాఁ జెప్పఁబడుచున్నది. [ప్రాచీన సాహితీశాస్త్రకారులగు భామహాదులు] రూపకాదులగు నలంకారములను గొన్నిఁటిని దెలిపిరి. [ప్రతిభ కంతముండదు. కనుక,] అలంకారము

కంతముకలుగదు. కనుక, ముందురాఁగల యాలంకారికులు కొందఱు- మఱికొన్నిఁటిని దెలుపుదురు. ఆయలంకార వర్గమంతయుఁగూడ సమీక్షించి వినివేశింపఁబడునెడల, అంగియగు నసంలక్ష్యక్రమవ్యంగ్య ధ్వనికది - చారుత్వహేతువుగా నిష్పన్నమగును.

లోచనము :— "తెలిపిరి" అనఁగా; "భామహాదులగు నలంకారలక్షణ కారులు - తెలిపిరి" అనియర్థము. ముందుచెప్పఁబడుటకు హేతుపు - "అలంకారములకు తెంపులేకుండుట" అని చెప్పఁబడినది. "ప్రతిభ - అనంతము. కనుక, భామహాదులకంటె నితరులగు, భవిష్యదాలంకారికులచేతఁ గూడ-మఱికొన్నియలంకారములు - చెప్పఁబడును." అనియర్థము.

(58) మూలము :— ఇది - [అంగియగు రసాదిధ్వనికంగములగునట్లు] రూపకాదులను వినివేశించుట యందగు సమీక్ష.

[కా] వివక్షాతత్పరత్వేన నాఙ్గిత్వేనకదాచన।
కాలేచగ్రహణత్యాగౌ, నాఽతి నిర్వహణైషితా. (18)
నిర్వ్యూఢావపి చాఙ్గత్వేయత్నేన ప్రత్యవేక్షణమ్।
రూపకాదేరలఙ్కార వర్గస్యాఙ్గత్వ సాధనమ్. (19)

సీ॥ రస తత్పరముగా నలంకారమును వివ
క్షింపంగవలయు, నంగిగ వివక్ష
జరుపరాదెప్పుడును, సమయమేతెంచు న
ప్పుడె, యలంకారమ్ముఁ బొందుపఱుప
వలయు, నవసరమ్ము కలిగిన యప్పుడు -
విస్తరింపక దానివిడువవలయు;
అతినిర్వహణ వాంఛ నందుటకూడదు;
నిర్వహణేచ్ఛ సంధిల్లునపుడు-
గీ॥ యత్నమునను రసధ్వని కంగములుగ
ప్రత్యవేక్షింపవలయు; రూపకముఖమ్ము

లగు నలంక్రియలు - రసాంగమగు సమీక్ష
నందు సాధనమిది - విజ్ఞులరయవలయు.

లోచనము :— "సమీక్షించి" అనుశబ్దముచేత-17వ కారికయందుఁదెలుపఁబడిన సమీక్ష-ఇచటఁదెలుపఁబడినది. [కారికారూపమగు] మొదటి సంస్కృత శ్లోకమునందలి పాదములు నాల్గింటియందును, రెండవదియగు శ్లోకార్థమునందును, రూపకాద్యలంకారవర్గము - రసాంగమగుటకుఁగల సాధనమిట్లు చెప్పఁబడినది. [మహాకవి-] (1) ఏయలంకారమును, రసమున కంగముగా వివక్షించునో, (2) అంగిగా వివక్షింపఁడో (3) దేనినవసరమున గ్రహించునో, (4) దేనినవసరమున త్యజించునో, (5) దేనినత్యంతముగా నిర్వహింపఁగోరఁడో, (6) దేనినియత్నము చేత రసమున కంగమగునట్లు ప్రత్యవేక్షించునో, యట్లుపనిబంధింపఁబడునదియగు నాయలంకారమే- రసాభివ్యక్తి హేతువగుననునది-వితతమగు (పూర్ణమగు) మహావాక్యము.

ప్రభా : అవ :- అలంకారములను సమీక్షించుట కుదాహరణావకాశమును దెలిపి, యుదాహరించి- సమీక్షాలక్షణమునందు యోజించి, సమర్థించి, నిరూపించుటకు, వృత్తికారుఁడు - వృత్తియగు నాలోకమును బ్రసరింపఁ జేయుచున్నాఁడు.

(59) మూలము : - రసబంధములయందు మిక్కుటమగు నాదరముఁ గలకవి - అలంకారమును రసమున కంగముగా వివక్షించును.

దీనికుదా :— [శకుంతల నభిలషించుచున్న దుష్యంతుఁడు ఆశకుంతల ముఖారవిందము చెంతఁజేరి, తిరుగుచున్న తుమ్మెదను ద్దేశించి యనుచున్నాఁడు.]

మ. సతమున్ జంచదపాంగ,వేపథుమతిన్,స్పర్శింతు-తద్దృష్టి; నా
శ్రుతిచెంతన్ నినదింతుమెల్లగ రహస్యోక్తి బ్రియున్బోలె; తద్
రతిసర్వస్వము,మోవిఁగ్రోలెదవు, హస్తమ్ముల్ విదల్పన్;మధు
వ్రత! నీవేకృతి;వేమిటఁ- హాటుల;మారా! తత్త్వచింతాదృతిన్.

మీఁది పద్యమునందుఁగల భ్రమరస్వభావోక్తి - రసానుగుణ మగు నలంకారమేగదా!

లోచనము :— ఓ మధుకర! (మధువ్రత!) మేము - ఏవంవిధాభిలాష చాటు ప్రవణులమైనను, తత్త్వము నన్వేషించుటవలన-వస్తువృత్తము వెదుకఁబడు నపుడు,హతులము = ఆయాసమాత్రమునకు పాత్రములుగాఁజేయఁబడినవారలము గానైతిమి. "త్వంఖలు" అనుచోనున్న నిపాతముచేత "[నీవే" అనుచోనున్న యేవకారార్థకముచేత] "నీవేచరితార్థుఁడవు" అని, శకుంతలనుగూర్చి యభిల షించు దుష్యంతునిమాట - యిది. అదెట్లనిన; "మేము - ఈలలితాంగి కటాక్ష గోచరులమెట్లగుదుము ? అస్మదభిప్రాయ వ్యంజకమగు రహోభాషితము నీమె యెట్లు వినఁగలుగును ? ఈమె యిచ్ఛగింపకున్ననుగూడ - హఠాత్తుగా నీమె మోవిని మేమెట్లుపరిచుంబింపగలము?" అని మామనోరాజ్యపదవినధిష్ఠించుచున్న యభిలాషము - నీకప్రయత్నముగనే సిద్ధించినది." [అను నది - యిచట దుష్యం తుని యభిప్రాయమగుచున్నది,] భ్రమరమునీలోత్పలశంకాకారిణియగు శకుంతల దృష్టినే - కల్లకలువయను బుద్ధిచేత (భ్రాంతిచేత) మాటిమాటికిని స్పృశించు చున్నది. ఆమెనేత్రములు - [ఆకర్ణాంత విశాలములు కనుక] శ్రవణావకాశ పర్యంతములగుటవలనను, "ఆకన్నులు - కలువపూవులు" అనుశంక (దాని కింకను) తొలఁగకుండుటవలనను, ఆమధుకరము - ఆసుందరి చెవిచెంతనేధం ధన్యమానయగుచున్నది, (ఝుమ్మని ధ్వనిచేయుచున్నది.) మఱియు, సహజ సౌకుమార్యత్రాసముచేత కాతరస్వభావముగల, శకుంతలకు సంబంధించినదాని నే- రతినిధానభూతమునే - వికసితారవింద, కువలయామోద మధురమునే - అధర మునుగూడ - ఆస్వాదించుచున్నది. కనుక, భ్రమరస్వభావోక్తియగు నీయలంకా రము - ప్రకృతమగు (అభిలాష విప్రలంభశృంగార) రసమునకు - అంగత్వ మునే పొందుచున్నది. మాకంటె నితరులగు కొందఱుమాత్రము- "భ్రమరస్వభా వోక్తి" అనువృత్తి వాక్యమునకు - "భ్రమరస్వభావే - ఉక్తిర్యస్య, సః = భ్రమ రస్వభావోక్తిః"అని, ["భ్రమరస్వభావమునందుక్తిగలది" అనువ్యుత్పత్తినిగొని] ఇచట, భ్రమరస్వభావోక్తి- [అనఁగా; భ్రమరస్వభావమును దెలుపునది] రూపక వ్యతిరేకమని (రూపకసహితమగు వ్యతిరేకమని) చెప్పుచున్నారు,

ప్రభా :— "భ్రమరమునందు నాయకత్వము నారోపించుటవలన రూప కము, ను, ఉపరిపాదమున "నీవేకృతివి - మేము - హతులము." అనుచోట విశే

షమును దెలుపుటవలన-వ్యతిరేకమును, నిచట భ్రమగస్వభావమును దెలుపుటవలన-కొందఱిచట - రూపకసహితమగు వ్యతిరేకమలంకారమని చెప్పుచున్నారు. కాని, యిచటనున్నది - సమాసోక్తి సహితమగు వ్యతిరేకమేకాని, రూపకసహితమగు వ్యతిరేకముకాదు'' అను నభిప్రాయమును, ''అన్యులు'' అనుదానిచేత- లోచన కర్త - సూచించినట్లగపడుచున్నది. అయిన నిచట మొదట - స్వభావోక్తియే-ముందుగాఁ బ్రకాశించుచుండుటవలన, లోచనకర్త - యిచట, స్వభావోక్తిని మాత్రమే - అలంకారముగాఁ దెలిపెనని గ్రహింపవలయుననితోఁచెడిని. ఇందలి యలంకారమేదియయినను, నిచట భ్రమరకృతమగు నీచేష్ట - కామోద్దీపకమగుట వలన పరిష్కృతమగు నభిలాష శృంగారమునకది - అంగమేయగును.

(60) మూలము :— "అంగిగ వివక్షజరుపరాదెప్పుడును" అనఁగా; అలంకారమును ప్రధానముగా వివక్షింపఁగూడదు" అని తెలుపఁబడిన సమీక్షాసాధనమునకు విరుద్ధముగా; ఒకానొకప్పుడు - రసాదితాత్పర్యమున వివక్షితమగు నలంకారముకూడ- ఒకానొకటి-అంగిగా వివక్షింపఁబడుట - కాన్పించుచున్నదిగదా। దీనికుదా :—

గీ॥ చక్రవిశసనమను హతాజ్ఞనె యెవండు
రాహుకాంతా జనమునకు రతమహమ్మ-
ప్రముఖ పరిరంభ సువిలాసవంధ్యముగ, స
సారచుంబనమాత్ర శేషముగఁ, జేసె.

ఇచ్చట (కవికి) రసాదితాత్పర్యమున్నను, పర్యాయోక్తమే-అంగిగా - (ప్రధానముగా) వివక్షితముగదా।

ప్రభా :— ''వాసుదేవుఁడు - రాహువుయొక్క శిరస్సును ఛేదించెను.'' అనునది - యిందలిభావము.

శ్లో॥ చక్రాభిఘాతప్రసభాజ్ఞయైవ, చకారయోరాహు వధూజనస్య।
ఆలిఙ్గనోద్దామ విలాసవన్ధ్యం రతోత్సవం చుమ్బనమాత్రశేషమ్।.

అనునది - మీఁది యాంధ్రకృతికి - మూలము.

లోచనము :— చక్రాభిఘాతమేయగు [చక్రముచేతఁజంపుటమేయగు] హఠాజ్ఞనె = అలంఘనీయమగు నియోగముచేతనే, ఎవఁడు - (ఏవిష్ణువు)రాహు దయితల, రతముహమును - (రతోత్సవమును) చుంబనమాత్రశేషముఁగొనర్చెనో. ఏల? అరతోత్సవము - ప్రముఖమగు పరిరంభముగల [ఆలింగనము ప్రధానము గాఁగల] యోగ్యములగు విలాసములయందు వంధ్యమై, అనఁగా; శూన్యమై, యున్నది. కనుక, రాహువుయొక్క ప్రియురాండ్ర రతోత్సవము - చుంబనము మాత్రమే - శేషముగాఁగలదియగుచున్నది. (అనిచెప్పఁబడినది.)

ప్రభా :— భారతీయ జ్యోతిశ్శాస్త్రమున-భూచ్ఛాయయే రాహువని చెప్పఁబడినది. అయినను, కథారూపమున, సూర్యచంద్ర గ్రహణములను బోధించుటకు పురాణములయందు "అమృతమునుద్రావుచున్న రాహువుయొక్క శిరస్సును-విష్ణువు, చక్రముచేత ఖండించునపుడది-రెండుఖండములైనట్లును, అందు-శిరస్సు రాహువుగను, మొండెము, కేతువుగను, నయినట్లును దెలుఁపబడినదిగదా! దాని ననుసరించి, విష్ణువు - చక్రాభిఘాతమను దాటరాని యాజ్ఞచేత- రాహుకాంతలకు (రాహువుతోడి) సురతోత్సమున, ముద్దులేకాని, ఆలింగనప్రధానములగు విలాస చేష్టలయనుభవమేదియు లేకుండఁజేసినట్లు చెప్పఁబడినది. కనుక, రాహుకాంతా గతమగు విశిష్టరతోత్సవముచేత (శబ్దాభిహితమగు కార్యముచేత) నిచట, కారణ రూపమగు రాహుశిరశ్ఛేదము - గమ్య (వ్యంగ్య) మగుచున్నది.

లోచనము :— (పూర్వపక్షి) ఒకఁడీయంశమున నిట్లనుచున్నాఁడు :— "అయ్యా! కవి - యిచట ప్రధానముగా వివక్షించినది - పర్యాయోక్తమే. కాని, రసాదికము [ప్రధానముగా వివక్షించినది] కాదు. కనుక, [వృత్తియందు]రసాది తాత్పర్యమున్నను" అనియెట్లు చెప్పఁబడినది ?

సిద్ధాంతి :— ఇచట-వాసుదేవప్రతాపము (ప్రధానముగా) వివక్షితము గదా! [కనుక, నిచట వీరరసమునఁ దాత్పర్యమున్నది.] అయిన, నది - యిచట సౌందర్యహేతువుగాఁ బ్రకాశింపకున్నది. ఇంతేమనిన; ఇచట, సౌందర్యహేతువుగాఁ బ్రకాశించుచున్నది - పర్యాయోక్తమేయగుచున్నది.

ప్రభా :— ఇచట రవికి - రసాదితాత్పర్యమున్నను, ఇచట, గమ్యమగు వాసుదేవ ప్రతాపముకంటె, పర్యాయోక్తమే - సౌందర్యహేతువుగాఁ బ్రకాశించుచున్నది, కనుక, నదియే - ఇచట నంగియగుచున్నదని భావము.

అవ :— "కవికి రసాది తాత్పర్యమున్నయెడల, (వాసుదేవప్రతాపము

నకు) అంగముగా వివక్షింపఁదగిన యలంకారము నిచట నంగిగా వివక్షించుట దోషముకాదా?'' అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

లోచనము :— అయిన, సుకావ్యమునందు - దోషమునాశంకింపఁదగదు, ఒకానొకచోట, అలంకారమంగభూతమయినను, పోషింపఁదగిన, (అలంకరింపఁదగిన) ప్రకృతవిషయముయొక్క స్వరూపమును దిరస్కరించునదిగా నేర్పడ వచ్చుననుటకు - మీఁది శ్లోకము - దృష్టాంతతుల్యముగా నొసఁగఁబడినది దాని వలన, "[అలంకారమంగముగా నుండక, ప్రకృతమునుదిరస్కరించి, యంగియగుటవలన] ఒక్కొక్కచోట ననౌచిత్యము. సంభవింపవచ్చును''. ? అనునదియే-గ్రంథకర్త యాశయమైయున్నది. [దీనినొక దోషముగాఁదెలుపుటయతని యభిమతముకాదు.] అదెట్లనిన; "మహాత్ముల విషయమున దూషణమునుద్ఘోషించుట-ఆత్మను (తన్ను) దూషించుకొనుటయేయగును.'' అని, యీయంశమును గ్రంథకారుఁడే - ముందుతెలుపనున్నాఁడు. కనుక, నిది- దూషణముగా నొసగఁబడిన, యుదాహరణము - కాదు.

ప్రభా :— "మహాకవి - ఇచట, వీరరస ప్రకాశన తత్పరుఁడై - వాసుదేవ ప్రతాపాతిశయమును - ప్రధానముగా వివక్షింపఁగోరెను. కనుక, రాహు శిరశ్ఛేదరూపమున - వ్యంగ్యమగు తత్ప్రతాపాతిశయమిచట - నంగిగానుండ వలసియున్నది. అయిన, నిచట - వ్యంగ్యమగు వాసుదేవ ప్రతాపాతిశయము-దానికంటె నధిక చమత్కారకారియగు పర్యాయోక్తమున కంగముగుచున్నది. కనుక, పర్యాయోక్తమంగియగుచున్నది. కనుక, అంగముగా (అలంకారముగా) నుండఁదగిన పర్యాయోక్తమే - అంగియగుట కుదాహరణముగా నొసఁగబడినది. ఇది - అలంకార సమీక్షావిధానమునకు విరుద్ధమగుటవలన ననుచితమేయగును. అయినను, మీఁది శ్లోకముగల కావ్యమును రచించిన మహాకవి - రసతత్పరుఁడగుటవలన, దూషణార్హుఁడుకాఁడు'' అనునది-లోచనాభిప్రాయముగాఁగాన్పించును.

(61) మూలము :— "అంగముగా వివక్షింపఁబడినను గూడ, 'సమయమేతెంచినప్పుడే యలంకారముఁ బొందుపఱుప వల యును' అవసరము కలుగనపుడు పొందుపఱుపఁగూడదు" అని చెప్పఁబడినది. కనుక, (మహాకవి) సమయమేతెంచునప్పుడే యలంకారమును గ్రహించును. దీనికుదాహరణము :—

మ. పరిణద్ధోత్కలికన్, విపాండురరుచిన్, బ్రారబ్ధజృంభన్, నిరం
తరవృత్తిశ్వసన ప్రసారముల నాత్మాయాసముంజూపు నీ
స్ఫురదుద్యానగతన్-లతన్,సమదనన్,బూఁబోడి,నన్యన్,వలెన్
నెఱిఁగన్గొంచు, భ్రువమ్మ పాటలముగన్ దేవ్యాస్యమున్
జేయుదున్।

అనునిచట - ఉపమా [సహిత] శ్లేషము గ్రహింపఁబడినది.

పరీక్షా :— ఈయాంధ్రీకృతికి మూలమగు శ్లోకము - రత్నావళీ నాటిక యందిట్లున్నది.

"ఉద్దామోత్కలికాం, విపాణ్డురరుచం, ప్రారబ్ధజృమ్భాం, క్షణా
దాయాసం శ్వసనోద్గమై రవిరలైరాతన్వతీ మాత్మనః।
అద్యోద్యాన లతామిమాం సమదనాం నారీమివాన్యాంధ్రువమ్
పశ్యన్, కోపవిపాటలద్యుతి ముఖందేవ్యాః కరిష్యామ్యహమ్. అని,

"తనచేతఁ బరిగ్రహింపఁబడి, లాలింపఁబడుచున్న, నవమాలికాలత-దోహద విశేషమునఁ బుష్పితకాఁగా, దానినిగని,"వత్సరాజనుచున్నాఁడు. "నేనీయుద్యాన లతను, వేరొకకాంతను జూచునట్లు చూచుచు, దేవియగు వాసవదత్త మొగమును, కోపముచేత నెఱ్ఱపెక్కునట్లు చేయుదును" అని. ఇందు లతాపక్షమునందును, వాసవదత్తేతర కాంతాపక్షమునందును, లోచనోన్మీలితములగు నర్థములను- క్రమముగా నిట్లెఱుగునది.

లోచనము :— (లతాపక్షమున) పరిణద్ధోత్కలికన్ (ఉద్దామోత్కలికాం) ఉద్గతములగు మొగ్గలుగలదానిని, ('మొలచిన మొగ్గలుగలదానిని' అని యర్థము) (కాంతాపక్షమున) ఉత్కలికలనఁగా; రుహరుహికలు. (అనఁగా; (ఉత్కంఠలు) కనుక పూర్ణములగు నుత్కంఠలుగల దానిని అనియర్థము. (లతాపక్షమున) "ప్రారబ్ధజృమ్భన్" అనఁగా; "క్షణములోనే యారంభింపఁబడిన వికాసముగలదానిని"అనియర్థము. (కాంతాపక్షమున) మన్మథకృతమగు నంగమర్ద ముగలదానిని" అనియర్థము. (లతాపక్షమున)"శ్వసనప్రసారములనాత్మాయాస మున్ జూపు"అనఁగా;"వసంతమారుతోల్లాసములచేతలతా స్వరూపమగుతనకాయా సమును, అనఁగా; అందోళనయత్నము నొనరించుచున్నదానిని," అనియర్థము.

పక్షమున) "నిట్టూర్పుగాలులచేత - తనహృదయమునందుఁగల సంతాపమును ప్రదర్శించుచున్నదానిని" అనియర్థము. "ఈ సుస్ఫురదుద్యానగతన్ లతన్, సమదనన్," అనఁగా; "మదనమను వృక్షముతోఁగూడినదియు, కనుకనే-మిగుల స్ఫురించునదియు, నగు నీయుద్యానలతను" అనియర్థము. "సమదనన్ బూఁబోఁడినన్యన్ వలెన్"కామముతోఁగూడిన, వేరొక,పూఁబోఁడినివలె,(నేనిపుడుచక్కఁగాఁజూచుచు, దేవీముఖము - నీర్ష్యచేత నెఱ్ఱవారునట్లొనర్చెదను.) అనియర్థము.

ప్రభా :— ఇచట."ఉదయనుఁడు - తనచేతఁ గావింపఁబడిన, దోహద' విశేషముచేత - పుష్పించిన లతను - అన్యకాంతనువలెఁ జూచుచు; నిజదేవిచేత - గ్రహింపఁబడిన మాధవీలత - పుష్పింపకుండుటవలన, కోపమునొందిన తద్దేవి ముఖమును - అరుణకాంతి యుక్తముగాఁజేసి, యానందింపఁ గోరుచున్నాఁడు' అనునది ప్రకరణము. (సందర్భము.)

లోచనము :— ఇచట, నుపమా (సహిత) శ్లేషము - ముందు స్ఫురింపఁ జేయఁబడునదియగు (వాసవదత్తాగత) ఈర్ష్యావిప్రలంభ శృంగారమునకు, మార్గ పరిశోధకముగా (వ్యంజకముగా) నుండి (సహృదయులకు) దాని యాస్వాదాభిముఖ్యమును గలిగింపుచు, అవసరమునందు-అనఁగా, తద్రసచర్వణము ప్రాముఖ్యమునొందు నంతవఱకును- ముందు నడచునదివలె, నిచట గ్రహింపఁబడినది.

ప్రభా :— "సభాసులకేతెంచుచున్న ప్రభువునకు దారిఁజూపుచు, ముందుండు వ్యక్తివలె, సహృదయులచేత త్వరలో సమాస్వాదింపఁబడనున్న, యీర్ష్యా విప్రలంభ శృంగారరసమునకు - వ్యంజకమగునట్లిచట నుపమాసహితమగు శ్లేషాలంకారము - ముందుగా గ్రహింపఁబడినది." కనుక, నిది - 'సమయమేతెంచునప్పుడే - అలంకారమును గ్రహించుట' కుదాహరణమగుచున్నది" అనునది - లోచనాభిప్రాయము.

అవ : నాట్యాచార్య శిఖామణియగు, శ్రీమదభినవ గుప్తాచార్యుఁడు- ఈ పద్యమునందుఁగల ప్రస్తుతాప్రస్తుతార్థముల నభినయింపవలసిన రీతినిగూడ ఇచట, నటులను శిక్షించుటకుఁ దెలుపుచున్నాఁడు.

లోచనము :— "ఈ పద్యమునందుఁగల ప్రాకరణికార్థము (లతాపరముగునర్థము) నభినయించునప్పుడిందలి ప్రతిపదార్థమునుగూడ నభినయింపవల

యును. అప్రాకరణికార్థము నభినయించునపుడుమాత్రము-వాక్యార్థమును-ఉపోం గాదులచేత నభినయింపవలయును. కాని, భొత్తిగానభినయములేకుండుటతగదు.'' అనునింతమాత్రిముచాలును. "ధ్రువమ్మ" (తప్పకుండ) అనునిది-భావియగు, నీర్వ్యకవకాశము నొసఁగుటకు-జీవితమగు- పదముగానున్నది.

(62) మూలము :— ఆయా రసముల కనుగుణమగు నట్లు, వేరొక యలంకారమును బ్రదర్శించు నపేక్షచేత - వెనుక గ్రహింపఁబడిన, యలంకారమునుగూడ - విస్తరింపక, అవసరము కలిగినపుడు విడుచుట కుదాహరణము :—

మ॥ గొనబౌలేత చిగుళ్లు- రక్తి నిడునీకున్, శ్లాఘ్యముల్ మత్ప్రియా
గుణముల్-నాకు;సఖా!శిలీముఖము-లీగుఁన్ నిన్ను,నన్నాత్మభూ
ధనురాముక్తము; లంగనా పదహతిన్-దర్పింతుమీ, వేనుఁ; గ
గల్గునిటుల్ సామ్య; మశోక! దైవము- సశోకున్ జేసె నన్నా
. క్కనిన్.

ప్రిభా :— మీఁది యాంధ్రీకృతికి మూలమగు శ్లోకమిట్లున్నది.

"రక్తస్త్వం నవపల్లవై రహమపి శ్లాఘ్యైః ప్రియాయాగుణై
స్త్వామాయాన్తి శిలీముఖాః స్మరధనుర్ముక్తాస్తథామామపి।
కాన్తాపాదతలాహతి స్తవముదే తద్వన్మమా, ప్యావయోః
సర్వం తుల్యమశోక! కేవలమహం ధాత్రాసశోకః కృతః॥" అని.

ప్రియావియుక్తుఁడగు నొక రసికుఁడు - అశోకముతో ననుచున్నాఁడు. "గొనబౌలేతచిగుళ్లు-రక్తి నిడునీకున్, శ్లాఘ్యముల్ మత్ప్రియాగుణముల్-నాకు" అనఁగా; సఖా! నీవు-క్రొంజివుళ్లచేత రక్తుఁడవైయున్నావు. నేనును- ప్రశంసార్హ ములగు నాప్రియతమ-గుణములచేత, ననురక్తుఁడనైయున్నాను. అనియర్థము. "ఆత్మభూధనురాముక్తములగు శిలీముఖములు నిన్నును,నన్నును, గూడఁబొందు చున్నవి". అని సమన్వయింపవలయును. అప్పుడు - "అరవిందాదులగు నితర పుష్పములను విడిచివచ్చిన తుమ్మెదలు-నిన్నును, ఆత్మనుండి (మనస్సునుండి) పుట్టిన మన్మథుని వింటినుండి గట్టిగా విడువఁబడిన బాణములు - నన్నును,బొందు

చున్నవి.''అనునర్థముసిద్ధించును. అంగనాపదహతిన్ దర్పింతుము + ఈవున్ + ఏనున్ = (పద్మినీజాతిగల) కాంత - తన్నుటచేతనగు వికాసముచేత నీవును, సురతబంధ విశేషమునందొదవు ప్రియాంగనా పదతలాహతిచేతనగు ప్రహర్షము చేత-నేనును, గర్వించుచుందుము. మనయనుభూతి- సర్వమునుగూడ, నిట్లు తుల్యమగనేయున్నది. ''అశోకః'' (ఓయశోకవృక్షమా = శోకములేనివాఁడా!) ''నీవు శోకములేనివాఁడవు. కాని, దైవము(మతిమాలిన) విధాత - ''సశోకున్ జేసె నన్నొక్కనిన్'' నన్ను మాత్రమే శోకయుక్తునిగాఁజేసివైచెను.''అనునిది- ఆంధ్రీకృత పద్యమునందలి సమన్వయము.

లోచనము :— 'రక్తస్త్వమ్' అనుచోట) ''రక్తుఁడవు'' అనఁగా, 'లోహితుఁడవు'. (ఎఱ్ఱఁదనము గలవాఁడవు) అనియర్థము. నేనుగూడ- (శ్లాఘ్యములగు ప్రేయసీగుణములచేత) రక్తుఁడను = మిక్కిలి పరిబుద్ధమగు (ఉద్బుద్ధమగు) ననురాగముగలవాఁడను. 'అందు (ప్రియకాంతానురాగమును మేలుకొలుపుటయందు) పరిబోధకమగు (ఉద్దీపన) విభావము - పల్లవకృతమగు, అశోకరాగమే'అని తలంపవలయును. ఇట్లే, ప్రతిపాదమునందునుగల, మొదటియర్థము (విరహవిప్రలంభమున కుద్దీపన) విభావముగా వ్యాఖ్యానింపఁ దగియున్నది.

పరీక్షా :— ''అశోకమును భ్రమరములు పొందునపుడును, స్వకాంతా పాదతలాహతిచేత - దానికి పుష్పవికాసము కలుగునపుడును, నాయకునకు - సంతోషము కలుగుచున్నది. కనుక, నశోకమును-శిలీముఖములు (తుమ్మెదలు) పొందుట, దానికి పుష్పవికాసముకలుగుట, అనునవి - కూడ, నాయకునకు- ఉద్దీపన విభావములుగా, వ్యాఖ్యానింపఁదగియున్నవి''. అనిలోచనాభిప్రాయము.

లోచనము :— కనుకనే, [ఇట్లిచట- మొదటియర్థముద్దీపనహేతువగుట వలననే] ఇది - హేతుశ్లేషమగుచున్నది, (ఇతరములగు నలంకారములుకూడ- శ్లేషమునను గ్రహించుచున్నవి)సహోక్తి,ఉపమ, హేతువు, అనునలంకారములు- తఱచుగా శ్లేషమునను గ్రహించుట-ప్రసిద్ధమైయున్నది. ఈయభిప్రాయముచేతనే, భామహుఁడు - ''సహోక్త్యుపమాహేతువుల నిర్దేశముచేత - శ్లేషము త్రివిధము'' అని నిరూపించెను. కాని, తదితరాలంకారములు - శ్లేషము నను గ్రహించుటను నిరాకరించునను నభిప్రాయమునఁగాదు.

ప్రభా :— ''సహోక్త్యాదులకంటె నితరములగు నలంకారములుకూడ - శ్లేషమున కనుగ్రాహకములుకావచ్చును.'' అనునది - లోచనాభిప్రాయము.

**(63)** మూలము :— ఇచ్చట శ్లేషాలంకారము - [మీఁది పద్యమునందు] ప్రబంధ ప్రవృత్తమయినను, [తొలిమూఁడు పాదములచేతను నిర్వహింపఁబడిననుగూళ] [రసానుగుణమగు] వ్యతిరేక వివక్షచేత - విడువఁబడి; రసవిశేషమును (విప్రలంభ శృంగారమును) పోషించుచున్న దిగదా!

లోచనము :— "రసవిశేషమును" అనఁగా, "విప్రలంభ శృంగార రసమును" అనియర్థము.

ప్రభా : అవ :— ప్రస్తుతమగు రసమునకనుగుణమగు, వేఱొక యలంకారమును దెలుపుటకు, దానికంటెముందుగా గ్రహింపఁబడిన యలంకారమును విడుచుట - ప్రకృత రసాంగమగును. కనుక, నిచట - తొలుత గ్రహింపఁబడిన శ్లేషోపమ - విడువఁబడినది. తమపరి, గ్రహింపఁబడినది - వ్యతిరేకాలంకారము. అది - విప్రలంభపోషక మెట్లగునదియు, నిచట, వివరించుచున్నాఁడు.

లోచనము :— "సశోకున్" అనుపదమిచట, అశోకమునందుకంటె - వక్తయగు నాయకునియందగు, వ్యతిరేకమును - గొనితెచ్చుచున్నది. దీనిచేత - విప్రలంభమును బాగుగాఁబోషించునవియు, శోకముతోఁగూడి జనించునవియు, నగు నిర్వేదము, చింత, మున్నగు వ్యభిచారిభావముల కవకాశమొసఁగఁబడినది.

ప్రభా :— "సశోకున్ జేసె నన్నొక్కనిన్" అనునది - ఉపమేయమునకు న్యూనత్వమును దెలుపునదియగు వ్యతిరేకముగదా!. దానిచేత - ఏతత్పద్యార్థమును దెలిపిన వక్తయందుఁగల నిర్వేదాది వ్యభిచారిభావస్థితి - ద్యోతితము.

అవ :— పూర్వపక్షియొకఁడు - ఇచట నలంకారములు - రెండున్నవని యంగీకరింపక, ఇందలి యలంకారము- (శ్లేషోపమా వ్యతిరేకముల) సంకరమని (ఒకటేయగు సంకరమని) శంకించుచున్నాఁడు.

**(64)** మూలము : "అయ్యా! ఇచట నలంకారద్వయమునకు సన్నిపాతములేదు. ["శ్లేషము" "వ్యతిరేకము" అను రెండలంకారములసమావేశములేదు.] మఱియేమనిన; నరసింహుని వలె శ్లేష - వ్యతిరేక (సంకర) మనుపేరుగల వేఱొకయలంకారమే

(ఏకవాక్యానుప్రవేశ సంకరమే)యగును. అనునెడల; [అదియుక్త ముకాదు.] (శ్లేష - వ్యతిరేక) సంకరము- వేరొకవిధమున, వ్యవస్థాపితమైయుండుటవలన", అది- (మీఁదిపూర్వపక్షము) యుక్తము కాదు.

కం॥ 'సహరి' హరినామమున - హరి,
సహరివి నీవు-వరతురగచయమునదేవా!

ఇత్యాది స్థలములయందు-ఎచ్చట, శ్లేషవిషయమగు (ఒక్కటియేయగు విషయమగు 'సహరి' మున్నగు) శబ్దమునందే, వేరొక విధమున - వ్యతిరేక ప్రతీతికలుగునో, అదియే - సంకరమునకు విషయము.

లోచనము :— ('గొనబొ' అనుచోట నలంకారములు రెండులేవు.) మఱి యుచేసునిన; ఇది - సంకరాలంకారమొక్కటియే యగుచున్నది. (ఇట్లిచటనున్న యలంకారమొక్కటియేయగునపుడు) అందు - త్యజింపఁబడినదేది? గ్రహింపఁబడినదేది?''అనునది - పరునియభిప్రాయము (పూర్వపక్షము).

ప్రభా :— వృత్తికారుఁడొసఁగిన సమాధానము నిచట లోచనకర్త - వివరించుచున్నాఁడు.

లోచనము : ఒకటియేయగు విషయమున, అలంకారద్వయప్రతీతి కలుగునపు, డది - సంకరమగును. మీఁద నుదాహరింపఁబడిన 'సహరి' శబ్దమొక్కటియే - (శ్లేషవ్యతిరేకములకు) విషయము. (హరియగు విష్ణువు) హరి యనునామముచేత - (హరియనునామముతోఁగూడియుండుటచేత) 'సహరి'. (ఓ రాజా!నీవు) శ్రేష్ఠములగు తురంగములతోఁ గూడియుండుటచేత- 'సహరివి'. అనునది-దీనియర్థము.

ప్రభా :— హరిశబ్దము - నానార్థకము. ఒకకవి- పెక్కుగుణములుగల, ఒకరాజును శ్లాఘించుచున్నాఁడు. ''ఓరాజా! విష్ణువు- హరియను నామముతోఁ గూడియుండుటచేత మాత్రమే - సహరియగుచున్నాఁడు. కాని నీవు శ్రేష్ఠములగు హయములతో (తురంగములతోఁ) గూడియుండుటవలన - సహరివి'' అని. ''విష్ణువు-

నామసాహిత్యమాత్రముచేతనే - సహరియగుచున్నాఁడు, కాని, నీకట్లుగాక, 'సహరి'యను పేరుకూడ-సార్థకమైయున్నది.'' 'అనియిచట, నుపమేయమునందాధిక్యరూపమగు విశేషము- చెప్పఁబడినది. కనుక, నిచట'సహరి'యను శబ్దమొకదానియందే - శ్లేషవ్యతిరేకాలంకారములు రెండును భాసింపఁజేయఁబడినవి. కనుక, నిటువంటిదే - సంకరముగా జెప్పఁదగినదనిభావము. ''సహరి''యను నాంధ్రికృతికి మూలము - వృత్తియందిట్లున్నది.

''సహరిర్నామ్నా దేవస్సహరిర్వరతురగనివహేన.''అని. దీనిపూర్వార్థమిట్లున్నది. ''యద్యప్యనుపమచరిత స్తథా ఒపితవనాచ్యుతస్తులాంలభతే.'' అని. మీఁదియాంధ్రికృతికూడ- పూర్వార్థముతోఁగూర్పఁబడునపుడిట్లుండును.

కం॥ సహరియు - అనుపమచరితో
ద్వహుఁడయిన భవత్సమానత గడింపఁడహో!
'సహరి' - హరినామమున, హరి-
'సహరివి' నీవు - వరతురగచయమున దేవా!

**(65)** మూలము :— ఇచ్చటనో; (గొనబొలేతచిగుళ్లు-రక్తినిడునీకున్' అనుచోటనో;) శ్లేషమునకు విషయమగు శబ్దము- ("రక్తిన్ ఇత్యాదికము) వేరుగానున్నది. వ్యతిరేకమునకు విషయమగు శబ్దముకూడ - (అశోక, సశోకాదికము-) అన్యమే యగుచున్నది.

లోచనము :— ''వేరుగానున్నది. అనఁగా; ''రక్తినిడునీకున్''అనునది- శ్లేషమునకు విషయమగు శబ్దమైయున్నది. దీనికంటె వేఱగు, అశోక, సశోకాది శబ్దము - వ్యతిరేకమునకు విషయమైయున్నది.'' అనియర్థము.

పరిభా :— ''రక్తినిడునీకున్'' మున్నగుచోటనే-శ్లేషమున్నది.'అశోక' 'దైవము సశోకుంజేసె నన్నొక్కసిన్' అనుచోటనే - వ్యతిరేకమున్నది. ''ఈయలంకారములకు రెండింటికినిగూడ - ఒక్కచోటనే యునికిలేదు, కనుక, నిది- సంకరముకాదు.'' అనిభావము.

లోచనము : అవ :— ''అయ్యా! వాక్యాత్మకమగు విషయము నాశ్రయించునపుడు - (శ్లేషవ్యతిరేకములకు) ఏకవిషయకత-కలుగవచ్చును, కనుక.

నిది-సంకరమేయగును(గాక!'' అనియాశంకించి, చెప్పుచున్నాఁడు.

(66) మూలము : మఱియు, నిటువంటివిషయమున (స్థలమున) దీనినింకొక యలంకారమని (శ్లేషవ్యతిరేకమను పేరు గలిగి, యొక్కటియేయగు, సంకరమని) కల్పించునెడల; అప్పుడు సంసృష్టికే విషయాపహారము కలుగవలసివచ్చును. (సంసృష్టియే లే నిది కావలసివచ్చును.)

లోచనము :— ''ఇటువంటి విషయమునందు'' అనుదానిచేత- ''వాక్య రూపమగు నొకేవిషయమునందు'' అనియేకత్వము - వివక్షితమని తెలియునది. (కాఁగా, పూర్వపక్షి - మీఁది పద్యార్ధమంతయుఁగూడ- నేకవాక్యమని తలఁచి) ఏకవాక్యతనుబట్టి (ఇందలి యర్థమునంతను) ఏకవిషయమని చెప్పునెడల; నప్పుడు, సంసృష్టివిషయమంతయు - సంకరముచేతనే - వ్యాపింపఁబడుటవలన, నప్పుడెచ్చటనుగూడ - సంసృష్టియే లేక పోవలసివచ్చును.

ప్రభామతి :— ''తిలతండులములవలె, వేరువేరగు నలంకారములకగు సమావేశము - సంసృష్టి'' అనిచెప్పఁబడునుగదా!. పూర్వపక్షి- మీఁది పద్యార్ధమున నేకవాక్యతనంగీకరించి, అది- యొకేవిషయముగుటచేత, నచటి యలంకారము - క్షీరనీరములవలె నభిన్నమగు సంకరాలంకారమేయగుననునెడల; భిన్నాలంకార సమావేశరూపమగు సంసృష్టి కెచ్చటనుగూడ స్థానమే లేకపోవలసివచ్చును. అని భావము.

లోచనము : అవ : [పూర్వ :—] ''అయ్యా! వ్యతిరేకముపమాగర్భము. ఆయుపమ కూడ - శ్లేషద్వారముననే తీసికొనిరాఁబడినది. కనుక నిచటి, శ్లేషము- వ్యతిరేకము ననుగ్రహించునదియగుచున్నది. కనుకనిది - సంకరమునకే విష యము. (ఇది - సంకరమేకాని సంసృష్టికాదు.) ఎచ్చట ననుగ్రాహ్యానుగ్రాహక భావములేకుండునో, అచ్చట నలంకారము లేకవాక్యగాములయినను గూడ - సంసృష్టికి విషయముకావచ్చును. [కనుక, సంసృష్టికి విషయాపహారములేదు.)'' అని పూర్వపక్షియభిప్రాయము నాశంకించి, చెప్పుచున్నాఁడు.

(67) మూలము :— ''శ్లేషముఖముననే యిచట వ్యతిరేక మునకు స్వరూపలాభము - కలుగుచున్నది. కనుకనిది - సంసృ ష్టికి విషయముకాదు.''

లోచనము :— "శ్లేషముఖముననే" అనఁగా; శ్లేషబలముచేతఁదీసికొని రాఁబడిన, యుపయాముఖముననే" అనియర్థము.

పరీక్షా :— "ఉపమానోపమేయములలో-ఒకదానియందు విశేషముండిన యెడల; నదివ్యతిరేకమనునలంకారమగును".అనునది-వ్యతిరేకలక్షణము. కనుక, నుపమానోపమేయ భావమున్నప్పుడే వ్యతిరేకమునకు స్వరూపము సిద్ధించును. ఇచట్ నుపమానోపమేయములకు సామ్యమునుసంపాదించునది-శ్లేషమగుచున్నది. కనుకనది - వ్యతిరేకమున కనుగ్రాహకమగుచున్నది. వ్యతిరేకమనుగ్రాహ్య మగుచున్నది. కనుకనిది - శ్లేషవ్యతిరేక సంకరమేకాని సంసృష్టికాదు ఇట్లిది - ఒకటేయగు సంకరమగునపుడు - శ్లేషము విడువఁబడి, వ్యతిరేకము గ్రహింపఁ బడుటకు దీనినుదాహరించుట - సంగతముకాదు" అనునది - పూర్వపక్షి యభి ప్రాయము.

లోచ : అవ :— దీనిని పరిహరించుచున్నాఁడు.

(68) మూలము :— మీరిట్లనుట - యుక్తముకాదు. ఏలయనిన; వేరొకవిధముచేతఁగూడ - (ఉపమచెప్పఁబడకున్నను) వ్యతిరేకము కాన్పించుచున్నది. అదెట్లనిన :—

చ॥ అదయరయోద్ధళత్ కుధరుఁడా ప్రళయానలుత్రైన నాచ్ఛరా
నిదయి, పగల్ మహోజ్జ్వలతనింపుచు, నెందుఁదమోంజనమ్ముకలే
నిదది, పతంగజమ్ము, తదనిర్వృతి, దీపసమస్తదీప వ
ర్తి - దళకు ఖిన్నమూర్తి, రవిదీప్తి - మిమున్ సుఖియింపఁ
జేయుతన్ ।

అను నీపద్యమునందు సామ్యప్రపంచ ప్రతిపాదనము లేకయే - (స్వశబ్దముచేత, నుపమ- ప్రతిపాదింపఁబడకయే) వ్యతి రేకము - ప్రదర్శింపఁబడినదిగదా!

పరీక్షా :— శ్లేషోపమలేకున్నను, వ్యతిరేకముపరిదర్శితమగు ననుట కుదాహరణమగు, మీఁది యాంధ్రీకృతికి-మూలమగుశ్లోకము-మయూరుని సూర్య శతకమునందలిది. అది - యిట్లున్నది.

''నోకల్పాపాయవాయో రదయరయదలత్ క్ష్మాధరస్యాపిశమ్యా
గాఢోద్గీర్ణోజ్జ్వలశ్రీరహని, నరహితానో, తమః కజ్జలేన।
ప్రాప్తోత్పత్తిః పతఙ్గాన్న పునరుపగతా మోషముష్ణత్విషోవో
వర్తిః సైవాన్యరూపా, సుఖయతు నిఖిలద్వీపదీపస్యదీప్తిః.''

''నిర్దయమగు వేగమున మహాపర్వతములనుగూడఁ బెకలించునదియగు కల్పాంతవాయువునకుఁగూడ నార్పుటకు శక్యముకానిదియు, పగటివేళయందు-పరిగాఢముగాఁ బ్రకాశింపఁజేయఁబడిన కాంతిపుంజముగలదియు, కాటుకవంటి చీకటితోఁ గూడియుండనిదియు, పతంగుని (సూర్యుని) వలన జనించునదియు, నతనినుండి యెప్పుడును నాశమునొందనిదియు, నగుచు - నిఖిల ద్వీపములకును దీపమగు, సూర్యునికి సంబంధించినదియు, లోకప్రసిద్ధమగు దీపశిఖకంటె విలక్షణ మగునదియు, నగుదీప్తి - మిమ్ములను సుఖింపఁజేయుఁగాక!'' అనునది-యిందలి వాచ్యార్థము.

లోచనము :— ''ఆర్పరానిదయి''-''శమింపఁజేయుటకు శక్యముకానిదియై''అని (సూర్యదీప్తిపరమైన) యర్థము. దీపవర్తి (శిఖ)యో - స్వల్పమగు వాయువుచేతఁగూడ - శమింపఁజేయుటకు వీలుపడును. [అని, దీప శిఖాపరమైన యర్థము]''తమోఽంజనమ్ములేనిది''-'చీకటియనుకాటుకతోఁగూడియుండనిదియే' అని (సూర్యదీప్తిపరమైన)యర్థము. దీపవర్తియో, మిక్కిలి ప్రకటముగాకుండుట వలనను, మీఁదికిఁబ్రసరించుచున్న కాటుకతోఁ గూడియుండుటవలనను, చీకటితోఁ గూడునదియు, కాటుకగలదియుఁగూడ నగుచుండును. (అని దీపశిఖాపరమైన యర్థము.)''పతంగజమ్ము''అనఁగా; సూర్యునినుండిపుట్టునదియు, తదనివృత్తి = సూర్యునివలన నాశమునొందనిదియు, (అనిదీప్తిపరమైనయర్థము.) దీపశిఖయో-(పతంగమువలన, అనఁగా) శలభమువలన-జనింపదు. శలభమువలన ధ్వంసము నొందును. (అని, దీపశిఖాపరమైనయర్థము)

పరిభా :— ''దశ'' అనఁగా; వర్తి. అనఁగా; దీపశిఖ. ఇందు-వ్యంగ్య మగునర్థము - సాధర్మ్యముగలదికాక, వైధర్మ్యముగలదియైయున్నది. కనుక, నిచట - వైధర్మ్యముఁగలిగి - దీపశిఖాపరమైయున్న యర్థము నిల్లెఁగునది. లోకమునఁ బ్రసిద్ధమగు, (సాధారణమగు) దీపశిఖ - దీపదీప్తి) స్వల్పమగు వాయువుచేతఁగూడ - శమింపఁజేయఁబడును. పగలు - మిక్కిలి, మందమగు (విచ్ఛాయమగు) కాంతినిగలిగియుండును. మిక్కిలిగాఁ బ్రకాశింపకుండుటవలన,

దీపవర్తితోను, మీఁదికిఁ బ్రసరించుచున్న (నల్లని) కాటుకతోను, గూడియుండును. శలభములవలన ధ్వంసము నొందును. లేక, శలభములనే నశింపఁజేయును. (పవనము వలననే నిర్వాణము నొందుచుండును. ఇచట, నిట్లు సామ్య ప్రతిపాదనము లేకయే గమ్యమగు వైధర్మ్యముచేత - సూర్యదీప్తియను దీపవర్తి - (దీపశిఖ) లోక ప్రసిద్ధమగు దీపవర్తి (దీపశిఖ) కంటె, నధికమగు నుత్కర్షముగలదిగాఁ బ్రదర్శింపఁబడినది. కనుకనిది - ఉపమేయాధిక్య పర్యవసాయియగు వ్యతిరేకమున కుదాహరణమగుచున్నది.

లోచనము :— "సామ్యప్రపంచ ప్రతిపాదనము లేకున్నను" అనఁగా; "స్వశబ్దముచేతనగు నుపమా ప్రబంధము లేకున్నను" అనియర్థము. దీనియభిప్రాయమిది :— (మీఁదిపద్యమునందు) ప్రతీయమానమగు నుపమయే - వ్యతిరేకమున కనుగ్రాహిణియగుచు, స్వకంఠముచేతనగు నభిధానము నపేక్షింపకున్నది. కనుక, శ్లేషోపమ- 'వ్యతిరేకమును ననుగ్రహించునదిగాఁ' (స్వశబ్దము చేతఁ) జెప్పఁబడినదికాదు.

ప్రభా : — "మీఁది పద్యమునందు-శ్లిష్టమగు స్వశబ్దముచేతనగు (శ్లేషము చేతనగు) నుపమాప్రబంధ ప్రతిపాదనము లేకున్ననుగూడ, వ్యతిరేకము - ప్రతిపాదింపఁబడినది కావున, 'గౌనబౌ లేతచిగుళ్ల' అను పద్యము - శ్లేషవ్యతిరేక సంకరమునకు లక్ష్యముగాఁ జెప్పఁదగినదికాదు." అనిభావము.

లోచనము : అవ : పూర్వ :— "అయ్యా! "ఆదయ" మున్నగు స్థలములయందు (శ్లిష్టమగు స్వశబ్దముచేతనగు సామ్య ప్రపంచ ప్రతిపాదనము లేకుండుటవలన) శ్లేషము - వ్యతిరేకము ననుగ్రహించునది కాకపోవచ్చును. అయినను, "గౌనబౌ లేత చిగుళ్లరక్తినిడు" అనుచోటను మాత్రము - (ఉపమ-శ్లిష్టమగు శబ్దముచేత - వాచ్యమగు స్థలమునందుమాత్రము) శ్లేషోపమ- (ఉపమాహేతువగు శ్లేషము) తత్ప్రవణముగానే (వ్యతిరేకపరముగనే, అనఁగా; వ్యతిరేకము నను గ్రహించునదిగనే,) ప్రతిపాదింపఁబడినది".

ప్రభా :— వ్యతిరేకమునకు స్వరూపలాభమును గలిగించుట కిచట స్వీకరింపఁబడిన యుపమ - శబ్దమాత్రసాధర్మ్యరూపమైయున్నది. అది - శ్లేషము చేతనే లభించుచున్నది. కనుక, నిచటి యుపమకు హేతువగుశ్లేషము - వ్యతిరేకము ననుగ్రహించునది కాకతప్పదు. కనుక, 'గౌనబౌ లేతచిగుళ్ల" అనుచోటను మాత్రము - ఉపమను గూర్చునదియగు శ్లేషమునకును, దానిచేత ననుగ్రహింపఁ

బడినదియగు వ్యతిరేకమునకును, సంకరమును జెప్పకతీరదు'' అనిభావము,

లోచనము :— ''వ్యతిరేకమున కనుగ్రాహకము కానియెడల, శ్లేషోపమ-యిచట స్వయముగా చారుత్వహేతువుకాకుండును. కనుక, నీశ్లేషోపమ-(ఉపమాహేతువగు-శ్లేషము వేరుగా నలంకారభావమునే పొందకుండును.'' -అని పూర్వపక్షి యొనర్చునదియగు నాశంకను దెలుపుచున్నాఁడు

పరిభా : అవ :— వృత్తికారుఁడిచట-ముందుగా, పూర్వపక్షి యాశంకను దెలిపి, సమాధానము నిచ్చుచున్నాఁడు.

(69) మూలము : "గొనబౌ లేతచిగుళ్లు" అనుపద్యము నందు శ్లేషము - వ్యతిరేకమున కంగముగనే వివక్షింపఁబడినది. కనుక, శ్లేషమాత్రముచేతనే సౌందర్యప్రతీతికలుగదు. కనుక, నది-(వ్యతిరేకముతోడి సాంకర్యము నొందియే అలంకారమగునుగాని) తనంతటానే (ప్రత్యేకముగా) అలంకారము కానేరదు." అనికూడఁ జెప్పఁదగదు.

ప్రభా : — ''ప్రత్యేకముగా నలంకారముకాఁజాలని, శ్లేషమిచట, నంగమేయగును. కనుక, నిది- అంగాంగిభావ సంకరమేయగును. అనిచెప్పఁదగను.'' అనిభావము

లోచనము : అవ :— ''ఇది - (మీఁది - పూర్వపక్షము-) స్వసంవేదన (స్వానుభవ) బాధితము. కనుక, సిద్ధింపనదికాదు.'' అని (వృత్తికారుఁడు) హృదయమున గ్రహించి, స్వానుభవమునుగప్పిపుచ్చుచున్న పరుని - (పూర్వపక్షిని-) శ్లేషములేని ఉపమామాత్రముచేతనే-(శ్లేషములేనిదియు, ఉపమాగర్భమగునదియు నగు వ్యతిరేకముచేతనే) సౌందర్యసంపన్నమగు నుదాహరణాంతరమునుజూపి, నిరుత్తరీకరించుచున్నాఁడు. [పూర్వపక్షిని - తనకు ప్రత్యుత్తరమునీయలేకుండునట్లొనర్చుచున్నాఁడు.]

(70) :— ఫలయనిన, ఏవంవిధమగు, విషయమున - (ఉపమాగర్భమగు వ్యతిరేక స్థలమున) సుప్రతిపాదితమగు సామ్యమాత్రమువలనఁ గూడ - (శ్లేషములేకుండ, సామ్యము-చక్కఁగాఁ

ప్రతిపాదింపఁబడినను గూడ - ) సౌందర్యము-కాన్పించుచునే యుండును. దీనికుదాహరణము :- [ప్రభామతి సంఘటితమగు "బంగారుగొలుసు" అను జాతీయ పద్యము; రూపకతాళము- లేక, త్రిశ్రి గతి-గలది.] ఒకవిరహి-జలధరుఁడగు మేఘునితో ననుచున్నాఁడు.

నారోదనములు - నీయురుములతో, నాలోచనజల
ధార-లవిశ్రాంతములగు నీజలధారలతో,
ఆరమణీమణి విరహమువలన జనించిన నాశో
కాగ్నిశిఖలు - నీవిద్యుల్లీలలతో, సరిగా;
సారములయి, నాలోదయితా ముఖబింబము - నీలో
శశిబింబము- నుండుట - మనవృత్తి సమానమెగా;
వారిధర! సఖుడవైనను, నీవునను దహించుటకే
వారక యుద్యతుఁడవగుదువేలా ? యిదిమేలా?.

ఇత్యాదికము.

ప్రభా :— ఇది - క్రొత్తగా సంఘటింపఁబడిన జాతీయపద్యము. దీనికి 'బంగారుగొలుసు' అను పేరు - పెట్టఁబడినది. దీనిని - చతురశ్రజాతిగల రూపక తాళమునందుఁగాని, త్రిశ్రజాతిగల యేకతాళమునందుఁగాని, పఠింపవలయును. దీనికి- ప్రతిపాదమునందును- నాలుగేసిమాత్రలుగల గణములు-పదునొకండును, చివరనొకగురువును, నుండును. ప్రతిపాదము చివరను - రెండుమాత్రల కాల మాగి - తరువాతి పాదమును జదువవలయును.

ఈ బంగారు గొలుసునకు మూలమగు శ్లోకమిట్లున్నది :—

"ఆక్రన్దాః స్తనితైర్విలోచన జలాన్యశ్రాన్త ధారాంబుభిః
తద్విచ్ఛేద భువశ్చశోకశిఖి నస్తుల్యాస్తడిద్ విభ్రమైః
అన్తర్మేదయితాముఖం, తవశశీ, వృత్తిః సమైవావయో
స్తత్ కింమామనిశం సఖే! జలధర! త్వం దగ్ధుమేవోద్యతః" అని.

లోచనము :— మీఁది యుదాహరణ శ్లోకమున, (పద్యమున) తృతీయాం

తములగు పదములయందు, తుల్యశబ్దమును ('సరిగా' అనుపదమును) జేర్చుకొనవలయును. తదితరమునంతను ''గొనబౌలేతచిగుళ్లు'' అను దానియర్థమునువలెనే సమన్వయించునది.

ప్రభా : - ఏతత్పద్యవిషయమున మీఁదిలోచనసూచితమగు నభిప్రాయము ననుసరించి, వ్యాఖ్యాన, సమన్వయము,లొనర్పఁబడుచున్నవి.''నారోదనములు = నాయేడ్పులు-వినువారి మనస్సులకు సంక్షోభమును గలించుటవలన- నీయురుముల తోసరిగా, = 'సమానము.' కాఁగా, నాయశ్రుధారలు - తెఱపినీయని నీజలధారలతో, సమానము కాఁగా, రమణులలో శ్రేష్ఠురాలగు, నాప్రేయసితోడి వియోగమువలన నుదయించిన, నాయీ శోకాగ్నిశిఖలు - నీయందు స్ఫురించుచున్న, మెరపుతీగల విలసనములతో సమానములు కాఁగా, నాహృదయమున, సారమగు నాప్రియురాలి ముఖబింబమును, నీలోపల, శ్రేష్ఠమగు చంద్రబింబమును, (తుల్యములుగా) నుండగా, మనధర్మములు - సమానములేయగుచున్నవి కనుక; మనము సమానులమేయగుచున్నాము. కనుకనే, మనము సఖులమగుచున్నాము'' అనియర్థము. (ఇంతవఱకును సామ్యము తెలుపఁబడినది.) నీవు జలధరుఁడవు. కనుక, నీకు సంతాపహరణ సామర్థ్యముకూడనున్నది. నీవు సంతాపమును దొలఁగించుటకు సమర్థతగల సఖుఁడవైయున్నను గూడ - ఏలొకో నన్నుఁబీడించుటకే యెప్పుడును నుద్యమము నొనర్చుచున్నావు. [ఇది-నీకున్యాయముకాదు. నేనిట్లు బాధింపఁదగిన వాడనుగాను.] అని వ్యతిరేకము - తెలుపఁబడినది. జలధరసందర్శనము-విరహోద్దీపకము. కనుక, వాని యురుములు మున్నగువాని నుద్దీపన విభావములుగాఁగూడ యోజించునపుడు క్రిందిభావమేర్పడును. ''ఈ వర్షాకాలమున, భయంకరములగు నీయురుములు - వినఁగానే, నన్నెడబాసిన నాప్రేయసి తలఁపునకువచ్చి, నాయందు రోదనధ్వను లుప్పతిల్లుచున్నవి. నీజలధారలు- 'నా కాంతయేమగునో' అను వెఱపును గలిగించుటవలన - నాబాష్పధారలకు హేతువులగుచున్నవి. నీలో స్ఫురించిన, విద్యుల్లతా విభ్రమములు - నాప్రేయసీ విలాసములను నాజ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. కనుక, నీవిద్యుల్లీలలే - నాయందలి విరహశోకాగ్నిజ్వాలలకు హేతువులగుచున్నవి. నీలోనున్న చంద్రబింబమును జూడఁగానే, నాప్రియురాలిముఖబింబము - నాలోతలఁకున్నది. సుఖింపఁజేయవలసిన సఖుఁడవు నీవు - నన్నిట్లు బాధించుచున్నావు''. అనిభావము.

ప్రభా :— ''మీఁది పద్యమున శ్లేషములేకున్నను, ఉపమాగర్భమగు (స్వగర్భమునందుండవలసిన యుపమగల) వ్యతిరేకముచేతనే సౌందర్యము - కాన్పించుచున్నది. కనుక - ''గొనబౌ... రక్తినిడు నీకుఁన్'' అనుస్థలమునందుఁ

గూడ, శ్లేషము - వ్యతిరేకమున కనుగ్రాహకము కాకున్ననుగూడ, నది - స్వయముగా నలంకారము కావచ్చును." అనునది సిద్ధాంతము.

ఇట్లు సిద్ధాంతీకరింపఁబడుటచేత - "గొనబౌ లేతచిగుళ్లు" అనుపద్యము నందు, శ్లేషాలంకారము - తొలిమూఁడు పాదములచేతను నిర్వహింపఁబడిన నుగూడ, రసానుగుణమగు వ్యతిరేకవివక్షచేత - విడువఁబడి, విప్రలంభశృంగార మును బోషించుటయు, వ్యతిరేకము - స్వీకరింపఁబడి, రసానుగుణమగుటయు, సిద్ధించుచున్నది. ("గొనబౌ" అనుపద్యమునందువలెనే) ఇచటఁగూడ - సామ్య సంపాదకములగు - ఉపమలు, జలధారలు, మెఱుపులు, శశిబింబము, అనునవి - ఇచటివివక్షిత - ఉద్దీపన విభావములగుచు - రోదనములు, లోచనజలధారలు. శోకాగ్ని జ్వాలలు, ప్రియాముఖస్ఫురణము, అను ననుభావములకుఁ గారణము లగుచున్నవి. ఇచట, దైన్యము. మోహము-స్మృతి, మున్నగువ్యభిచారిభావములు వ్యంజితములై యున్నవి. విరహావిప్రలంభము - రసము. ఇచట - తొలి మూఁడు పాదములచేతను శ్లేషములేకుండనే-సామ్యము ప్రతిపాదితము. "నీవు- జలధరుఁడవగు సఖుఁడవైననుగూడ, నన్నుసుఖింపఁజేయుటకుఁగాక, పీడించుటకే ఉద్యుక్తుఁడవగుచున్నావు." అని చతుర్థపాదమున వ్యతిరేకము గ్రహింపఁబడినది. ఈపద్యమునందిట్లు-శ్లేషములేకున్నను సామ్యము-ప్రతిపాదితము.

లోచనము : అవ :— 'అలంకారగ్రహణ, త్యాగముల' నిట్లు సమర్థించి, "అతినిర్వహణవాంఛనందుటకూడదు" అను, భావమును వ్యాఖ్యానించుచున్నాడు.

(70) మూలము : — రసనిర్వహణైకతాన హృదయుఁ డగు మహాకవి - అలంకారము నధికముగా నిర్వహింపఁగోరఁడు. అదెట్లనిన :- (అతినిర్వహణవాంఛ నందకుండుట కుదా : --

మ॥ బలిమిన్ గోమలలోల బాహులతికా పాశాలబంధించి, పే
రలుకన్ వాసగృహమ్మునం జొనిపి, సాయంవేళ-నాళుల్ గనన్,
స్ఖలదుక్తిన్ 'మఱికూడదది' ట్లని-కుచేష్టన్ జూపి, తానేడ్చుచున్
జెలి-తాటింపెయొనర్చె, నిహ్నుతిపరున్, స్మేరాస్య,ధన్యున్,
బ్రియున్.

ఇచట - రూపకమాక్షేపింపఁబడినదియు, [వాచ్యముగాఁ బ్రారంభింపఁబడినదియు, నయినను-]రసపోషణోద్దేశమున మిక్కిలిగా నిర్వహింపబడనిదియుఁ, గూడ - నగుచున్నదిగదా!

వ్రి : — "ఇచట "బాహులతికాపాశాల బంధించి" అనియారంభింపఁబడిన రూపకము-తుదివఱకును, నిర్వహింపఁబడినయెడల; నది రసపోషణమునకు- ప్రతికూలమగు ననునభిప్రాయమున, 'అతినిర్వహణవాంఛ నందఁగూడదు" అను సమీక్షననుసరించి, (తుదివఱకును) నిర్వహింపఁబడినది - [సమాప్తినొందింపఁబడినది] కాదు." అనియర్థము.

లోచ :— "[నిర్వహింపఁబడనిదియుఁగూడ" అనుచోనున్న] చకారము - (వార్థకము, కూడ -) సమీక్షాప్రకారసముచ్చయార్థము. బాహులతిక లయందు - బంధనీయ పాశత్వారోపణరూపము నిరూపణము- "దయితయను-వ్యాధవధువు, వాసగృహాదికమను-కారాగారపంజరాదికము." అని(తుదివఱకును) నిర్వహింపఁబడినయెడల; ఇచట-మిక్కిలి యనౌచిత్యమేర్పడవలసివచ్చును.

ప్రిథా : — "దయితయను వ్యాధవధువు, బాహులతలను పాశములతో-ప్రియుఁడను చోరుని, బంధించి - కేళిగృహమను కారాగృహ పంజరమునఁజేర్చి' ఇత్యాదియగురూపణమును- పద్యము ముగియువఱకును చెలుపుచు, పొడిగించిన యెడల;నపుడు మిగుల ననౌచిత్యము-కలుగవలసివచ్చును. అది రసపోషణమునకు ప్రతికూలమగుటవలన రసభంగముకలుగవలసివచ్చును." అనిభావము. ఖండితనాయిక, స్వసన్నిధికేతెంచిన ప్రియతముని యెడనొనరించిన, వ్యాపారమిచట, వర్ణితము. దానిచేత - ఈర్ష్యావిప్రలంభశృంగారమిచట - ధ్వనితము.

అవ : దీనియందలి గూఢార్థమును - లోచనమిట్లు సమీక్షించుచున్నది. చూడుఁడు!

లోచనము : - "అకుల్ గనన్, వాసగృహమ్మునన్ జొనిపి" అనుచోట (సమ్యమగు) భావమిది.

"(ఓ చెలులారా!) ఈతఁడిట్లొనర్పఁడని (అపరాధికాఁడని) మీరెప్పుడును జెప్పుచుందురు. కనుక, నిప్పుడు (వీనిదోషమును) చూడుఁడు." అనునది. "స్థలచుక్తిన్" అనఁగా కోపావేశమున, అవ్యక్తమధురమగు-(బొబ్బలిడుచున్న)వాక్య-

చేత'' అనియర్థము. అవాక్కేదియనినఁ జెప్పుచున్నాఁడు.''మతికూడనిట్లు''అను నదియని.''ఇట్లు'' అనుదానిచేత నేదిచెప్పఁబడినదో: 'అదియేది ?' అనిన; జెప్పు చున్నాఁడు. 'కుచేష్టన్' అని. ఆకుచేష్ట - (దుశ్చేష్టితము) నఖపదాదికము. (గోటినాటు. పంటినాటు. మున్నగునది కనుక) దానిని, అంగుళ్యాది నిర్దేశము చేత-చూపి = చక్కగా సూచించి, తాటింపయొనర్చె - కొట్టుటనే కావించెను. కాని, సంఖ్యాదులచేత (సఖ్యాదులచేత) కావింపఁబడిన యూరడింపు ననుసరింప కుండెను.

ఏలయనిన; వీఁడు (ఈనాయకుడు) హాసమును నిమిత్తముగాఁ జేసికొని, తనదోషమును గప్పిపుచ్చుకొను తలంపుగలవాఁడును, (పైగా) ప్రియతముఁడును, గూడ నగుచున్నాఁడు. అట్టి ప్రియతమునికి సంబంధించిన వ్యళీకమును (కామా వేశకృతమగు నపరాధమును) సహించుటకెవతె - సమర్థురాలగును ?.

పరీభా :— ''కనుకనే, కొట్టుటను విడువక యే సాగించుచుండెను అట క్కరి - అపరాధమును గప్పిపుచ్చుటకిట్లు నవ్వుటయెడల; నామె యింతగా కొట్టి యుండెడిదికాదు.'' అనిభావము. ''నతుసంఖ్యాదికృతోఽనునయోఽనురుధ్యతే'' అనుపాఠము - ముద్రితమగు లోచనమునందున్నది. అది ''సఖ్యాదికృతః''అను విధమున నుండవచ్చునని తోఁచెడిని. చెలులచెంత - నాయకునదేపనిగాఁ గొట్టు చున్ననాయిక - ''సంఖ్యాదులచేత అనఁగా; దెబ్బలులెక్కించుటచేత, నగునూర డింపు ననుసరింపకుండెను'' అనుటకంటె - ''తనకుప్రీతిపాత్రులగు సఖులు ''అమ్మా! కొట్టకు కొట్టకు'' అనియూరడించుచున్ననుగూడ - నూరడిల్లక, తన ప్రియతముని గొట్టుచునేయుండెను.'' అనుటయే - అధిక చమత్కారకారియగు నని, నాయభిప్రాయము.

''లోచనకర్త - 'అట్టిటక్కరి నామెయిట్లుకొట్టుట యుక్తమే'అని యెట్లు సమర్థించెనో చూడుఁడు,''

> ''యతోఽసౌహాసనం నిమిత్తీకృత్య, నిహ్నుతిపరః, ప్రియతమశ్చ,
> తదీయం వ్యళీకం కాసోఢుం సమర్థా ? (అతోహన్యతఏవ)''

మీఁది యాంధ్రీకృతికి మూలమగు శ్లోకము-అమరుశతకమునందిట్లున్నది.

> ''కోపాత్ కోమలలోల బాహులతికా పాశేనబద్ధ్వా దృఢం
> నీత్వావాసనికేతనం దయితయాసాయం సఖీనాంపురః।

'ధూమో నైవ' మితిస్థలత్కలగిరా సంసూచ్య దుశ్చేష్టితమ్
ధన్యోహన్యత ఏవనిహ్నుతి పరః ప్రేయాన్ రుదత్యాహసన్ ; అని.

ఇక్కడట, రూపకము - ప్రారంభింపఁబడినను, రసపోషణమునకు ప్రతికూల మగుటవలన, సమాప్తినొందింపఁబడుటలేమ. కనుక నిది - 'అతినిర్వహణ వాంఛ నందకుండుట' కుదాహరణమగుచున్నది.

(72) మూలము : — నిర్వహించుటకు - (నిశ్శేషముగాఁ బరిసమాప్తి నొందించుటకు.) వాంఛింపఁబడిన యలంకారమును గూడ - (అంగియగురసమునకు) 'అంగముగా' నుండునట్లు ప్రయత్నమువలన, ప్రత్యవేక్షించుటకుదా :—

ముత్యాలసరము :—

(౧) శ్యామః నీ వీక్షా ప్రసారము
చకిత హరిణీ దృష్టిఁగాంతును.
శ్యామలతలం, దచ్ఛమగు నీ
యంగమును గాంతున్.

(౨) చంద్రునందు భవత్ కపోల
చ్ఛాయయును, శిఖిబర్హ భారము
లందు నీ కబరీ విహారము,
నతివః భావింతున్ !.

(౩) ఇందలి నదీ సూక్ష్మవీచులఁ
గందు నీ కనుబొమల నాట్యము;
నెందు నొక్కెడ, భీరుః నీసా
దృశ్య మొందనహో !

ఇత్యాదికము.

పరీక్షా : -- మీఁది మూఁడుముత్యాల సరమునకు - మూలమగు మేఘ సందేశమునందలి శ్లోకమిది :—

శ్యామాస్వఙ్గం, చకితహరిణీ ప్రేక్షణే దృష్టి పాతం
గణ్డచ్ఛాయాం శశిని శిఖినాం బర్హ భారేషు కేశాన్ ।
ఉత్పశ్యామి ప్రతనుషు నదీవీచిషు భ్రూవిలాసాన్
హన్తైకస్థం క్వచిదపిన తేభీరు! సాదృశ్యమస్తి. ।

లోచనము : — "నిర్వహించుటకు" అనఁగా, "నిశ్శేషముగాఁబరిసమాప్తి నొనరించుటకు" అని యర్థము. పాండిమతోను, తనిమతోను, కంటకితత్వము తోను, గూడఁ-గూడి యుండుటవలన, "శ్యామలతలందు" అనగా, ప్రియంగుల తలయందు- (నీ శరీర సంపదను గనుచుందును,) చంద్రునందు - పాండురత్వము వలన, (నీ చెక్కిళుల కాంతిని) కందున్ = ఉత్ప్రేక్షింతును. (దేనికొఱకు ?) 'జీవితసంధారణముకొఱకు' అని యర్థము. అహో = కష్టము.

పరీక్షా ! — "ప్రస్తుతమగు విరహిణీ దశయందు-నీ శరీరము-పాండిమను, (తెల్లనై యుండుటను) తనిమను (కార్శ్యమును) కంటకితత్వమును, (రోమాంచ మును గలిగి యుండుటను) బొందియుండును. కనుక, పాండిమయు, (తెల్ల దనమును) తనిమయు, (కృశించియునికియు) కంటకితత్వమును, (సూదికొనల వంటి అగ్రావయవములు గలిగియుండుటయుఁ) గల ప్రియంగు లతలందు - నీ శరీరమును సంభావించుచున్నాను. విరహముచేత - వివర్ణతనొంది, పాండురమై యుండుటవలన చంద్రకాంతినే - నీకపోలచ్ఛాయఁగా దలంచుచున్నాను. ఈ నా జీవితమును చక్కఁగా ధరించుటకు - మీఁది పదార్థములయందు - నీ రూపము నిట్లు భావించికొనుచుందును." అనునది మీఁది లోచనాభిప్రాయము.

లోచనము : — ఏకస్థసాదృశ్యాభావమున (మీఁది వస్తువులలో నెచ్చటను గూడ నొక్కచోట - సమస్తమగు నీసాదృశ్యము లేకుండుటవలన. దోలాయ మానుఁడనగు నేను - సర్వస్థలములందును వర్తించుచు, ఒకే వస్తువునందెచ్చటను గూడ - ధృతి (ధారణము) నొందకున్నాను. "భీరూ" అను దానిచేత-(సంబో ధనముచేత-) 'ఎవఁడు, కాతరహృదయుఁడగుచుండునో, వాఁడు - సర్వస్వమును (సర్వధనమునుగూడ) నేకస్థముగా ధరింపఁడు.' అనునర్థము - (గమ్యమని,) తెలియునది.

పరీక్షా : -- లోచనమున 'భీరూ' అనుదానిచేతఁ - (గమ్య

ముగా() జెప్పఁబడిన యర్థము - క్లిష్టముగానున్నది. అందలి యభిప్రాయము నిట్లు భావింపఁదగునని తోఁచినది. భయశీలుఁడగువ్యక్తి - సర్వస్వము ను (తన ధనమునంతను) గూడ-(అన్యాపహరణ భయమున) నొకే స్థలమునందు నిలుపఁడుగదా! కనుకనే భీరువవగు నీవు-నీసాదృశ్య ధనము నొక్కచో నుంచక, పెక్కుస్థలములందుంచితివి. అనిగాని, విరహోద్వేగమున ధైర్యమును గోల్పోడిన నేనును నీవలెనే భీరువునైయున్నాను. నీసాదృశ్యమంతయు నొక్కచోట లేకుండుటవలన నూయలవలెనూగుచున్న హృదయముగల నేను-నీసాదృశ్యముగల ప్రతివస్తువు నొద్దకునుదిరుగుచు నొకేవస్తువునందెచ్చటను గూడ - నిన్ను ధరింప లేకున్నాను, కనుక - ధృతిలేనివాఁడగుచున్నాను. భీరువుల హృదయ చాంచల్యము - భీరురాలవగు నీకుఁదెలియనిది కాదు'' అనిగాని, ''భీరూ'' (భీరు రాలా) అను సంబోధనముచేత - ఇచట గమ్యము అని. భావించునది,

లోచనము :— తద్భావాధ్యారోపరూపయగు ('అది' కాని వేరొక వస్తువును, 'అదిగా' సంభావించునదియగు) నుత్ప్రేక్షకు - అను ప్రాణకమగు (అంగమగు) సాదృశ్యమీపద్యమున నెట్లుపక్రమింపఁబడినదో, అట్లు నిర్వహింపఁబడినది, అయినను, విప్రలంభ శృంగార రసమును బోషించునదియే యగుచున్నది గదా!

ప్రభా:— ''స్వకాంతా దృష్టి ప్రసారము, స్వకాంతా శరీరము, మున్నగునవి కానివియగు-చకితహరిణీ దృష్టి ప్రసారము, శ్యామలతలు, మున్నగువానిని - స్వకాంతా దృష్టి ప్రసారము, స్వకాంతా శరీరము, మున్నగువానినిగా - సంభావించునదియగు నుత్ప్రేక్షకిచట- గమ్యమగు సాదృశ్యమనుప్రాణ కమగుచున్నది. [అంగమగుచున్నది.] ఇచట నారంభింపఁబడిన యీసాదృశ్యముత్ప్రేక్షా నిర్వహణద్వారమున, నిర్వహింపఁబడినది. (సమాప్తినొందింపఁబడినది.) అట్లు సమాప్తి నొందింపఁబడినను గూడ - 'ప్రయత్నించి - ప్రత్యవేక్షించుట' అను సమీక్షావిధానము ననుసరించుటవలన, నిచటఁ బ్రధానమగు ప్రవాస విప్రలంభ శృంగారరసమున కంగమగుట నతిక్రమింపక - దానిని బోషించునదియే యగుచున్నది''. అని భావము,

అవ :— వృత్తికారుఁడు :— సమీక్షా ప్రకార నిరూపణమును ముగించుచున్నాడు.

(73) మూలము : — కవిచేత నొనర్పఁబడునదియగు రసాభివ్యక్తికి - ఇట్లుపనిబంధింపఁబడిన యలంకారమే - హేతు

వగుచుండును.

మీఁదనుగ్గడింపఁబడిన (సమీక్షా) ప్రకారమునతిక్రమించుట - రసభంగహేతువు కాకతప్పదు. అయినను, తథావిధమగు (మీఁది సమీక్షా ప్రకారమునతిక్రమించిన) లక్ష్యము - మహాకవి ప్రబంధములయందుఁ గూడ - అధికముగనే, కాన్పించుచున్నది.

ప్రభా :— అవ :— "మహాకవి కృతములగు ప్రబంధములయందు-మీఁది సమీక్షా ప్రకారమునతిక్రమించిన లక్ష్యమున్నయెడల; పాఠకులు గుర్తించుటకు-దానిని విభజించి; ప్రదర్శింపరాదా?" అనిన; 'ప్రదర్శింపము' అనుచున్నాఁడు.

(74) మూలము : — (అయినను) సూక్తి సహస్రద్యోతితాత్ము లగు మహాత్ముల దోషములను ఘోషించుట - ఆత్మదూషణమే (మమ్ము నిందించుకొనుటయే)యగును. కావున దానిని మాత్రము-(సమీక్షా ప్రకారమునతిక్రమించిన లక్ష్యమును మాత్రము) విభజించి ప్రదర్శింపము.

లోచనము:— "ఆ లక్ష్యమును మాత్రము - ప్రదర్శించువారముకాము' అనియర్థము.

అవ :— ప్రత్యుదాహరణము - (దుష్టలక్ష్యోదాహరణము) ప్రదర్శింపఁబడకున్నను,(పూర్వోక్తమగు) ఉదాహరణానుశీలన మార్గముచేతనే (మాకు) కృతకృత్యతకలిగినదని చూపుచున్నాఁడు.

(75) మూలము :— రసాదివిషయమగు వ్యంజకత్వమున, - ఏయీ, లక్షణసంగ్రహము - దర్శింపఁబడినదో, దానిననుసరించుచు, అన్యమగు లక్షణమునుగూడ నుత్ప్రేక్షించువాఁడగుచు, సమాహితచేతస్కుఁడగు సుకవి-పూర్వోక్తమగు, నీ యసంలక్ష్య క్రమప్రతిభ (వ్యంగ్య) మగు, ధ్వనిస్వరూపము నుపనిబంధించునెడల, నప్పు డాతనికి 'మహీయమగు, నాత్మలాభము' (మహాకవిత్వలాభము) కలుగును" అనితెలియునది.

లోచనము :— "అన్యమగు లక్షణమును" - అనఁగా, "అవసరమగు నపుడు త్యజింపఁబడిన యలంకారమునుగూడ - తిరుగ గ్రహించుట' మున్నగు పరీక్షాప్రకారమును," అనియర్థము. దీనికి-('అవసరమగునపుడు త్యజించిన యలంకారమునుగూడఁ దిరుగ గ్రహించుట' అను సమీక్షా ప్రకారమునకు-) మదీయమే (అభినవగుప్తకృతమే) యగు నుదాహరణము :—

అమృతవుఁ జాలులేని మిహికాంశుకరాలు - మదాత్మకింతతా
పమిడునె? కాలకూట సహవాసమునం జెడెనేమొ? ప్రాణధా
మముఁగొనవే? ప్రియావచనమంత్ర సువర్ణములోమె నన్నఁ, మో
హమెుదవనేల? ఈగతియహో? తెలియంబడదయ్యె నేడియో !

అనుచితము - రసపరిపోషణమునకై రూపక, సందేహ, నిదర్శనములు త్యజింపఁబడి - తిరుగ గ్రహింపఁబడినవిగదా! ఈప్రకార నిరూపణము నికఁ జాలింతును.

ప్రభా :— మీఁదియాంధ్రీకృతికి-మూలమగు, శ్రీమదభినవగుప్త పాదుల శ్లోకమిట్లున్నది :—

శీతాంశోరమృతచ్ఛటా యదికరాః కస్మాన్మనో మే భృశం ।
సమ్ప్లుష్యన్త్యథ కాలకూటపటలీ సంవాససన్దూషితాః ?
కింప్రాణాన్న హరన్త్యుత ప్రియతమా సంజల్పమన్త్రాక్షరై
రక్ష్యన్తేకిము మోహమేమి? హహహా నోవేద్మి కేయంగతిః ?

"మంచుచేత - చల్లనివగు కిరణములుగల చంద్రుని కరములు - అమృతచ్ఛటలు." (అమృత ప్రవాహములు.)అని లోకప్రసిద్ధియున్నది. "అట్లయినయెడల; అవి - నాహృదయము నింతయధికముగా నేల సంతాపింపఁజేయును? ఓహో! తెలిసినది. ఆచంద్రకిరణములు - క్షీర సముద్రమునందొకప్పుడు కాలకూట (విష) సందోహముతోఁగూడి - సహవాసము నొనర్చుటవలన - సంతాపింపఁ జేయునదియగు, విషదోషముచేత - దూషితములై యుండవచ్చును. అట్లయిన యెడల; విషదూషితములగునవి - నా ప్రాణప్రథ న్నేల హరింపకున్నవి? సరియే గ్రహించితిని. నాప్రాణములు - నాప్రియురాలి వాక్కులేయగు మంత్రముల యక్షరములచేత రక్షింపఁబడుచుండవచ్చును. అగుచో- నాకీమోహమేలకలిగినది? ఈయవస్థయేదో నేను గ్రహింపలేకున్నాను." అనునది- దీనియర్థము.అమృతవుఁ

జాలులేని (లేక, అమృతపుజాలులేని) మిహికాంశుకరాలు = ''హిమకిరణుఁ డగు చంద్రుని కిరణములు - అమృతచ్ఛటలు. (లేక అమృత ప్రవాహములు) అను రూపకమును, ''కాలకూట సహవాసమునన్ జెడెనేమొ'' అనుచోట- సందేహమును, ''ప్రియావచన మంత్రసువర్ణములు'' అనుచోట-నిదర్శనయు, నున్నవి.

(1) ''మిహికాంశునికరములు - అమృతపుఁజాలులు'' లేక 'అమృతపు జాలులు' అనురూపకము- ''మహాత్మకింతతాపమిడునె'' అనుదానిచేత -త్యజింపఁబడి, 'కాలకూట సహవాసమునన్ జెడెనేమొ'' అనుదానిచేత - తిరుగ గ్రహింపఁబడినది.

(2) ''కాలకూట సహవాసమునన్ జెడెనేమొ'' అను సం దే హ ము - ''ప్రాణధామముఁ, గొనవే'' అనుదానిచేత - విడువఁబడి, ''ప్రియావచనమంత్ర సువర్ణములోమెను'' అనుదానిచేత గ్రహింపఁబడినది.

(3) ప్రియురాలికి సంబంధించిన మాటలు - మంత్రమునకు సంబంధిచిన యక్షరములు. అని, బింబ ప్రతిబింబ భావాపన్నములగు వస్తువులతోఁ గూడిన, యుపమేయవాక్యార్థమునకును,నుపమానవాక్యార్థమునకును, నైక్యమునారోపించు టయేరూపముగాగల''ప్రియావచనమంత్రసువర్ణములు''అనునిదర్శనము-''మోహ మొదవనేల? అనుదానిచేత విసర్జింపఁబడి, ' ఈగతియహో! తెలియంబడదయ్యె నేదియో,''అనుదానిచేతఁ-దిరుగగ్రహింపఁబడినది.'' అనితెలియునది. ఇది-సంలక్ష్య క్రమ ధ్వనియగు రసాదికముఁన-రూపకాద్యలంకారముల, నంగములుగా నొనర్చునప్పుడు, మహాకవి - ప్రత్యవేక్షింపవలసినదియగు సమీక్షాప్రకారమని తెలియునది.

లోచనము: -అవః— ఇట్లు, వివక్షితాన్యపరవాచ్య ధ్వనికిసంబంధించినప్రథమ భేదమగు నసంలక్ష్యక్రమమును విచారించి, ద్వితీయ భేదమును (సంలక్ష్య క్రమ ధ్వని భేదమును) విభజించుటకుఁ దెలుపుచున్నాఁడు.

(76) మూలము:— [కా] క్రమేణ ప్రతిభాత్యాత్మా
యోఽ స్యానుస్వాన సన్నిభః
శబ్దార్థ శక్తి మూలత్వాత్
సోఽపి ద్వేధావ్యవస్థితః.

గీ॥ క్రమముఁబాటించి ప్రతిభాసితమగు చునికిఁ,
దగననుస్వాన నిభమైన, దానియాత్మ -

శబ్దశక్తి మూలము, నర్థశక్తి మూల
మును, నగుటఁ - దానును - ద్విభేదమునఁదనర్చె.

లోచనము :— ( క్రమేణ ప్రతిభాత్యాత్మా ) "క్రమముఁబాటించి," అనునిందలి ప్రథమపాదము - అనువాదభాగమై యున్నది. (వివక్షితాన్యపరవాచ్యధ్వనికి సంబంధించిన ద్వితీయభేదమగు) సంలక్ష్యక్రమ ధ్వని - అనుస్వాన సన్నిభమగుటకు-('క్రమేణ ప్రతిభాతి')"క్రమముఁబాటించి ప్రతిభాసితమగుచునికి" అను ప్రథమ పాఠము-హేతువుగాఁజెప్పఁబడినది.

ప్రభా :— హేతువగు నిందలి ప్రథమపాదముచేత - "సంలక్ష్యక్రమధ్వని - చక్కఁగాలక్షింపఁదగిన క్రమముచేత ప్రతిభాసించును" (అనుసరించి భాసించును.)అనునర్థమేర్పడుచున్నది. ఆంధ్రీకృతియందు "క్రమముఁబాటించి, ప్రభాసితమగుచునికి" అనుచోట - "ఉనికిన్" అనుదానిచేత - హేతువు - స్పష్టీకరింపఁబడియున్నది. సంస్కృతమున నీ హేతువు - స్ఫుటీకృతమైలేదు,

లోచనము:— ఘంటయొక్క, అనురణనము - అభిఘాతముచేత-(దెబ్బచేత) జనించిన శబ్దముననుసరించి- క్రమముచేతనే భాసించును.

ప్రభా:— "సంలక్ష్యక్రమధ్వని-గంట మ్రోగించునపుడు జనించునదియగు మొదటిమ్రోత (నాదము) ననుసరించి, క్రమముగా నుదయించునదియగు, (చప్పుడు) అనునాదము-వంటిది. కనుక, "అనుస్వాన (అనురణన) సన్నిభము, అనుస్వానతుల్యము, అనురణనప్రఖ్యము అనుస్వానోపమము, అనుస్వాన రూపము," మున్నగు నామములఁ బేర్కొనఁబడును." అనితెలియునది.

లోచనము :— [''సోఽపి'' అనుచోనున్న 'అపి' శబ్దార్థము -] 'తానును' అనుచోటనున్న తాశబ్దముతోఁగూడిన 'ను'శబ్దార్థము - "ధ్వని - మూలభేదములచేత - ద్వివిధము మాత్రమేకాదు, వివక్షితాన్య పరవాచ్యముకూడ-ద్వివిధము మాత్రమేకాదు. ఇదికూడ - ద్వివిధమే అనునది.

ప్రభా :— "ధ్వనికి- అవివక్షితవాచ్యము, వివక్షితాన్యపరవాచ్యము" అని మూలభేదములు - రెండున్నవి. అందు - అవివక్షిత వాచ్యము - 'అర్థాంతర సంక్రమిత వాచ్యము, అత్యంత తిరస్కృత వాచ్యము,' అనిద్వివిధము. వివక్షిన్యపరవాచ్యము - 'అసంలక్ష్యక్రమవ్యంగ్యము, సంలక్ష్యక్రమ వ్యంగ్యము,' అని ద్వివిధము. అసంలక్షక్రమ వ్యంగ్యమను వివక్షితాన్య పరవాచ్య ప్రథమ భేదము -

శృంగారాది భేదములచేత ననంతమైయున్నది. సంలక్ష్య క్రమవ్యంగ్యమను, వివక్షి తాన్యపరవాచ్య ద్వితీయభేదముకూడ - 'శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము,' అని ద్వివిధము అనునది. - "తానును, అనుదానిచేతఁ దెలుపఁబడుచున్నది" అని దీనిభావము.

ప్రి॥ :— అవ :— మీఁదికారికార్థమును వృత్తికారుడు వివరించుచున్నాఁడు.

(77) మూలము : — ఈ వివక్షితాన్య పరవాచ్య ధ్వనికి సంబంధించిన ద్వితీయ ధ్వనిభేదము -సంలక్ష్య క్రమమగుటవలన, అనురణన ప్రఖ్యమగుచున్నది. అదికూడ -శబ్దశక్తిమూలము, అర్థ శక్తిమూలము, అగుచుండును. కనుక, ద్విప్రకారమగు చున్నది.

ప్రి॥ :— "ఘంటాశబ్దమునకును, దానిననుసరించి, తరువాత జనించునదియగు ప్రతిశబ్దమునకును గల క్రమము - చక్కఁగాలక్షింపఁదగినట్లు, వాచ్య ప్రతీతికిని, అది కలిగిపిమ్మట స్ఫురించునదియగు వ్యంగ్యప్రతీతికిని, గలక్రమము కూడ - చక్కఁగా లక్షింపఁదగినదగుటవలన- 'అనురణన,' 'అనుస్వరణములకు' సామ్యము చెప్పఁబడినది. కనుక, సంలక్ష్యమగు క్రమముగల వివక్షితాన్యపర వాచ్య ధ్వనిభేదము-అనురణనతుల్య" మని చెప్పఁబడును. "ఇచటఁ జెప్పఁబడిన, 'శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము' అగు సంలక్ష్యక్రమ (అనుస్వానోపమ) ధ్వని - శబ్దార్థ (ఉభయ) శక్తిమూలమగు, తృతీయభేదమునకుఁగూడ - ఉపలక్షణము" అని తెలియునది. కావ్యప్రకాశమునందు —

> అనుస్వానాభ సంలక్ష్యక్రమవ్యఙ్గ్యస్థితిస్తు యః ।
> 'శబ్దార్థోభయశక్త్యుత్థః' త్రిధా సకథితో ధ్వనిః.

అని, అదికూడ - సంగ్రహింపఁబడినది,

అవ :— "అయ్యాః శబ్దశక్తి యనఁగా; అభిధయే. అభిధావ్యాపారముచేత - ఎచట, ద్వితీయార్థమునకు ప్రతీతికలుగునో; అది - శబ్దశక్తి మూలమగు సంలక్ష్యక్రధ్వని ప్రకారమగు నెడలః శ్లేషాలంకారలక్ష్యములుకూడ- శబ్దశక్తి మూలమగు నీధ్వని ప్రకారము చేతనే - ఆక్రమింపఁబడుటవలన- శ్లేషాలంకారము నిరవకాశమగును." శ్లేషమునందుఁగూడ - తృతీయార్థము- అభిధచేతనే బోధింప

షమునుగదా!'' అనియాశంకించి, శ్లేషాలంకారమునకును, శబ్దశక్తిమూలధ్వనికిని, గల విషయభేదమును జూపుటకు, వృత్తికర్త-కారిక నవతరింపఁజేయుచున్నాఁడు.

(78) "మూలము : అవ : — "అయ్యా ! శబ్దశక్తిచేతఁ గాపింపఁబడునదియగు నర్థాంతర ప్రకాశనము-ధ్వని ప్రకారముగాఁ జెప్పఁబడునెడల; శ్లేషమునకుఁగల విషయము - అపహరింపబడవల సియేవచ్చును." అనునెడల; "శ్లేషవిషయ మపహరింపఁబడదు"అనుచున్నాఁడు.

[కా] ఆక్షిప్త ఏవాలఙ్కారః, శబ్దశక్త్యా ప్రకాశతే।
యస్మిన్ననుక్తః శబ్దేన, శబ్దశక్త్యుద్భవో హి సః (21)

గీ॥ కావ్యమున శబ్దమున ననుక్తమయి, శబ్ద
శక్తినాక్షిప్తమయి, ప్రకాశమ్ము నొందుఁ;
గావునను దానలంకారమే-విభాసి
తమ్మగును శబ్దశక్త్యుద్భవమ్మనంగ.

"వస్తుమాత్రముకాక, అలంకారమే - కావ్యమునందు - శబ్దశక్తిచేత-ఆక్షేపింపఁబడి, ప్రకాశించును. కనుక, నాయలంకారము-శబ్దశక్త్యుద్భవమగు ధ్వని" అని మేము వివక్షించుచున్నాము. అట్లుగాక, వస్తువులు రెండునుగూడ - శబ్దశక్తిచేతనే-ప్రకాశించునపుడు మాత్రము-శ్లేషమేయగును.

లోచనము :— (వృత్తికర్త-) కారికాగతమగు హి శబ్దమును ''కనుక'' అని, వ్యాఖ్యానించుచున్నాఁడు. ''అలంకారమే'' అనుచోట- అలంకార శబ్దమునకు (కారికయందలి, ఏవకారార్థముచేత) వ్యవచ్ఛేద్యము (వారింపఁదగి శము- అనఁగా; వస్తుమాత్రముకాదనునది-) ప్రదర్శితము. (సం వృత్తియందలి)చశబ్దము('కూడ'అనునర్థముగలది) తుశబ్దార్థమున అనునర్థమునందుఁ]ప్రయోగింపఁబడినది.[కనుక, ''ప్రకాశి

అని యాంధ్రీకృతియందు- మశబ్దార్థమగు మాత్రపదము-ప్రయోగింపఁబడినది.)

పరీక్ష :— "వస్తువులు రెండునుగూడ" అనఁగా; అలంకారరూపము కానివగు నర్థములు రెండునుగూడ - శబ్దశక్తిచేత వాచ్యములుగానే ప్రకాశింపఁ జేయఁబడునపుడది - వాచ్యమగు శ్లేషమేయగుననుట కుదాహరణము నొసఁగుచున్నాఁడు.

**(79)** మూలము :— వాచ్యమగు శ్లేషాలంకారమున కుదాహరణము. కేసరివృత్తము - ప్రభామతి ప్రసారితము.

కని "యేనధ్వస్తమనోఽభవేన + ఖలజిత్ + కాయః పురాఽస్త్రీకృతః ప్రణుతశ్చోద్వృత్తభుజఙ్గహార + వలయోఽగంగాంచయోఽధారయు" త్తనిదివ్యర్షుల్ - 'శశిమచ్ఛిరోహ + రః పరాత్మా' ।యందు రెవ్వానియా ఖ్యనుమానాథుండదఁదంధకక్ష + యకరుండాస్వామి-మిమ్మేలుతన్ ।.

పరీక్ష :- అనుకృతిరూపమగు, మీఁదికేసరివృత్తము - క్రొత్తది. దీనికి మూలమగు, సంస్కృతశ్లోకము - సుభాషితావళియందుద్ధరింపఁబడినది. చంద్రకుఁడనుకవి - దీనినిరచించెను, శార్దూలవృత్తరూపముననది - యిట్లున్నది.

యేనధ్వస్తమనోఽభవేన బలిజిత్కాయః పురాఽస్త్రీకృతః
యశ్చోద్వృత్తభుజఙ్గహార వలయోఽగంగాంచయోఽధారయత్ ।
యస్యాహుః శశిమచ్ఛిరోహర ఇతిస్తుత్యంచ నామామరాః
పాయాత్ సస్వయ మన్ధకక్షయకరస్త్వాం సర్వదోమాధవః. అని.

ఆంధ్రీకృతియందుఁబ్రసారింపఁబడిన కేసరివృత్తము-21వ ఛందస్సునుండి స్వీకరింపఁబడినది. ఇది - 21వ ఛందస్సునందలి 597348వ సంఖ్యగల వృత్తమైయున్నది. దీనిని పూర్వకవులు - ప్రయోగించియుండుటలేదు, సంస్కృతాంధ్రచ్ఛందోలక్షణముల యందెచటనుగూడ దీనికి,- నామ యతి, విభాగమొనర్పఁబడియుండుటలేదు. దీనికినామమును, యతినిర్ణయమును. పరీక్షామతికర్తచేతనే ) సంఘటింపఁబడినవి. దీనియందలి తాళము- చతురశ్రజాతి త్రిపుట.(ఆదితాళము- దీనియందలి గణములు :- స, త, జ, భ, య, ర, ర. విశ్రాంతిస్థానము :- 11వ యక్షరము. (కనుక, దాని తరువాతిదియగు 12వ యక్షరము - ప్రథమాక్షరమునకు సామ్యముగలదిగానుండును.) దీనియందు - మానాథ (విష్ణు) పరముగను,

ఉమానాథ (శివ) పరముగినుగల యర్థములను రెండింటిని - లోచనోక్తమగు వ్యాఖ్యాననుసరించి, క్రమముగా నిట్లెఱుఁగునది. "ఛందోఽనురోధమువలన-శ్లోక మునందలి "బలిజిత్" అను పదము - ఆంధ్రీకృతియందు మార్పునొందింపఁబడి 'ఖలజిత్' అని రచింపఁబడినది ]

లోచనము :— (మానాథ (విష్ణు) పరమగునర్థము :-) [తని = చూచి, తెలిసికొని] బాలక్రీడయందు, యేన = ఏమాధవునిచేత, అనః = శకటము, ధ్వస్తమ్ = విరుగగొట్టఁబడినదో, బలిజిత్కాయః = (ఖలజిత్కాయః = ) బల వంతులగు (ఖలులగు) దానవులను జయించిన శరీరము, పురా = అమృతహరణ కాలమున, స్త్రీకృతః = స్త్రీగాఁజేయఁబడినదో, (పరిణుతః = ప్రకృష్టముగా నుతింపఁబడిన) యః = ఏమాధవుఁడు - ఉద్వృత్తభుజఙ్గహా = మదముతోఁ గూడిన కాళియుఁడను-పేరుగల సర్పరాజును పాదములచేతఁ ద్రొక్కెనో; అ కా రము - విష్ణువని చెప్పఁబడుటవలన, (ఎవఁడు) రవలయః = (అకార, శబ్దము నందు లయముగలవాఁడో, (అకారరూపశబ్దమునందగు తాదాత్మ్యముగలవాఁడో, అనఁగా; శబ్దాత్మకుఁడో) చ = మఱియు, యః = ఏమాధవుఁడు, అగమ్ = గోవర్ధనపర్వతమును, గాంచ = పాతాలగతమగు భూమినిగూడ, అధారయత్ = ధరించెనో; (అని,) దివ్వర్షల్ = దివ్యర్షులు, ఎవ్వానియాఖ్యను = ఎవనినామ మును, శశిమచ్ఛిరోహరః = చంద్రుని మథించినరాహువునకు సంబంధించిన మస్తకమును దెగఁగొట్టినవాఁడా! పరాత్మా = శ్రేష్ఠస్వరూపా! అనియందురో, అతఁడు = వాఁడు, మానాథుఁడు = మాధవుఁడగు విష్ణువు. అంధకక్షయక రుండాస్వామి = అంధకులను పేరుగల జనులకు - ద్వారకయందు-నివాసముల, నొసఁగినవాఁడు, లేక, మౌసలమునందు - ఇషీకలచేత (బాణములచేత) అంధ కులను నశింపఁజేసిన ప్రభువు-మిమ్మున్ + ఏలుతన్ = మిమ్ము రక్షించుగాక!"అని యర్థము. (ఉమానాథ (శివ) పరమగు ద్వితీయార్థము.] ధ్వస్తమనోభవేన = కామధ్వంసము నొనర్చిన, యేన = ఏయుమాధవునిచేత (ఖలజిత్ కాయః) = బలిజిత్కాయః = [ఖలులనులేక,] బలిని, జయించిన విష్ణునికి సంబంధించిన శరీ రము. పురా = త్రిపురములను నిర్దహించునవసరమున, అస్త్రీకృతః = బాణ ముగాఁజేయఁబడినదో, యః = ఎవఁడు, ఉద్వృత్తభుజఙ్గహార, వలయః = మదిం చిన సర్పములే హారములుగను, వలయములుగను, గలవాఁడో, చ = మఱియు, గఙ్గాం = మందాకినిని, యః = ఎవఁడు, అధారయత్ = ధరించెనో! దివ్య ర్షల్ = దేవర్షులు, ఎవనినామమును - శశిమచ్ఛిరోహర = చంద్రునితోఁగూడిన శిరస్సుగలవాఁడవగు హరా!, పరాత్మా, అని పేర్కొందురో; అంధకక్షయకరుండా స్వామి = అంధకాసురుని స్వయముగనే, వినాశము నొందించిన ప్రభువగు,

ఉమానాథుండు = అతఁడు = ఉమావల్లభుఁడగు నాఁపృష - మిమ్ము రక్షించుఁ గాక!" అనియర్థము. ఇచట (మాధవోమాధవులిద్దరును గూడ - స్తుతింపవలసినవారే యగుటవలన) ద్వితీయమగు వస్తుమాత్రమే - ప్రతీతమగుచున్నది. కాని, (ధ్వన్యమానమగు) అలంకారము - ప్రతీతముకాలేదు. కనుకనిది-(వాచ్యమగు) శ్లేషమునకే విషయమగుచున్నది. కారికాగతమగు, ఆక్షిప్తశబ్దమునకు వ్యవచ్ఛేద్యమును (వారింపఁదగిన యంశమును) జూపుటకు- ప్రశ్నరూపమగు ప్రారంభము నొనర్చుచున్నాఁడు. 'అయ్యా!' అని.

(80) మూలము : అవ : "అయ్యాః (వస్తుప్రకాశించునప్పుడేకాక,) శబ్దశక్తివలన- అలంకారాంతరము - ప్రతిభాసించునప్పుడుకూడ - శ్లేషమనియే, చెప్పవలయును." అని భట్టోద్భటుని చేత-ప్రదర్శింపఁబడినది. కనుక, "ఁదిరుగశబ్దశక్తిమూలమగుధ్వని- నిరవకాశమేయగును" అనియాశంకించి - [కారికయందు] "ఆక్షిప్తమయి" అనునిది - (సమాధానము) చెప్పఁబడినది. కనుక, నిందలి యర్థము నిట్లెఱుఁగనగును." ఎచ్చట, (ఏకావ్యమున) శబ్దశక్తిచేత- (సాక్షాత్తుగా వాచ్యమగు వేరొక వస్తువు మాత్రమేకాక) సాక్షాత్తుగా వాచ్యమగుచు, వేరొక యలంకారము ప్రతిభాసించునో, అది యంతయు-(వాచ్య) శ్లేషమునకే విషయమగుచుండును. ఎచ్చట- 'శబ్దశక్తిచేత'-అనఁగా;శబ్దసామర్థ్యముచేత-ఆక్షిప్తమును, (అనఁగా వ్యంజితమును)వాచ్య వ్యతిరిక్తమును, నయి వ్యంగ్యమగు వేరొక యలంకారమే - ప్రకాశింపఁజేయఁబడునో, (అప్పుడుమాత్రమే) అది-ధ్వనికి విషయమగును." అని. శబ్దశక్తిచేత-సాక్షాత్తుగా(వాచ్యమగుచు)వేరొక యలంకారము-ప్రతిభాసించుట కుదాహరణము:—

కం॥ హారము లేనివె'యయినను'
'హారులు' సహజములుగానె యగునవి-యెవియో;
ఆరమణి పయోధరముల;
వేరికి విస్మయము సంఘటింపనివి యగున్ ?.

ఇచట - విస్మయమను పేరుగల, శృంగారవ్యభిచారి భావమును - (అవ్యభిచారి భావమువలె) విరోధాలంకారమును-గూడ, సాక్షాత్తుగానే (వాచ్యమై) ప్రతిభాసించుచున్నవి. కనుక, నిది - విరోధచ్ఛాయ ననుగ్రహించునదియగు, శ్లేషమునకే - (శ్లేషవిరోధ సంకరమునకే-) విషయమగును. కాని, అనుస్వానోపమమగు ధ్వనికి - విషయము - కానేరదు.

లోచనము :— 'వినాఽపి' (హారములేనివె యయినను) అనుచోనున్న, యీ అపిశబ్దము - (అపిశబ్దార్థముగల 'అయినను' అనునది-) విరోధమును దెలుపుటవలన, 'హరతో హృదయమవశ్యమితిహారిణౌ' ('అవశ్యముగా హృదయము నాకర్షించుచున్నవి కనుక, హారులు') అనియు, 'హారోవిద్యతేయయోస్తౌ హారిణౌ' (వేనికి - హారము - అనఁగా ముక్తామాల్యమున్నదో, అస్తనములు - 'హారులు'. అనఁగా, 'హారవంతములు') అనియు, అర్థములు - రెంటియందును గూడ - అభిధాశక్తిని నియమించును. కనుకనే, ('అయినను', అనునపిశబ్దార్థముండుటవలననే) విస్మయశబ్దము - ఈయర్థమునకే - ఉపోద్బలకమగుచున్నది. ఇచట, అపిశబ్దము ('అయినను'అనునది) లేనిమొకలనో, అప్పుడు, స్వసౌందర్యమువలననే, స్తనములు - విస్మయహేతువులగుట-కుదురును. కనుక, ఆవిస్మయశబ్దమువలననే - ఈయర్థద్వయము తెలుపఁబడినది. కాకపోవలసివచ్చును.

ప్రభా :- దీనికి మూలమగు శ్లోకమిట్లున్నది. :—

''తస్యావినాఽపి హారేణ నిసర్గాదేవ హారిణౌ।
జనయామాసతుః కస్యవిస్మయం నపయోధరౌ.'' అని.

విరోధములేకున్నను విరోధమున్నట్లు - అభాసించుటవలన నిందలి యలంకారము - విరోధాభాసమని చెప్పఁబడును.

''అరమణి పాలిండ్లు- హారములేనివెయయినను - ముక్తామాలలేనివైనను గూడ, హారులు = హారముకలవి.'' (హారవంతములు) అనునది - విరోధము. హారముయొక్క లేమియు, కలిమియు, ఒకచోటనుండుట - విరుద్ధముగదా।. ''హృదయము నవశ్యముగా హరించునవి. కనుక,- హారులు''. అనునర్థముచేత- మీఁది విరోధము - పరిహరింపఁబడును. కనుకనిది - శ్లేషానుగ్రాహ్యమగు (శ్లేష

ముచేత ననుగ్రహింపఁబడిన) విరోధాభాసమగుచున్నది. "హారములేనివె అయి నను" అనుచోనున్న. 'అయినను', అను అపిశబ్దార్థకముచేత-ఇచటి విరోధము-సాక్షాత్తుగనే వాచ్యమగుచున్నది. కనుక, "హారులు" అనుశబ్దమునకు- "హారము గలవి, మనస్సును హరించునవి", అనునర్థములు - రెండును, అభిధచేతనే - చెప్పఁదగినవగుచున్నవి. ఇట్లు - విరుద్ధమగునర్థము - బోధింపఁబడునపుడే- విస్మయము కలుగును. కనుక, విస్మయశబ్దముకూడ - విరుద్ధమగు - నీయర్థద్వయమును దెలుపుటయందు- సహకరించునదియగుచున్నది. విరోధమును సాక్షాత్తుగాఁ దెలుపునదియగు, "అయినను" అనునది- (అపిశబ్దార్థకము) ఇచట లేనియెడల, కేవలమగు విస్మయశబ్దముచేతనే - విరుద్ధములగు నీయర్థములు - తెలుపఁబడునవి కావు. ఏలయనిన; విరుద్ధమగునర్థము - బోధింపఁబడునపుడేకాక, స్తనములకుఁగల సహజసౌందర్యముచేతఁగూడ - విస్మయము - కలుగవచ్చునుగదా!.

అవ :— "విస్మయమను పేరుగల భావమును" అనివృత్తియందేల చెప్పఁబడినది ?" అనినఁ జెప్పుచున్నాఁడు

లోచనము :— "మీఁది పద్యమునందు - "విస్మయము" అనుశబ్దము చేత - (వాచ్యమగు) విస్మయము (ఆశ్చర్యము) ప్రతిభాసించినట్లే, "అపి, అను శబ్దముచేత ('అయినను' అను నపిశబ్దార్థకముచేత- వాచ్యమగు) విరోధముకూడ- ప్రతిభాసించును." అని, దృష్టాంతమును దెలుపుటకిచట- 'విస్మయమను పేరుగల భావమును-ప్రతిభాసించును.' అనునది - స్వీకరింపఁబడినది.

అవ : పూర్వ :— "అయ్యా! యిచట (మీఁది పద్యమునందు) సర్వథా (సర్వవిధములచేతను) ధ్వనిలేదా ?" అనియాశంకించి (వృత్తికర్త) చెప్పుచున్నాఁడు.

**(81)** మూలము : ఈపద్యము - వాచ్యమగు శ్లేషము చేతఁగాని, (వాచ్యమగు) విరోధముచేతఁగాని, వ్యంజితమగునలక్ష్య క్రమవ్యంగ్య ధ్వనికిమాత్రము - విషయమేయగును.

లోచనము : — 'విరోధముచేతఁగాని' అనుచోనున్న 'కాని' అనుదాని చేత - "ఇది - శ్లేష - వ్యతిరేక సంకరాలంకారము". అని ప్రదర్శింపఁబడినది. ఏలయనిన, అనుగ్రహయోగమువలన - [అనఁగా; ఇచటి విరోధము గ్రాహ్యమును, శ్లేషమునుగ్రాహకమును, నగుచుండుటవలన- ఈశ్లేష - విరోధములలో]

ఒకదానియొక్క - త్యాగమునకుఁగాని, గ్రహణమునకుఁగాని, నిమిత్తములేకుండు టయే - (ఇచట) 'కాని' అనుశబ్దముచేత - సూచింపఁబడుచున్నదిగదా!.

ప్రభా :— "ఇచటియలంకారములకు - త్యాగ, గ్రహణ, నిమిత్తము-లేకుండుటవలన, నిది - శ్లేషవిరోధ సంకరమగుచున్నది. దానిచేత - అసంలక్ష్య క్రమధ్వని - వ్యంజితము" అనితెలియునది. "ఇచట - శబ్దశక్తిచేత - సాక్షాత్తుగా వాచ్యమగుచునే, యలంకారాంతర (శ్లేష - విరోధసంకర) ప్రతీతి- కలుగుటవలన నిది-వాచ్యశ్లేషమేయగును. కాని, అనురణనతుల్యమగు సంలక్ష్యక్రమధ్వనికాదు." అనునది - ఫలితార్థము,

(82) మూలము :— మదీయమేయగు, నింకొక యుదాహరణము :- [ఆనందవర్ధన కృతశ్లోకమున కాంధ్రీకృతిరూపమగు 'క్రొవ్విరి' లేక 'నవలా' అను జాతీయపద్యము. దీనిని - చతురశ్ర జాతిగలయేకతాళమునఁగాని, ఆదితాళమునఁగాని, పఠింపదగును. ప్రతిపాదమునను 32 మాత్రలుండును. 16 మాత్రలపైని యతి యుండును.]

కలితసుదర్శన కరుఁడాహరి-శ్లాఘ్యాశేషశరీరను, చరణాంబుజ
లలితమున సమాక్రాంతలోకుఁ,డఖిలాంగలీలాజిత త్రైలోక్యను,
నెలరూపగుచక్షువుఁదాల్చిన పతి-నెలరూపగుమొగమెల్లఁగలసతిని,
కలికినెవతెఁదనమేనికిమిన్నగఁగనె,నారుక్మిణి-మిమ్ముబ్రోవుతను.

మీఁది పద్యమున, వ్యతిరేకచ్ఛాయానుగ్రాహి యగుశ్లేషము-వాచ్యముగానే ప్రతీతమగుచున్నది.

లోచనము :— సుదర్శనమనఁగా; చక్రము. అది - కరమునందుఁగల వాఁడు - 'సుదర్శనకరుఁడు' అనునది - వస్తుస్థితి ననుసరించునదియగు నర్థము వ్యతిరేకపక్షమున, 'సుదర్శనకరుఁడు' అనఁగా; 'శ్లాఘ్యములగు హస్తములు మాత్రమే కలవాఁడు.' అనునర్థమేర్పడును. చరణాంబుజమునకు సంబంధించిన 'లలితము' అనఁగా; 'త్రిభువనాక్రమణక్రీడనము.' 'నెలరూపగు చక్షువుఁదాల్చు నతఁడు' అనఁగా: 'చంద్రరూపమగు నేత్రమును ధరించినవాఁడు'. అనియర్థము.

"(తనమేనికి) మిన్నగఁగనె" అనుశబ్దముచేత-వ్యతిరేకము చెప్పఁబడుటవలన, ఇచటి వ్యతిరేకము - వాచ్యముగనే పరిశీలమగుచున్నది " అనియర్థము.

పరీక్షా :— "శ్లాఘ్యాశేషతనుం, సుదర్శనకరః; సర్వాఙ్గలీలాజిత
త్రైలోక్యాం, చరణారవిన్దలలితే నాక్రాన్తలోకోహరిః;
బిభ్రాణాం ముఖమిన్దురూప మఖిలం, చన్ద్రాత్మచక్షుర్దధత్;
స్థానేయాం స్వతనోరపశ్యదధికాం సారుక్మిణీవోఽవతాత్".

అనునిది - మీఁది యాంధ్రీకృతికి మూలమగు నానందుని శ్లోకము. ఆంధ్రీకృత పద్యార్థము నిట్లెఱుఁగునది, ఆహరి = ఆశ్రీకృష్ణుఁడు-కలితసుదర్శనకరుఁడు- 'కూర్పఁబడినచక్రము- హస్తమునందుఁగలవాఁడు.' అనియర్థము. "తనమేనికిమిన్నగఁగనెన్" అనుదానిచేత - వ్యతిరేకము - చెప్పబడుటవలన - ఇందలి పదములన్నిటియందునుగూడ - వ్యతిరేకము చెప్పవలసినదియే యగుచున్నది. కనుక, వ్యతిరేకపక్షమున, 'శోభనదర్శనముగల చేతులుమాత్రమే కలవాఁడు' అనియర్థము. శ్లాఘ్యాశేషశరీరను = కొనియాడఁదగిన శరీరమంతయుఁ గలదానిని, 'చరణాంబుజలలితమున సమాక్రాంతలోకుఁడు' అనఁగా, "పాదోఽస్యవిశ్వాభూతాని"అను శ్రుతిననుసరించి, ఏకపాద(భాగ) విలాసచేష్టితముచేత, నాక్రమింపఁబడిన సర్వలోకములుగలవాఁడు" అనియర్థము. వ్యతిరేకపక్షమున-"చరణపద్మచేష్టాదివిశేషముచేత-ఒక్కలోకమునుమాత్రమేయాక్రమించినవాఁడు "అనియర్థము. అఖిలాంగలీలాజిత త్రైలోక్యను = "నిజాంగములకు సంబంధించిన, ప్రతివిలాసచేష్టితముచేతను - జయింపఁబడిన మూఁడులోకములును గలదానిని"అనియర్థము. 'నెలరూపమగు చక్షువుఁదాల్చిన పతి' అనఁగా; 'చంద్రరూపమగు నేత్రముగల భర్త' అని సామాన్యార్థము. వ్యతిరేకపక్షమున, "ఒకనేత్రముచేతనే, చంద్రుని ధరించినవాఁడు" అనియర్థము, "నెలరూపగుమొగమెల్లఁగలసతిని" అనఁగా మొగమునంతను చంద్రరూపముగాఁగల సాధ్విని" అనియర్థము. కలికిన్ + ఎవతెన్ = ఏస్త్రీని, తనమేనికి మిన్నగఁగనెన్ = తనశరీరముకంటె నాధిక్యముగల శరీరముఁగలదానినిగాఁజూచెనో, ఆరుక్మిణి - మిమ్మురక్షించుగాక!" అనియర్థము. ఇచట - గమ్యమగు సామ్యముచేత - సంభావితమగు వ్యతిరేకము - 'తనమేనికి మిన్నగన్' అనుదానిచేత - వాచ్యము కావింపబడినది. "సుదర్శనకరుఁడు" ఇత్యాదులచేత - శ్లేషమును, "మిన్నగన్" అనుదానిచేత - వ్యతిరేకమును, జెప్పబడుటవలన - శ్లేషవ్యతిరేక సంకరమగు నీయలంకారము -వాచ్యమే కాని, సంలక్ష్యక్రమమగు (అలంకార) ధ్వని - కాదు." అనితెలియునది.

(83) : – శ్లేషానుప్రాణితమగు రూపకాలంకారము వాచ్యముగుటకు పేరొక యుదాహరణము :- [ఒకానొకసఖి - వర్షా వర్ణనము నొసర్చుచు, వియోగినియగు నాయికయవస్థను - వియో గియగు తన్నాయకునికిఁ దెలుపుచున్నది.]

కం॥ భ్రమి, నరతి, మూర్ఛఁ, దనుసా
దముఁ, బ్రళయము, నలసహృదయతను, దమము, మృతిన్,
సమకూర్చును జలదభుజగ
జమువిషము - వియోగినులగు, సఖులకు-బలిమిన్.

లోచనము :— (మీఁది పద్యమునందున్న) విషశబ్దమునందలి యభిధ- జలమునుదెలిపియు, హాలాహలమును దెలుపక, సమాప్తినొందుటలేదు. దీనికి హేతువు - భుజగశబ్ద పర్యాలోచనముచేతనగు బలమేయగుచున్నది. కనుకనే, యిందలి విషశబ్దము - జలమును దెలిపియుఁగూడ, విరమించుట కుత్సహింపక, హాలాహల లక్షణమగు ద్వితీయార్థమునుగూడఁ - దెలుపుచున్నది. "భ్రమి" మొదలు "మృతి" వఱకునుగల పదములయర్థము - సాధారణమేయగుచున్నది. (కనుక. వానియందర్థశ్లేషమున్నది.)

ప్రభా :— జలదమనఁగా మేఘము. భుజఁగఁమనఁగా; సర్పము, విష మనగా; నీరు,లేక హాలాహలము. విరహిణులగు (ప్రియురాండ్రకు జలదమనుభుజ గమునుండి - (మేఘమును సర్పమునుండి) పుట్టిన, విషమను విషము - (జలమను హాలాహలము-) మనోవికారమును తలత్రిప్పును, విషయానభిలాషమను సంతోష రాహిత్యమును, బాహ్యాంతరింద్రియ వ్యాపారరాహిత్యమును, తనుసాదమును. అనఁగా; శరీరకార్శ్యమను పీడను, 'ప్రళయమును' అనఁగా; బాహ్యేంద్రియ వ్యాపారములేకుండుటను, హృదయమాంద్యమును, తమోగుణోద్రేకముచేతనగు చీఁకటిని, 'మృతిన్'అనఁగా; ప్రాణనిర్గమారంభమును,హఠాత్తుగాసంఘటించును." అనియర్థము. ఇచట, "జలదమను భుజగము" అనురూపకమును - విషమను పదము - సాధించుచున్నది, కనుక నీపద్యమునందు - శ్లేషానుప్రాణితమగు రూపకాలంకారము - వాచ్యముగానే భాసించుచున్నది. కనుక, నిదికూడ - శబ్ద శక్తిమూలమగు నలంకారధ్వనికాదు" అనితెలియునది.

(84) మూలము :— మఱియొక యుదాహరణము :—
[ఒకచాటుకవి - ఒకమహారాజును బ్రశంసించుచున్నాఁడు.]

గీ॥ కృత్తమానస స్వర్ణపంకేజనిర్మ
థిత పరిమళాన్వితము, లఖండిత విసర్పి
దానములు, నృప! నీయవియైన బాహు
పరిఘములను గజేంద్రముల్ వరలుచుండు.

అను మీఁది పద్యమునందుఁగూడ- రూపకచ్ఛాయానుగ్రాహి యగు శ్లేషము - వాచ్యముగనే భాసించుచున్నది.

ప్రభా :— మీఁది యాంధ్రీకృతికి మూలమగు ప్రాకృతశ్లోకమునకు స్ఫుటమగు నర్థముగాని, స్ఫుటమగు ఛాయగాని, కాన్పించుటలేదు. అయినను, దాని ననుసరించియే, యాంధ్రీకరణ మొనర్పఁబడినది. కల్పితమగు దీని సంస్కృతచ్ఛాయ - ఇట్లున్నది.

"(ఖణ్డిత) మానసకాఞ్చన పఙ్కజనిర్మథిత పరిమళాయస్య।
అఖణ్డిత దానప్రసరా బాహుపరిఘాఇవ గజేన్ద్రాః"అని.

లోచనము :— నీయవియైన బాహుపరిఘములు - "కృత్తమానసస్వర్ణపంకేజ నిర్మథిత పరిమళాన్వితములు" = నిరాశగలవిగాఁ జేయఁబడుటవలన ఖండింపఁబడిన శత్రుమానసములే - ససారములగుటవలన, కాంచనపద్మములుగా నారోపింపఁబడినవి. కనుక, హేతుభూతములగు, నాశత్రుమానసకాంచన పద్మములచేత - ప్రసృతమగు (వ్యాపించిన) ప్రతాపసారముగలవి. "అఖండితవిసర్పి దానములు" అనఁగా; "ఖండింపఁబడని, వితరణ ప్రసారముగలవి"- అని ద్వితీయార్థము. "నీయవియైన బాహుపరిఘములను గజేంద్రముల్" అనుచోనున్న, గజేంద్రశబ్దవశమువలన - చమహిఅ (ఖండిత) శబ్దము - త్రోటనరూపమగు (తెగింపుటయను) నర్థమును, పరిమళశబ్దము - సౌరభరూపమగునర్థమును, దానశబ్దము - మదరూపమగు నర్థమును, బ్రతిపాదించినను; (ద్వితీయార్థముకూడ - ప్రస్తుతమేయగుటవలన - అంతతో] అభిధావ్యాపార సమాప్తిని బొందినవికావు. కనుకనే, పూర్వోక్తమగు ద్వితీయార్థమునుగూడ - (బాహుపరిఘములపక్షము నందగు నర్థమునుగూడ) చెప్పునవియేయయినవి.

ప్రిభా :— బాహుపరిఘములనఁగా; ఇనుప గుదియలవంటి బాహువులు. ఇందు - మహారాజ బహుపరిఘములయందు - గజేంద్రములారోపింపఁబడినవి. కనుక, దీనియందు - శ్లిష్టములగు నర్థముల నిర్లైఖుఁగునది. "కృత్త....పరిమలాన్వితములు" అనఁగా; (గజేంద్రపక్షమున) తెగ్రింపఁబడిన మానస సరోవరమునందలి బంగారుతామరపూవులచేత - విజృంభింపఁజేయఁబడిన మనోహరమగు సౌరభముగలవి. (బాహుపరిఘములపక్షమున) విజయమునందలి యాశలేనివిగాఁజేయఁబడుటవలన - 'శత్రుమానసములు' అను సుసారములగు కాంచనపద్మములచేత ప్రిసరింపఁజేయఁబడిన ప్రతాపప్రకర్షముతోఁ గూడినవి "అఖండితవిసర్పిదానములు" అనఁగా; (గజేంద్రపక్షమున) తెంపులేనివియై ప్రవహించు మదజలముగలవి, (బాహుపరిఘములపక్షమున) విరామములేక ప్రవర్తించు, వితరణముగలవి. ఇట్టివి. బాహుపరిఘములనెడి గజేంద్రములు - "వరలుచుండున్" = "సర్వోత్కృష్టములై వెలయుచున్నవి." అనియర్థము. "ఈపద్యమునందుఁగూడ-బాహుపరిఘములను గజేంద్రముల్" అను రూపకమును - మానసాదిశబ్దనిష్ఠమగు శ్లేషమనుగ్రహించుచున్నది, కనుక, ననుగ్రాహ్యాను గ్రాహకభావముకల, శ్లేషరూపకముల సంకరమిచట, వాచ్యమేయగుచున్నది. కనుక, నిదికూడ - శబ్దశక్తిమూలమను నలంకారధ్వనికాదు" అని,గ్రహించునది.

"ఇనుపగుదియలవంటి బాహువులను - గజేంద్రహస్తములుగా నారోపించుట - సమంజసమగుటచేత - "బాహుపరిఘములను గజేశ్వరకరములెసఁగు" అనియుండిన బాగుండును." అనియొకరనిరి. కాని, మూలమున "బాహుపరిఘా ఏవ గజేన్ద్రాః" అనియేయున్నది. 'అదియేయుక్త'మని శ్రీమద్గురువరేణ్యులు-సెలవిచ్చిరి. కనుక మూలానుసారియగు నాంధ్రీకృతియే - కావింపఁబడినది.

లోచనము : అవ :— ("కావ్యమున" అను కారికయందున్న) ఆక్షిప్త శబ్దమునకిట్లు వ్యవచ్ఛేద్యమును (వారింపఁదగినదానిని, అనఁగా; ఆక్షిప్తముకాకుండుటవలన వాచ్యమగు నలంకారమును) ప్రదర్శించి, "అలంకారమే" అనుచోటనున్న ఏవకారమునకు (ఏవకారార్థమగు నేకారమునకు) వ్యవచ్ఛేద్యమును (సూచకమగు పదముచేతఁ జెప్పఁబడుటవలన ధ్వనికాదని ధ్వనిత్వమునుండి వారింపఁబడునదియగు నలంకారమును) ప్రదర్శించుటకుఁ జెప్పుచున్నాఁడు.

(85) మూలము :— ఆక్షిప్త (వ్యంజిత)మయిననుగూడ-ఆయలంకారము - తిరుగ (సూచకమగు) వేఱొకశబ్దముచేత - వాచ్యమగు స్వరూపముగలదియగునపుడు, దానికి- 'శబ్దశక్తిమూలా

నురణన రూప వ్యంగ్యధ్వని' వ్యవహారము- కలుగునదికాదు. ఇంతే మనిన, దానికి 'వక్రోక్తి'మున్నగు వాచ్యాలంకార వ్యవహారమే - కలుగును.

ప్రభా :— ఇచట లోచనకర్త - సహృదయులు సులభముగాఁ దెలిసికొను టకు-వెనుకఁ దెలిపినదియు, ముందుఁదెలుపనున్నదియు,నగు గ్రంథమునకుసంబంధించిన భావార్థమును - "ఉభయార్థములను" అనిప్రారంభించి, "తాత్పర్యము" అనునంతవఱకును గావింపఁబడిన స్వకృత విమర్శనముచేతఁ దెలుపుచున్నాఁడు.

లోచనము :— (ప్రస్తుతములయిన) (1) "ఉభయార్థములను దెలుపుట యందు శక్తిగల శబ్దమును ప్రయోగించునపుడు (ఆయర్థములు రెండింటిలోను) ఒకేయర్థమున నభిధను నియమించుటకుఁ గారణము - (సంయోగము మున్నగు నవి-) లేనివియగు, "కనిమేనధ్వస్త మనోఒభవేన" అని వెనుకఁ బ్రసారించిన యుదాహరణమువంటి స్థలములయందుఁగల ద్వితీయార్థము - వాచ్యమేయగు చుండును. (2) ఇట్లే; ద్వితీయమగు నభిధావ్యాపారమునకు సద్భావమును-(ఉని కిని-) దెలుపునదియగు, ("అయినను" మున్నగు) ప్రమాణముగల "హారము లేనివెయయినను" అను నుదాహృతి మొదలు, "కృత్తమానస" అనునుదాహృతి వఱకునుగల (నాలుగు) స్థలములయందునుగల ద్వితీయార్థముకూడ - సర్వథా వాచ్యమేయనునది - స్పష్టమైయున్నది. (రెండర్థములుగల స్థలమున) ఒకే యర్థ మున నభిధను నియమించుటకు హేతువగు ప్రకరణాదికముండి, దానిచేత - అచ్చటి ద్వితీయార్థమున, నభిధ - సంక్రమింపకుండునపుడు - అచ్చట నీద్వితీ యార్థము - ఆక్షిప్తమని (వ్యంజనాలభ్యమని) చెప్పఁబడును. (3) అచ్చటఁగూడ (ఆక్షిప్తమగు ద్వితీయార్థముగల స్థలమునందుఁగూడ) ఏశబ్దము-(ఒకేయర్థమున) అభిధను నియమించునవియగు ప్రకరణాదుల సామర్థ్యము నుపహతమొనర్చునో, అటువంటి ('ససూచనముగాన్' మున్నగు) శబ్దమున్నయెడల, (ఇంతకుముందు ప్రకరణాదులచేత-ఒకయర్థమునందే నియమింపఁబడి, ద్వితీయార్థమునందు)బాధిత యయిన యాయభిధాశక్తికూడ - దానివలననే (అటువంటి శబ్దమువలననే) ప్రతి ప్రసూతయే (తిరుగ ద్వితీయార్థమునుగూడ వాచ్యమొనర్చుట కనుకూలముగాఁ జేయఁబడునదియే) యగుచుండును. కనుక, నదికూడ- (ద్వితీయార్థమునుగూడఁ జెప్పవలయునని సూచించునదియగు శబ్దముగల స్థలముకూడ) ధ్వనికి విషయము కాదు" అనితాత్పర్యము.

ప్రభా :— వెనుక, వాచ్యశ్లేషముగా నుదాహరింపఁబడిన "కనిమేన

ధ్వస్తమనో౽భవేన'' అనుస్థలమున - శ్లిష్టములగు నర్థములు రెండింటిలోను - ఒకయర్థమునే యభిధానించుటను(తెలుపుటను) నియమించునదియగు సంయోగాదికారణమేదియుఁగూడలేదు. కనుక, రాఘవ పాండవీయాదులయందు (ప్రస్తుతములగు) రామాయణపరమును, భారతపరమును, నగు నర్థములు రెండునుగూడ- అభిధచేత వాచ్యములేయగునట్లు ''కనియేనధ్వస్తమనో౽భవేన'' అనివెనుకనుదాహరింపఁబడిన పద్యమునందుఁగూడ (ప్రస్తుతములగు) మాధవోమాధవపరములగు నర్థములు- వాచ్యములే (అభిధేయములే) యగును. ''హారములేనివెయయినను'' అనుచోట, అపిశబ్దార్థకమగు ''అయినను''అనుదానిచేత, విరోధము వాచ్యమగుటచేత - దానిననుగ్రహించు శ్లేషము - వాచ్యమేయగుచున్నది. ''కలితసుదర్శన'' అనుపద్యమున ''తనమేనికి మిన్నగఁగనెనో'' అనుదానిచేత, వ్యతిరేకము - వాచ్యమగుటచేత - దానిననుగ్రహించుశ్లేషము- వాచ్యమేయగుచున్నది. ''భ్రమిఁనరతిన్,'' అనుపద్యమున, భుజగశబ్దపర్యాలోచనముచేత- విషశబ్దము - జలరూపమగు నర్థమును దెలిపియుఁ, నంతతోనాగక, హాలాహలరూపమగు నర్థమునుగూడఁ దెలుపుటవలన - అచటిశ్లేషముకూడ - రూపకమున కనుప్రాణకమగుటచేత - వాచ్యమేయగుచున్నది. ''కృత్తమానస'' అనుపద్యమున, బాహుపరిఘములయందగు గజేంద్రత్వరూపణమును, మానసాది శబ్దనిష్ఠమగు శ్లేషమనుగ్రహించుటవలన - శ్లేషరూపకసంకరాలంకారమచట వాచ్యమేయగుచున్నది, క్రింద నుదాహరింపఁబడుచున్న 'కానకున్నాను' అనుపద్యమునందు - ద్వితీయార్థమాక్షిప్తమైననుగూడ - ''సలేశముగా'' అనుపదముచేత - ద్వితీయార్థమున్నట్లు సూచింపఁబడుటవలన, ద్వితీయమగు నభిధాశక్తిచేత- నదియు - వాచ్యమేయగుచున్నది.'' అనునది - లోచనతాత్పర్య తాత్పర్యము.

లోచనము :— (సంస్కృత మూలమున ''సహాక్షిప్తో౽లఙ్కారః'' అను వృత్తియందు) ''ఆయలంకారము (శ్లేషము) ఆక్షిప్తమైనను'' అనుచోట - ''ఆక్షిప్తమైనను'' అనఁగా; ''ఆక్షిప్తమయి (వ్యంజితమయి) నట్లు శీఘ్రముగా నూహించుట కారంభింపఁబడినను'' అనియర్థము. (ఇచట ద్వితీయమగునర్థము - ఆక్షిప్తమయినట్లూహించుట కారంభింపఁబడినదియే) కాని, యాయర్థమాక్షిప్తముకాదు. ఇంకేమనిన, వేరొకశబ్దవిశేషముచేత - అభిధను (ద్వితీయార్థాభిధానమును) ప్రతిప్రసవించుటవలన (తిరుగఁ బ్రవర్తింపఁజేయుటవలన) ఈ ద్వితీయార్థముకూడ- అభిహితస్వరూపమే (ద్వితీయార్థాభిధచేత - అభిధేయమే) యయినది. (నాచేత వ్యాఖ్యానింపఁబడిన యీ) ప్రతిప్రసవము - (అనఁగా, అభిధను రెండవమారు ప్రవర్తింపఁజేయుట) తనచేత - వ్యాఖ్యాతమనునంశము - 'తిరుగ' అనుపదమును (వృత్తియందు) గ్రహించుటచేత (వృత్తికారుఁడు) సూచించుచున్నాఁడు. ఆకార

ణముచేత - ఏవకారము - (అక్షిప్తమే'' అనుచోటనున్న ఏకారము-) ఆక్షిప్తాభాస మును (ఆక్షిప్తమువలెనున్నవానిని - అది - ధ్వనికాదని) నిరాకరించుచున్నది.

ప్రభా :— ద్వితీయార్థముగు ''వక్రోక్తి'' మున్నగునలంకారము ననుగ్ర హించునదియగు శ్లేషము - అక్షిప్తమువలెఁదోచును. కానియాక్షిప్తముకాదు. అదెట్లనిన; ''వక్రోక్త్యుదాహరణమగు ''కానకున్నాను'' అనుక్రింది పద్యమున - 'సలేశముగా' అనుపదము - శ్రవణగోచరము కానంతవఱకును, ద్వితీయార్థము- అక్షిప్తముగుచున్నట్లూహించుట కారంభింపఁబడినను, తదుపరి - 'సలేశముగా' అను పదముచేత - తిరుగ ద్వితీయార్థమున, నభిధప్రవర్తింపఁజేయఁబడుటవలన, నాక్షి ప్తాభాసమేయగును. కనుక, నచటి వక్రోక్తి-వాచ్యాలంకారమేకాని, ధ్వన్యమాన ముగు నలంకారముకాదు. కనుక మూలకారికయందు ''అక్షిప్తమే'' అనుపదము- శబ్దశక్తిమూలధ్వనిస్థలమునుండి - అక్షిప్తాభాసమును (అనఁగా అక్షిప్తమువలె నూహించుట కారంభింపఁబడినను నిజముగా నాక్షిప్తముకాని వక్రోక్తిమున్నగు నలంకారమును) నిరాకరించును.'' అనితెలియునది.

(86) మూలము :— వక్రోక్తిని గూర్చునదియగు వాచ్య శ్లేషమున కుదా :— "(వెండితెర" అనుజాతీయపద్యము. ప్రభా మతి ప్రసారితము.)

"కానకున్నాను కేశవగోపరాగహృతమైన దృష్టినినేనొకించుకంత యునన్;
గాననే-స్ఖలితనైతిని, ప్రభూః పతిత, నన్-సాలంబనన్ జేయకున్నా వదేలా ?
హా! నీవొకండవే-విషమ శల్యార్తసర్వాబలావళికిగతి"వని సలేశ ముగా
తానుగోపియొకర్తె - పలుకగోష్ఠమునందుఁ దనరు శ్రీహరిసదా! మిముమనుచుఁగాతన్!

ఇటువంటి జాతిగలదంతయుఁగూడ - వాచ్యశ్లేషమునకే విష యమగుఁగాక!

లోచనము :— కేశవా! ('గోపరాగహృతమైన') గోధూళులచేత- హరింపఁబడిన (మూతఁగొనిన) దృష్టిచేత - నేను కించిత్తైననుగూడ (ఎత్తుపల్లములను) జూడఁజాలకుంటిని. ఆకారణముచేతనే, తొట్రుపడఁదప్పితిని (జారిపడితిని) అట్టిదాననై,పడిపోవుచున్ననన్ను-నీహస్తమున నేలఁబట్టుకొనకున్నావు?.(హా = అయ్యో!) నీవొక్కఁడవే - అతిశయముచేత (మిగుల) బలవంతుఁడవు, కనుక, నిమ్నోన్నత స్థలములయందు ఖేదమునొందినమనస్సుగలవారును, (కనుకనే) నడిచివెళ్లుటకు శక్తిలేనివారును, నగు 'సర్వాబలులకును' అనఁగా; బాలవృద్ధాంగన లందఱకును 'గతివి.' అనఁగా; ఆలంబనాభ్యుపాయమవగుచున్నావు." అనునేవంవిధమగునర్థమున - (కేశవగోపరాగాదులగు) ఈ శబ్దములు - ప్రకరణముచేత (సందర్భము ననుసరించి) నియంత్రితములగునభిధాశక్తులు గలవిగనే యున్నవి. వ్యాఖ్యానింపఁదగియున్న, ద్వితీయార్థవిషయమున, ఈ శబ్దముల యభిధాశక్తి - నిరోధింపఁబడునదగుచునే యుండినను, "సలేశముగా" అను పదముచేత-ప్రత్యుజ్జీవితమయినది. (ప్రతిప్రసవముగలదిగాఁజేయఁబడినది) ఇచట "సలేశముగా" అనఁగా. 'ససూచనముగా' అనియర్థము- లేశమనఁగా; అల్పీభవనము అల్పీభవనమనఁగా; సూచనమేగదా!('ససూచనముగా'అనునర్థముగల,'సలేశముగా'అనుపదముచేత - ప్రత్యుజ్జీవిత మొనర్పఁబడిన, ద్వితీయాభిధాశక్తిచేతఁ దెలుపఁబడిన, ద్వితీయార్థము నిట్లైయుఁగునది.)"కేశవగోపరాగహృతమైనదృష్టిని" అనుచోట - 'ఓకేశవా! గోపా! (స్వామీ!) రాగముచేత - హరింపఁబడిన, దృష్టిచేత' - అనిగాని, 'కేశవగతమయిన, ఉపరాగము (వలపు) చేత హరింపఁబడిన దృష్టిచేత', అనిగాని, సంబంధమును దెలియునది. "స్ఖలితనైతిని." అనఁగా; 'ఖండితచరిత్రనయితిని'. (భ్రష్టురాలనైతిని.) అనియర్థము. పతితన్ + నన్. "అనఁగా; భర్తృభావముచేత, నన్ను" అనియర్థము. (దీనిని-సాలంబనన్ జేయకున్నావదేలా? అను తరువాతి యర్థముతో సంబంధించునది) "నీవొక్కండవే" అనఁగా;"అసాధారణ సౌభాగ్యశాలివగువీవే"అనియర్థము. "సర్వాబలావళికిన్" మదన విధురమనస్కలగు నబలలందఱికిని, ఈర్ష్యాకాలుష్యమును దొలఁగించి' వారిచేత సేవింపఁబడుచున్నవాఁడవై, 'గతివి' అనఁగా; 'జీవితరక్షకుపాయమవై' యున్నావు." అనియర్థము.

పరీక్షా :— ఇందు "సలేశముగాన్" అనుపదముచేత - ద్వితీయాభిధాశక్తి-ప్రత్యుజ్జీవితమగుటవలన - వక్రోక్తిరూపమగు నిందలి ద్వితీయార్థము - శ్లేషమూలకమగుచున్నది. కనుక, శబ్దశక్తిమూలమగు నిచటిశ్లేషము - వాచ్యమేకాని, శబ్దశక్తిమూలమగు ధ్వని-కాదు. గుణీభూతవ్యంగ్యమేయగును.

లోచనము : అవ !— ఇట్లు వాచ్యమగు శ్లేషాలంకారమునకు విషయమును వ్యవస్థాపించి, ధ్వనివిషయమును వ్యవస్థాపించుచున్నాఁడు.

(87) మూలము :— అట్లుకాక, వేరొక యలంకారము - (శబ్ద) సామర్థ్యమున నాక్షిప్తమగుచు (సహకారియగు నర్థసామర్థ్యముచేత వ్యంజితమగుచు) శబ్దశక్తిచేతఁ బ్రకాశించునపుడది యంతయుఁగూడ - ధ్వనికే - విషయమగును. శబ్దశక్తిమూలానురణనోపమ వ్యంగ్యాలంకారధ్వని కుదాహరణము :- "ఇంతలో, కుసుమసమయ యుగోపసంహార కర్త్రు- ఫుల్లమల్లికాధవళాట్టహాస-గ్రీష్మాభిధాన మహాకాల విజృంభణము - ప్రవర్తిల్లెను."

లోచనము :— [''కుసుమసమయ యుగోపసంహారకర్త్రు''] కుసుమసమయాత్మకమగు యుగము, అనఁగా; (చైత్రవైశాఖములను) మాసద్వయము. దానినుపసంహరించునదియు, [వసంతర్తువును ముగింపఁజేయునదియు] ఫుల్లమల్లికాధవళాట్టహాస = ధవళములు (తెల్లనివికసనుకనే) హృద్యములగు, అట్టములు. అనఁగా, ఆపణములు,దేనిచేతనో, అట్టిధవళాట్టములతో సదృశములగు వికసించిన మల్లెల 'హాసము' అనఁగా 'వికాసము'అనఁగా; సితిమ (తెల్లఁదనము) గలదియు, [''గ్రీష్మాభిధాన'' = [జ్యేష్ఠాషాఢ మాసద్వయరూపమగు] గ్రీష్మమనుపేరు గలదియగు] మహాకాలవిజృంభణము = పగళులతిదీర్ఘములగుటచేతను, వానిని మిగుల శ్రమపడి గడుపవలసివచ్చుటచేతను, మహత్త్వముగలది (గొప్పది) యగు కాలముయొక్క అగమనాతిశయము - ప్రవర్తిల్లెను.'' అనియర్థము. ''ఫుల్లమల్లికాధవళాట్టహాస'' అనుచోట (గ్రీష్మకాలము) ఫుల్లమల్లికలనెడి ధవళాట్టహాసము (తెల్లని పెద్దనవ్వుగలది) అని వ్యాఖ్యానించిననో; అప్పుడది - ''జలదభుజగజము'' అనుదానితో సమానమయినది - (వాచ్యమగునది-) కావలసివచ్చును.

ప్రభా :— ''వికసించిన మల్లెలనెడి పెద్దనవ్వుగలది'' అని రూపకమును జెప్పునెడల; ''భ్రమిమనరతి'' అనుపద్యమున, ''జలదమను భుజగము'' అనురూపకమును సాధించుట కచటనున్న విషపదమునకు హాలాహలరూపమగు ద్వితీయార్థము వాచ్యమయినట్లు, దీనియందుఁగూడ - మహాకాలపదమునకు రుద్రుఁడను నర్థమును జెప్పవలసివచ్చును. అప్పుడు - జగత్సంహర్తయు, మహాకాలుఁడుననగు శివునిపక్షమునందగు నర్థముకూడ - వాచ్యము కావలసి వచ్చుటవలన - నిది - ధ్వన్యుదాహరణము కాకపోవలసివచ్చును.

లోచనము : — ఈపద్యమున, ఋతువర్ణనము - ప్రస్తుతము. కనుక, మహాకాల ప్రభృతులగు శబ్దములు - ఋతువర్ణనరూపమగు ప్రస్తావముచేత - (ఆయాయర్థములయందు) నియంత్రితములయిన, యభిధాశక్తులుగలిగియున్నవి. కనుకనే (ప్రకరణముచేత నియమింపఁబడుటవలననే) - "అవయవప్రసిద్ధేః సముదాయ ప్రసిద్ధిర్బలీయసీ" ('అవయవప్రసిద్ధి' యనఁగా; 'యోగశక్తి'.దానికంటె, సముదాయప్రసిద్ధి యనఁగా, రూఢిశక్తి - బలీయమైనది.) అను న్యాయమును (గూడ) అపాకరించునవియగుచు, నామహాకాలాది శబ్దములు - మీఁదియర్థమునే (ఋతువర్ణనపరమగు నర్థమునే) యభిధానించియు, కృతకృత్యములేయయినవి. తరువాతిదియగు నర్థావగతి - (వ్యంగ్యార్థస్ఫూర్తి -) శబ్దశక్తిమూలమగు ధ్వననవ్యాపారమువలననే - అగుచుండును.

ప్రభా : — ఇచట, శబ్దశక్తిమూలమగు ధ్వనన వ్యాపారముచేత స్ఫురించునదియగు ద్వితీయార్థము నిట్లెఱుఁగునది. కుసుమసమయయుగోపసంహారకర్త్రె = కుసుమసమయ (వసంత) సదృశమగు కృతాది (సత్యాది) యుగమునుపసంహరించువాఁడును, ఫుల్లమల్లికా ధవళాట్టహాస = విచ్చిన మల్లెపూవుల కాంతులవలె, తెల్లనిదగు పెద్దనవ్వుగలవాఁడును. గ్రీష్మాభిధాన = భయంకరమగు నామముగలవాఁడును, నగు, మహాకాల = జగత్ సంహర్తయగు దేవతావిశేషమగు రుద్రునియొక్క, విజృంభణము = ప్రవర్తనాతిశయము - ప్రవర్తిల్లెను. అనియర్థము. ఆంధ్రకృతికి మూలమగు "అత్రాన్తరే కుసుమసమయయుగము పసంహరన్నజృమ్భత గ్రీష్మాభిధానః, ఫుల్లమల్లికా ధవళాట్టహాసో, మహాకాలః" అనునీగద్యము - హర్షచరితమునందలి ద్వితీయోచ్ఛ్వాసమునమనున్నది.

—* శబ్దశక్తి మూలాలంకారధ్వనివిషయమున మతభేదప్రదర్శనము *—

అవ : లోచనకర్త :— ఇచ్చటి మతభేదములను బ్రదర్శించుచున్నాఁడు.

లోచనము :— ఇచ్చటఁ గొందరిట్లూహించుచున్నారు. "జ్ఞాతలు -మహాకాలాదిశబ్దములకు- జగత్సంహారకర్త్రె, రుద్రాద్యర్థమును దెలుపునదియగు వేరొక యభిధాశక్తి నింతకుముందే తెలిసియున్నారు. కనుక, నట్టిజ్ఞాతలకే - (ప్రకరణాదులచేత ప్రస్తుతమగు ఋతుప్రస్తావనార్థమున) నియమింపఁబడిన యభిధాశక్తులుగల, యీమహాకాలాది శబ్దములవలన (తరువాత)నగు నర్థాంతరప్రతీతి-(అనఁగా: జగత్సంహారకర్త్రె, రుద్రాది పక్షీయమగు, ద్వితీయార్థప్రతీతి-) ధ్వననవ్యాపార

మువలనే కలుగుచున్నది. కనుకనే, ఈయర్థాంతర ప్రతీతి - శబ్దశక్తిమూలమగుటయు, వ్యంగ్యమగుటయు, ననునిది - విరుద్ధముకానిదగుచున్నది.''అని.

ప్రిభా :— ''జ్ఞాతృసహృదయులు - 'మహాకాల'' మున్నగుశబ్దములకు - కాలాదిపరములుగను, జగత్సంహారకర్తృ, రుద్రాదిపరములుగను, గలయర్థములను దెలుపునదియగు, నభిధాశక్తిద్వయమును - ఇంతకుముందే - యెఱింగియుందురు. (అయినను) ఇచ్చట - ప్రస్తుతమగు విషయము - ఋతువర్ణనమేగాని, మహాకాలుఁడగు రుద్రుని వర్ణనముకాదు, కనుక, మహాకాలాది శబ్దములయందుఁగల యభిధాశక్తి - ఋతువర్ణనపరమగు నర్థమునందే-నియమింపఁబడును, కనుక, ఋతువర్ణనరూపార్థమునే - బోధించునదియగు నాయభిధాశక్తిచేత - ఈమహాకాలాది శబ్దములు - (తిరుగ) మహాకాలరుద్రపరమగు ద్వితీయార్థమును బోధింపఁజాలకుండుటవలన, ధ్వననవ్యాపారమువలననే- దానిని బోధించును.'' ఇట్లు చెప్పిననే - ఇచటి ద్వితీయార్థప్రతీతి - శబ్దశక్తిమూలమగుటయు, వ్యంగ్యమగుటయుఁ, గుదురును, అదెట్లనిన :- మహాకాలరూపరుద్రాదిపరమగునర్థాంతరమున, మహాకాలాది శబ్దములకుఁగల యభిధాశక్తిని - గ్రహించిన జ్ఞాతకే - మహాకాలరూప, రుద్రాదిపరమగు నర్థాంతర ప్రతీతికలుగుటవలన,నది- శబ్దశక్తిమూలమగుట కుదురుచున్నది. [ఇచట నభిధ-] ప్రకరణాదులచేత- ఋతువర్ణనపరమగు నేకార్థమునందే - నియమింపఁబడుటవలన, ప్రకరణాదులు- తననే యర్థమును దెలుపుటకు నియమించినవో, ఆయర్థమునే తెలిపి, విరమించును, కనుక నీయభిధకు - మరల (అదే) వ్యాపారముకలుగదు. కనుక, మహాకాల రుద్రాది పరమగు, ద్వితీయార్థప్రతీతి - తచ్ఛబ్దశక్తిమూలమగు ధ్వననవ్యాపారమువలననే కలుగుటవలన, (ద్వితీయమగు) ఆయర్థము - వ్యంగ్యమగుట కుదురుచున్నది. అట్లుకాని యెడలనో, - ద్వితీయార్థప్రతీతి - శబ్దశక్తిమూలమును, వ్యంగ్యమును. గూడనగుట - విరుద్ధమేయగును.'' అనునది - కొందఱిమతము.

లోచ :- 'మఱికొందఱు'-ఇట్లుతలఁచుచున్నారు.''ఆద్వితీయాభిధయే గ్రీష్మమునకు - భీషణదేవతావిశేషము (రుద్రుని) తోడి సాదృశ్యము రూపముగాఁగలదియగు నర్థసామర్థ్యమును సహకారిగా నవలంబించుచున్నది, కనుక, నాద్వితీయాభిధయే - ధ్వననవ్యాపార రూపయని చెప్పఁబడును.'' అని.

ప్రిభా :— ''మహాకాలాది శబ్దములయందు ద్వితీయార్థమును దెలుపునదియగు శక్తినిగూడ - (''ద్వితీయార్థప్రతీతి కలుగుటకు) ముందుగానే, జ్ఞాతలు గ్రహింతురు'' అని మీఁదిమతము - చెప్పుచున్నదిగదా!. ఇట్లు ముందుగానే, గ్రహింపఁబడిన, యాద్వితీయార్థాభిధయే- మీఁది యుదాహృతిస్థలమున, గ్రీష్మము

నకు, "యుగము నుపసంహరించుట" మున్నగుదానిచేత-భీషణదేవతావిశేషమగు ప్రళయకాలరుద్రునితోడి సాదృశ్యము రూపముగాఁగలదియగు నర్థసామర్థ్యమును- ("సామర్థ్యముచేత నాక్షిప్తమై" అనువృత్తిచేతఁ జెప్పఁబడినదానిని-) ద్వితీయార్థ బోధనమున, సహకారిగా నాశ్రయించును. కనుక. ముఖ్యగనే గ్రహింపఁబడిన ద్వితీయార్థాభిధయే - (యిప్పుడు) 'ధ్వననవ్యాపారరూప'యని చెప్పఁబడును." అని మఱికొందఱు తలఁచుచున్నారు. "అభిధాదులగు వ్యాపారములు- అర్థబోధానుకూల శక్తివిశేషరూపములే యగుచున్నవి. సహకారిభేదమున వానికి భేదమేర్పడును. సంకేతగ్రహణ మాత్రసహకారముచేత - శబ్దమునకగు నర్థబోధనశక్తి - అభిధ. సంకేతగ్రహణాతిరిక్తమగు నర్థసామర్థ్యాది సహకారముచేతనగు నర్థబోధన శక్తియే - ధ్వననము. కనుక, నాయభిధయే - ఇచట 'ధ్వననరూప'యని చెప్పఁబడును," అనునది - వీరియభిప్రాయము.

లోచనము :— వేరొక కొందఱిట్లు సంభావించుచున్నారు. "(పెక్కు-శబ్దములచేరికవలన నేర్పడునదియగు) శబ్దశ్లేషమునందు - శబ్దమునకు భేదము (విరుపు) కలుగునట్లు, అర్థశ్లేషమునందుఁగూడ - (ఆయాయర్థములను దెలుపుట కనుకూలమగు) శక్తిభేదమువలన (అనఁగా; అర్థభేదమువలన) శబ్దభేదముకలుగును" అని దర్శనము. కనుక, నచ్చటఁగూడ - (శబ్దశ్లేషమునందువలె, అర్థశ్లేషమునందుఁగూడ) ద్వితీయమగు శబ్దము - (అనుసంధానించి) తీసికొనిరాఁబడును. ఆద్వితీయశబ్దము - ఒకానొకప్పుడు [అనఁగా; అర్థములురెండునుగూడ-ప్రకరణాదులచేతఁ దెలుపఁదగి, యుండునపుడు- అభిధచేతఁ దెలుపఁదగినవికాక తప్పనివగుటవలన, నవిప్రస్తుతములగునపుడు] అభిధావ్యాపారమువలనఁదీసికొని రాఁబడును. దీనికుదాహరణములు :- ప్రశ్నములు రెండింటికిని (ఒకేరూపమున) ప్రత్యుత్తరము నిచ్చుటకొఱకు (ప్రయుక్తమగు) "శ్వేతోధావతి" (శ్వేతః, శ్వా + ఇతః + ధావతి) అనుస్థలముగాని, ప్రశ్నోత్తరము లొక్కచోటనే కలదియగు, (ఇదియేవర్ణము? ఇత్యాది) స్థలము మున్నగునదిగాని. యగును. ఇచట నివి - వాచ్యాలంకారములేయగును.

ప్రభా :— ప్రకరణాది నియంత్రితములగు నర్థములు - అభిధచేతనే బోధింపఁబడును. కనుక, నర్థములురెండును ప్రస్తుతములే యగునప్పుడు - ద్వితీయార్థమును దెలుపునదియగు ద్వితీయశబ్దము - అభిధచేతనే-తీసికొనిరాఁబడును. "ఏదియిచ్చటనుండి పరుగెత్తుచున్నది ?. అది - యేగుణముగలది?" అనిప్రశ్నించునపుడు-ఆప్రశ్నములు రెండింటికినిగూడ. ఒకేమాటతో "శ్వేతోధావతి"అని ప్రత్యుత్తరము నిచ్చునపుడు, "శ్వేతః, శ్వా + ఇతః + ధావతి" అని శబ్దభేదము

కలుగుచున్నది. "శ్వేతః = తెల్లనిదగు, శ్వా = కుక్క, ఇతః = ఇచ్చటి నుండి (ఇటు) ధావతి = పరుగెత్తుచున్నది". అని దీనియర్థము. ప్రశ్నలకు రెండింటికిని, దీనిచేత - (శబ్దభేదముచేత-) ప్రత్యుత్తరము - చెప్పఁబడినదిగదా! ఆంధ్రమున, "ఏనుంగనికరమరయక" అను రాఘవపాండవీయమునందలి పద్యమున, 'ఏనుంగు + అని + కరము + అరయక' అని, రామాయణార్థము నందును, "ఏనున్ + కనికరము + అరయక" అని భారతార్థమునందును శబ్దములు - భేదింపఁబడును. ఇచట - "ఏనున్" అను ద్వితీయశబ్దమభిధచేతనే తీసికొనిరాఁబడును. ఇది-శబ్దశ్లేషమున కుదాహరణము."నీవు- రక్తుఁడవు" అను నపుడు, "ఎఱ్ఱనివాఁడవు, అనురాగముగలవాఁడవు" అనునర్థములు రెండును - ప్రస్తుతములగుటవలన వాచ్యములేయగును. ఇచట, ద్వితీయార్థమును తెలుపురక్త శబ్దము - అభిధచేతనే - తీసికొనిరాఁబడును. ఇది- అర్థశ్లేషమున కుదాహరణము. ప్రశ్నించువాఁడు - ప్రత్యుత్తరమునిచ్చువానికి - 'ఏ' అనువర్ణమునుజూపి - "ఇదియేవర్ణము" అని ప్రశ్నించునపుడు - "ఇదియేవర్ణము" అని ప్రత్యుత్తర మొసఁగఁబడినయెడల, అదియొకేస్థలమునఁ జెప్పఁబడిన ప్రశ్నోత్తరాత్మకమగు శ్లేషమున కుదాహరణమగును."మున్నగు"అనులోచనోక్తిచేత "కనియేనధ్వస్త" మున్నగు నుదాహృతులనుగూడ నిచట గ్రహింపవలయును.

"మీఁది యుదాహృతులన్నిఁటియందునుఁగూడ - అర్థములు రెండునుగూడ ప్రకరణమువలనఁ జెప్పకతీరనివగుటవలన నవి - వాచ్యశ్లేషమునకే విషయము లగును" అనితెలియునది.

లోచనము :— ఎచ్చట, ధ్వననవ్యాపారమువలననే, ద్వితీయశబ్దము - తీసికొని రాఁబడునో, అచ్చటనుమాత్రము - శబ్దాంతరబలమువలనఁ బొందఁబడి ననుగూడ, ఆయర్థాంతరము - ప్రతీయమానమూల (ధ్వనన వ్యాపారమూలక) మగుటవలన ప్రతీయమానమేయగుట యుక్తము.

ప్రభా : "కుసుమసమయ" ఇత్యాదిస్థలములయందు, ప్రకృతమగు (ఋతువర్ణనపరమగు) నర్థమునందే - అభిధ - నియమింపఁబడుటవలన, ద్వితీయార్థము - వేరొకశబ్దముయొక్క బలముచేతఁబొందఁబడినను, అద్వితీయశబ్దము-వ్యంజకత్వమువలనే తీసికొనిరాఁబడుటవలన - ద్వితీయమగు నాయర్థము-వ్యంగ్య మేయగును," అనునది - వేరొక కొందఱిమతము.

లోచనము :— ఇంకొక కొందఱిట్లు సంభావించుచున్నారు. మీరు మఱి కొందఱిమతమును వ్యాఖ్యానించునపుడు - (ద్వితీయార్థాభిధచేత - సహకారిగా నాశ్రయింపఁబడునదిగాఁ జెప్పఁబడిన) అర్థసామర్థ్యమేదికలదో, దానిచేత ద్వితీ

యాభిధయే- ద్వితీయార్థమునకుఁ బ్రతిప్రసవమును కలిగించును. కనుక, ద్వితీయమగునర్థము-వచింపఁబడునదియేకాని, ధ్వనింపఁజేయఁబడునదికాదు. అటుపిమ్మట మాత్రము - పొందఁబడినదియగు నాద్వితీయార్థమునకు ప్రస్తుతమగు ప్రథమార్థముతోనగునదియగు రూపణము - (అభేదారోపము) మాత్రము - వేరొకశబ్దము దేనిచేతనుగూడ భాసింపఁజేయఁబడునదికాదు. అప్పుడు-(ఈయభేదారోపమునందు) అభిధాశక్తియేదియుఁగూడ నాశంకింపఁదగినదికాకుండుటవలన, నది-(ఆరూపణ) ధ్వననవ్యాపారమువలననేభాసింపఁజేయఁబడును. ద్వితీయమగు,అభిధాశక్తిలేనిదే ఆరూపణకుద్థానముకలుగదు, కనుక, ఆరూపణకు - ద్వితీయమగు శబ్దశక్తియే మూలము. కనుక, (రూపణాదికము మాత్రమే వ్యంగ్యమగుటవలన) అదియే - (రూపకాద్యలంకారమే) ధ్వనియనునది-యుక్తము, గ్రంథకర్తగూడ-"వాక్యము- అసంబద్ధమగు నర్థమును బోధింపవలసివచ్చునది కాఁగూడదు." మున్నగు నంశమును ముందుచెప్పనున్నాఁడు, ఇంతకుముందో;('కానకున్నాను'. అనుచోటనో,) "సలేశముగా,' అనుపదముచేత-అసంబద్ధత - నిరాకరింపఁబడినదియేగదా!." కనియేనధ్వస్త" అనుచోట అసంబద్ధత భాసించుటయేలేదు. "హారములేనిపెనుయినను" అనుచోట-అపిశబ్దము(అయినను) చేతను, "లలితసుదర్శన" అనుచోట- "మిన్నగ" అనుదానిచేతను, "భ్రమినరతిన్" "కృత్త" అనుచోట్ల- రూపకము చేతను, (వాక్యమున నేర్పడునదియగు) అసంబద్ధత - నిరాకరింపఁబడినదిగదా!" అని తాత్పర్యము.

ప్రభా :— "మీఁది స్థలమున, ప్రకరణమున్నగునవి-కుసుమసమయయుగాదిశబ్దములను - ప్రస్తుత ఋతువర్ణనరూపార్థ బోధమునందేనియమించుచు. ద్వితీయార్థమును దెలుపనీయకున్నవి, కనుక, మొదటియభిధకు-ప్రకరణాదులు- బాధకములగుచున్నవి. అయినను, ద్వితీయార్థసామర్థ్యము - ప్రకరణాదులకు బాధకమగుటవలన, (బాధకములగు ప్రకరణాదులను బాధించుటవలన) అభిధకు ప్రతిప్రసవము [ద్వితీయార్థమును తిరుగఁ) దెలుపుటకనుకూలముగాఁజేయఁబడుట] ఏర్పడును. కావున దానిచేతఁ దెలుపఁబడునదియగు ద్వితీయార్థము - (మహాకాలరుద్రపక్షీయమగు నర్థము-) వ్యంగ్యముకాదు. వాచ్యమేయగును కాని, ఇచట - ప్రకృతాప్రకృతార్థములను బోధించునదియగు వాక్యము - అసంబద్ధములగు నర్థములను బోధించుటవలన దుష్టముకావలసివచ్చును. కనుక, నావాక్యము దుష్టము కాకుండుటకు - అప్రస్తుతమగు ద్వితీయార్థమునకు - ప్రస్తుతమగు ప్రథమార్థముతోడి-రూపణ-ఏది స్ఫురించునో, అది - వేరొకశబ్దము దేనిచేతనుగూడ- ప్రకాశింపఁజేయఁబడునదికాదు. కనుక- నది- (ఆరూపణ) ద్వితీయశబ్దశక్తిమూలమగు ధ్వననవ్యాపారమువలననే భాసింపఁజేయఁబడి, వ్యంగ్యమగును. "వ్యంగ్య

మగు రూపణమే యిచట ధ్వని" అను, నంశమును - వృత్తికర్తకూడ - దీనిని, దీనితరువాతి యుదాహరణములను, సమన్వయించునపుడు - ముందు - తెలుప నున్నాఁడు." అనునది - యింకొక కొందఱిమతము. "శ్రీమదానందవర్ధనాభి ప్రాయమునే-మీఁది మతములన్నియు వివిధములుగా సంభావించినవి. అందు-మీఁదఁదెలుపఁబడిన (చివరి) మతమును, కువలయానందకారాదులు - అనుసరించి యున్నారు. ఆనందవర్ధనోక్తికి - సముచితమగు, నర్థము- లోచనోక్తమేయగును. కనుకనే, రసగంగాధరకర్తయగు శ్రీ జగన్నాధపండితరాజు - శ్లేషవిషయమున, కువలయానందమునఁ దెలుపఁబడిన యీమతమును - లోచనోక్తిననుసరించి ఖండించెను." అనితెలియునది.

## (88) మూలము :— ఇంకొక యుదాహరణము.

గీ॥ ఉన్నతము, ప్రోల్లసద్ధారమున్, నిరంత
రమ్ముఁ,గాలాగురుమలీమసమ్ము, నగుచు -
పరగుచుండునదగు పయోధరభరమ్ము-
వేనిఁగాంతాభిలాషి గావింపకుండు ?.

ప్రిభా :— ఇది - వర్షాసమయవర్ణనము. "ఉన్నతము = ఆకసమున నెత్తుగానున్నదియు, ప్రోల్లసద్ధారమున్ = (ప్ర + ఉల్లసత్ + ధారమున్) ప్రకర్షించి బయలువెడలుచున్న నీటిధారలు (జలపాతములు) గలదియు, నిరంతరమ్మున్ = తెంపులేనిదియు, కాలాగురుమలీమసమ్మున్ = "అగురు" అను సుగంధిధూప ద్రవ్యవిశేషమువలె, నీలవర్ణముగలదియు, నగుచు, పరగుచుండునదగు = ప్రకాశించునదియగు, (తదీయమగు,) పయోధరభరమ్ము = వర్షాసమయ సంబంధియగు జలధరములయతిశయము- వేనిని = బాటసారియగువాని నెవనిని. కాంతాభిలాషిన్ = తనప్రియురాలితోడి సమాగమమునందలి యభిలాషముఁగల వానినిగా, కావింపకుండున్ = చేయకుండును ?" అనునర్థము - ప్రకరణని యంత్రితమగు నభిధచేతఁ - దెలుపఁబడును. తమపరి, శబ్దశక్తిమూలమగు ధ్వనన వ్యాపారమువలనఁ గ్రిందియర్థము స్ఫురింపఁజేయఁబడును. "ఉన్నతము = వక్షోభాగమున నెత్తుగానున్నదియు, ప్రోలసద్ధారమున్ = (ప్ర + ఉల్లసత్ + హారమున్) ప్రకర్షించి, యుల్లసించుచున్న హారములుగలదియు, నిరంతరమ్మున్ = అంతరము (అవకాశము) లేకుండునట్లున్నదియు, కాలాగురుమలీమసమ్మున్ = అగురుచేత పూయఁబడుటవలన నీలవర్ణముగలిగినదియు, నగుచు, ప్రకాశించునది

యగు, (తదీయమగు) పయోధరభమ్ము = ఆకామినికి సంబంధించిన, స్తనముల యతిశయము - వేనిన్ = ఏయువకుని, కాంతాభిలాషిన్ = ఆకాంతయెడల నభిలాషముగలవానినిగా, కావింపకుండున్ = చేయకుండును.'' అని.

ఇది - వర్షావర్ణనపరికరణము. కనుక, మేఘపరమగు నర్థమున నభిధ - నియంత్రితమగుటవలన, స్తనపక్షీయమగునర్థము- వ్యంగ్యమగుచున్నది, తదుపరి-స్తన - మేఘములకుపమానోపమేయ భావము - (ఔపమ్యముమాత్రము) ధ్వనన వ్యాపారమువలననే యేర్పడును. కనుకనిది- శబ్దశక్తిమూలమగు ననుస్వానోపమ వ్యంగ్యమగు ధ్వనియేయగును. దీని మూలశ్లోకమిట్లున్నది.

''ఉన్నతః, ప్రోల్లసద్ధారః, కాలగురు మలీమసః।
పయోధర భరస్తన్వ్యాః (తస్యాః) కంనచక్రేభిలాషిణమ్.'' అని.

''తస్యాః'' అనుటకు బదులు, ''తస్యామ్'' అనుపాఠముండియుండునని తోఁచెడిని. పరగిన తదీయమగు పయోధరభరమ్ము, అని, పా.

(89) మూలము :— వేరొక యుదా :- క్రొవ్విరి. లేక 'నవలా' అను జాతీయపద్యము.

సముచితకాలముల, నక్లిష్టసృష్టపయస్సులఁ బ్రజఁదనుపుచు, పూర్వాహ్ణమునన్,దిగ్దిక్కులఁజెదరుచు, సాయాహ్నమునందుపసంహృతి నొందుచు,
సమరి - దీర్ఘదుఃఖప్రభవభవభయాంబునిధి సముత్తరణ నావలై - విమలాత్ములు మీ, కపరిమితమ్మగు ప్రీతి నొసంగుత, భాస్వద్ గోవుల్ః.

లోచనము :— (సూర్యకిరణపక్షమున) పయస్సులన్ = పానీయముల చేత - (ధేనుపక్షమున) క్షీరములచేత- సంహృతియనఁగా; (సూర్యకిరణపక్షమున) ధ్వంసము (ధేనుపక్షమున) ఒకచోఁజేరుట (మరలివచ్చి గోష్ఠములఁజేరుట).

పరిభా :— ఈయాంధ్రీకృతికి మూలమగు శ్లోకము- మయూరుని సూర్య శతకమునందలిది. ఇందలియర్థములలో; మొదటిది - సూర్యకిరణపరము, అది-

వాచ్యము రెండవది - ధేనుపరము. అది - వ్యంగ్యము. సమగ్రములగు నాయర్థములు రెంటిని - క్రమముగా నిట్లెఱుఁగునది :— సముచితకాలములన్ = (వాచ్యము)వర్షాదికాలములయందు,(వ్యంగ్యము)ప్రాతరాదికాలములయందు,అక్లిష్ట సృష్టపయస్సులన్ (వా)క్లేశములేకుండునట్లువర్షింపఁబడిన జలములచేత(వ్యం)విడువఁబడినపాలచేత, ప్రజన్ + తనుపుచున్ = (వా)జనులను దృప్తినొందఁజేయుచు. (వ్యం)సంతతినివనియఁజేయుచు, పూర్వాహ్ణమునన్ దిగ్దిక్కులఁజెదరుచున్ = (వా)ఉదయకాలమునఁ బ్రకాశించుటకు బ్రతిదిక్కునందును వ్యాపించుచు-(వ్యం) మేతకొఱకు పెక్కుతావులఁ దిరుగుచు, సాయాహ్నమునందున్ + ఉపసంహృతిన్ = ఒందుచున్ = (వా) సాయంసమయమున ధ్వంసమునొందుచు-(వ్యం) సాయంకాలమున మరలివచ్చి: యొకచోటఁజేరుచు,

(క్రింది సమాసమునందలియర్థము - ఉభయత్ర సమానము)

దీర్ఘ, దుఃఖ, ప్రభవ, భవ, భయ + అంబునిధి, సముత్తరణ, నావలై = దుస్సహమగుటచేత, పొడవైన దుఃఖమును గలిగించునదియగు సంసారమునకు సంబంధించిన, భయమనెడి సముద్రమును, జక్కగాదాటించుటకు నౌకలై (అమరి = ఒప్పి)భాస్వద్గోవుల్ = సూర్యునికిరణములు-ఒప్పుచున్నగోవులు (ధేనువులు-)విమలాత్మలు = పవిత్రస్వభావులగు, మీకు,అపరిమితమ్మగు = పరిచ్ఛేదములేనిదగు, ప్రీతిని = ఆనందమును, ఒసంగుతన్ = (అత్యంతముగా) జనింపజేయుఁగాక : అని.

(90) మూలము :— మీఁది యుదాహరణములు మూఁడిఁటియందును - (ప్రస్తుతములగు నర్థములయందభిధ - నియమింపఁబడియుండుటవలన) అప్రస్తుతమగు నింకొకయర్థము- శబ్దశక్తిచేత- (అభిధామూలకమగు వ్యంజనచేత) ప్రకాశింపఁ జేయఁబడునపుడు- (అభిధచేత-ప్రస్తుతమగు నర్థమును, అభిధామూలమగువ్యంజనచేత నప్రస్తుతమగునర్థమును, బోధించునదియగు)వాక్యము-అసంబద్ధార్థమునుబోధించునది (ప్రస్తుతమునకుసంబంధింపని వేరొకయర్థమును దెల్పునది) కావలసివచ్చును. వాక్యమిట్లు-అసంబద్ధార్థమును బోధించునది కాకుండుటకు - సామర్థ్యమువలన (ధ్వననవ్యాపారమువలన) అప్రాకరణిక, ప్రాకరణికార్థములకు - (రెండింటికిని)

ఉపమానోపమేయ భావమును గల్పింపవలసియుండును. కావున నర్థాక్షిప్తమగు నీశ్లేషము - శబ్దోపారూఢము (వాచ్యము) కాదు. కనుక ననుస్వానోపమ వ్యంగ్యమగు, (ఈశ్లేషాలంకార) ధ్వని - (వాచ్యమగు) శ్లేషముకంటె - విశేషించి భేదించునదియే యగును.

లోచనము :— "అసంబద్ధార్థమును బోధించునది" అనఁగా; "అసంవేద్యమానమునే (సహృదయులకుఁ దెలియనిదానినే- అనఁగా; ప్రస్తుతార్థమునకు సంబంధింపనివేరొకయర్థమునే,) తెలుపునది" అనియర్థము. (భావార్థము.) "సామర్థ్యమువలన" అనఁగా; ధ్వననవ్యాపారమువలనని యర్థము. "ఉపమానోపమేయభావము" (ఔపమ్యము) అనుదానిచేత- క్రింది యభిప్రాయము నూహింపఁదగును. (ఈయలంకారధ్వనులందంతటను - ఉపమా, రూపక, వ్యతిరేకాపహ్నవాదులందలి) ఉపమానము, రూపణ, వ్యతిరేచనము, నిహ్నవము, మున్నగు వ్యాపారమాత్రరూపములే-ఆస్వాదప్రతీతికి ముఖ్యములగుస్థానములు. (ప్రధానవ్యంగ్యములు) కాని, ఉపమేయము, మున్నగునవి - (విశ్రాంతిస్థలములగు వ్యంగ్యములు) కావు. అని.

ప్రభా :— 'ఇంతలో' 'ఉన్నతము' 'సముచితకాలములు' అను నుదాహృతులు మూడింటియందును. ప్రకరణాది నియంత్రితమగు నభిధ - ప్రస్తుతార్థములనే బోధించును. తదుపరి, శబ్దశక్తిచేత - అనఁగా; అభిధామూలమగు వ్యంజనచేతనే - అప్రస్తుతార్థములు - బోధింపఁ (ధ్వనింపఁజేయఁ) బడును. అప్పుడు, అప్రస్తుతములగు నర్థములు - ప్రస్తుతార్థములతో సంబంధింపకుండుట వలన, వానిని బోధించినవాక్యము - అనన్వితమగునర్థమును బోధించునదియగుట వలన- దుష్టముకావలసివచ్చును. కనుక, నప్పుడు, ప్రస్తుతాప్రస్తుతముల కుపమానోపమేయభావాదిరూపమగు సంబంధము - కల్పింపవలసియుండును. ఆసంబంధము - ప్రకరణాది నియంత్రితమగు నభిధవలనఁ గల్పింపఁబడునదికాదు. కనుక, ధ్వననవ్యాపారమువలననే కల్పింపఁబడును. అప్పుడు - ప్రస్తుతముకాకుండుట వలన వ్యంగ్యముపమానమును, ప్రస్తుతమగుటవలన వాచ్యముపమేయమును నగును. కాఁగా; ద్వితీయమగు నప్రస్తుతార్థము - వాచ్యము కాకుండుటవలన, శ్లేషమునకు విషయముకాదు. ఇంకేమనిన ద్వితీయమగు నాయర్థము - శబ్దశక్తిమూలమును, అనుస్వానతుల్యమును, నగు (సంలక్ష్యక్రమవ్యంగ్య) ధ్వనికే విషయమగును. కాఁగా; "శ్లేషమునకును, ధ్వనికిని. విషయము - భిన్నమేయగు

నను నంశము - సుస్పష్టమేయగుచుండును'' అని, సహృదయజ్ఞాతలు - గుర్తింతురుగాక!.

(91) మూలము :— (శబ్దశక్తిమూలానుస్వానరూప వ్యంగ్యమగు ధ్వనియందు, ఉపమ, రూపకము, మున్నగునవియే కాక) ఇతరములగు నలంకారములుకూడ - సంభవించునవియే యగును. అదెట్లనిన :- ఇచట, శబ్దశక్తిమూలానుస్వానరూపమగు విరోధముకూడ - కాన్పించెడిని. దీనికుదా :- భట్టబాణకృతమగు, హర్షచరిత్రమున, స్థాణ్వీశ్వరమను జనపదవర్ణనమునందలి గద్యము.

అచ్చటనున్న ప్రమదలు - మత్తమాతంగగామినులు - శీలవతులును, గౌరులు-విభవరతలును, శ్యామలు- పద్మరాగిణులును, ధవలద్విజశుచివదనలు - మదిరామోదిశ్వసనలును, [చంద్రికాంత శరీరలు-శిరీషకోమలాంగులును, అభుజంగగమ్యలు-కంచుకినులును, పృథుకళత్రశ్రీలు - దరిద్రమధ్యకలితలును, లావణ్యవతులు - మధురభాషిణులును, అప్రమత్తలు - ప్రసన్నోజ్వలరాగలును, అకౌతుకలు - ప్రౌఢలును] నయియుండిరి.

లోచనము :— మాతంగగామినులు = మాతంగము (గజము) వలె నడుచువారు, మాతంగులను అనఁగా; శబరులను (చండాలురను) గూడఁ బొందువారు. [శీలవతులు = సదాచారముగలవారు] అనునది విరోధము. విభవముల యందాసక్తికలవారు. విగతమహాదేవమగు (మహాదేవుఁడులేని) స్థానమునందాసక్తి కలవారు. అనునది విరోధము. పద్మరాగరత్నములతోఁగూడినవారు. పద్మముతో సదృశమగు లౌహిత్యముతోఁ (ఎరుపుతోఁ) గూడినవారు. అనునది విరోధము. ధవళములగుదంతములచేత నిర్మలమగుముఖముగలవారును, అనిపరిహారము. ఉత్కృష్టబ్రాహ్మణముఖమువలె శుచియగు ముఖముగలవారును'' అనునది విరోధము.

ప్రభా :— ఈగద్యము - హర్షచరిత్రమునందలి తృతీయోచ్ఛ్వాసమున నున్నది. ఇచట, వాచ్యమగు ప్రథమార్థమున విరోధములేదు. ఆయర్థము స్పష్టముగనది. ఆజనపదమునందున్న ప్రమదలు - మదగజయానలు, సదాచారవతులును, గౌరవర్ణలు, వైభవములయందాసక్తిగలవారును, యౌవనవతులు, పద్మరాగ

రత్నములుగలవారును, తెల్లనిదంతములచేత, స్వచ్ఛములగు వదనములుగలవారు. మదిరవలె (ఆసవమువలె) సుగంధముగలదియగు ముఖమారుతముగలవారును, చంద్రునివలె కమనీయమగు శరీరముగలవారు, శిరీషపుష్పములవలె కోమలము లగునంగములుగలవారును, విటులచేతఁ బొందఁదగనివారు, కంచుకములు (కూర్పాసకములు) గలవారును, విస్తృతవక్షలగు పిఱుఁదుల సొంపుగలవారు, అత్యల్పమగు నెన్నడుముతోఁ గూడినవారును, లావణ్యమును (ముత్తెములందగు ఛాయాతారళ్యమువంటి నైగనిగ్యమును) గలవారు, మధురముగాఁబలుకువారును, ప్రమాదము (అనవధానము) లేనివారు, ప్రసన్నోజ్జ్వలమగు రాగము (ప్రేమ) గలవారును, పూర్ణములగు కామములుగలవారగుటచేత కౌతుకములేనివారు, భర్తల తోడి కూటములయందు ప్రగల్భలును నగుచుందురు.'' అనునిది - వాచ్యమగు ప్రథమార్థము. తదుపరి, శబ్దశక్తిమూలమగు వ్యంజనచేత - ద్వితీయమగు విరోధ మిట్లు స్ఫురింపఁజేయఁబడును.

ఆజనపదమునందు ప్రకృష్టమగు మదముగలస్త్రీలు - మదించినమాలలను గూడువారు(అయినను)సద్వృత్తముగలవారు అనివిరోధము. ''మదగజయానలు'' అను ప్రథమార్థముచేత నీవిరోధము- పరిహరింపఁబడును. గౌరులు = పార్వతులు, (అయినను) విభవరతలు = శివునియందురతిలేనివారు. లేక శివభిన్నునియందురతి గలవారు. లేక మహాదేవుఁడులేనిస్థానమున రతిగలవారు, అనివిరోధము.''విభము లయందాసక్తిగలవారు''అనుప్రథమార్థముచేతనిదిపరిహరింపఁబడును,శ్యామలు = కృష్ణవర్ణలు, పద్మరాగిణులు = పద్మమునందలి యెరుపువంటి యెరుపుగలవారు. అనునది - విరోధము. షోడశవర్ష వయస్కలగు యువతులు - పద్మరాగరత్నము లతోఁగూడినవారు. లేక పద్మమునందు రాగముగలవారు. అను ప్రథమార్థముచేత నీవిరోధము - పరిహరింపఁబడును. ధవలద్విజశుచివదనలు = ఉత్కృష్టబ్రాహ్మ ణుల పవిత్రముఖములవలె పవిత్రములగు ముఖములుగలవారు - మదిరామోది శ్వసనలు = కల్లుకంపుగల యూర్పులుగలవారు. అనునది - విరోధము. తెల్ల దంతములచేత నిర్మలమగు వదనముగలవారు. ఆసవసుగంధియగు ముఖానిలము గలవారు. అనునది - పరిహారము. అంతటనుగూడ నిట్లు, విరోధమును, తత్పరి హారమును, నెఱుఁగునది. వృత్తియందు, ''మదిరామోదిశ్వసనలు'' అనునంత వఱకే-యీగద్యము - గ్రహింపఁబడినది. లోచనమునందుఁగూడ - అంతవఱకే వ్యాఖ్యానింపఁబడినది. అయినను, ధ్వన్యాలోకప్రతులు - కొన్నిఁటియందు - గద్యమంతయు నుదాహరింపఁబడినది. గద్యమునకంతకును మీఁది - ప్రభామతి యందు - వాచ్యమగు ప్రథమార్థము తెలుపఁబడినది. కనుక నాయర్థములను విరోధపరిహార విషయమున సమన్వయించుకొనుచు, శేషించిన గద్యమున, శబ్ద

శక్తిమూలమగు వ్యంజనచేతఁ బ్రకాశింపఁజేయఁబడిన విరోధరూపములగు నర్థముల నిశ్లేషించుచున్నది. చంద్రికాంత శరీరలు = చంద్రికాంతమణివంటి(కఠినమయిన) శరీరముగలవారు - శిరీషకోమలాంగులు = దిరిసెనపూవువలె మెత్తని, యంగములుగలవారు, అని విరోధము. అభుజంగగమ్యలు = సర్పభిన్నునిచేత నుపభోగింపఁదగినవారు. లేక సర్పముచేఁ బొందఁదగినవారు - కంచుకినులు = సర్పిణులు - (సర్పకాంతలు) అనివిరోధము. పృథుకళత్రశ్రీలు = పృథుసార్వభౌముని పత్నుల సంపదవంటి సంపదగలవారు- దరిద్రిమధ్యకలితలు = దరిద్రములనడుమ లెక్కింపఁదగినవారు. అనివిరోధము, లావణ్యవతులు = లవణత్వము (ఉప్పఁదనము) గలవారు, మధురభాషిణులు = తీయగామాటాడువారు. అనివిరోధము. అప్రమత్తలు = ప్రకర్షించిన మదములేనివారు - ప్రసన్నోజ్జ్వలరాగలు = అధికమును, దీప్యమానమును నగు మదముగలవారు. అని విరోధము. అకౌతుకలు = పెండ్లికానివారు, ప్రౌఢలు = పెండ్లాడినవారు. అనివిరోధము.

(92) మూలము :— ఇక్కడ - సాక్షాచ్ఛబ్దముచేత (శబ్దముచేత సాక్షాత్తుగా) విరోధము - ప్రకాశితమగుటలేదు. కనుకనిది- వాచ్యమగు విరోధమనిగాని, విరోధచ్ఛాయ ననుగ్రహించునదియగు శ్లేషమనిగాని, చెప్పుటకువీలుకలుగదుగదా!. ఎక్కడ- (కావ్యరూపయగు) శ్లిష్టోక్తియందు విరోధాలంకారము - సాక్షాచ్ఛబ్దావేదితమో, (శబ్దముచేత ప్రత్యక్షముగాఁ దెలుపఁబడినదియగునో,) అక్కడనే - విరోధముగాని, శ్లేషముగాని, వాచ్యాలంకారమునకు (వాచ్యాలంకృతిత్వమునకు) విషయమగును. [శబ్దముచేత సాక్షాత్తుగాఁ దెలుపఁబడునదియగు విరోధశ్లేషసంకరమే-వాచ్యమగు నలంకారమగును.]

లోచనము :— "ఏశ్లిష్టోక్తి - కావ్యరూపయగునపుడు - (విరోధాలంకారము - శబ్దముచేతఁ బ్రత్యక్షముగాఁ దెలుపఁబడునో) ఆశ్లేషకావ్యమునందే విరోధముగాని, శ్లేషముగాని, అనఁగా, విరోధశ్లేషసంకరము - వాచ్యాలంకృతియగు ఒకు విషయమగును." అనిఅర్థము. "అచ్చటనే (శబ్దముచేత సాక్షాత్తుగా విరోధాదులను దెలుపునదియగు శ్లేషకావ్యమునందే) విరోధముగాని, శ్లేషముగాని, వాచ్యాలంకారమని చెప్పఁదగును." అనునది - ఫలితార్థము.

ప్రభా :— "మాతంగ గామినులు, శీలవతులును" ఇత్యాదిగా విస్తరిం

చిన గద్యమున, చశబ్దార్థకములగు సుశబ్దములు - సముచ్చయార్థకములేకాని, విరోధమును దెలుపునవికావు. "మత్తమాతంగగామినులైనను - శీలవతులు" అని, "అపి" ఇత్యాద్యర్థముగల 'ఐనను' మున్నగుపదములుగాని, విరోధశబ్దముగాని, విరోధమును - సాక్షాత్తుగాఁదెలుపును. ఇచట, నట్టిశబ్దములులేవు. ప్రకరణనియంత్రితమగు నభిధ - ఇచట, ప్రస్తుతమగు ప్రథమార్థమునే తెలుపును. కనుక, తదుపరి, మాతంగాది శబ్దశక్తిమూలమగు వ్యంజనచేతనే - అప్రస్తుతమగు విరోధమును, దానిననుగ్రహించునదియగు శ్లేషమును, గూడ స్ఫురింపఁజేయఁబడును. కాఁగా, నిచట నను(గ్రాహ్యాను(గ్రాహకభావరూపమగు శ్లేషవిరోధసంకరము - వాచ్యాలంకారము కాక, శబ్దశక్తిమూలానుస్వానరూపవ్యంగ్యమగు [శ్లేషవిరోధ (విరోధాభాస) సంకరాలంకార] ధ్వనియేయగును. అనితెలియునది.

అవ :— శబ్దముచేత సాక్షాత్తుగాఁ దెలుపఁబడునదియగు విరోధాభాసము, నుదాహరించుచున్నాఁడు.

(93) మూలము : — దీని కుదాహరణము. హర్షచరిత్రమునందున్నది:- విరోధులగుపదార్థములసమవాయము(ఏక(తస్థితి) వలె (నీసన్నిధియందున్న యీపూజ్యురాలెవతె ?) అదెట్లనిన :— సన్నిహిత బాలాంధకార, భాస్వన్మూర్తియు, ...... .... .. ....

ఇత్యాదికము.

లోచనము :— "బాలాంధకార" అనుచో బాలములయందగు(వాలములయందగు) అనఁగా; కేశములయందగు 'అంధకారము' అనఁగా, కార్ష్ణ్యము (కృష్ణత్వము - గాఢనీలిమ) గలది. (అనునది - యొకయర్థము.) 'బాలమగు' అనఁగా; ప్రత్యగ్రమగు, అంధకారమనఁగా; చీఁకటి. అదిగలది. (అనునది - యింకొకయర్థము.)

ప్రభా :— ఇది - భట్టబాణకృతమగు హర్షచరిత్రమునందలి ప్రథమోచ్ఛ్వాసమున దధీచానుచరుఁడగు వికుక్షియనువాఁడు సావిత్రితోఁ దెలిపినసరస్వతీవర్ణనమునందలిమాట. దీనియర్థమిది. ఈమె - విరోధులగు = పరస్పరవిరుద్ధములగు, పదార్థముల = వస్తువులకు సంబంధించిన, సమవాయమువలె = ఏకత్రస్థితివలె, (ఒక్కచోనునికివలె)నున్నది 'అదెట్లనిన,అనుదానిచేత- "సరస్వతి-విరుద్ధవస్తువులొకచోనున్నట్లున్నదియుఁదెలుపఁబడును" అనిభావము. "సన్నిహిత

బాలాంధకార = సమీపస్థితమును, గ్రొత్తదియు,నగుచీఁకటిగలది, భాస్వన్మూర్తి = సూర్యునిమూర్తి'' అనునది - విరోధప్రకాశకమగు నర్థము. సూర్యునిస్వరూప మెప్పుడునుగూడ - సమీపమునందుండునదియగు నవీనాంధకారముగఁ డదికాదు. కనుక, నిచట - విరోధమాభాసించుచున్నది. ''ముడువఁబడిన కేశములందగు నీలిమగలది - (ముడువఁబడిన కేశములనెడి చీఁకటులుగలది.) కాంతిమతియగు మూర్తిగలదియు,'' అనునర్థముచేత - మీఁది విరోధము - పరిహరింపఁబడును.

దీనిమూల మిట్లున్నది.

[కాచేయమతి భవతీభవత్యాః సమీపే,]
సమవాయ ఇవవిరోధినాం, పదార్థానామ్ తథాహి.
సన్నిహిత బాలాన్ధకారా, భాస్వన్మూర్తిశ్చ,
[పుణ్డరీకముఖీ, హరిణ లోచనాచ,]
.................................

''ఇచ్చట- విరోధమును దెలుపునదియగు, ''అయినను''మున్నగు పదము లేకున్నను. దీనికిముందున్న వాక్యమునందున్న ''విరోధులు'' అను దానిచేతనే - విరోధాలంకారము - సాక్షాద్బోధితమగుచున్నది, కనుక, విరోధాభాసమును, దానికుపస్కారకమగు శ్లేషమును నిచట-వాచ్యములేయగును.'' అనితెలియునది.

లోచ : అవ :— [పూర్వపక్షి] ''అయ్యాః మాతంగగామినులు - శీల వతులును, ఇత్యాదులయందుఁగూడ - ధర్మద్వయమునందున్న (రెండేసిరెండేసి, ధర్మములను దెలుపునవియగు, వాచకముల చివరనున్న) చకారము-(చకారార్థక మగు'ను'కారము) విరోధద్యోతకమేయగును. అది-(చకారార్థకమగు నుకారము) ద్యోతకముకాక, సముచ్చయార్థకమేయగునెడల; నప్పుడు ప్రతిధర్మముయొక్క యు చివరనుగాని, సర్వధర్మములయు చివరనుగాని 'ను' అనునది - ఉండవలసి యుండును. లేదా (చకారార్థకమగు, ఆ'ను'కారము) ఎచ్చటనుగూడ నుండఁ గూడదు.'' అనునభిప్రాయమున వేరొక యుదాహృతిని దెలుపుచున్నాఁడు.

ప్రతి : పూర్వ :— ''ఇచట, నుకారము- సముచ్చయమును దెలుపునది కాదు. నుకారమును సముచ్చయార్థకముగాఁ బ్రయోగించు నుపాధ్యాయుఁడు - బాలురను బిలిచి, ''పలకలును, కాగితములును, కలములును, దీసికొనిరండు' అనిగాని,'పలకలు, కాగితములు, కలములును, తీసికొనిరండు.' అనిగాని, పల

కలు, కాగితములు, కలములు, తీసికొనిరండు అనిగాని, చెప్పవలసియుండును గాని, 'పలుకలు, కాగితములును, కలములు, తీసికొనిరండు.' అని చెప్పవలసి యుండదుగదా!.

ఇక్లే, వెనుక నుదాహరింపఁబడిన గద్యమునందలి పదములను - సముచ్చయసహితములుగా నొనరింపఁగోరినయెడల, బాణమహాకవి - 'మాతంగగామిను లును, శీలవతులును, గౌరులును, విభవరతలును', అని ప్రతిపదము చివరను సముచ్చయమునుంచిగాని, పదములన్నింటికిని - చివర, నొక సముచ్చయము నుంచిగాని, అసలు - సముచ్చయము నెచ్చటను జేర్పకయేగాని, వాక్యప్రయోగము నొనర్చియుండెడిని. అట్లుకాక, నామహాకవి- యీవాక్యమునఁగల రెండేసి. రెండేసి, పదములచివరనే - యీచకారమును (నుకారమును) ప్రయోగించుట వలన 'వీని నతఁడు విరోధములను దెలుపుటకే ప్రయోగించెను.'' అనిచెప్పుటయే సమంజసము. కాఁగా; 'మాతంగగామినులు' అనుగద్యమున, విరోధము- సాక్షాత్తుగనే వాచ్యమగుటవలన, నది - వాచ్యాలంకారోదాహరణమేయగును, కాని, శబ్దశక్తిమూలానురణన రూపవ్యంగ్యమగు, నలంకారధ్వని కానేరదు.'' అను పూర్వపక్షి యభిప్రాయము నాశంకించి, ఆయరుచిని దొలఁగించుటకు, వృత్తికారుఁడు- నిర్వివాదమగు, అనురణనరూప వ్యంగ్యాలంకార ధ్వన్యుదాహరణమును, వేరొకదానిని - స్వవిరచితమునే - యొసఁగుచున్నాఁడు.

(94) మూలము :— (శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యమగు విరోధాభాసాలంకార ధ్వనికి) వేరొక యుదాహరణము. నాయదియే : —

గీ॥ అరిమథనుఁ, జక్రధరుని, సద్వైతశరణు,
నక్షయుని, చతురాత్ముని, నక్రియుని, న
ధీశ్వరుని, ధీశ్వరుని, స్వాత్మఁ - దెలిసి; హరికిఁ,
గృష్ణునికి, భక్తులు నమస్కరింపుఁడయ్య!.

ఇచ్చట - శబ్దశక్తిమూలానుస్వానరూపమగు విరోధము - (విరోధాభాసాలంకార ధ్వని) స్ఫుటముగనే ప్రతీయమానమగుచున్నదిగదా!.

లోచనము :— శరణమనఁగా, గృహము. (క్షయమనఁగా గృహము.

కనుక) అక్షయమనఁగా, గృహకంబె వేరగు, అగృహము) 'ఆ'గృహము - అక్షయరూపమగు, (గృహముకాని,) అగృహమెట్లగును ? (అనివిరోధము.) ఎవఁడు- ధీశ్వరుఁడు (బుద్ధిప్రేరకుఁడు) కాఁడో, వాఁడు - ధీశ్వరుఁడెట్లగును? ('బుద్ధులకు ప్రేరకుఁడెట్లగును' ? (అనివిరోధము.) ఎవఁడు- హరియో, అనఁగా, కపిలుఁడో (కపిలవర్ణుఁడో) వాఁడు, కృష్ణుఁడెట్లగును ? (నల్లవాఁడెట్లగును? అనివిరోధము.) చతురాత్ముఁడనఁగా, పరాక్రమయుక్తమగు నాత్మగలవాఁడు. (అట్టి) వాఁడు- నిష్క్రియుఁడెట్లగును ? (అరములనఁగా, చక్రమునందలియాకులు. "అరులను" అనఁగా; అరములతోఁగూడిన చక్రములను, నశింపఁజేసినవాఁడు బహుమానించి, చక్రమును ధరించునా? విరోధమనఁగా; 'విరోధనమని' (విరోధించుటయనుక్రియయని) అర్థము. "స్ఫుటముగనే, ప్రతీతమగుచున్నదిగదా !" అనఁగా; "దేని చేతను జెప్పఁబడక స్ఫుటముగనే (నిస్సందేహముగనే) ధ్వనింపఁజేయఁబడుచున్నదిగదా! " అనిభావము

ప్రభా :— మీఁది యాంధ్రీకృతికి మూలమగు నానందవర్ధనుని శ్లోకమిట్లున్నది :—

> "సర్వైకశరణమక్షయ, మధీశ, మీశంధియాం, హరింకృష్ణమ్।
> చతురాత్మానం, నిష్క్రియ,మరిమథనం నమతచక్రధరమ్." అని.

దీనియందలి విరోధమువలెనే, "మాతంగగామినులు" అనుగద్యమునందలి విరోధముకూడ-సాక్షాచ్ఛబ్ద బోధితముకాకుండుటవలన- ప్రతీయమానమే యగును. కనుక. నదియు ధ్వన్యుదాహరణమే యగుచున్నది అయినను, నచటి చకారము- (చకారార్థకమగు నుకారము -) విరోధమును దెలుపవచ్చునని, యింతకుముందు- ప్రదర్శింపఁబడిన, యాశంకచేత నొదవిన యరుచివలన, వృత్తికర్త - నిస్సంశయమగునట్లు విరోధమును స్ఫురింపఁజేయునదియగు మీఁది శ్లోకమునుగూడ నుదాహరించెను" అనితెలియునది.

ఆంధ్రీకృత పద్యార్థము నిట్లెఱుఁగునది :- అరములన (బండి మున్నగు వానియందుఁగల) చక్రమునందలి యాకులు. ఆయరములుగలదియగుచక్రము - 'అరి' అనిచెప్పఁబడును. కాఁగా; "అరిమథనున్ = చక్రమును నశింపఁజేసిన వానిని, చక్రధరున్ = చక్రమును (సుదర్శనమును) ధరించినవానిని, అను విరోధము - శబ్దశక్తిమూలమగు వ్యంజనచేతఁ దీసికొని రాఁబడిన ద్వితీయార్థముగు చున్నది. అరిమథనున్ = శత్రుమథనముగలవానిని, అనునదియగు తత్పరిహారము-శబ్దశక్తిమూలమగు నభిధచేత సమర్పింపఁబడునదియగు ప్రథమార్థమగును."

అనితెలియునది., ఇట్లింతటను. విరోధ, పరిహారములు-వ్యంజనా, భిధా, ప్రకాశితము లని యెఱుఁగునది. సర్వైకశరణున్ = అందఱికిని ముఖ్యమగు గృహమగువానిని, అశరణునిన్ = గృహముకానివానిని, అనునది - విరోధము. "చరాచరమగు ప్రపంచమున కంతకును రక్షకుఁడగువానిని,' వినాశములేనివానిని," అనునది- తత్పరిహారము. "చతురాత్మునిన్ = "పరాక్రమాది యుక్తమగు నాత్మగలవానిని, అక్రియునిన్ = క్రియలేనివానిని," అనునది - విరోధము. "కృష్ణ, బలరామ, ప్రద్యుమ్న, అనిరుద్ధులను, నామములుగల చతుర్వ్యూహ రూపములుగలవానిని, నిష్క్రియబ్రహ్మస్వరూపుని," అనునది తత్పరిహారము. "అధీశ్వరునిన్ = బుద్ధులకు ప్రేరకుఁడగు నధిపతికానివానిని, ధీశ్వరునిన్ = బుద్ధిప్రేరకుఁడగు నధిపతిని," అనునది - విరోధము

స్వాత్మన్ = తనబుద్ధిచేత, తెలిసి = గ్రహించి, "హరికిన్ = హరిత వర్ణముగలవానికి, కృష్ణునికిన్ = నీలవర్ణముగలవానికి," అనునది - విరోధము. "విష్ణువునకు, 'కృష్ణుఁడను నామముగలవానికి,' అనునది - తత్పరిహారము. "భక్తులు నమస్కరింపుఁడయ్యా! = 'భక్తులారా! నమస్కరింపుఁడు!'' అనియర్థము. "ఇచట - విరోధమును, దెలుపునదియగు "అయినను" మున్నగువాచకమేది యును లేకుండుటవలన, నిది - అనుస్వానోపమ వ్యంగ్యమును, (సంలక్ష్యక్రమ వ్యంగ్యమును) శ్లేషోత్థాపితమును, నగు విరోధాభాసాలంకార ధ్వనియేయగు''నని తెలియునది.

(95) మూలము :— ఇటువంటిదియేయగు (శబ్దశక్తిమూలానురణనవ్యంగ్యమేయగు) వ్యతిరేకముకూడ- కాన్పించుచున్నది. దీనికుదాహరణము నాయదియే.

మ. తమమున్ దుంచుచు, ఖమ్ము- ప్రోజ్జ్వలతనొందంగా,
నఖోద్భాసులై,
తమిఁ శ్రీఁగూర్చుచుఁ బద్మసంతతికి; క్షిప్తాబ్జార్చులై; భూభృదీ
శమహోమూర్ధములన్ దనర్చి. సురశీర్షాక్రాంతిఁగావించు; న
ర్యము పాదాలుభయాలునయ్యువి-సిరిన్ రాణింపమిమ్మేలుతన్!

లోచనము :— (వాచ్యమగునపుడు) 'నఖోద్భాసులై' అనఁగా; గోళ్లచేత నవశ్యమును బాగుగాఁ బ్రకాశించునవియై, అనియర్థము. (వ్యంగ్యమగునపుడు "అఖోద్భాసులై" అని, పదవిభాగ మేర్పడుటవలన) ఆకాశమున నుద్భాసింపనివై, అనియర్థము. "పాదా,లుభయాలున్" అనఁగా, 'కిరణరూపములును' - వ్రేళ్లు, మడమలు, మొదలగు నవయవములుగల 'చరణరూపములును.' అనియర్థము.

ప్రభా :— మీఁది యాంధ్రీకృతికి మూలమగు నానందవర్ధనుని శ్లోక మిట్లున్నది :—

> ఖంయేఒత్యుజ్జ్వలయన్తి లూనతమసో, యేవానఖోద్భాసినో
> యేపుష్ణన్తి సరోరుహశ్రియమపి, క్షిప్తాబ్జభాసశ్చయే.।
> యేమూర్ధస్వవభాసినః క్షితిభృతాం, యేవామరాణాం శిరాం,
> స్యాక్రామ, న్త్యుభయేఒపి తేదిశవతేః పాదాః శ్రియేసన్తువః. అని.

సూర్యునికి - ఉభయములగు (ద్వివిధములగు) పాదములున్నవి. అందు మొదటివి - కిరణములు. రెండవవి - చరణములు. ప్రతిపాదమునందును-పూర్వ భాగమున-కిరణములకు సంబంధించిన యర్థమును, ఉత్తరభాగమున చరణములకు సంబంధించిన యర్థమును గలవు. ఆయర్థముల నిట్లెఱుఁగునది.

ఖమ్ము = ఆకాశము, ప్రోజ్జ్వలతనొందఁగాన్ = మిగులఁబ్రకాశించు నట్లు, తమమున్ = చీకటిని, తుంచుచున్ = ఖండించుచు, అనునది - కిరణ సంబంధియగునర్థము. నఖోద్భాసులై = గోళ్లచేతఁ బ్రకాశించునవియై, తమమున్ + తుంచుచున్ = పాపమును ఖండించుచు, అనునది-చరణసంబంధియగు వాచ్యార్థము. పద్మసంతతికిన్ = పద్మసమూహమునకు, తమిన్ = వికాసమును శ్రీన్ = శోభను, కూర్చుచున్ = సంఘటించుచు, అనునది - కిరణసంబంధ్యర్థము. క్షిప్తాబ్జార్చులై = పద్మకాంతులను దిరస్కరించుచు, అనునది - చరణ సంబంధి, వాచ్యార్థము. 'భూభృదగ్రిమమహాశీర్షములన్ దనర్చి" = పర్వతశ్రేష్ఠ ముల మహాశృంగములయందు [మహారాజుల శిరస్సులందు) భాసించి, అనునది- కిరణసంబంధియగు నర్థము.

సురశీర్షాక్రాంతిన్ + కాంచు = నాపు ప్రణమిల్లునపుడు దేవతల శిర స్సులను స్పృశించు, అనునది - చరణసంబంధియగు వాచ్యార్థము, అర్కునిపా దాలు + ఉభయాలు = కిరణరూపములును, చరణరూపములును, నగుచు, నిట్లు సూర్యునికి సంబంధించిన ద్వివిధములగు పాదములునుగూడ- సిరిన్ రాణిం

పన్ = ఆయురారోగ్యాదిరూపమును, ధర్మజ్ఞానాధిరూపమును, నగు సంపదచేత, రాజించునట్లు, మిమ్మున్ + ఏలుతన్ = మిమ్మురక్షించుగాక! అనియర్థము. ఈయర్థము అభిధచేతఁ దెలియఁజేయఁబడిన పిదప, శబ్దశక్తిమూలమగు వ్యంజన చేత - చరణసంబంధియగునదియగు వేరొకయర్థము - (వ్యంగ్యార్థము) ఇట్లు స్ఫురింపఁజేయఁబడును. అఖోద్భాసులై = ఆకాశమును ప్రకాశింపఁజేయనివై, క్షిప్తాబ్జార్చులై = పద్మకాంతులను తిరస్కృతినొందఁజేయునవియై, సురశీర్షాక్రాంతిఁ గావించు = పర్వతశీర్షములయందుఁ బ్రకాశింపక, పూజ్యులగు దేవతాశిరములను దొక్కునవియగు" అని. అప్పుడిచట - చీఁకటిని దొలఁగించుచు, నాకాశమును భాసింపఁజేయుట, పద్మములకు - వికాసశోభలనుగూర్చుట, పర్వతశిఖరముల యందు [మహారాజ శీర్షములందు] భాసించుట, మున్నగు ధర్మములుగల యుప మేయమగు (సూర్య) కిరణరూపపాదములకు - ఆకాశమును భాసింపఁజేయ కుండుట, పద్మకాంతులను తిరస్కృతినొందఁజేయుట, పర్వతములందుఁ బ్రకాశిం పక, పూజనీయులగు నమరుల శిరస్సులనుద్రొక్కుట, అనుహీనధర్మములుగల యుపమానమగు (సూర్య) చరణరూపపాదములకంటె నగు నాధిక్యము - శబ్ద శక్తిమూలమగు వ్యంజనచేతఁ బ్రకాశింపఁజేయఁబడుటవలన, 'నిది-శబ్దశక్తిమూలా నుస్వానోపమ వ్యంగ్యమగు, వ్యతిరేకాలంకార ధ్వని' యగుచున్నది.

అవ ; వృత్తికర్త :— అలంకారధ్వని నిరూపణమును ముగించుచున్నాఁడు.

(96) మూలము:— ఇట్లే, శబ్దశక్తిమూలానుస్వానరూప ములగుధ్వని ప్రకారములు - మఱికొన్నికూడ - సంభవములై యున్నవి. సహృదయులు- వానిని స్వయముగనే గుర్తింపవచ్చును. కనుక, గ్రంథము - విస్తరించునను భీతిచేత, నిచ్చటవానిని-ప్రపం చించు వారలముకాము.

లోచనము :— శబ్దశక్త్యుద్భవమగు ధ్వని నిట్లుతెలిపి - అర్థశక్త్యుద్భవ మగు ధ్వనినిగూడఁ బ్రదర్శించుచున్నాఁడు.

—* అర్థశక్తి మూలధ్వని నిరూపణము *—

(97) మూలము :—

[కా] అర్థశక్త్యుద్భవస్త్వన్యో యత్రార్థః సమ్ప్రకాశతే।
యస్తాత్పర్యేణవస్త్వన్యద్ వ్యనక్త్యుక్తింవినాస్వతః. 22

తే. ఉక్తి లేకయె, తానర్థమొకటి- 'తత్ప
రత్వమున,' స్వయముగనె, యర్థాంతరమ్ము
నలరఁజేయఁగ; 'నలరువస్త్వంతరమది'-
'అర్థశక్త్యుద్భవధ్వని' యనఁగవరలు.

లోచనము :— వస్త్వంతరము = శబ్దశక్త్యుద్భవమగు ధ్వనికంటె వేరగునర్థము. (అభిప్రాయ (వస్తు) రూపము.) 'స్వయముగనె, తత్పరత్వమునన్ - అనుటవలన, అభిధావ్యాపారనిరాకరణ పరమగు నీపదము - (తత్పరత్వమునన్'' అనునది) - ధ్వననవ్యాపారమునే తెలుపునుగాని తాత్పర్యశక్తినిగాదు. ''అతాత్పర్యశక్తి - వాచ్యార్థప్రతీతియందే - ఉపక్షీణయగును.'' అని పూర్వము తెలుపఁబడినదిగదా!.

ప్రిభా :— వాచ్యార్థమును ప్రతీతమొనర్చుటతోనే- తాత్పర్యశక్తియొక్క పని - ముగియును. కనుక కారికయందు ''తత్పరత్వమునన్'' అనుపదముచేతఁ దెలుపఁబడినది - ధ్వననవ్యాపారమేకాని, తాత్పర్యశక్తికాదు.

అవ :— వృత్తికారుఁడీవిషయము నీయాశయముతోనే వ్యాఖ్యానించుచున్నాఁడు. చూడుఁడు!.

**(98)** మూలము :— ఒకయర్థము - వేరొకయర్థమును (వ్యంగ్యమును) శబ్దవ్యాపారములేకయే, స్వసామర్థ్యమువలన నభివ్యంజింపఁజేయునపుడు - ఆయర్థము - అర్థశక్త్యుద్భవమను పేరుగల యనుస్వానోపమ (సంలక్ష్యక్రమ) వ్యంగ్యమగుధ్వనియగును.

లోచనము :— (కారికయందలి) ''స్వయముగనె'' అనుశబ్దమును [వృత్తికర్త] స్వశబ్దముచేతఁ దెలిపెను. ''ఉక్తిలేకయె'' అనుదానిని 'శబ్దవ్యాపారములేకయే' అని వ్యాఖ్యానించెను.

అవ :— అర్థశక్త్యుద్భవధ్వనికి కాళిదాసకృతమగు కుమారసంభవమునందలి పద్యము నుదాహరించుచున్నాఁడు.

**(99)** మూలము :— దీనికుదా :-

కం॥ అమరర్షి యిట్లుపలికెడు
సమయమ్మున - జనకపార్శ్వ సంవాసిని, యా
యుమ - అవనతాస్య - లీలా
కమలదళమ్ముల గణింపఁగా దొరఁకొనియెన్.
(కు. 6 ష. 84 శ్లో.)

ఇచ్చట - లీలాకమలదళగణనము - ఉపసర్జనీకృతమగు (గుణీభూతమగు, అనఁగా అప్రధానీకృతమగు,) స్వరూపమునుగలిగి, శబ్దవ్యాపారములేకయే- వ్యభిచారి భావలక్షణమగు నర్థాంతరమును (వేరొకయర్థమును, అనఁగా; వ్యంగ్యమగు వ్రీడను) ప్రకాశింపఁ చేయుచున్నదిగదా!.

లోచనము :— 'అర్థాంతరము'నసఁగా; 'లజ్జాత్మకమును' అనియర్థము.

ప్రభా :— "ఏవంవాదిని దేవర్షౌ, పార్శ్వేపితురధోముఖీ।
లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ."

అనునిది - ఆంధ్రీకృతికి మూలమగు శ్లోకము. (కు. ష. 84) అమరర్షి యనఁగా; అంగిరసుఁడు. దివ్యఋషులలో నొకఁడు.

అవ :— "ఇచట, లజ్జయను వ్యభిచారిభావము- ద్యోతితమగునెడల, నిది- అసంలక్ష్యక్రమవ్యంగ్య ధ్వన్యుదాహరణమే యగునుగాని, సంలక్ష్యక్రమవ్యంగ్య వస్తుధ్వన్యుదాహరణ మెట్లగును ?" అనియాశంకించి, వృత్తికర్త సమాధానము నిచ్చుచున్నాఁడు.

—• లజ్జాధ్వని - సంలక్ష్యక్రమమా ? అసంలక్ష్యక్రమమా ? •—

(100) మూలము : — ప్రశ్న :- అయ్యా! ఇది - అసంలక్ష్యక్రమవ్యంగ్యమగు ధ్వనికేవిషయమగుననరాదా ? ఉ :- అనరాదు. ప్రశ్న :- ఏల ? ఉ :- ఎచ్చట - సాక్షాచ్ఛబ్ద నివేదితములగు విభావానుభావ వ్యభిచారులచేత - రసాది ప్రతీతికలుగునో,

అదియే - (అస్థలమే) కేవలమగు నసంలక్ష్య క్రమవ్యంగ్యధ్వనికి-విషయమగును.

—• వ్యభిచారిభావము - సాక్షాచ్ఛబ్దనివేదితమా ? •—

ప్రభా : ప్రశ్న :— అయ్యా! ఇంతకుమునుపు - వ్యభిచారిభావము - సాక్షాచ్ఛబ్దనివేదితము - (వాచ్యము-) కాదనిచెప్పిన వృత్తికర్త- ఇచట, వ్యభిచారిభావముకూడ-సాక్షాచ్ఛబ్దనివేదితము కావలయుననుచున్నాఁడు. ఇది-సంగతమా?

ఉ :— "రసాదులను స్ఫురింపఁజేయుటకు-విభావానుభావములవలె, వ్యభిచారిభావముకూడ - వాచ్యముకావలయుననునది - వృత్తికారాభిమతముకాదు." అతని యాలోకార్థము నున్మీలించుచున్న లోచనమున - ఆయాలోకార్థము నాలోకింపుఁడు !

లోచనము :— "ఎచ్చట - ఈ వ్యభిచారిభావములు - స్వస్వవిభావాదిబలమువలన, అసంలక్ష్యక్రమతచేత, (చక్కఁగాగుర్తింపఁదగని క్రమభావముచేత) వ్యవధివంధ్యముగ (వ్యవధానములేకుండ) స్ఫురింపఁజేయఁబడునో, అచ్చటనవి-సాక్షాచ్ఛబ్దనివేదితములని వివక్షింపఁబడినది. కనుక, పూర్వాపరవిరోధములేదు. వ్యభిచారులుకూడ - భావములు. కనుక, స్వశబ్దమువలన, - తత్ప్రతిపత్తి (కూడ) కలుగదు." అనునది మొదలుగాఁగల విషయము - పూర్వము - విస్తారముగనే చెప్పఁబడినది.

—• వ్యభిచారిభావము - సాక్షాచ్ఛబ్దనివేదితముకాదు. వ్యంజితమేయగును •—

ప్రభా : ప్రశ్న :— అయ్యా! మీరు - లోచనములో, ఆలోకము నాలోకింపుమనినారు. కాని, మాకీలోచనములో - ఆయాలోకము నవలోకించు నాలోచనము- స్పష్టముగాఁగలుగుటలేదు. అయినను, ముందిదిచెప్పుఁడు! "వ్యభిచారులు కూడ - భావములు." అనఁగానేమి ?

ఉ :— ఓ వివేకీ ? ఇది - వినుము !. సహృదయహృదయములయందు-వాసనారూపముననుండి విభావాదులచేత స్ఫురింపఁజేయఁబడునవియు, స్థాయులై యుండుటవలన ముఖ్యముగా నాస్వాదింపఁబడునవియు, నగు రత్యాదిచిత్తవృత్తులేగదా! రసములు ?

పరిప్రశ్నకర్త :— ఔను.

ఉ :— సాక్షాచ్ఛబ్ద నివేదితములగు విభావానుభావములచేత - స్ఫురింపఁ జేయఁబడి, రసీభవించిన (ఆస్వాదింపఁబడుటనొందిన) యీరత్యాదిచిత్తవృత్తులు- రసీభవించిన భావములేగదా! ?

పరిప్రశ్నకర్త : - ఔను.

ఉ :— రసీభవింపని రత్యాదిచిత్తవృత్తుల నేమనవలయునో చెప్పుదురా?

పరిప్రశ్నకర్త :— రసములనరాదు. కనుక - వానిని భావములనియే చెప్పవలయును.

ఉ : నిర్వేదము మున్నగువాని నేమనవలయును ?

పరిప్రశ్న :— అవియు, చిత్తవృత్తులేయగుచున్నవి. కనుక, భావములనియే చెప్పవలయును.

ఉ :— వివిధములుగను, ఒకదానికొకటి యభిముఖములుగను, చరించునవియు, సముద్రకల్లోలములవలె నుదయించుచు, నడఁగుచు, నుండునవియునగు నిర్వేదాదుల నేమనవలయును ?

పరిప్రశ్న :— వ్యభిచారులనవలయును.

ఉ :— వ్యభిచారులుగూడ - భావములే, అనఁగానేమో తెలిసినదా ?

పరిప్రశ్న :— అహా! తెలిసినది. రసీభవింపని చిత్తవృత్తులే - వ్యభిచారిభావములని తెలిసినది. కనుకనే; "రసములవలె (రసీభవించిన చిత్తవృత్తులవలె) వ్యభిచారిభావములుకూడ (రసీభవింపని చిత్తవృత్తులను నిర్వేదాదులుకూడ) సాక్షాచ్ఛబ్దబోధితములగునపు డనుభవ గోచరములుకావు" అను సిద్ధాంతమును దృఢముగా విశ్వసించియున్నాను. కాని వృత్తికర్త - యిప్పుడిట్లేలచెప్పెనో తెలియక తికమకపడుచున్నాను. విభావానుభావములతోఁబాటు వ్యభిచారిభావములుకూడ- సాక్షాచ్ఛబ్దనివేదితములు కావలయునని, యిచట - వృత్తికర్త చెప్పినమాటను - లోచనకర్త యెట్లు సమర్థించి సమన్వయించెనో తెలుపుదురా ?

ఉ :-- రసములవలె (రసీభవించిన చిత్తవృత్తులవలె) వ్యభిచారులుకూడ (రసీభవించని) చిత్తవృత్తిరూప భావములేయగుటవలన, అసంలక్ష్యక్రమవ్యంగ్యములగు ధ్వనులేయగునని చెప్పియుంటిమిగదా. తమతమవిభావాదులబలముచేసిన ఆవిభావాది వాచ్యప్రతీతికిని, వ్యంగ్యములగు నీవ్యభిచారిభావముల ప్రతీతికిని,- రసాదిప్రతీతియందువలెనే ప్రతీతిక్రమమున్ననుగూడ - తమతమవిభావాదుల వలననగు బలమువలన, అనఁగా సామర్థ్యముచేతనగు శీఘ్రతవలన, (ఉండిన క్రమముకూడ) చక్కఁగా గుర్తింపఁదగినదిగాకుండుటవలన, (అసంలక్ష్యక్రమత వలన) వాచ్యార్థ-వ్యంగార్థప్రతీతులనడుమనుగల వ్యవధానముకాన్పింపకుండును కనుకనే, యీ వ్యభిచారిభావముల ప్రతిపత్తి - వాచ్యార్థ ప్రతిపత్తితోఁగూడి యుండునదివలెఁ దోచునదియగు రసాదిప్రతిపత్తివలెనే, వ్యవధానములేనిదివలెఁ గాన్పించుచుండును కనుక, రసాదిప్రతిపత్తివలెనే, యీవ్యభిచారిభావ ప్రతిపత్తికూడ - సాక్షాచ్ఛబ్దనివేదితముకాకున్నను, సాక్షాచ్ఛబ్దనివేదితమువలె నుండుట వలన - ఇచట - వృత్తికర్తచేత - సాక్షాచ్ఛబ్ద నివేదితముగా వివక్షింపఁబడినది.

ప్రశ్నకర్త :— అయ్యా! మీలోచనకర్త - అఘటనఘటనాసమర్థుఁడగు నైంద్రజాలికునివలెనున్నాఁడు. ఈసమన్వయము - మాకింద్రజాలమువలెనే విస్మయజనకముగానున్నది. వృత్తికర్త - ఇచట - సాక్షాచ్ఛబ్దనివేదితములుకాని వ్యభిచారిభావములను సాక్షాచ్ఛబ్దనివేదితములగు విభావానుభావములతోఁ జేర్చి వానినిఁగూడ - సాక్షాచ్ఛబ్దనివేదితములుగా వివక్షించుటయందలి గూఢాశయ మేమో తెలుపుదురా ?

ఉ :— తెలుపకేమి ? "రాధాకృష్ణులు - శృంగారముగా విహరించిరి." అని ఒకరచయిత - ప్రయోగించెననుకొనుఁడు - అపుడచట సాక్షాచ్ఛబ్దనివేదితమగు నీ శృంగారపదముచేత - సహృదయులకు శృంగారరసాస్వాదము-కలుగఁ జేయఁబడునా ?. అట్లే- "రాధ-నిర్విణ్ణయయ్యెను" అని సాక్షాచ్ఛబ్దనివేదితమగు నిర్వేదాదిపదముచేత - సహృదయులకు - నిర్వేదాది వ్యభిచారిభావముకూడ - గోచరింపఁజేయఁబడునదికాదు. కాఁగా! రసీభవించిన చిత్తవృత్తిరూపభావములగు రసములవలె, రసీభవింపని చిత్తవృత్తిరూపభావములగు వ్యభిచారులుకూడ - వాచ్యములగునపుడు - స్ఫురించునవికావు. శకుంతలాదులకు దుష్యంతాదుల విషయమునఁగలిగిన రతిని, నిర్వేదమును, సహృదయములకు గోచరింపఁజేయఁగోరిన కవి - విభావాదులచేత - వానిని స్ఫురింపఁజేయక, "శకుంతల - దుష్యంతుని ప్రేమించెను- నిర్వేదమునొందెను." అని కావ్యమునఁ జెప్పినయెడల, నతఁడుపరిహాస పాత్రుఁడేయగునుగదా!. వ్యభిచారులు - వాచ్యములగునపుడు - అవి-భావ

ములు - (చిత్తవృత్తిరూపములు.) కావు, మఱియునవి - రసవ్యంజనమున, నుప యోగించునవికూడఁ గానేరవు, ఈ భావములు - వాచ్యములు కాఁగూడనివైనను, వ్యంజనాసిద్ధములగు వీని నొకప్పుడనువదించుట- దోషముకాదు. స్ఫురింపఁజేయఁ బడినభావములే యనువదింపఁబడును. కనుకనది - దోషముకాదు. కాఁగా; వ్యభి చారులుకూడ - విభావానుభావములవలన - స్ఫురింపజేయఁబడునవియేయగును. కనుకనివి - సాక్షాచ్ఛబ్దబోధితములుకావు. ఇట్లివి - సాక్షాచ్ఛబ్ద నివేదితములుకాకున్నను, విభావానుభావముల సామర్థ్యమున - మిక్కిలివడిగా స్ఫురింపఁజేయఁ బడుటవలన, రసాదిప్రతీతివలె, వీనిప్రతీతికూడ - అసంలక్ష్యక్రమవ్యంగ్యమే యగును. అనఁగా, "విభావానుభావ నివేదితములయి - స్ఫురించునవియగు నీవ్యభిచారిభావముల ప్రతిపత్తి - వాచ్యార్థప్రతిపత్తి కలిగినపిదపనే కలుగునది యయినను, వాచ్యార్థప్రతిపత్తితోఁ గూడియే కలుగునదివలె నుండుటవలన - వాచ్యార్థప్రతీతికిఁ దరువాతిదిగాఁ గుర్తింపఁబడని వ్యంగ్యార్థప్రతీతి క్రమముగల దియేయగును." అనియర్థము. వ్యభిచారులగు భావములిట్లు - అసంలక్ష్యక్రమ వ్యంగ్యములగుటవలన - (నిజముగా) సాక్షాచ్ఛబ్దనివేదితములు కాకున్నను, సాక్షాచ్ఛబ్దనివేదితములవలెనే గోచరించును. కాఁగా; సాక్షాచ్ఛబ్ద నివేదితములగు "శకుంతల, ఆమెచూపులు" మున్నగునవియగు విభావానుభావములచేతను- ఈ విభావాను భావములచేతనే స్ఫురింపఁజేయఁబడునవియగుచున్నను, ప్రతీతి శీఘ్ర తవలన - సాక్షాచ్ఛబ్ద నివేదితములవలె నుండునవియగు వ్యభిచారులచేతను-స్ఫురిం పఁజేయబడిన రసప్రతీతిగలస్థలమే - అసంలక్ష్యక్రమ వ్యంగ్యమగు ధ్వనిస్థలము గాని, విభావానుభావాదులవలన స్ఫురింపఁజేయఁబడక, కేవలమగునర్థముయొక్క స్వసామర్థ్యముచేతనే స్ఫురింపఁజేయఁబడిన లజ్జాదిరూప వ్యంగ్యార్థప్రతీతిగల యీ స్థలము - అసంలక్ష్యక్రమధ్వని స్థలముకాదు. కాఁగా; "అసంలక్ష్యక్రమధ్వనులగు వ్యభిచారులు-వ్యవధానములేని వాచ్య-వ్యంగ్య ప్రతీతిక్రమమువలన, వాచ్యములగు విభావాను భావములవలె నుండు"ననుటయే - వ్యభిచారిభావములను సాక్షాచ్ఛబ్ద నివేదితములని (వృత్తికర్త) వివక్షించుటయందలి గూఢాశయము.

(101) మూలము :— (కాళిదాస మహాకవి కృతమగు) కుమారసంభవమున, (తృతీయసర్గమున) మధుప్రసంగమున, "వసంత పుష్పాభరణ ధారిణియగు పార్వతీదేవి (శివసన్నిధికి) ఆగమన మొనర్చుట" మున్నగునది - మొదలు - (మన్మథుఁడు- శివుని లక్ష్యముగాఁగొని) బాణమును సంధించునంతవఱకును, గల

వర్ణనమును, (కించిత్) పరివృత్తధైర్యుఁడగు శంభుని, చేష్టావిశేషాది వర్ణనమును, సాక్షాచ్ఛబ్ద నివేదితమగుచున్నది. ఇచ్చటనో ('అమ రర్షి' అనుస్థలమునమాత్రము) అర్థసామర్థ్యముచేత - ఆక్షిప్తమగు (కనుకనే, సంలక్ష్యక్రమవ్యంగ్యమగు) వ్యభిచారి (లజ్జా) భావద్వారమునసే - (అసంలక్ష్యక్రమవ్యంగ్య) రసప్రతీతి కలుగుచున్నది. కావుననిది - (అసంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని ప్రకారముకంటె) వేఱగు (సంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని) ప్రకారమగుచున్నది.

ప్రభా : అవ :— ఇచట - నిగూఢమగు ఫలితార్థమును - లోచనకర్త విశదీకరించుచున్నాఁడు.

లోచనము :— రసము, భావము [అనఁగా; వ్యభిచారియగు నిర్వేదాది కము] మున్నగునర్థము - ధ్వన్యమానమే యగునుగాని, యెుకప్పుడునుగూక - వాచ్యముకాదు. అయినను, నదియంతయుఁగూడ - అసంలక్ష్యక్రమధ్వనికే విషయమగునదికాదు. ఎచ్చట - స్థాయిగతములును, (స్థాయిభావమునకు సంబంధించినవియు) వ్యభిచారిగతములును, (వ్యభిచారిభావములకు సంబంధించినవియు) (కనుకనే) పూర్ణములును, నగువిభావానుభావములవలన రసము-వ్యంజితమగునో- అది - అసంలక్ష్యక్రమధ్వని స్థలమగును.

ప్రభా :— "స్వశబ్దనివేదితములగు విభావానుభావములలో-స్థాయిభావమునకు సంబంధించిన విభావానుభావములు- స్థాయి (రత్యాది) భావమును, వ్యభిచారిభావములకు సంబంధించిన విభావానుభావములు - వ్యభిచారి (నిర్వేదాది) భావములను, వ్యవధిలేకుండునంత శీఘ్రమున స్ఫురింపఁజేయగల్గునపుడే-తాము-పూర్ణతగలవియగును. ఇట్లు పూర్ణములగు వాచ్యవిభావానుభావములెచ్చట వాచ్య-వ్యంగ్యప్రతీతిక్రమము కాన్పింపకుండునంత శీఘ్రముగా స్థాయిభావ, వ్యభిచారి భావములను, స్ఫురింపఁజేయునో, ఆస్థలమే - అసంలక్ష్యక్రమధ్వనిస్థలము. విభావానుభావద్వారమునఁగాక - అర్థము - స్వయముగానే - లజ్జాదిరూపమగు వ్యభిచారిభావము నెచట - స్ఫురింపఁజేయునో, ఆస్థలము-అసంలక్ష్యక్రమధ్వనిస్థలము కాదు. అది-సంలక్ష్యక్రమధ్వని స్థలమేయగును." అనిభావము. కాఁగా, "భావము-సంలక్ష్యక్రమవ్యంగ్య ధ్వనిరూపముకూడఁ గావచ్చును" అనునది-ఫలితార్థము.

అవ :— అసంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని నుదాహరించుచున్నాఁడు.

—• అసంలక్ష్యక్రమవ్యంగ్య (రసాది) పరిదర్శనము •—

లోచనము :— దీనికుదా :-

గీ॥ అపుడు - నిర్వాణ భూయిష్ఠమతనిబలము -
స్వాత్మగుణమున నుజ్జీవితాత్మఁ జేయు
నదియువలె, వనదేవతలంటి వెంట
రాఁగ,ఁ గాన్పించె, 'స్థావరరాజకన్య' ।.

ఇత్యాదులయందు - ఆలంబనోద్దీపన విభావతకు యోగ్యమగు స్వభావము-సంపూర్ణముగా వర్ణింపఁబడినది.

ప్రభా :— ఇది - కాళిదాసకృత కుమారసంభవమునందుఁగల తృతీయ సర్గమునందలి శ్లోకమున కాంధ్రీకృతిరూపము.''ఆదులయందు''అని, లోచనము చేత నుద్ధరింపఁబడిన కుమారసంభవమునందలి తృతీయసర్గమునందు - దీనికిముందును, వెనుకను, గల శ్లోకములయర్థముల నిట్లెఱుఁగునది. (ఇది-కుమారసంభవ. తృతీయసర్గమునందలిది) ''శివుఁడు - తనమనస్సును-(చక్షురాదులగు) నవద్వారములనుండియు నివర్తింపఁజేసి, సమాధిచేత వశగతమయిన యామనస్సును-హృదయమును నధిష్ఠానమున నిలిపెను, క్షేత్రజ్ఞులగు పురుషులు - ఎవ్వనినక్షరునిగ (అవినాశిగ) తెలియుదురో, ఆయక్షరుఁడగు నాత్మనే - స్వాత్మయందుఁజూచెను. ఏలన; తనకంటె వేరగుపరమాత్మ లేఁడుగదా ।. మనస్సుచేతఁగూడ - సమీపించుటకు వీలుపడనివానిని, ఇంతవఱకును వర్ణింపఁబడినవానిని, మూడుకన్నులుగలవానిని, యోగిగానున్నహరుని - రాగిగానొనర్చుటకువచ్చిన, స్మరుఁడు-చూచెను. చూచినతోడనే, భయముచేత, నతఁడు- విశ్లథపాణియయ్యెను. (చేయువదలెను.) పాపమతఁడు - తనచేతినుండి - చాపముజారిపడిన విషయమునుగూడ - గుర్తింపలేకపోయెను. అప్పుడించుమించుగ నతని శక్తియంతయుఁగూడ - నష్టప్రాయమయ్యెను. అట్టి మన్మథుని బలమును-స్వాత్మగుణముచేత-అనఁగా; స్వశరీరసౌందర్యముచేత - పునరుజ్జీవింపఁజేయునదివలె, సఖులగు వనదేవతలచేత, ననుసరింపఁబడి, వచ్చుచున్న స్థావరరాజకన్య - (పార్వతి-) వానికిఁ గనిపించెను. అనగరాజకుమారి - అశోకపుష్పమునే ధరించెను. (అయినను) అది - పద్మరాగమణిని దిరస్కరించెను. కొండగోగుపూవునే తాల్చినది. (అయినను) అది - సువర్ణాభరణవర్ణములనుగూడ పుడికి పుచ్చుకొన్నది. (ఆయమ్మ) సింధువారములనే (నిర్గుండి కుసుమములనే) వహించినది, అయిననవి - యామెకు ముక్తాకలాపములుగాఁ జేయఁబడినవి.

ఆమె - ఇట్లు వసంతమునఁబూచిన పూవులనునగలనే - వహించినది. (అనమిత కాకున్నను) స్తనములచేత-ఇంచుక వంగినదివలెనున్నది. లేతసూర్యుని కెంజాయ వలె నెఱ్ఱనిదగు వస్త్రమును (కాషాయమును) గట్టుకొనియున్నది. కనుకనే. నిండు గాఁబూచినపూవులగుత్తులచేతవంగి, చిగురాకులతోఁగూడి, (కిసలయపతియై) నడ యాడుచున్న లతవలెనున్నది. స్మరుఁడు - స్థానవిదుఁడు. కనుక నతఁడు - దేని నెచట నిక్షేపింపఁదగునో, దానినచట నిక్షేపించును. వింటికి సంబంధించిన, రెండవ నారివలెనున్న వకుళమాలారూపమగుకాంచి-పార్వతీనితంబమునకు మీఁదనుండెను. అచట స్మరునిచేత - నిక్షేపింపఁబడిన రెండవమౌర్వివలెనున్న కాంచి - శివునిమీఁద పగఁదీర్చికొనుటకు ముందుముందుపయోగించు ననుతలంపున, నతనిచేత - అచట నిక్షేపింపఁబడినదివలె నుండెను. పొగడపూలదండయగు మొలత్రాడు - పార్వతీ నితంబమునుండి జారుచుండ - ఆమె దానిని మాటిమాటికిని సవరించుకొనుచు, వచ్చుచుండెను. (దానిని' తనహస్తమునఁ బట్టుకొనుచు వచ్చుచుండెను.) మిక్కిలి పరిమళించుచున్న నిట్టూర్పుగాలులచేత - వృద్ధినొందిన కోరికగలిగిన తుమ్మెద - (దొండపండువలెనున్న) ఆమె మోవిచెంతఁదిరుగుచుండెను. ఆమె ప్రతిక్షణమును సంభ్రమముచేత చలించునదియగు దృష్టిగలిగి, పాణియందు ధరించిన లీలారవిం దముచేత, దానిని - నివారించుచుండెను. పార్వతియంగకములన్నియు నిర్దుష ములే. కనుకనే, తనకాంతయగు రతికిఁగూడనామె - సిగ్గునొదవించుచుండెను. ఆజగదేకలావణ్యరాశినిజూచి-పుష్పబాణుఁడగు కామునిచేత నెదుర్కొనఁబడుచున్న శివుఁడు - జితేంద్రియుఁడగుటవలన - దుర్జయుఁడైనను, శూలియైనను, గూడ- ఆశివుని విషయమున (తిరుగ) స్వకార్యసిద్ధిని సంభావించెను. పార్వతికూడ - తనకు భర్తకాఁబోవుచున్న శంభుని ప్రతిసీర (ద్వారము) చెంతకు - వచ్చెను. శివుఁడుకూడ - పరమాత్మయను పేరుగల, పరంజ్యోతిని సాక్షాత్కరించుకొని, యోగమునుండి ఉపరమించెను. తరువాత, తానుకూర్చుండియుండిన భూమిభాగ మును - దానిక్రిందనున్న భుజంగాధిపతియగు శేషుఁడు - తన ఫణాగ్రములచేత- అత్యధికమగు ప్రయత్నమున, నెట్లోమోయుచుండగా, ఇంతకుముందు(తనచేత) నిరోధింపఁబడిన ప్రాణవాయువులను - మెల్లగా వెలుపలికివిడిచి, ప్రాణవాయు సంచారమును గలిగియున్న యాయీశ్వరుఁడపుడు - తానుసంఘటించిన పర్యంక బంధమును (వీరాసనమును) - శిథిలీకరించెను. అంతలో నచటికి- నంది-వచ్చెను. వచ్చి, భగవానునికి - ప్రణమిల్లెను. "శైలతనయ - శుశ్రూషార్థమువచ్చినది." అని నివేదించెను. స్వామి - భ్రూక్షేపము నొనర్చెను. తన్మాత్రముచేతనే - ఆమె ప్రవేశమనుమతింపఁ బడినది- కనుక, నామె నతఁడు - (లోనికి) ప్రవేశపెట్టెను.

ఆమె సఖియలిర్వురును - స్వహస్తములతోఁ గోసితెచ్చిన కిసలయశకల

మిశ్రమగు వాసంతిక పుష్పోచ్చయమును - త్ర్యంబకపాదమూలమున, ప్రణతి పురస్సరముగా విక్షేపించిరి. ఉమకూడ - నీలాలకములనడుమఁ గూర్పఁబడి, విలసిల్లుచున్న, నవకర్ణికారమును - (కొండగోగుపూవును) విస్రంసనము నొందఁ జేయుచు, (క్రిందికి, ప్రసరించునట్లొనర్చుచు,) చెవినుండి జారిన చిగురాకులుగల శిరస్సుతో - వృషభధ్వజునకుఁ (శివునకుఁ) బ్రణామమునొనర్చెను. ''అన్యాంగన నభిలషింపని పతినొందుము'' అని భవుఁడామెను తథ్యముగనే యాశీర్వదించెను. (తమపని సఫలించిరిగెనుగదా!) ఈశ్వరవ్యాహృతులు - (మహాపురుషోక్తులు) లోకమునందెప్పుడునుగూడ - విపరీతమగు నర్థమును దెలుపునవికావుగదా!. ''ఉమ - చెంతనున్నది. కనుక, నిదియే - బాణప్రయోగమునకుఁదగిన సమయము.''అని తెలిసికొని, మిడుతవలెఁ దుల్యముగ, అగ్నిముఖమునఁ బ్రవేశింపఁగోరిన వాఁడగు మన్మథుఁడు -ఉమాసమక్షమున హరుని గురిగాఁజేసి, శరాసనమునందున్నారిని మాటిమాటికిని పరామర్శింపఁదొడఁగెను. అదేసమయమున - గౌరీదేవి - తపస్వియగు గిరీశునికి, భానుమంతుని కిరణములచేత నెండింపఁబడియున్న మందాకినీ పుష్కరబీజమాలను (జపమాలికను) తామ్రరుచిగలస్వహస్తముతో సమర్పించెను.'' [ఇది - కుమా. తృతీయసర్గము. 50 నుండి 65 వఱకునుగల శ్లోకాభిప్రాయము.]

మీఁది కావ్యవర్ణనమున, ఆలంబన విభావమగు, ఉమాదేవియు, ఉద్దీపనవిభావమగు, తదీయ సౌందర్య, వసంతపుష్పాభరణ విలాసాదికమును, మిక్కిలిపూర్ణముగా వర్ణింపఁబడినవిగదా !.

లోచనము :— (తరువాత)

గీ॥ స్వీకరింప నుపక్రమించెను, త్రిలోచ
నుండపుడు, దానిఁ, బ్రణయి ప్రియుండుగనుక;
పుష్పధన్వయు - నిజచాపమున, నమోఘ
మయిన సమ్మోహనాస్త్రమ్ముఁ, నపుడెకూర్చె.
(కు. తృ. 66)

అను దీనిచేత - విభావతకు సంబంధించిన, యుపయోగము తెలుపఁబడినది.

ప్రభా :— ''స్వీకరింప నుపక్రమించెను. చాపమున - అలుగుఁగూర్చెను'' అని తెలుపఁబడిన యుపయోగము - ఆలంబనోద్దీపనవిభావ కృతమేగదా !.

లోచనము : – గీ॥ హరుఁడు నిందూదయారంభమందు, సాగ
రుండుపోలెఁ, గించిత్ పరిలుప్తధైర్యుఁ
డగుచు; బింబఫలాధరమ్మగు, నుమాము
ఖమునఁ బ్రసరించెఁ దన లోచనములనపుడు.
(కుమా. తృ. స 67)

ప్రియామతి : — అప్పుడు,

కం॥ వికసచ్ బాలకదంబ
ప్రకృతి సమానాంగముల - శివయు - భావమ్మున్
బ్రకటింపుచుఁ, జక్కని, ని
గ్గుకనులఁ గల, మొగము - మలఁచుకొని - నిలుచుండెన్.
(కుమా, తృ. స. 68)

"హరుఁడుకూడ - చంద్రోదయారంభ సమయమున - సముద్రుఁడువలె, నించుక పరిలుప్తమయిన యింద్రియనిగ్రహము గలవాఁడయ్యెను. (కాని, ప్రాకృత జనులవలె, మిక్కిలి పరిలుప్తమయిన ధైర్యముగలవాఁడు కాలేదు.) కనుకనే, దొండపండువలెనున్న యుమాముఖమున నప్పుడతఁడు - తనకన్నులుమూడింటి కిని-పనిఁగల్పించెను." 'ఇచట - హరుఁడుకూడ-ఇంచుకలోపించిన ధైర్యముగల వాఁడగుట - ఉమాముఖము నవలోకించుట' -అను, అనుభావములు-వాచ్యములు. వాచ్యములగు నీయనుభావములచేత - భగవంతునికిఁ గలిగిన, రతిభావోదయము-వ్యంజితము. "మహీధర కుమారికూడ - వికసితములును, కోమలములును, నగు నీపములను (కడిమిమొగ్గలను) బోలునవియగు (పులకితములగు) నంగకముల చేత - రత్యాఖ్యమగు భావమును వివరింపుచు, చారుతరమును, వ్రీడావిభ్రాంత నేత్రములుగలదియు, నగు ముఖమును - ప్రక్కకుఁ ద్రిప్పికొని, అచటనే-నిలి చెను." అను ద్వితీయపద్యమున-'ఉమ-పులకితములగు నంగములుగలదియగుట, సిగ్గు కనులతోఁగూడిన మొగమును - మలఁచికొని నిలుచుట.' అనునవి - అను భావములు. ఈయనుభావములు - సాక్షాచ్ఛబ్దనివేదితములగుచున్నవి. వీనిచేత - భగవతియగు పార్వతికి - శివుని విషయమున నొదవిన, రతి - ప్రకాశితమని తెలియునది.

లోచనము : – (సతీ రూపాంతరయగుటవలన) భగవతియగు పార్వతి-మొదటినుండియు (పుట్టినప్పటినుండియు) శివప్రవణయేయయియున్నది. (సతీ

దేవితోడి వియోగము నొందిన పిమ్మట - విరక్తుడగుటవలన - ఇంతవఱకును
తపః పరాయణు(డయియున్నను) శివుడు కూడ - ఇప్పుడు - (శుశ్రూషననుమ
తించి) భగవతి కున్ముఖుడగుటచేతను, పరిణయ ప్రియభావముచేతను, [ఆమె
సమర్పించిన మందాకినీ పుష్కరబీజమాలను స్వీకరించుట కుపక్రమించుటచేతను]
సూచింపబడిన పక్షపాతము - గాఢభావము నొందుటవలన, (వారివిషయమున)
స్ఫురింపజేయబడిన, రతియను స్థాయిభావమునకును - ఔత్సుక్యము, ఆవేగము,
చాపల్యము, హర్షము, మున్నగు (దాని) వ్యభిచారిభావములకును - గూడ సాధా
రణముగా జేయబడిన (శివుని విషయమున) కించిత్ పరిలుప్తధైర్యుడగుట
ఉమాముఖమున నవలోకించుట, (పార్వతివిషయమున) పులకితములగు నంగము
లచేత భావమును ప్రకటింపుచుండుట, చక్కనిదియు, సిగ్గుచేత విభ్రాంతములగు
కన్నులుగలదియు, నగు మొగమును - ప్రక్కకు ద్రిప్పికొనుట, అను, అనుభావ
వర్గము - సాధారణమగునట్లు - ఇచట బ్రకాశింపజేయబడినవి. కనుక, విభా
వానుభావ చర్వణయే - వ్యభిచారి (భావ) చర్వణయందు - పర్యవసించును.
(ఈ) వ్యభిచారిభావములు (గూడ) పరతంత్రములు. (స్థాయిభావమున కధీన
ములు.) కనుకనే, పుష్పమాలికవంటివగు నివి - సూత్రమువంటిదగు స్థాయిభావ
మునకు సంబంధించిన చర్వణయందు విశ్రాంతి నొందును. కనుక -(స్థాయివలెనివి
యు(గూడ) అసంలక్ష్యక్రమములగుట - (చక్కగా గుర్తింపబడని క్రమముగల
వ్యంగ్యముగల ధ్వనులగుట) సిద్ధించును.

ప్రభా :— ఇచట-వాచ్య విభావానుభావములవలె, -వ్యభిచారిభావములు
కూడ - సాక్షాచ్ఛబ్దనివేదితములవలె, శీఘ్రముగా స్ఫురింపజేయబడి, అభిలాష
శృంగారరసరూపమునందు - విశ్రాంతినొందుచున్నవి. కనుక, నిట్లు సాక్షాచ్ఛబ్ద
నివేదితములగు విభావానుభావములచేతను, సాక్షాచ్ఛబ్ద నివేదితములవలెనున్న
వ్యభిచారిభావములచేతను, ప్రకాశింపజేయబడిన, రసప్రతీతిగల స్థలమే - అసం
లక్ష్యక్రమవ్యంగ్యమగు ధ్వనిస్థలమనునది - వృత్తికారాశయమని తెలియునది.

లోచ :— ఇచ్చటనో, ('అమరర్షి' అను పద్యస్థలముననో) అవనతాస్య
యగుట - లీలాకమలదళములను లెక్కించుచుండుట - అనునవి- కుమారికలకు-
వేరొకవిధమునగూడ - [లజ్జకంటె వేరగు కారణముచేతగూడ సంభవింపవచ్చు
నని] సంభావింపవచ్చును. కనుకనవి-యిచట ననుభావములు కాకతప్పనివికావు
కనుక - నవి - (సహృదయ) జ్ఞాతయొక్క హృదయమును - (అసంలక్ష్యక్రమ
ధ్వని స్థలమునందువలె) శీఘ్రముగా లజ్జయందు (లజ్జారూపమగు నర్థమునందు)
విశ్రమింపజేయునవికావు. కాని, యింతకుముందు శ్రీపార్వతి కావించిన తపశ్చ

ర్యాది వృత్తాంతముయొక్క స్మరణముచేత, నిచట-జ్ఞాతకు-లజ్జావిషయకమగు జ్ఞానము గలిగించును. కనుక,("అమరర్షి" అనుపద్యమున స్ఫురింపఁజేయఁబడిన) లజ్జ - సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనియే యగును.

ప్రభా : ప్రశ్న :— అయ్యా : "అమరర్షి" అనుచోటఁగూడ - శివ-ఆలంబన విభావముగాఁజెప్పఁబడినది. అవనతాస్యయగుట, కమలదళముల గణించుచుండుట, అనునవి - అనుభావములుగాఁ జెప్పఁబడినవి. కనుక నిచట-వ్యంగ్యమగు లజ్జ - అసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వని యేలకారాదో ?

ఉ :— పార్వతి - మొగమువంచుకొనుట, పద్మదళములను గణించుట, అనువానికిచట హేతువు - లజ్జయే - కానక్కరలేదు. కుమారికలకివి - సహజముగనేయుండును. కనుకనిచట - సహృదయులకు - వాచ్యవ్యంగ్యప్రతీతిక్రమము తెలియఁబడకుండునంత వేగమున, లజ్జావిషయకమగు జ్ఞానముకలుగదు. [అనఁగా; పార్వతి - సిగ్గుపడుచున్నదని తెలియదు.] కనుకనిది - అసంలక్ష్యక్రమవ్యంగ్య ధ్వన్యుదాహరణముకాదు. కాని, యీ వాక్యమునువిని - దీనివాచ్యార్థము నెఱిఁగిన సహృదయజ్ఞాత - యింతకుముందలిదగు పార్వతీ తపోవృత్తాంతమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనునపుడు - ఈముఖనమన, దళగణన, రూపమగు నర్థముయొక్క సామర్థ్యమున - సహృదయులకు లజ్జావిషయకమగు జ్ఞానముకలుగును. కనుక, నిచట, ధ్వనింపఁజేయఁబడిన లజ్జ - సంలక్ష్యక్రమవ్యంగ్యమేయగును.

ప్రశ్న :— ఇచ్చట - రసప్రతీతిలేదా ? అప్పుడిది - యేధ్వనియగును?.

ఉ :— లోచనమునఁ జూడుఁడు:.

—• "అమరర్షి" ఇత్యాదిస్థలము - సంలక్ష్యక్రమవ్యంగ్యము,
అసంలక్ష్యక్రమ వ్యంగ్యము, కూడనగును •—

లోచనము :— ఇచటఁగూడ- రసప్రతీతియున్నది. కాని, వ్యభిచారిస్వరూపము - పర్యాలోచింపఁబడునంతవఱకును, నది - విలంబముగనేయగును. వ్యభిచారిభావప్రతీతి కలిగినపిమ్మట - శీఘ్రముగానే రసప్రతీతికలుగును. కనుక, రసప్రతీతినిబట్టి విచారించునపుడు- ఇది అసంలక్ష్యక్రమవ్యంగ్యమేయగును. లజ్జాపేక్షచేత (లజ్జాప్రతీతినిబట్టి విచారించునపుడు) మాత్రము - మీఁది పద్యము-సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనియే యగును.

ప్రభా :— "లజ్జారూపవ్యభిచార భావస్వరూపప్రతీతి కలిగినపిమ్మట - రసప్రతీతి నడ్డగించునది - యింకేదియును లేకుండుటవలన, రసప్రతీతినిబట్టియే విచారించునపుడిది-'అసంలక్ష్యక్రమ ధ్వన్యుదాహరణమే'యగును. ఇచట మొదట- లజ్జాప్రతీతి విలంబముగా నగుచున్నది. కనుక లజ్జనపేక్షించునపుడు మాత్రము- మీఁది పద్యము - 'సంలక్ష్యక్రమధ్వన్యుదాహరణమే'యగును." అనిభావము.

లోచనము :— "అసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనికే" అనుచోనున్న ఏకారమును, "కేవలమగు" అనుచోనున్న కేవలశబ్దమునుగూడ - ఈయభిప్రాయమునే - సూచించుచున్నవని తెలియునది.

అవ :— "ఉక్తిలేకయె" అనుదానిచేత - ఏవ్యవచ్ఛేద్యము- (వారింపఁదగినయంశము-) తెలుపఁబడెనో, దానిని దెలుపుచున్నాఁడు.

(102) మూలము :— కాని, శబ్దవ్యాపారమును సహాయముగాఁగొనిన యర్థము - వేరొకయర్థమునకు వ్యంజకముగా నుపపాదింపఁబడునపుడు మాత్రము - అది - యీధ్వనికి (అనురణనతుల్యమగు సంలక్ష్యక్రమధ్వనికి) విషయముకాదు.

లోచనము :— (సంస్కృత మూలమునందలి 'చ'శబ్దము, తుశబ్దార్థమునఁ బ్రయుక్తము.) "ఈధ్వనికి" అనుదానిచేత - "అచ్చటఁగూడ - అసంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని - ఉండునదియేయగును." అనుభావమేర్పడుచున్నది.

ప్రభా : అవ :— "ఉక్తిలేకయే" అనుదానిచేత - వారింపఁదగిన స్థలమును - ఉదాహరించుచున్నాఁడు.

(103) మూలము :—

ఆ॥ చతురశీలయామె - సంకేతకాల, ని
విష్టమానసునిగ - విటునెఱింగి -
హసితలోచనార్పితాకూతముగ, స్వలీ
లా సరోజదళములను మొగిడ్చె.

ఇచట - "లీలా సరోజదళములను మొగిడ్చె" అనుదానికిఁ గల వ్యంజకత్వము - స్వోక్తిచేతనే - నివేదితము

లోచనము :— (ఇచట - విదగ్ధచేత నొనరింపఁబడిన) లీలాసరోజదళనిమీలనము-ప్రదోషసమయరూపార్థమునకువ్యంజకము.(లీలాసరోజదళనిమీలనము-వేరొకయర్థమునకు వ్యంజకమనునంశము- ) "స్వోక్తిచేతనే" అనఁగా; "మీఁది పద్యమునందలి మూడుపాదములచేతనే - తెలుపఁబడియెను" అనియర్థము. "ఇచట - శబ్దాంతర సన్నిధానమున్నను - ఇందున్నపదమేదియుఁగూడ- ప్రదోషమను నర్థమును దెలుపుట - లేదు. కనుక. (లీలాపద్మనిమీలనమునందున్న) వ్యంజకత్వము - విఘటితముకానిదియై యగుచున్నది. అయినను - "పద్మదళ నిమీలనమను, నర్థము - వేరొకయర్థమునకు వ్యంజకము." అనునర్థము - (పద్యమునందున్న పాదత్రియాత్మకమగు) శబ్దముచేతనే - చెప్పఁబడినది.

ప్రభా : ప్రశ్న :— ఏమండీ! "లీలాసరోజదళములను మొగిడ్చె" (ముకుళింపఁజేసెను.) అనుదానిచేత - 'సాయంకాలము - వాచ్య'మని, మీఁది పద్యమునందలి, యేపదమునుగూడఁ జెప్పుటలేదుగదా! దీనినిమీరు సంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వన్యుదాహరణము కాదందురేల ?

ఉ :— మీరన్నది - వాస్తవమేయగును. కాని, "లీలాసరోజదళములను మొగిడ్చె" అనునది-యేదోవేరొక యర్థమునుదెలుపునను నంశము- "చతురశీల- ఆమె - సంకేతకాల నివిష్టమానసునిగ విటునెఱింగి - హసితలోచనార్పితాకూతముగ" అని, (పాదములు- మూటియందునుగల)వాక్యరూపములగు శబ్దములన్నియు - ఆలీలాసరోజదళములను ముకుళింపఁజేయుటయందేవో గూఢార్థమున్నదని మిక్కిలి గట్టిగా తెలుపుటవలననే - ఈయుదాహృతికిముప్పు (సంలక్ష్యక్రమ ధ్వనికాకుండుట) కలిగినది. "ఈశబ్దములిట్లు చెప్పుటచేతనే-ఇందలి సౌందర్యము విధ్వస్తమైనది" అని లోచనకర్త - చెప్పుచున్నాఁడు. చూఁడుఁడు !

లోచ :— ఇట్లు చెప్పుటచేత - ధ్వనికి సంబంధించిన జీవితము - గోప్యమానతచేత నుదయించునదియగు సౌందర్యమే స్వరూపముగాఁ గలదియగుచుండునో; ఆధ్వని జీవితమే - అపహస్తితము. (విధ్వంసమొనర్పఁబడినది.) అదెట్లనిన :- ఒకఁడిట్లు చెప్పుచుండునట!

"బ్రహ్మచారో౽హం నమేక్ష్మతత్వంకో౽పి వేద ననూచితమ్, కిఞ్చిత్ప్రబ్రవీమి .." అని.

పరీక్షా :— "గంభీరుఁడగు మానవవ్యక్తి - స్వకృత్యమును వాక్కుచేతఁ జెప్పఁడు. కాని, యొకానొకప్పుడు - సూచించును." అనులోకస్థితి నంగీకరించి, యొకఁడనుచున్నమాట - మీఁది శ్లోకమున నిబంధింపఁబడినది. దానియర్థమిది :-

"నేను గంభీరుఁడనుగాను. కనుక, నేనొనర్చిన కార్యము - నాచేతసూచింపఁబడినను, దాని నొక్కఁడునుగూడఁ దెలియకున్నాఁడు. కనుక, కొంచెము చెప్పుదును." అనునది.

లోచ :— మీఁదఁ దెల్పఁబడిన వాక్యముచేత - గాంభీర్యసూచనార్థము (గాంభీర్యమును సూచించునదియగు'వదనవికారములేకుండుట',మున్నగునర్థము) మిదుమిక్కిలి, ఆవిష్కరింపఁబడునదియే యగుచున్నదిగదా!

పరీక్షా :— గంభీరుఁడుకాని యొకవ్యక్తి - లోకులు - తన్ను - గంభీరుఁడని భావింపవలయునను నభిప్రాయమున - మీఁది వాక్యమును జెప్పెను. గంభీరుఁడగువ్యక్తి - 'ముఖవికారము లేకుండుట' మున్నగువానివలన - తనగాంభీర్యమును సూచించును. కాని; "నేనుగంభీరుఁడ'ననిగాని, 'గంభీరుఁడనుగా'ననిగాని, చెప్పి - నేను నాగాంభీర్యమును సూచించుచున్నాను." అనివాక్కుచేతఁ దెలుపఁడుగదా!. వీఁడు - "నేను గాంభీర్యమును సూచించుచున్నాను." అనిచెప్పుట వలన - ముఖవికారము లేకుండుట మున్నగుసూచనముచేత- సూచింపఁబడవలసిన గాంభీర్యము - (అవివేకియగు) వీనిచేత- సూచింపఁబడునది కాకుండుటయేకాక, మీదుమిక్కిలి వెలువరింపఁబడినదియే - యయినది. "నాచేత గాంభీర్యము-సూచింపఁబడినది.' అనితెలిపిన, యీవాక్యముచేత-"వీఁడిట్లు తాను గంభీరుఁడనని వెలువరించుటవలన - 'వీఁడు గంభీరుఁడుకాఁడు. సరిగదా! డాంబికుఁడు." అనిస్ఫుటీకరింపఁజేయఁబడునుగదా! "సూచన - సూచనగానే యుండవలయును. గాని. వెలువరింపఁబడునది కాఁగూడదు" అని తెలియునది. ప్రస్తుతస్థలమున- లీలాపద్మదళనిమీలనము-వ్యంజకమేయయినను, దీనియందేదో గూఢార్థమున్నదనునంశము పాదత్రయాత్మకమగు (పద్యమునందలి) వాక్యముచేత - తెలుపఁబడుటవలన, నిది - గుణీభూతవ్యంగ్యమేయయినది. ఇందలి సౌందర్యము - విధ్వస్తమొనర్పఁబడినది. కనుకనిది - అర్థశక్తిమూల సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వన్యుదాహరణము కానిదయినది.

లోచనము :— కనుకనే, 'వ్యంజకత్వము' అనియు, "ఉక్తిచేతనే" అనియు, వృత్తియందుఁ జెప్పఁబడినది.

ప్రిభా :— "ఇచటి వ్యంగ్యార్థము-(సాయంసమయరూపమగు నర్థము) వేరొకశబ్దము దేనిచేతనుగూడ - చెప్పఁబడుటలేదు. కనుకనే, వృత్తికర్త - 'లీలా పద్మనిమీలనము - (గూఢమగు నర్థమునకు)- వ్యంజకమను నంశము - ఉక్తిచేత నివేదింపఁబడినది' అనియేచెప్పెను. కాని, లీలాపద్మనిమీలనముచేత - వ్యంజిత మగు (ప్రదోషసమయరూప) వ్యంగ్యార్థము - మీఁది పద్యమునందలి వేరొక శబ్దము దేనిచేతనుగూడఁ - దెలుపఁబడినదని, చెప్పుటలేదు." అనునది లోచ నార్థము.

లోచనము : అవ :— ప్రకాంతమయిన (ఆరంభింపఁబడిన) ప్రకార ద్వయమును (శబ్దశక్తిమూలమును, అర్థశక్తిమూలమును) ముగించుటయు, తృతీ యప్రకారమును (శబ్దార్థోభయశక్తి మూలధ్వని ప్రకారమును) సూచించుటయు, అనునవి - ఒకటియేయగు యత్నమున - నిర్వర్తించెదనను నాశయమున, వృత్తి కర్త- సాధారణమగు నవతరణపదమును (అవతారికను) ప్రక్షేపించుచున్నాఁడు.

(104) మూలము :—

తథాచ [కా] శబ్దార్థ శక్త్యాక్షిప్తో వ్యఙ్గ్యోऽర్థః కవినాపునః।
యత్రావిష్క్రియతే స్వోక్త్యా,సాన్యైవాలఙ్కృతిర్ధ్వనేః.
కాఁగా; (23)

ఆ॥వె॥ సత్కవీనుఁడెచట – శబ్దార్థశక్తుల
దేనఁగాని, స్ఫురితమైన దాని -
స్వోక్తిఁదిరుగ స్పష్టమొనరింప; ధ్వనికన్య
మయి, తనరు నలంక్రియమె యగునది.

శబ్దశక్తిచేతఁగాని, అర్థశక్తిచేతఁగాని, శబ్దార్థశక్తిచేతఁగాని, ఆక్షేపింపఁబడినను - (స్ఫురింపఁజేయఁబడినను) గూడ - వ్యంగ్య మగు నాయర్థమును - సత్కవీనుఁడు - (సత్కవిప్రభుఁడు) తిరు గనెచట స్వోక్తిచేత- స్పష్టము నొనరించునో, (అచట) అది-అను స్వానోపమ వ్యంగ్యమగు నీధ్వనికంటె వేరగునదియగు నలంకార మేయగును. లేక, అచట - అసంలక్ష్య క్రమవ్యంగ్యధ్వని సంభవిం

చునెడల; దానికది - తాదృశమగు వేతొౌకయలంకారమే (రసాది రూపమగు నసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వని నలంకరించునదియే) యగును.

లోచనము :— ఇంతకుముందు- ప్రకారములు (శబ్దశక్తిమూలము, అర్థ శక్తిమూలము. అని,) రెండుతెలుఁపబడినవి. కనుక, నిది-(ఉభయశక్తిమూలము) తృతీయమని, తలఁపవలయును. (శబ్దార్థములనుచోట) శబ్దమును, అర్థమును, శబ్దార్థములును, అనియేకశేషమును జెప్పవలయును.

ప్రభా :— "శబ్దశ్చార్థశ్చ = శబ్దార్థౌ, శబ్దార్థౌ, శబ్దార్థౌచ = శబ్దార్థాః. తేషాంశక్తిః = శబ్దారశక్తిః" అని సంస్కృతమునసేక శేషసమాసమును జెప్పవల యును. 'శబ్దారశక్త్యుందున్' అనఁగా (1) 'శబ్దశక్తియందు' (2) 'అర్థశక్తి యందు' (3) 'శబ్దార్థశక్తియందు', అనియర్థము నెఱుఁగునది.

అవ :— వృత్తియందు - (సాఽలఙ్కారాలఙ్కృతిర్ధ్వనేః) "ధ్వనికన్యమై తనమునలంక్రియయె యగునది." అనునది- ద్వివిధముగా వ్యాఖ్యానింపఁబడినది. కనుక, దానిననుసరించి, లోచనకర్త - మొదటియర్థమును వివరించుచున్నాఁడు,

లోచనము :— "అది - (ఆక్షేపింపఁబడిననుగూడ - తిరుగ స్వోక్తిచేఁ జెప్పఁబడినవ్యంగ్యము - ) ధ్వనికాము. ఇంతేమగుననిన; శ్లేషముమున్నగునది యగు నలంకారమే - యగును." అనియర్థము.

ప్రభా : అవ :— వృత్తియందు వ్యాఖ్యానింపఁబడిన, రెండవయర్థమును విశదీకరించుచున్నాఁడు.

లోచ :— "లేక (అథవా) ధ్వనిశబ్దముచేత - అలక్ష్యక్రమధ్వనిని గ్రహింపనగును- అలంకార్యమును, (కనుకనే) అంగియు, నగు, ఆయసంలక్ష్య క్రమ (రసాది) ధ్వనికి - 'వేఱొకటియగు' అనఁగా; వాచ్యాలంకారము నపే క్షించునపుడు (దానికంటె వేరగుటవలన) రెండవదియు, ("అటువంటిదియు" అనఁగా) లోకోత్తరమగునదియు, నగునలంకారమేయగును." అనియైనను జెప్ప వచ్చును. వృత్తియందుఁగూడ - ఇట్లే ద్వివిధముగా వ్యాఖ్యానింపఁబడినది,

ప్రభా :— "ధ్వనేః" అను కారికాపదమునకు - పంచమ్యర్థమును,

షష్ఠ్యర్థమునుగూడ - వృత్తికర్తచేత - వ్యాఖ్యానింపఁబడినవి. కనుక, ఆంధ్రీకృతి యందు - మీఁది రెండర్థములును గుదురుటకు - "ధ్వనికన్యమగు" అని, ఆంధ్రీకరింపఁబడెను. కాఁగా, అది- సంలక్ష్యక్రమధ్వనికంటె వేరగునలంకారమేయగు ననునర్థమును, అసంలక్ష్యక్రమధ్వని కలంకారమగునను నర్థమునుగూడ - సిద్ధించును. దీనిచేత - "ధ్వనికారికాకర్తయు, వృత్తికర్తయు, భిన్నులేమో" అను సంశయము - కలిగింపఁబడుచున్నది.

(105) మూలము :— శబ్దశక్తిచేత- ద్వితీయమగు వ్యంగ్యార్థము - ఆక్షేపింపఁ (స్ఫురింపఁ) జేయఁబడిననుగూడ - శబ్దశక్తిచేతనే - ఇచట, ద్వితీయమగు వ్యంగ్యార్థముకూడ - స్ఫురింపఁ జేయఁబడునని, స్వోక్తిచేతఁ దిరుగఁదెలుపఁబడునపుడది - ధ్వనికాకుండుట కుదా :—

సీ. వత్సా! విషాద సంప్రాప్తిని జెందకు,
    మూర్ధ్వప్రవృత్త - దీర్ఘోరుసత్వ
రశ్వసనానువర్తనము - వీడుము, గురు
    కంపకవృత్తి - సంగతమె నీకు ?
బలభేది - జృంభితప్రకృతి, నొందకు; 'మిటు
    ర'మ్మంచు 'భయనివారణమొనర్చు
వ్యాజమ్ముచేత' - దేవతల, - శ్రీలక్ష్మి - ప్ర
    త్యాఖ్యానము నొనర్చు నట్లొనర్చి.

ఆ॥ మంథమూఢమైన మంగళదేవత,
నామె నెవనికొసఁగె నాపయోధి;
విభుఁడతండు - దురితవిధ్వంసకర్తమై -
యెల్లవేళ మిమ్ము నేలుఁగాత!.

ప్రభా :— దీని మూలమిది :—

"వత్సే! మాగావిషాదం, శ్వసనమురుజవం సంత్యజోర్ధ్వ ప్రవృత్తం, కమ్పః, కోవాగుణస్తే, కిమిహబలభిదాజృమ్భితే, నాతప్రయాహి,

పరిత్యాఖ్యానం సురాణామితి 'భయశమనచ్ఛద్మనా' కారయిత్వా,
యస్మైలక్ష్మీ మదాద్వః సదహతు దురితంమన్థమూఢాం పయోధిః.

''దేవాసురులు - క్షీరసముద్రమును మథించునపుడు లోకమాతయగు శ్రీలక్ష్మి - ఆపాలకడలినుండి- కమలాసన సన్నివిష్టయై, బయలువెడలినదిగదా! సర్వాంగ సౌందర్యలావణ్య మూర్తియు, జ్యోతిర్మయ స్వరూపిణియు, నగునా యమ్మ - మూర్తీభవించిన శృంగారరసాధిదేవతవలెనుండెను. ఆమెను వరించు టకు - శివుఁడు, వాయువు, అగ్ని, వరుణుఁడు, బ్రహ్మ, దేవేంద్రుఁడు, మున్నగు దేవతలువచ్చి, నిరీక్షించుచుండిరి శ్రీహరిప్రియయగు శ్రీజగన్మాత- తనహృదయ మున - పుండరీకాక్షుని నిలుపుకొని, నిత్యయౌవన తారళ్యకలితయై - సముద్రము నుండి, సముత్థితయైనది. క్రొత్తగానుదయించుటవలనకన్యయైయున్నది. ఆ మంగ ళదేవత - అప్పుడే సముత్థితయగుటవలన - మందరాందోళిత జలధితరంగభంగ పర్యాకులితయైయుండెను కనుక, నాయమ జనకుఁడగుపయోధి - తనయయగు లక్ష్మీదేవికొదవిన జడుపుఁదీర్చుటకును, ఆనెపమున - ఆమెనువరించుటకువచ్చిన దేవతలయందలి లోపములనుదెలిపి, వారినామెచేత - తిరస్కరింపఁజేయుటకును, సంకల్పించి- పలికినమాట - సీసపాదములందుఁ దెలుపఁబడినది. లోచనకర్త - లక్ష్మికిని, లక్ష్మిస్వయంవరమున కరుదెంచిన దేవతలకును, సహృదయులకును, వాచ్యముగాఁ దెలియఁదగిన, యథాశ్రుతార్థమును వ్యాఖ్యానింపక, లక్ష్మీదేవికిని, సహృదయపాఠకులకును, మాత్రమే తెలియఁదగిన వ్యంగ్యార్థమును మాత్రమే వ్యాఖ్యానించెను, కనుక, ముందిచట - పరిభామతి - యథాశ్రుతమగు వాచ్యార్థ మును బ్రసారించుచున్నది. వాచ్యమునెఱిఁగిన పాఠకులు- తదుపరి- లోచనమున, వ్యంగ్యార్థమును సమీక్షించునది. ''అమ్మాయీ! నీవు - విషాదప్రాప్తిని జెంద కుము. ఊర్ధ్వపరివృత్త-దీర్ఘ + ఉరుసత్వర + శ్వసన + అనువర్తనమును = మీఁదికెగయునదియు, పొడవైనదియు, మిక్కిలి వడిగలదియు, నగునిట్టూర్పు ననుసరించుటను, వీడుము = విడుపుము. గురుకంపకవృత్తి = విస్తారమగు కంపమును గలిగియుండుట, సంగతమె నీకు ? = నీకుచితముకాదు. బలభేది = బలమును భేదించునది (కనుక) జృంభితప్రకృతిని, = ఆవులింతయొక్క స్వభా వమును, బొందకుము = పొందకుము. ఇటురమ్మ = నాచెంతకురమ్మ. [అను నిది - వాచ్యార్థము]

లోచనము :— [విషమత్తీతి, విషాదః] విషమును, దినువాఁడు [కనుక, శివునియొక్క ప్రాప్తినిజెందకుము.] ఊర్ధ్వపరివృత్త = (మీఁదుగామండువాఁడ గుటవలన,] అగ్నిని, దీర్ఘ + ఉరు + సత్వర = దీర్ఘమగునదియు, మిక్కిలి

వడిగలదియు, నగువాయువును. అనువర్తనము = అనుసరించుటనుగూడ - పీడుము = [వివాహవిషయమున విడువుము.] గురు - కంప + క + వృత్తి = గురువులగు, వరుణుని, బ్రహ్మను,గోరుట, సంగతమెనీకు? = నీకుయుక్తముకాదు. [నీపుట్టినింటికధిదేవతయగుటవలన, వరుణుఁడును, సృష్టికర్తయగుటవలనబ్రహ్మయు, నీకుగురువులు. (తండ్రివంటివారు.) కనుక, వారిని గోరఁదగదు.] జృంభిత ప్రకృతిన్ = ఐశ్వర్యమదమత్తస్వభావుడగు, బలభేదిన్ = బలాసురుని జంపిన దేవేంద్రుని, పొందకుము. [ఐశ్వర్యమదమత్తస్వభావుఁడగుటవలన, - బలాసురుని భేదించిన దేవేంద్రుని వరింపకుము.] [వాచ్యార్థమునందు] గాత్ర సంమర్దనాత్మకమగు జృంభితము - (ఆవులింత] ఆయాసకారి. కనుక, బలమును భేదించును. [కనుక, జృంభితము నొందకుమనిభావము.] ఇటురమ్మ = నారాయణుని చెంతకురమ్మ. ఇది - వ్యంగ్యార్థము.

ప్రిభా : ప్రశ్న : — అయ్యా! ఈపద్యమునందుఁగల శబ్దములశక్తి - ద్వితీయమగు వ్యంగ్యార్థమునకిచట - వ్యంజకముగానేయున్నదే!, మీరు - దీనిని- ‘‘శబ్దశక్తిమూలమగు ననురణనధ్వని కా’’దనుచున్నారు. ఇదియేల ధ్వనికాదో ?.

లోచ : ఉ :— ఇచట - ద్వితీయమగు నర్థముకూడ, చెప్పఁబడుననునది - ‘‘ప్రత్యాఖ్యానమును’’ అనువచనముచేత-నివేదింపఁబడినది. (కనుకనిది- ధ్వన్యుదాహరణముకాదు.)

‘‘ఒనర్చునట్లొనర్చి’’ [అచుచోనున్న ణిజర్థము-(ప్రేరణార్థము-)నిట్లెఱుఁగుసది.] ఆయమ్మ - కమలగదా! (కనుకనే) హృదయమునందు - పుండరీకాక్షునిచికొనియే - సముత్థితమైనది. కనుక, స్వయముగానే, (తనంతతానే) తదితర దేవతలను ప్రత్యాఖ్యానించును. (నిరాకరించును.) అయినను, శ్రీలక్ష్మి - స్వభావ సుకుమారతచేత - మందరాందోళితజలధితరంగభంగపర్యాకులిత యయినది. కనుక, నామెను ప్రతిబోధించుచున్న (మేలుకొలుపుచున్న) సముద్రుఁడు- శివాదుల విషయమున, దోషముల నుద్ఘాటించి - ‘ఇటురమ్మ’ అని, శ్రీవిష్ణుభగవానునియందుఁగల యాదరమును (బహుమతిని)జూపునదియగు నభినయవిశేషము చేత - తత్సమర్థాచరణమునే - కావించెను. కనుకనే - (ఇచట, సముద్రుఁడొనర్చిన సమర్థాచరణము - ణిజర్థకమగుటవలననే -) ఏతత్ప్రకృతికర్త - (రమాదేవిని) మంథమూఢయని (మందరమథనజనిత జలధితరంగోద్వేగముచేత మోహమునొందినదని) చెప్పుచున్నాఁడు.

కనుక, "నిట్లు తెలుపఁబడిన పరికారముగల, భయనివారణ వ్యాజముచేత- ఆయమ్మ - తదితర దేవతలనందఱిని ప్రత్యాఖ్యానము నొనర్చునట్లొనర్చి - (తిరస్కరించునట్లు పేరేపించి) రత్నాకరుఁడగుపయోధి-వేనికామె నొసఁగెనో; వాఁడు- (శ్రీమన్నారాయణుఁడు -) మీపాపములను విధ్వంసము నొనర్చుఁగాక !". అని నమస్కరించుచున్నది.

పరిభా : ప్రశ్న :— అయ్యా ! శ్రీలక్ష్మి - నారాయణునికంటె నితరులగు దేవతల నెవ్వరినిగూడ - వరింపదుగదా! ఏతత్కవి - ప్రత్యాఖ్యానము నొనర్చునట్లొనర్చి" (తిరస్కరించునట్లుచేసి) అని, ప్రేరణార్థకమగు పదమునేల ప్రయోగించెను ? నారాయణుని దక్కనితరులను వరింపవలదని సముద్రుఁడు - శ్రీలక్ష్మిని ప్రేరణమొనర్పవలయునా ?

ఉ :— మీరన్నది - నిజమే! అయినను, హరిప్రియయభిమతమును సమర్థించుటకే, యీప్రేరణార్థకము - ప్రయోగింపఁబడెను. కాని, తదనభిమతవ్యక్తిని- ఆమెచేత వరింపఁజేయుటకుఁగాదు. ప్రేరణమావశ్యకమని తెలుపుటకే-ఏతత్కవి- రమను - మంథమూఢగాఁదెలిపెను. అప్పటిస్థితి యెట్లుండెనో చూఁడుఁడు! "మందర పర్వతము - గిరగిర తిరుగుచుండెను. జలధితరంగములాకసమునంటి విరిగిపడుచుండెను. అప్పుడే, సముద్రాంతారాభ్యాగమునుండి లేచివచ్చిన, రమాదేవి స్వభావ సుకుమారగదా! కనుకనే, ఉత్తుంగతరంగ భంగములనుజూచి, విషాదము నొందెను. మీఁదికెగయుటవలన, దీర్ఘములగుచున్న నిట్టూర్పుల నొనర్చుచుండెను. (నిదురతీరలేదేమో) ఆవులించుచుండెను. శరీరము - మిక్కిలి వణకుచుండెను" ఇట్లామెకలతనొందుటయే - 'మంథమూఢ' అనుపదముచేత - చిత్రింపఁబడినది. లోకమాత - పుండరీకాక్షునియందే - హృదయము నునిచి, యుత్థితయయినను (నారాయణ ప్రియయేయయినను) - ఈదృశమగు దుర్దశయందు - సమ్మూఢ హృదయవలెనుండుట - యుక్తమేయగును. కనుక - నామెను - తండ్రియగు సముద్రుఁడు - తదభిమతమునామె విస్మరింపకుండునట్లు, మేలుకొల్పుటకిట్లు ప్రేరణమొనర్చుటయే - యుక్తమగును. కనుకనే - "ప్రత్యాఖ్యానము నొనర్చునట్లొనర్చి" అనుప్రేరణార్థకము - లక్ష్మికి సహజసిద్ధమగు నితరదేవతా తిరస్కారమును సమర్థించునదియేకాని, వివాహవిషయమున నామెప్రవర్తింపని వ్యక్తివిషయమున నాయమ్మను ప్రవర్తింపఁజేయునదికాదు. మంథమూఢయైన మంగళదేవత" అనుచోటనున్న 'మంథమూఢ' అను పదమీయంశమునే జ్ఞాపకముచేయుచున్నది. జగన్మాతకుఁగూడ - అవ్యక్తమాయా కల్పితమగు మౌఢ్యము - ఔపాధికము కావచ్చునుగదా !

(106) మూలము :— అర్థశక్తిచేత - ద్వితీయార్థము - స్ఫురింపఁజేయఁబడినను, "ఇచట- ద్వితీయార్థము స్ఫురింపఁజేయఁబడు"నని స్వోక్తిచేతఁ దెలుపఁబడునపు డచటి వ్యంగ్యార్థము - ధ్వనికాకుండుట కుదాహరణము : —

ఉ॥ "ఇచ్చట - వృద్ధురాలు, జనయిత్రి - పరుండును; పండు
వృద్ధు, తా
నిచ్చటఁ-దండ్రి; యింటిపనులెల్ల నొనర్చి-శ్రమశ్లథాంగయై,
యిచ్చట - కుంభదాసి; పతి-యిప్డిలువీడ, నభాగ్య నోర్తునే
నిచ్చట," - నంచుస్వైరిణి - స్వవృత్తి-నెపమ్మున, పాంథు
తోననెన్.

లోచనము :— "ఇచ్చట నొక్కొక్క పదమునందునుగల వ్యంజకతను-సహృదయులే - ఊహించుకొనవచ్చును" అను నభిప్రాయమున స్వకంఠమునఁ జెప్పఁబడుటలేదు. "నెపమ్మున" అనునది - ఇచట స్వోక్తి.

ప్రభా :— అందచందములుగల యొకానొక పాంథునవలోకించి - ప్రవృద్ధమదనావేశవివశయయిన యొకస్వైరిణి - వానితోననుచున్నది. పండు వృద్ధు = పండినముదుసలి. 'కుంభదాసి' అనఁగా; 'జలాదులను దెచ్చునదియగు పనికత్తె' అనియర్థము. ఇందలివాచ్యము - స్పష్టమైయున్నది. కనుక, లోచనకర్త 'సహృదయులూహించుకొనవచ్చు'నని చెప్పిన, ద్వితీయార్థమగు వ్యంగ్యము నిట్లూహించునది. 'జనయిత్రి', 'తండ్రి', అను, పదములచేత - "కన్నవారికి సహజ వాత్సల్యముండును. కనుక. నేనేమొనర్చిననుగూడ - వారు ప్రతికూలురుకారు." మన్నగునర్థము - వ్యంగ్యము. "వృద్ధురాలు" 'పండువృద్ధు' అనువిశేషణముల చేత - "వారు - నిద్రాపరవశులు. మఱియు, ఇంకొకరులేపనిదే - లేవఁజాలరు" ఇత్యాదికము - వ్యంగ్యము. 'ఇంటిపనులెల్ల' 'శ్రమశ్లథాంగ' - అనువిశేషణముల చేత - "ఆమె పరుండినది మొదలు వేకువజామువఱకును, గాఢనిద్రాపరవశురాలగును." అనునర్థము - వ్యంగ్యము. "దాసి" అనుటచేత - "ఆమె - నాయాజ్ఞానువర్తిని. కనుక - ఒకప్పుడామె - మనదుష్ప్రవృత్తిని జూచిననుగూడ-మనకుఁ గలుగునదియగు హానియేదియునుండదు." మన్నగునది - వ్యంగ్యము. 'పతి' అనుటచేత - 'ప్రియుఁడుకాఁడనునది- వ్యంగ్యము. ఇప్డు + ఇలువీడెన్"అనుట

చేత - వీఁడింతవఱకును, నిల్లువిడువలేదు. కనుక నే, ఇంతవఱకును నాకు నీవంటి రసికునితోడి పొందు నొందనవకాశము- కలుగలేదు, 'ఇపు' అనుటచేత-''ఇప్పటి కెల్లో నాభాగ్యము- పండినది.'' ఇత్యాదికము - వ్యంగ్యము. (ఇప్పుడే, దేశాంత రము వెళ్లెనుగనుక) ''ఇంతలోవచ్చు నను సంశయములేదు.'' అనునదికూడ - వ్యంగ్యము. ''అభాగ్యను'''అయ్యో! నేనింతకాలమువఱకునుగూడ సరససమ్మేళన రసానుభవభాగ్యము నొందనైతినే.'' అనుదైన్యము - వ్యంగ్యము. ''ఓర్తును'' అనుటచేత - ''నాకు- వేరొకరసికపురుషునితోడి సంబంధము నేటివఱకును గలుగుటలేదు. (ఒంటరి బ్రతుకైనది.) కనుక నే, నీపొందునందింత యౌత్సుక్యము నొందుచుంటిని,'' మన్నగునది - వ్యంగ్యము. ''ఇచట- మనస్వేచ్ఛావిహరణమును గ్రహింపగలిగిన యితరు లెవ్వరునులేరు. కనుక, కామార్తనగు నన్ను సుఖింపఁ జేయుము'' అనునది - ప్రధానమగువ్యంగ్యము. వక్త్రృవైశిష్ట్యాదికము నెఱిఁగిన సహృదయులకే వ్యంగ్యము - స్ఫురించును. కాని, స్వైరిణి,-స్వవృత్తి- నెపమ్మగ పాంథుతోననెన్'' అనుటచేత - ''ఆస్వేచ్ఛావిహారిణి - 'తనవృత్తాంతమును దెలుపుట' - అను మిషపెట్టి - ఆపాంథునితో నిట్లనెను'' అనుచోట, ''నెపమ్మగన్'' (వ్యాజముచేత) అనుస్వోక్తిచేత - కవి - 'దీనియందు - ద్వితీయమగు వ్యంగ్యార్థమున్న'దనునంశమును స్పష్టీకరించెను- కనుకనిది గుణీభూతవ్యంగ్యమేయగును. కనుక, ధ్వనికాదు.'' అని తెలియునది.

అవ : — ఇట్లు - ఉపసంహార వ్యాజమున, ప్రకారములు రెండింటిని గూడ - సోదాహరణముగా నిరూపించి, తృతీయప్రకారమును దెలుపుచున్నాఁడు.

(107) మూలము :— ఉభయశక్తిచేత-[వేఱొకయర్థము- వ్యంజితమైనను, 'అది- వ్యంజిత'మని స్వోక్తిచేతఁ దెలుపఁబడునపు డది - ధ్వనికాకుండుట కుదాహరణము] ఎట్లనిన :—

''కానకున్నాను కేశవగోపరాగ'' ఇత్యాదికము. (పూర్వోదాహృతము.)

లోచనము :— కేశవ గోప + రాగ = ''గోపః రాగ (కేశవగ + ఉపరాగ) ఇత్యాదిస్థలమున శబ్దశ్లేషమువలన శబ్దశక్తియు, ప్రకరణవశమువలన, అర్థశక్తియునేర్పడును. ''రాధారమణుఁడు - అఖిలతరుణీజనమునందును ప్రచ్ఛన్నముగానున్న యనురాగగరిమకాస్పదుఁడు.'' అనునది - ఎంతవఱకును దెలి

యఁబడకుండునో; అంతవఱకును నర్థాంతరప్రతీతికలుగదు కనుక, అర్థశక్తిమాత్రము - ప్రకరణవశమువలననే యేర్పడును. ఇచ్చట, "సతేశముగా" అను నది-స్వోక్తి.

ప్రభా :— అర్థాంతర వ్యంజకమగు శబ్దశక్తియు, అర్థశక్తియుఁగూడ. ఇచటనున్నవి. శ్లిష్టములగు శబ్దములయందుఁగలశక్తి - శబ్దశక్తి. "శ్రీకృష్ణుఁడు - రాధారమణుఁడు. అచ్చటనున్న తరుణులందఱునుగూడ - అతనిని గాఢముగా వలచి, వలపించుకొనినవారే" అను సందర్భము నెఱిఁగిన సహృదయులకే - ఈ యర్థాంతరము - స్ఫురించును. కనుక, నిచటవంగ్యార్థవ్యంజనారూపమగు నర్థశక్తి-ప్రకరణవశము వలననే యేర్పడునని యర్థము. "సతేశముగా" అనుపదమిచ్చట లేనియెడలనో; అప్పుడిది - ఉభయశక్తిమూలమగు సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వని కుదాహరణము - కాఁగలిగియేయుండెడిది." అని తాత్పర్యము.

లోచనము : అవ : అర్థశక్త్యుద్భవమగు (సంలక్ష్యక్రమవ్యంగ్య) ధ్వనికి - ఇట్లు; సామాన్యలక్షణమొనర్పఁబడినది. మఱియు, శ్లేషాద్యలంకారముల కంటె, దీనివిషయము -విభక్తముగఁ - (వేరుగఁ) జెప్పఁబడినది. ఇప్పుడు- దీనికి సంబంధించిన ప్రభేదములను నిరూపించుచున్నాఁడు.

(108) మూలము :—

[కా] ప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నశరీరః, సమ్భవీస్వతః,
అర్థోఽపిద్వివిధోజ్ఞేయో, వస్తునోఽన్యస్య దీపకః. 24

తే॥ అన్యవస్తుదీపకమైన యర్థమదియు -
కావ్య సంచయమున - ద్విప్రకారమగుచుఁ
దనరి - ప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నదేహ
మన, స్వతస్సంభవియనంగ, నలరుచుండు.

లోచనము :— అర్థాంతరమునకు (అర్థశక్తిమూలవ్యంగ్యధ్వనికి) వ్యంజకమని, యేయర్థము తెలుపఁబడినదో, ఆయర్థముకూడ - ద్వివిధము. (అనఁగా;) "కేవలము, అనుస్వానోపమము- మాత్రమే- ద్వివిధముకాదు. అనుస్వానోపమ ధ్వనిభేదమగు (అర్థశక్తిమూలమగు) ద్వితీయభేదముకూడ - వ్యంజకమగు

నర్థమునందలి ద్వైవిధ్యమును ద్వారముగాఁ గలిగియుండుటవలన - ద్వివిధమగు చుండును" అనునది-"అదియు" అనుచోనున్న, అపిశబ్దార్థమని తెలియునది.

అవ :— ప్రౌఢోక్తి నిష్పన్నశరీరమునకుఁ [ప్రౌఢమగు నుక్తిచేత నుద యించునదియగు రూపముగలధ్వనికిఁ] గూడ- (వృత్తికర్త) అవాంతరభేదమును జెప్పుచున్నాఁడు.

(109) మూలము :— అర్థశక్త్యుద్భవానురణన రూపవ్యంగ్యధ్వనియందు వ్యంజకముగాఁ జెప్పఁబడిన యర్థముకూడ - ద్వివిధము. అందు మొదటిది-కవికి సంబంధించునదిగాని, కవిచేతనిబద్ధుఁడగు వక్తకు సంబంధించునదిగాని, యగు ప్రౌఢోక్తిమాత్రముచేతనే నిష్పన్నమగు శరీరముగలది. రెండవదియో - స్వతస్సంభవి.

ప్రభా : అవ :— ఇచట - వ్యంజకమగు నర్థములలో మొదటిది- ఏక విధముగాఁ జెప్పఁబడినను, "కవిప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నశరీరము,కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నశరీరము," అనునవాంతర భేదమువలన ద్వివిధమగుట వలన, స్వతస్సంభవితోఁ జేరి - త్రివిధమగుననుచున్నాఁడు.

లోచనము : అవ :— ఇట్లు చెప్పుటచేత - ఇవి - మూడుభేదములగు చున్నవి.

ప్రభా :— "ఇవి- 1 'కవిప్రౌఢోక్తిమాత్రసిద్ధము. 2. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధము. 3. స్వతస్సంభవి." అని మూడుభేదములుగలవి యగు చున్నవి.

అవ :— ప్రౌఢపద వ్యుత్పత్తిని దెలుపుచున్నాఁడు.

లోచనము :— (ప్ర + ఊఢము = ప్రౌఢము.) ప్రకర్షముచేత సంపాదింపఁజేయఁదగిన వస్తువుచేత - పొందఁబడినది. అనఁగా; దానివలన కుశలమగు నది - ప్రౌఢము. (సహృదయ హృదయమునందు) సమర్పింపఁ జేయదగినవస్తువు (అభిప్రాయరూపమగునర్థము) నర్పించుట కుచితమగు నుక్తికూడ - ప్రౌఢమని చెప్పఁబడును.

ప్రభా :— ప్రకృష్టమగునట్లు సంపాదింపఁజేయవలసిన అభిప్రాయము

చేత-పొందఁబడుటవలనఁ ప్రవీణమగు, నర్థమును-లేక-సహృదయహృదయముల యందు చక్కఁగా నర్పింపఁజేయఁదగిన యర్థమును-అర్పించుటకుచితమగు నుక్తికూడ-ప్రౌఢ మని చెప్పఁబడును. కాల్పనికమగు వాఙ్మాత్రముచేతనే - సిద్ధించు రూపముగలది-ప్రౌఢోక్తి మాత్రసిద్ధమనియు, లోకమునందు యుక్తమగునట్లు సంభవించునది - స్వతస్సంభవియనియుఁ, జెప్పఁబడునని గ్రహింపనది. ఇట్లు త్రివిధమగునర్థము - [వాచ్యరూప] 1 వస్తువును, 2 అలంకారమును, అగుచు [వ్యంగ్యరూప] వస్తువు నకును, 2 అలంకారమునకును, గూడ- వ్యంజకమగుచుండును. కనుక, అర్థశక్తి. మూలమగు సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వని-($3 \times 4 = 12$) ద్వాదశవిధమగుచున్నది.

—: తత్ ప్రకారనామములివి : –

1. కవిప్రౌఢోక్తిసిద్ధవస్తు - వ్యంగ్యవస్తుధ్వని 2. కవి ప్రౌఢోక్తిసిద్ధవస్తు - వ్యంగ్యాలంకారధ్వని. 3. కవి ప్రౌఢోక్తిసిద్ధాలంకార - వ్యంగ్య వస్తుధ్వని 4. కవి ప్రౌఢోక్తసిద్ధాలంకార వ్యంగ్యాలంకారధ్వని.

(1) కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధవస్తు వ్యంగ్యవస్తుధ్వని.
(2) కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధ వస్తువ్యంగ్యాలంకారధ్వని.
(3) కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధాలంకార వ్యంగ్యవస్తుధ్వని.
(4) కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధాలంకార వ్యంగ్యాలంకారధ్వని.

(1) స్వతస్సంభవి వస్తువ్యంగ్యవస్తుధ్వని (2) స్వతస్సంభవివస్తు వ్యంగ్యాలంకారధ్వని (3) స్వతస్సంభవ్యలంకారవ్యంగ్యవస్తుధ్వని (4) స్వతస్సంభవ్యలంకార వ్యంగ్యాలంకారధ్వని. [$3 \times 4 = 12$.]

(110) మూలము :— కవి ప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నశరీరమున కుదా : – [ప్రిభామతి ప్రసారితమగు "భ్రమరము" లేక 'తేఁటి' అనుజాతీయపద్యము. [$36+36=72$ మాత్రలుగలది. చతురశ్రజాతియగు రూపకతాళమునఁబాడఁదగును.-](ప్రతికందార్ధముచివరనునాలుగుమాత్రలు-కందముకంటె అధికముగానుండును.]

చివురాకు టెక్కెలమరిచి
యువతులు- గుజిగా, ముఖమ్ములునిచ్చి, నవరసాలాదుల్

పువ్వులలుగులొనర్చును, గా
ని, వసంతుఁడు తాననంగునికి నాములుకులొసంగఁడు.

పరీక్షా :— ప్రథామతిచేతఁ బ్రసారితమగు నీతేటికి మూలమొక ప్రాకృత శ్లోకము - అది-యిట్లున్నది :—

సజ్జేహి సురహిమాసో, ణదావఅప్పేఇజుఅఇజణలక్ఖముహే।
అహిణవసహఆరముహే, ణవపల్లవపత్తలే అణఙ్గస్సశరే.

సంస్కృతచ్ఛాయ - దీనికిట్లుండును.

సజ్జయతి సురభిమాసో । నతావదర్పయతి యువతి జనలక్ష్యముఖాన్।
అభినవ సహకారముఖాన్। నవపల్లవ పత్త్రిలాననఙ్గస్య శరాన్.

ఆంధ్రమునఁ బ్రసిద్ధమగు కందమునఁగూడ నిట్లిది యాంధ్రీకృతము.

చివురాకు ఱెక్కలమరిచి,
యువతులు గుఱిగఁగొనలునిచియు, రసాలామల్
పువ్వులలుగులొనర్చునె, కా
ని, వసంతుఁడు-తాననంగుని కొసంగఁడహో!.

లోచనము :— ఇచ్చట - (సురభిమాసమగు) వసంతము - చేతనుఁడు గాను, వాఁడు-అనంగునికి (శరీరములేని మన్మథునికి) సఖుఁడుగాను, తెలుపఁబడి యెను. (చేతనుఁడగు నావసంతుఁడు కూడ పూవులనుబాణములను) సజ్జీకరించును. (కూర్చును) కాని, యర్పింపఁడు (ఒసఁగఁడు.) అని, యిట్టివిధముగలదియు, సమర్పింపఁజేయఁదగిన వస్తువునర్పించుటయందు- కుశలమగునదియునగు, మాటచేత, సహకారోద్భేదినియగు (తీయమామిడిని ప్రకాశింపఁజేయునదియగు) ఏవసంతదశ- చెప్పఁబడినదో, దానివలన, క్రమముగా (ముందుముందు) గాఢగాఢముకాఁగలది యగు మన్మథోన్మాథనారంభము - ధ్వనింపఁజేయఁబడుచున్నది. ఇట్లుకాక, (ఇట్లు ప్రౌఢమగు నుక్తిచేత - వసంతదశ చెప్పఁబడక.) ''వసంతమునందు - తీయమామిడులు - చివురించెను.'' అని చెప్పఁబడునెడల, (వాచ్యమగు) ఈవస్తుమాత్రము- (మన్మథోన్మాథన ప్రారంభరూపమగు వ్యంగ్యమునకు) వ్యంజకముకానిది కావలసి వచ్చును. కాఁగా; [ఇట్లు ప్రౌఢముగాఁ జెప్పుటవలన] ఇది - ప్రౌఢమగు, కవి వాక్యమేయగుచున్నది.

ప్రభా : — దీనియందు వసంతఋతు (చైత్రమాస) ప్రారంభవర్ణనముఁ వాచ్యమగు "వస్తువు". అనఁగా; అభిప్రాయరూపమగు వాచ్యార్థము. దీనిచేత, త్రియమామిడి మున్నగువృక్షములు చిగిరించి, పూచినవి." అనువసంతవర్ణ- చెప్పఁబడినది. సహృదయుల హృదయములయందు - సమర్పింపఁజేయఁదగిన యభిప్రాయమును సమర్పించుటకుఁదగిన విధమున, కవిచేత నీయర్థము-సిద్ధపరుపఁబడినది. కనుకనిది - కవిప్రౌఢోక్తి సిద్ధమగుచున్నది. "వసంతమువచ్చెను. మామిడులు చిగిరించెను" అనిచెప్పుత, ఇచట, అచేతనమగు వసంతము - చేతనుఁడుగను, వాఁడు - శరీరములేని మన్మథునికి పూవుటమ్ములను నిర్మించియిచ్చువాఁడుగాను, అనంగుఁడు - విలుకాఁడుగాను, అతఁడు నిర్మించిన బాణములు - యువతులు-(గుబ్బెతలు) గురిగానుండునట్లు సంధింపఁబడినవౌనలుగలవిగాను, పూవులు-బాణములుగాను, దెలుపునదియగునుక్తి - కవిప్రౌఢోక్తిమేయగును. కనుక నిట్లు కాల్పనికమగు నీయర్థము-కవిప్రౌఢోక్తిసిద్ధమగు వస్తువగుచున్నది. ఇందు "ఒనర్చును" అను వాచ్యవస్తువుచేతఁగూడ- మన్మథోన్మాథన ప్రారంభమను వ్యంగ్యవస్తువు వ్యంజింపఁజేయఁబడును. "ఒనంగఁడు", అనువస్తువుచేతనో; "ఆమన్మథోన్మాథనము - ముందిముందింతకంటెనుగూడ - గాఢగాఢీభావమునొందును." అను మనోజ్ఞమగు వ్యంగ్యవస్తువు- వ్యంజితమగును "వసంతుఁడు, చిగురాకు తెక్కలనుంచి, గుబ్బెతల మీఁదికి గుఱిచేసిన పూవములుకులను గూర్చుటలోనే మన్మథావేశము ప్రారంభమగుచుండునేః అతఁడువానినిమన్మథునికందించినయెడల; ఆయావేశమునకగు గాఢీభావము నెవఁడుచెప్పగలఁడు"? అనిభావము. కనుకనిది, సంలక్ష్యక్రమ, అర్థశక్తిమూల, కవి ప్రౌఢోక్తిమాత్రసిద్ధవస్తువ్యంగ్యవస్తుధ్వని కుదాహరణమగుచున్నది. ఇచటనిట్లు కవిప్రౌఢోక్తిసిద్ధమగు నర్థములేనియెడల, వసంతకాలికసహకారకిసలయ కుసుమోద్గమ రూపమగు నర్థమాత్రమునకివ్యంజకత్వము సిద్ధింపదుగదాః.

(111) మూలము :— కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రనిష్పన్న శరీరమునకుదాహరణము :- పూర్వోదాహృతమగు "శిఖరియందు" అనునది మొదలగునది.

లోచనము :— ఇచ్చట "అరుణబింబఫలముఁ జిల్కయానుచుండె" అనిమాత్రమే చెప్పునెడల; దానియందు వ్యంజకత్వమేదియు నుండునదికాదు. అట్లుగాక,వాచ్యమగువస్తువు-"శిఖరియందు"ఇత్యాదిరూపమునసాభిలాషుఁడును కవినిబద్ధుఁడును, నగువక్తకు సంబంధించిన ప్రౌఢోక్తియగుచుండునప్పుడే - అర్థాంతరవ్యంజకమగును.

పరిభా :— పరిభమోద్యోతమునందు- ప్రదర్శితములగు గాథలు (గాథా చ్ఛందములు) అర్థశక్తిమూలములగు సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వన్యుదాహరణములని తెలియునది.

(112) మూలము :— దీనికింకొక యుదాహరణము :-

గీ॥ యౌవనము - సాదరముగ హస్తావలంబ
నమ్మొసఁగుచుండగ; సమున్నతమ్ములయిన
నీస్తనమ్ము లేతెంచుచుండిన రతీశ్వ
రుని యెదురుకోఁలోఁనగునట్లు తనరుఁదరుణి!.

లోచనము : - ఇచట - (యౌవనము- చేయూతనిచ్చి మీఁదికిలేచునట్లు గౌరవించుటవలన)స్తనములచట పరిధానములుగాఁజేయఁబడియున్నవి. కామము- (రతీశ్వరుఁడు-) ఆస్తనములచేతఁగూడ - అభ్యుత్థానింపఁ (ఎదురుకోలోనఁగఁ) బడుటవలన-అంతకంటెను గౌరవింపఁబడినట్లుపచరింపఁబడినది. యౌవనము - ఈయుభయములకును (ఉరోజములకును, కామమునకును, పరిచారకభావమున నున్నట్లు చెప్పఁబడినది. ఏవంవిధమగు నుక్తివైచిత్ర్యముచేత - "ఎవఁడు - సము న్నతములును, కనుకనే మనోహరములునునగు, నీయీ స్తనముల నవలోకించుట చేత - వృద్ధినొందింపఁబడిన మన్మథావస్థగలవాఁడు - కాకుండును ?" అనుభంగి చేత - స్వాభిప్రాయము-(నీయందు ప్రేమరసవివశుఁడనగు నేను మన్మథోద్విగ్నుఁ డనైయున్నాను." ప్రాణరక్షకములగు వీని గాఢాలింగనముననే నాప్రాణములు నిలుచును లేనిచో, నీయీప్రియుఁడు నీకుదక్కఁడుసుమా!" అనునది) ధ్వనింపఁ జేయఁబడినది.

(ఇట్టి. ఉక్తివైచిత్ర్యము నాశ్రయింపక- కవినిబద్ధుఁడగు నీవక్త)-"సుందరీ! నీస్తనములు - తారుణ్యముచేత నెంతయెత్తుగానున్నవి." అనునెడల, దీనిచేతఁ జెప్పఁబడునదియగునర్థము - (మీఁది వ్యంగ్యార్థమునకు) వ్యంజకమగునా?

పరిభా :— ఇచ్చట - యౌవనాదులయందు - పరిజనాదిచేతనవృత్తాం తము - సమారోపింపఁబడినది. కనుక, నిందలి సమాసోక్తి - ఇచ్చటి యుత్ప్రేక్ష కంగమని తెలియునది.

(113) మూలము :— ఏది - కేవలమును భణితివశము చేతనే, అభినిష్పన్నమగు శరీరముగలదిగాక - వెలుపలఁగూడ - (లోకమునందుఁగూడ - ) ఔచిత్యముచేత, సంభావ్యమానమగు సద్భావమును గలిగియుండునో, అది - స్వతస్సంభవి. దీనికుదా :- [స్వతస్సంభవియు, అర్థశక్తిమూలమును, నగు వస్తువుచేత-వ్యంగ్య, వస్తురూపమగు ధ్వనికుదాహరణము.] ముందుదాహరింపఁబడిన "అమరర్షి" అనుపద్యము.

లోచనము :— "కేవలమును, అనుటచేత - (కావ్యమునందు) ఉక్తివైచిత్ర్యము - సర్వవిధములచేతను, ఉపయోగించునదియేయగును" అనిభావము.

ప్రిభా :— "ఉక్తివైచిత్ర్యము - కవి (తన్నిబద్ధ) ప్రౌఢోక్తిసిద్ధమగు వస్తువునందేకాక, స్వతః, సంభవియగు వస్తువునందుఁగూడ నుండవలయును" అనిభావము, ఉక్తివైచిత్ర్యములేనియెడల - 'వస్తువు' అనఁగా; అభిప్రాయరూపమగు నర్థము . భావ్యమే (భావింపఁదగినదియే) కానివగును.

(114) మూలము :— (స్వతస్సంభవి, వస్తువ్యంగ్య వస్తుధ్వనికే) వేరొక యుదాహరణము :

గీ॥ ముత్తెములఁ జేర్చికూర్చిన భూరిభూష
ణములఁదాల్చిన సవతుల నడుమఁ, దాను -
గరువమునుఁ బూని - శిఖిపింఛకర్ణపూర,
తిరుగుచున్నది వ్యాధుని తరుణియొకతె.

ప్రిభా : - దీనికి మూలమగు ప్రాకృతగాథకు సంబంధించిన సంస్కృత చ్ఛాయ - ఇట్లున్నది.

'శిఖిపిఞ్ఛకర్ణపూరా, జాయా వ్యాధస్య గర్విణీ భ్రమతి।
ముక్తాఫలరచిత ప్రసాధనానాం, మధ్యేసపత్నీనామ్.' అని.

వృత్తికర్త - ఈగాథను- తృతీయోద్ద్యోతమునందుదాహరించి, వివరించెను. దానినను సరించి, లోచనకర్త - ఇచట వ్యాఖ్యానించుచున్నాఁడు.

లోచ :— "ఈక్రొత్త పెండ్లమునందు-ఆసక్తిగలబోయవాఁడిపుడు - శిఖమాత్రమారణమునే (నెమలిని చంపుటనుమాత్రమే) కావించెను. (ఈమెకుసవతులగు) తక్కిన పెండ్లములయందాసక్తుఁడగునప్పుడో; ఏనుగులనుగూడఁజంపెను." అనుసేవచనముచేత - (ఈక్రొత్త పెండ్లమునకు సంబంధించిన) ఉత్తమసౌభాగ్యము (సౌభాగ్యాతిశయము) తెలుపఁబడినది. (వ్యంజితము.) ["ముత్తెములఁదీర్చి కూర్చిన ఇత్యాదికముచేత - ] "ఇప్పుడు - (అనఁగా, ఈక్రొత్తపెండ్లమును బోయవాఁడు పెండ్లాడినపిమ్మట,) తదితరులగు సవతులకు - సంభోగవ్యగ్రిమ లేదు. కనుక, వారికిప్పుడు భూషణవిరచన శిల్పకౌశలమే - పరమై (ముఖ్యమై) యుండెను." అని వారిదౌర్భాగ్యాతిశయము-ప్రకాశింపఁజేయఁబడినది. గర్వము-బాల్యనిమిత్తకమగు. అవివేకము మున్నగువానిచేతఁ గూడనగును. కనుక,నిచట-స్వోక్తిసద్భావమును ("గరువమునుబూని"అనుచోట, [గరువమునుబూని అను] స్వోక్తి-ఉన్నదని) శంకింపఁదగదు. (మీఁది పద్యమునందలి) ఈయర్థమునెట్లెట్లు వర్ణించినను వర్ణింపవచ్చును. కాని యావర్ణనమునట్లుండనిండు!. దీనియర్థమును వెలుపల, ప్రత్యక్షాదులచేత విలోకించునెడల, మనమెట్లుచూచిన నట్లేయిది-వ్యాధవధువునకొదవిన సౌభాగ్యాతిశయమును - ద్యోతింపఁజేయును.

పరిభా ;— "సర్వాంగసుందర దృఢశరీరుఁడగు నొకబోయవాఁడు-పెక్కుమంది కాంతలను పెండ్లాడెను. బలిష్ఠుఁడగు నతఁడప్పుడు వారితో విహరించుచున్నను, వారియందతని కత్యాసక్తి లేదు. కనుక, వారితోవిహరించునపుడతఁడేన్గులనుగూడఁజంపి, వానియందలిముత్తెములను దీసి, వానినివారి కొసఁగఁగలిగియుండెను. కొంతకాలము గడచినపిమ్మట, నతఁడు క్రొత్తగాఁబెండ్లాడిన విలాసవతియగు నొకానొకతరుణిని-గాఢముగావలచి, క్షణకాలమైనను విడువక, ఆమెతో విహరించుచు, కృశించెను. కనుక, నప్పుడు సమీపమునందున్న యొకనెమలి నెట్లోచంపి, దానిపింఛమునుమాత్రమే యామెకుఁ గర్ణాభరణముగాఁజేసెను."అనునది-యిచటి ప్రకరణము. ఏతత్పద్యవాక్యముచేత- 'ఈకొత్తసుందరియొక్క సౌభాగ్యాతిశయమును' - 'ముత్తెములను దీర్చికూర్చి యలంకరించుకొనుటకంటె, వేరొకపనిలేని యామె సవతుల దౌర్భాగ్యాతిశయమును'- ఇచట ప్రకాశింపఁ (ధ్వనింపఁ) జేయఁబడినవి." అనితెలియునది.

ప్రశ్న :— "గరువమున్ బూని" అనుస్వోక్తిచేత - ఈవ్యంగ్యము - ప్రకాశితముకాదా ?

ఉ :— బాల్యనిమిత్తకమగు నవివేకమున్నగు దేనిచేతనైననుగూడ-

ఈగరువము (గర్వము) కలుగవచ్చును. కనుక, నిచట - స్వోక్తియున్నదనుటకు వీలుకలుగదు. మఱియునిది - స్వతస్సంభవియునగుచున్నది. కాఁగా, నిది - అర్థశక్తిమూలమును, స్వతస్సంభవియు,నగు వస్తువుచేత- వ్యంగ్యమగు, వస్తుధ్వనియే యగును.

లోచనము : అవ :— ఇట్లు, భేదద్వయముగల యర్థశక్త్యుద్భవమున - వస్తుమాత్రము - వ్యంజనీయత నొందునప్డు - (అర్థశక్తిమూలమగు వస్తువు వ్యంగ్యమగునపుడు) వస్తుధ్వనిరూపమగునని నిరూపింపఁబడియెను. ఇప్పుడు - "అర్థశక్తిమూలమగు నా ప్రభేదమే - అలంకారరూపమున వ్యంజనీయమగునపుడు (అర్థముచేత వ్యంగ్యమగునపుడు) అలంకారధ్వనికూడ నగును" అని చెప్పుచున్నాఁడు.

(115) మూలము :—

[కా] అర్థశక్తేరలఙ్కారో యత్రాప్యన్యః ప్రతీయతే।
అనుస్వానోపమ వ్యఙ్గ్యః స ప్రకారోఽపరో ధ్వనేః.(25)

ఆ॥ అర్థశక్తిఁగూడ - అన్యమ్మగు నలంక్రి
యయుఁ - బ్రతీయమానమైనచోట-
అనునినాదసదృశమగు ధ్వని, కదియన్య
మగు ప్రకారమగుచు, నలరుచుండు.

లోచనము :— (అర్థశక్తిఁగూడ) "పూర్వోక్తవిధమున శబ్దశక్తివలన మాత్రమేకాక, అర్థశక్తివలనఁగూడ- అలంకారము - స్ఫురింపఁజేయఁబడును." అనిగాని, 'వ్యంగ్యమగు వస్తువుమాత్రమేకాక (వ్యంగ్యమగు) అలంకారముకూడ [అర్థసామర్థ్యమున]- స్ఫురింపఁజేయఁబడును.' అనిగాని, అపిశబ్దార్థమును ("అర్థశక్తిఁగూడన్, 'అలంక్రియయున్" అనుచోట్లనున్న 'కూడ' శబ్దార్థమును) గ్రహించునది.

ప్రభా :— "శబ్దశక్తిచేతమాత్రమే- వ్యంగ్యమగు నలంకారము స్ఫురింపఁజేయఁబడు"నని తలపఁదగదు. అర్థశక్తిచేతఁగూడ- వ్యంగ్యమగు నలంకారము

స్ఫురింపఁజేయఁబడును.'' ''ఈయర్థశక్తిచేత - వ్యంగ్యవస్తువు మాత్రిమేకాక, అలంకారముకూడ స్ఫురింపఁజేయఁబడును'' అను లోచన వ్యాఖ్యననుసరించి - అంధ్రీకృతిరూపమగు కారికయందు మీఁది యర్థములు - రెండును - సంగ్రహింపఁబడియెను.

లోచ : అవ :— ''అన్యమ్మగు'' అను పోనున్న అన్యశబ్దమునువ్యాఖ్యానించుచున్నాఁడు.

(116) మూలము :— వాచ్యాలంకార వ్యతిరిక్తమగు (వ్యంగ్యమగు) వేఱొక యలంకారము - అర్థసామర్థ్యముచేతఁబ్రతీయమానమంబు, యవభాసించునపుడు - అది - "అర్థశక్త్యుద్భవమగు, అనుస్వానోపమ వ్యంగ్యము" అనుపేరుగల వేఱొకధ్వని ప్రకారముగును.

అవ :— అది - (అర్థశక్త్యుద్భవాలంకారము) ప్రవిరళ విషయముగునని (మిక్కిలి యల్పమగు విషయముగలదియగునని) యాశంకించి క్రిందికారిక చెప్పఁబడుచున్నది.

లోచనము :— శ్లేషావ్యలంకారము - శబ్దశక్తిచేతనేభాసించును. కనుక, ఇది - (అనఁగా; అర్థశక్తిచేత - భాసించునదియగు నలంకారము - అరుదుగా నుండవచ్చునని యాశంకించుట - ) సంభావ్యమగుచున్నది. అట్లయిన, అర్థశక్తి చేతఁగూడ నేయలంకారమయినను భాసించునా ? అనునది - (ఇచట) ఆశంకకు బీజమైయున్నది.

ప్రభా : అవ :— అర్థశక్తిమూలమగు నలంకారధ్వని - ముందే- ప్రదర్శితమగుటవలననది-ప్రవిరళవిషయముకాదని సమాధానము నొసఁగుచున్నాఁడు.

(117) మూలము : —

[కా] రూపకాదిలఙ్కారవర్గోయో వాచ్యతాంశ్రితః।
సనర్వోగమ్యమానత్వం, బిభ్రద్ భూమ్నాప్రదర్శితః. 26

కం॥ ఒకచో - వాచ్యతఁగను, రూ
పకముఖ్యాలంక్రియా నివహమంతయు, నిం
- కొకచో - వ్యంగ్యతనొందుట -
ప్రకాశితమ్మదియు మున్నె బహురీతులుగన్.

లోచనము :— "అంతయున్" అనియు, 'ప్రకాశితము' అనియు, (కారికయందుఁదెలుపఁబడిన)పదములచేత (అర్థశక్తిమూలాలంకారధ్వనివిషయమగు నను) ఆశంకాసంభావన - మిథ్యయేయగు ననుచున్నాఁడు.

(118) మూలము :— ఒకచోట- వాచ్యముగా (వాచ్యతచేత) - ప్రసిద్ధములగు రూపకము మున్నగు నలంకారములు - వేరొకచోట - ప్రతీయమానములుగా నుండుటను పూజ్యులగుభట్టోద్భటాదులు-బహుళముగ (అవిరళముగ) ప్రదర్శించియేయున్నారు' అదెట్లనిన :- ససందేహాదులగు నలంకారములయందు - ఉపమా రూపకాతిశయోక్తులు- ప్రకాశింపఁజేయఁ (స్ఫురింపఁజేయ) బడుట- (వారిచేత) ప్రదర్శితమే.

లోచనము : — కం॥ "ఉపమానముతో నైక్యము
నుపమేయమ్మునకుఁ దెలిపియును, భేదమ్మున్
నిపుణత - స్తుతికయి, సుకవి తె
లెలుపఁగ, ససందేహమందురు బుధులెవానిన్."

అని (భట్టోద్భటునిచేతఁ దెలుపఁబడినది దీనికుదాహరణము.)

"పవనచలత్ పత్త్రాంగుళి యిదియా
యువతి పాణియో పల్లవమో" ఇత్యాదికము.

మీఁది పద్యమున - ఉపమగాని, రూపకముగాని, ధ్వనింపఁజేయఁబడును. అతిశయోక్తికూడ - సర్వాలంకారములయందునుగూడ- తరచుగ ధ్వనింపఁజేయఁబడుచుండును.

(119) మూలము :— కావున అలంకారాంతరమునందు-(అలంకారాంతరముచేత-అర్థసామర్థ్యమువలన)అలంకారాంతరము-(వేరొక యలంకారము) వ్యంగ్యమగుట - యత్న ప్రతిపాద్యము కాదు.[ అర్థశక్తిమూలధ్వనియందు వ్యంగ్యమగు వస్తువువలె, (వాచ్యమగు నలంకారముచేత)- వ్యంగ్యమగు నలంకారముకూడ- స్ఫురింపఁజేయఁబడునను విషయము - మేము ప్రయత్నించి, క్రొత్తగా, ప్రతిపాదింపవలసినదికాదు.]

లోచనము : – ''అలంకారముచేత - అలంకారాంతరము-ధ్వనింపఁజేయఁబడుచుండునపుడు - వస్తుమాత్రముచేత నలంకారము ధ్వనింపఁజేయఁబడుననుట-యెట్లుసంభావ్యమగును ?'' అనుతాత్పర్యమున, (కారికయందు - అంతరశబ్దము లేకున్నను) వృత్తికర్త- ('అలంకారాంతరమునందు' అనిసప్తమ్యంతమగు)అలంకారాంతర శబ్దమును బ్రయోగించెను కానియిది-ప్రకృతోపయోగికాదు.

ప్రభా :— (దీనిచేత - ఒకయలంకార మింకొక యలంకారమును ధ్వనింపఁజేయుననునర్థమే సిద్ధించును.) కనుకనిది - ప్రకృతోపయోగికాదు.

అవ : — 'అట్లగునెడల ప్రకృతమేది ?' అనినఁ జెప్పుచున్నాఁడు.

లోచ :— ''అర్థశక్త్యుద్భవమగు ధ్వనియందు - ఎట్లు వస్తువువ్యంగ్యమగునో, అట్లే, అలంకారముకూడ - వ్యంగ్యమగును'' అనునదియే - యిచటఁ బ్రకృతము. కనుక, అలంకారముచేత నలంకారము ధ్వనింపఁజేయఁబడునను నింతమాత్రమే యిచట ప్రకృతముకాదు.

ప్రభా : అవ :— వృత్తికారునియభిమత మిదియేయనుట కుపష్టంభకమును దెలుపుచున్నాఁడు.

లోచనము :— అదెట్లనిన :- ఉపసంహార గ్రంథమున (ఈవిషయమును ముగించునపుడు)

''ఏయలంకారములకు దేహీకరణమె
వాచ్యతా దశయందవ్యవస్థితమ్మొ;
ఆయలంకారములు - ధ్వనికంగముఁగ
నగుచునుత్కృష్టమగు ఛాయనలరుచుండు.''

అని, మీఁదఁదెలుపఁబడినదియగు శ్లోకమున (కారికార్థవిషయమున) వృత్తి కర్త - "(వ్యంజకత్వముచేతను, వ్యంగ్యత్వముచేతను) ఉభయప్రకారములచేతను, ధ్వన్యంగత్వము - (ధ్వనిభేదమగుట-) కలుగును" అనియుపక్రమించి, "అంది చట ప్రకరణమువలన నలంకారవర్గము - వ్యంగ్యత్వముచేత - ధ్వన్యంగమగును. [ధ్వనిభేదమగును.]" అనితెలుపును.

ప్రభా :— 'అలంకారాంతరముచేత-అలంకారాంతరము వ్యంగ్యమగుట' యనఁగా;'ఒకయలంకారముచేత నింకొకయలంకారమువ్యంగ్యమగుట'అనియే,అర్థ మేర్పడునను నభిప్రాయమునొంది, అది - ప్రకృతోపయోగికాకుండుటవలన, (పూర్వోక్తమగు) భావార్థము - లోచనకర్తచేత - తెలుపఁబడియెను.

అవ :— అంతరశబ్దమునకు - వేరనునర్థమును జెప్పక "విశేషము" అనునర్థమును జెప్పుచున్నాఁడు.

లోచనము :— అథవా ("అలంకారాంతరమునందు - అలంకారాంత రము" అను వృత్తివాక్యమునందున్న) "అంతరశబ్దము" ఉభయస్థలములయం దును విశేషపర్యాయము. (అనఁగా; "విశేషము" అనునర్థమును జెప్పునది.) (అలంకారాంతరమునందు అనుచోటనున్న)సప్తమి-వైషయికి. ["విషయమున" అనునర్థమును దెలుపునది.] కాని, యింతకుముందు వ్యాఖ్యానింపఁబడినట్లు, నిమి త్తసప్తమికాదు. ఇట్లు చెప్పుటవలన నేర్పడునర్థమిది :- "వాచ్యాలంకార విశేష రూపమగు విషయమున, (వాచ్యాలంకార విశేషశాలియగు కావ్యమునందు) వ్యం గ్యాలంకార విశేషము - భాసించును-" అనునిది - ఉద్భటాదులచేతఁ దెలుపఁ బడినదియే యగుచున్నది. కనుక, అర్థశక్తిచేత - అలంకారము - వ్యంజితమగు ననునది - వారిచేత నంగీకరింపఁబడినదియేయగును. (అయినను) వారు కేవలము 'అలంకార లక్షణకారులే'యగుటవలన వానిని (వ్యంగ్యాలంకారములనుగూడ) వాచ్యాలంకార విశేషవిషయములుగనే తెలిపిరి" అనిభావము.

ప్రభా :— "ఉద్భటాదులుకూడ - ససందేహాదు లగు నలంకారముల యందు - దీపకాదులు భాసించునని యంగీకరించియేయుండిరి. అయినను, వారు- అలంకారలక్షణమాత్రకారులే యయియున్నారు. కనుక, వ్యంగ్యాలంకారములను గూడ - (మేమిపుడు - అర్థశక్తిమూలములగు నలంకారధ్వనులనుచున్నవానినే) వారు - వాచ్యాలంకార విశేషములని చెప్పిరి." అను నది యిచటి ఫలితార్థము.

లోచ : అవ :— అయ్యా! పూర్వులే - దీనిని [అలంకారములుకూడ

ప్రతీయమానములగుటను] తెలిపియుంటినయెడల, 'దేనికొఱకు నీకీయత్నము ?' అనియాశంకించి (సమాధానము) చెప్పుచున్నాఁడు.

(120) మూలము :- ఇదియొక్కఁటిమాత్రమే-తెలుపుదుము.

లోచనము :— "ఒక్కఁటిమాత్రమే" అనునది - వారుతెలిపిన దాని కంటె విశేషమును దెలుపుదుము" అని స్ఫురింపఁజేయును.

(121) మూలము :—

[కా] అలఙ్కారాన్తరస్యాపి ప్రతీతౌ యత్ర భాసతే।
తత్పరత్వం నవాచ్యస్యనాఽసౌమార్గో ధ్వనేర్మతః. 27

కం॥ సరసకృతినలఁకారాం
తరము - ప్రతీతమ్మయినను; తత్పరమగు సుం
దరతఁగలిగి, వాచ్యమచట-
వరలని యెడలనది-ధ్వనికి-పథమనఁదగునే ?

అలంకారాంతరములయందు [వాచ్యములగు దీపకాదుల యందు] అనురణన రూపమగు నలంకారాంతరము [ఉపమాది వ్యంగ్యాలంకారము] స్ఫురించినను గూడ, వాచ్యము - వ్యంగ్యప్రతి పాదనోన్ముఖమగు సౌందర్యమునుగలిగి, ప్రకాశింపని స్థలమున, నది - [స్ఫురించిన యుపమాద్యలంకారము] ధ్వనికి, మార్గము - (విషయము-) కాదు. అదెట్లనిన :- 'దీపకము' మున్నగునలంకార మునందు - ఉపమగమ్యమగుచున్ననుగూడ - [వాచ్యాలంకార] సౌందర్యము - వ్యంగ్యాలంకారపరమగు నట్లుగువ్యవస్థానము లేకుం డుటవలన [అచట] ధ్వని వ్యపదేశము - లేదు.

ప్రభా :— "దీపకము, తుల్యయోగిత, స్మరణము, మొదలగు నలంకా రములయందు - ఉపమ - గమ్యమగుచుండును. అయిననచట - వాచ్యాలంకార

చారుత్వము - వ్యంగ్యపరముకాదు. వ్యంగ్యాలంకార - సౌందర్యమే - వాచ్యాలంకారపరముగుచుండును. కనుకనే, దీపకాదులయందువ్యంగ్యమునకు ప్రాధాన్యము లేకుండును. ప్రధానముకాని వ్యంగ్యము - ధ్వనియని వ్యవహరింపఁబడునదికాదు. కనుక నచటనది - గుణీభూతవ్యంగ్యమగును'' అనితెలియునది.

(122) మూలము : — దీనికుదా :- ''కిన్నెర'' అను జాతీయపద్యము. ఖండగతిగలది. ఇందు - ప్రతిపాదమునను 20 మాత్రలుండును. 10 మాత్రలమీఁద యతియుండును.

రజనికి సుధాంశునికరాలు, పద్మినికి సర
సిజములును, శారద శ్రీకి హంసలు, లతకు
స్రజములయి పుష్పగుచ్ఛములు, సత్కృతికథకు
సుజనులును, గౌరవము చొప్పుఁజతు రెప్పుడున్.

ఇత్యాదులయందుపమ- గర్భస్థమగుచున్నను, దీనియందలి సౌందర్యము - వ్యంగ్యాలంకార తత్పరముకాక, వాచ్యాలంకార ముఖమునసే, వ్యవస్థితమగుచున్నది. కనుక వాచ్యాలంకారముఖము ననే యిచట - కావ్యవ్యపదేశము - యుక్తము. [ఇది - వ్యంగ్యాలంకారభూషితమగు వాచ్యాలంకారమేయగును.]

పరిభా :— మీఁది యాంధ్రీకృతికి మూలమొక ప్రాకృతశ్లోకము. ఇది-దాని సంస్కృతచ్ఛాయ.

చన్ద్రమయూఖైర్నిశా, నళినీకమలైః, కుసుమగుచ్ఛైర్లతా।
హంసైశ్శారదశోభా, కావ్యకథా సజ్జనైః క్రియతేగుర్వీ.

లోచనము :— నిశాదులను విడిచినయెడల, చంద్రకిరణాదులకు - పర భాగలాభము (భాస్వరత్వాది గౌరవలాభము) లేదు. (అట్లే) కావ్యకథను విడిచిన యెడల, సజ్జనులకు సాధుజనత (సజ్జనత్వము) ఎట్లు కలుగును ?

పరిభా :— ''రజనిని (నిశను) విడిచిన చంద్రకిరణములు- ప్రకాశించు నవియు, సేవింపఁదగినవియు, కావు. పద్మినిని (తామరతీగను) విడిచిన, సరసి

ముజలు- శోభను, పరిమళమును, గోల్పోవును. శరత్కాలశోభనువిడచినహంసలు వెవికింపుగా(గూయవు. మనోహరములును, గావు. అట్లే, కావ్యకథనువిడిచిన సజ్జనులు - సాముజనతను గోల్పోవుదురు.'' అని పదవిపరిణామముచేతనగు నర్థ సామర్థ్యమున నిచట ప్రతీయమానార్థము - ముందు ప్రదర్శింప(బడినది,

లోచనము : — ''అమృతకరుని కిరణములు-రజనిని- (రాత్రిని)భాస్వర గాను, సేవింప(దగిన దానినిగాను, కావించుచుయేదికలదో, అదియే - యిచట, సుధాంశునిచేత నొస(గ్ప(బడిన గురుకీకరణము. (గౌరవము.) అట్లే - సరసిజ ములు - పద్మినికి చొప్పుచ్చిన గౌరవము - శోభ, పరిమళము, లక్ష్మి, మున్నగు నది హంసలు - శారదశ్రీకి (శరత్కాలశోభకు) సంఘటించిన గౌరవము-శ్రుతి సుభగత్వము, మనోహరత్వము, మున్నగునది. పుష్పగుచ్ఛములు- లతకొనర్చిన గౌరవము - అభిగమ్యత్వము, (అంతటను తాముండుటవలన లతయందంతటను తాము పొంది(దగియుండుట) మనోహరత్వము, మున్నగునది. ఇట్లు పూర్వోక్త మగుదానిని-(భాస్వరత్వసేవ్యత్వాదిక మేదిచెప్ప(బడినదో; ఆగౌరవమును) సర్వ మునుగూడ - సజ్జనులు - కావ్యకథకు గౌరవమగునట్లు కావింతురు'' అనునంత వఱకునుగల యర్థము దీపకబలమువలననే-ప్రకాశింప(జేయ(బడుచున్నది. ఇచటి కథాశబ్దము - ఇట్లుచెప్పుచున్నది. ''కావ్యసంబంధులగు కొన్ని సూక్ష్మవిశేషముల నట్లుండనిండు !. సజ్జనులులేనియెడల ''కావ్యము'' అను శబ్దముకూడ - ధ్వంస మగును. వారుండిననో; శబ్దసందర్భమాత్రముకూడ- కావ్యశబ్దవ్యపదేశమునొంది- సుభగమగును. ''ఎట్లు (నిశాదులు) ఆదరణీయతనొందునో, వానిచేత (సుధాం శుకిరణములు, సరసిజములు, మున్నగువానిచేత) అట్లుచేయ(బడుచున్నది.''అని. కావున నిచట దీపకమునకేగాని, (ఇచట వ్యంగ్యమగు) ఉపమకు ప్రాధాన్యము - లేదు.

ప్రభా :— ''ఇచట-సజ్జనవిషయమున-చంద్రకిరణాదులకును, సత్కాృతి కథావిషయమున - నిశాదులకును. ఉపమ- గమ్యమానమగుచున్నది. అయినను, నిచట దీపకమునకే ప్రాధాన్యముండుటవలన నిది - ''ఉపమాధ్వనికాదు.'' అని భావము.

లోచనము : అవ :— ఇట్లు కారికార్థమునుమాత్రమే - ఉదాహరణము చేత(బ్రదర్శించి, వ్యవచ్ఛేద్యబలముచేత (''వాచ్యము - వ్యంగ్యపరమగు సౌంద ర్యమునుగలిగి భాసింపనియెడల, నచటివ్యంగ్యము - ధ్వనివిషయముకాదు.'' అని, ధ్వనికానిదానిని వారించునదియగు నుక్తిసామర్థ్యముచేత) పూర్వోక్తమగు

కారికతే - 'ఎచటవాచ్యము - వ్యంగ్యపరమో, అది - ధ్వనివిషయము.' అను నిష్టిరూపముగల యేయర్థమభిమతమో; (వివక్షితమో) దానిని - వ్యాఖ్యానించు చున్నాఁడు.

(123) మూలము :— ఎచ్చట వాచ్యము-వ్యంగ్యపరమే యగుచుండునో, అచ్చటనుమాత్రము - వ్యంగ్యముఖముననే -వ్యపదేశము - [దానిని ధ్వనియని వ్యవహరించుటయే-] యుక్తము.

ప్రభా :— ఇచట, వ్యంగ్యము-త్రివిధముగాఁ గాన్పించుననుచున్నాఁడు.

లోచనము :— ఒకప్పుడు వాచ్యాలంకారముచేత- వేరొకయలంకారము వ్యంగ్యమగును. ఇంకొకప్పుడు- వాచ్యాలంకారమునకు సద్భావమాత్రముండును. కాని, యదివ్యంజకముకాదు. వేరొకప్పుడు- వాచ్యాలంకారమేయుండదు. కనుక, నిచట త్రివిధమగు వికల్పము నెఱుఁగునది. ఈవికల్పములను యథాయోగముగా నుదాహరణములయందుఁ జూచునది.

అవ :— ఉదాహరించుచున్నాఁడు.

(124) మూలము :— అదెట్లనిన; [ఒకానొక చాటుకవి- ఒకానొక నరేంద్రుని స్తుతించుచున్నాఁడు.]

శా॥ మంథార్తిన్ దిరుగన్ విధించు నెసిరిన్ బ్రాపించియున్ వీఁడు?ని
ద్రందొల్కొంటకు పూర్వమట్లలసచిత్తాన్వీతుఁడే? ద్వీపభూ
పేందుల్ లోఁబడ, సేతువున్ మరలబంధింపంగనే, లన్నయీ
సందేహమ్ములఁబోలె, నీవటుచనన్ సంద్రమ్ము కంపించెడిన్.

లోచనము :— అనంతబలసముదాయ యుక్తుఁడగు నొకానొకనరపతి - సముద్రపరిసరమున వర్తించునపుడు - పూర్ణచంద్రోదయము, తదీయ సేనావగాహము, మున్నగు నిమిత్తమున, నచటి సముద్రమునకు కంపమొదవెను. ఆకంపము - మీఁది సందేహముచేత నుత్ప్రేక్షింపఁబడినది. కావుననిచట - ససందేహోత్ప్రేక్షలకగు (ఏకవాక్యానుప్రవేశ) సంకరమువలన - సంకరాలంకారము -

వాచ్యమగుచున్నది. దీనిచేత - (ప్రశంసింపఁబడుచున్న) 'జనపతి - వాసుదేవరూపుఁడు'. అని ధ్వనింపఁజేయఁబడుచున్నది.

ప్రభా :— ఇచట - సందేహోత్ప్రేక్షల సంకరము- వాచ్యము. దీనిచేత- భూపతికి భగవత్తాదాత్మ్యము - ధ్వనితము. కనుక, నిచట, 'ఓనరేంద్రా; నీవు - వాసుదేవునికంటె భిన్నుఁడవుకావు?' అను రూపకాలంకారధ్వని - కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధాలంకార వ్యంగ్యమైయున్నది.

అవ : ప్రశ్న :— "ఈనరేంద్రుఁడు-శ్రీప్రాప్తిఁ గొందినవాఁడు.' వాసుదేవుఁడు - శ్రీప్రాప్తిఁ గొందనివాఁడు." అని నరేంద్రునికి వాసుదేవునికంటె నగు వ్యతిరేకమిచట భాసించుటలేదా ?

లోచనము : ఉ :— ఇచట - వ్యతిరేకముకూడ ప్రతీయమానమగును. అయిన, నది - పూర్వవాసుదేవునికంటెనగు వ్యతిరేకమేయగును. అవ్యతనుఁ డగునపుడు - వాసుదేవభగవానుఁడుకూడ- ప్రాప్తశ్రీకుఁడు, అనలసుఁడు, సకలద్వీపభూపవిజయియు, నయియుండుటవలన, [ఈనరేంద్రునికి, వానికంటె నాధిక్యమేమియు స్ఫురింపఁజేయఁబడకుండుట, వలన] ఇప్పటి వాసుదేవునికంటెనగు వ్యతిరేకమిచట భాసించుటలేదు. [కాఁగా, "వాఁడేవీఁడు" అను నభేదమే- యిచట ధ్వనింపఁజేయఁబడినది.]

ప్రభా : ప్రశ్న : — ఇచటి - రూపకము - ధ్వనికాదు. "ఇతఁడువాసుదేవుఁడే" అను జ్ఞానములేనియెడల, సముద్రుఁడిట్లు వితర్కింపఁడు. కనుక, సందేహోత్ప్రేక్షాసంకరముచేత నాక్షేపింపఁబడిన రూపకమిచట -సందేహోత్ప్రేక్షల నుపపన్నముల నొనర్చుటకు - వాని నుపపాదించునది - కాకతప్పదు. కనుక, నది- యిచట వాచ్యాలంకారమున కుపస్కారకమేయగును. దీనికిమీరేమందురు ?

లోచనము : ఉ :— సందేహోత్ప్రేక్షల యనుపపత్తిచేతనగు బలము వలన, నిచటరూపకమాక్షేపింపఁబడునదికాదు. అట్లాక్షేపింపఁబడినయెడల, నిచటి వ్యంగ్యరూపకము - వాచ్యోపస్కారకము కావచ్చును. "(వాసుదేవునివలె) ఎవఁడెవఁడు - అసంప్రాప్తమగు సిరిగలవాఁడో, వాఁడు -నన్నుమథింపవచ్చును. ఎవఁడెవఁడు - నిర్వ్యాజవిజిగీషాక్రాంతుఁడో, వాఁడు-నన్ను బంధింపవచ్చును." అను నీమొదలగు నర్థమునతఁడు సంభావింపవచ్చును.

ప్రభా :— కాఁగా; 'ఇతఁడు వాసుదేవుఁడను జ్ఞానములేనియెడల, నీవిత

ర్కాములు-సంభవింపవని తలంపవలసిన యావశ్యకతలేదు, ఇట్లు కర్తృభేదమును సంభావింపవచ్చును. దానిచేతనవి - యుపపన్నములు. కనుక, సందేహోత్ప్రేక్షల యనుపపత్తిబలముచేత - ఇచట రూపకమాక్షేపింపఁ బడవలసివచ్చునదికాదు.

పరీక్ష :— ఇట్లు కర్తృభేదసంభావనవలన సందేహోత్ప్రేక్షాసంకరము పపన్నమగునెడల, 'తిరుగన్, పూర్వమట్లు, మరలన్,' అను నర్థములు - వ్యర్థములగునే. వీనిచేత - 'కర్తయొక్కఁడే' అను విషయము - భాసింపఁజేయఁబడుట వలన - వర్ణనీయుఁడగు నరేంద్రునికి-వాసుదేవతాదాత్మ్యమాకర్షింపఁబడుటలేదా?

లోచనము : ఉ :— ''పృథివి - కార్తవీర్యునిచేత - పూర్వము జయింపఁబడెను. జామదగ్న్యునిచేత - (పరశురామునిచేత) తిరుగ జయింపఁబడెను.'' అను చోటనువలె (ఇచటనుగూడ) తిరుగ, మరల, అనువానియర్థములు - కర్తృభేదమున్నను - సముద్రైక్యమాత్ర పరములుగా నుపపన్నములు కావచ్చును. కనుక తిరుగన్, మరలన్, అనుశబ్దములచేత నీయర్థము [వాసుదేవరూపత్వము] ఆకృష్టమగునదికాదు. పూర్వయగు నిద్రకూడ - రాజపుత్త్రీద్వయావస్థయందుఁగూడ సిద్ధింపవచ్చును. కావున శబ్దవ్యాపారములేకయే, అర్థసౌందర్యబలమువలన - రూపకాప్రతిపత్తికలుగుచున్నది. కనుకనిది - రూపకధ్వనియే యనునది - సిద్ధము.

పరీక్ష : — అయ్యా! మీరు - 'తిరుగన్, పూర్వము,మరలన్' అనుపదములచేత సముద్రుఁడు - కర్తృభేదమును సంభావింపక తీరదనుకొనుచున్నారా? ''కార్తవీర్యునిచేత పృథివి పూర్వము జయింపఁబడెను. పరశురామునిచేత, తిరుగ జయింపఁబడెను.'' అనుచోట, పూర్వము, తిరుగ, అనుపదములచేతఁజెప్పఁబడిన కర్త - ఒక్కఁడుకాఁడుగదా!. అట్లే యిచ్చటఁగూడ - తిరుగ, పూర్వము, మరల, అనువానిచేత - మంథార్తిని గలిగించువాఁడును - నిద్రింపఁగోరువాఁడును, సేతువును బంధించువాఁడును, నగుకర్త - యొక్కఁడే - సముద్రునిచేత సంభావింపఁబడెనని సంభావింపవలసిన యావశ్యకతలేదు లోచనోక్త దృష్టాంతవాక్యమున పూర్వముజయింపఁబడినదియు, తిరుగజయింపఁబడినదియుఁగూడ, పృథివియొక్కటియేయగునట్లిచటఁగూడ ''వాసుదేవునిచేతవలె వీనిచేతఁగూడ - తిరుగమంథార్తిని బొందుదునేమో'అనియు, 'పూర్వపు వాసుదేవుఁడువలె, వీఁడుకూడ - నామీఁదఁ బండుకొనునేమో'యనియు,'వాసుదేవుఁడువలె,సంప్రాప్తవిజయుఁడయిననుగూడ- వీనిచేతఁగూడ - నాకుమరల సేతుబంధనము కలుగునేమో'' అనియు, సముద్రుఁడిచట సంభావింపవచ్చును. కనుక, తిరుగన్, పూర్వము, మరలన్, అనుపదములిచట - సముద్రునికిమాత్రమే యేకత్వమును దెలుపునుగాని మంథార్తినిగూర్చు

వాఁడు మున్నగుకర్తలకేకత్వమును చెప్పుచున్నది. కనుక 'తిరుగన్, పూర్వమట్లు, మరలన్,' అను పదములచేత నిచట నోక్తియున్నదని (కనుకనే, రూపకాలంకారము - వాచ్యమని) తలఁపదగును. కాని, ''కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధ ససందేహోత్ప్రేక్షాలంకారరూపమగు నర్థశక్త్యుద్భవసామర్థ్యముచేత (వ్యంజనచేత) రూపింపఁజేయఁబడుటవలన నిది-రూపకధ్వనియేయగును '' అని సిద్ధాంతీకరింపఁబడినది.

ఆప :— క్రిఁదియాంధ్రీకృతికి మూలమగు శ్లోకమిట్లున్నది.

> ప్రాప్తశ్రీరేష కస్మాత్ పునరపి మయి తం మన్థఖేదం విదధ్యా
> న్నిద్రామప్యస్య పూర్వామనలసమనసో నైవ సమ్భావయామి।
> సేతుం బధ్నాతి భూయః కిమితి చ సకలద్వీపనాథానుయాత
> స్త్వయ్యాయాతే వితర్కానితి దధత ఇవాభాతి కమ్పః పయోధేః. అని

చెప్పి తరువాత —

లోచ :— యథాచ.

> జ్యోత్స్నాపూరప్రసరధవళే సైకతేఽస్మిన్ సరయ్వా
> వాదద్యూతం సుచిరమభవత్ సిద్ధయూనోః కయోశ్చిత్।
> ఏకోఽవాదీత్ ప్రథమనిహతం, కేశినం, కంసమన్యో
> మత్వా తత్త్వం కథయ భవతా కో హతస్తత్ర పూర్వమ్ ॥

అను నుదాహరణమును - కొందఱిచట పఠించుచున్నారు. ''భవతా'' అను నీ శబ్దముయొక్క బలముచేత - నీవు వాసుదేవుఁడవను నర్థము - స్ఫుటీకృతమగుచున్నది. కనుకనిది - సత్కావ్యముకాదు.

ప్రభా :— ఒకచాటుకవి-ఒకనరేంద్రుని స్తుతించుచున్నాఁడు. ఇది - ప్రభామతి ప్రసారితమగు జాతీయపద్యము. దీనిపేరు-చామంతి. ప్రతిపాదమునను 30 మాత్రలుండును. పాదాంతమున రెండుమాత్రలకాలమాగినయెడల చతురశ్రజాతి త్రిపుటతాళమునకు సరిపడును. 16 మాత్రలమీదపడియుండును.

> 'సరయూసైకతమున, నిచ్చలు - జ్యోత్స్నాపూర శ్రీ ధవళమునన్
> చిరకాలము, వాదద్యూతమొదవె సిద్ధయువకు లొకయిద్దరికిన్;
> హరి-కేశిని దొలుతఁజంపెననె నొకఁ;డన్యుఁడు కంసునిజంపెననెన్;
> అరసి యథార్థముఁదెలుపు మీవెవని హతునొనర్చితివొ తొలుతప్రభూ.'

అను పాఠమునిచటఁ గొందఱుదాహరించిరి. "నీవెవనిని దొలుతహతునొనర్చితివి" అనుచోట - "నీవు" అను శబ్దపుబలమున వ్యంగ్యము స్పష్టమొనర్పఁబడినది. కనుకనిది (నీవు వాసుదేవుఁడవను నర్థము) ఇచట - రూపకాలంకారధ్వనిగా నుదాహరింపఁదగినదికాదు.

ప్రశ్న :— ఇచట "నీవువాసుదేవుఁడవే" అనునర్థము-వ్యంగ్యముకాదా?

ఉత్త :— "నీవు" అను శబ్దమునకిచట - వక్ష్యుఁడగు నరపతి యర్థమగుచున్నాఁడుగదా. కేశిని, కంసునిఁజంపియుండని రాజునుజూచి - 'నీవు వీరిలో నెవనిని-తొలుతఁజంపితివి?' అనునప్పుడు - ఆరాజునకు - కేశిని, కంసుని జంపిన వాసుదేవునితోడి - యభేదము - స్ఫుటీకృతమగునుగదా! ఇట్లు తదభేదము - స్ఫుటీకృతమయినను, వాచ్యముకాకుండుటవలన వ్యంగ్యమేయగును. 'కేశిని, కంసుని, కృష్ణరూపమునఁజంపిన వాసుదేవుఁడవు' అను నీ వ్యంగ్యార్థము-దీనికంటెమిగుల సుందరమగు వాచ్యార్థమును వీరిలో నెవనిని తొలుతఁజంపితివి? అను దానిని-అలంకరించుచున్నది. కనుక, నిచటి వ్యంగ్యము-ఇట్లు వాచ్యార్థమున కుపస్కారకమగుటవలన - గుణీభూతమే (అప్రధానీభూతమే) యగును. కనుక ధ్వనికాదు.

ప్రశ్న :— అయ్యా! "మంథార్తిన్" అనునదికూడ - శ్లేషయున్నట్లున్నదే? దానిని లోచనకర్త - రూపకధ్వనిగా నేల సమర్థించెనో!

ఉ :— అది-ఇట్లులేదు. అది, రూపకధ్వనియేయగును. పూర్వోక్తమును, సప్రభామతియు, నగు లోచనార్థమును-మరల సమాలోచించి చూడుఁడు!

**(125)** మూలము :- వేరొక యుదాహరణము, నా యదియే.

(జాబిల్లి. ప్రభామతి ప్రసారితమగు నుపజాతీయపద్యము. ప్రతిపాదమునందును 37 మాత్రలుండును. [పాదాంతమున 3 మాత్రలు కాలమాగినయెడల, ఖండగతికిని, ఖండగతి త్రిపుటతాళముమునకును, సరిపడును.]

లావణ్యకాంతి పరిపూరితాశాముఖమ్మీ వేళ నీముఖము 'సస్మితముగా'

శ్రీ విలోలాయతాక్షీ! పయోనిధి-క్షోభఁ
జెందకున్నాఁ, డిప్పుడొక్కింతయున్,
గావునన్ - కల్యాణి! సకలలోకఖ్యాతిఁ
గలదాని, 'జల (డ) రాశి'యను నామమున్,
భావింతు నామనోవీథి;నీతనికి 'సు
వ్యక్తాభిధేయమౌ నామమ్ముగన్.'

ఇటువంటి విషయమున - కావ్యచారుత్వము - అనురణన రూపమగు (సంలక్ష్యక్రమ వ్యంగ్యమగు) రూపకము నాశ్రయించి యుండుటవలన-ఇచట-రూపకధ్వనియనువ్యపదేశము-న్యాయ్యము.

ప్రభా :— దీని మూలమిది :—

శ్లో॥ "లావణ్యకాన్తి పరిపూరిత దిఙ్ముఖేఽస్మిన్
స్మే రేఽధునాతవముఖే, తరలాయతాక్షి!
క్షోభంయదేతి నమనాగపి తేనమన్యే
సువ్యక్త మేవ జలరాశిరయం పయోధిః."

లోచనము :— లావణ్యమనఁగా; సంస్థానముగ్ధిమ. (ఆకారసౌందర్యము) కాంతియనఁగా; ప్రభ. వానిచేత (ఆశాముఖములు) పరిపూరితములనఁగా, సంవిభక్తములు'. అనఁగా హృద్యములుగాఁ జేయఁబడినవి. అట్టి యాశాముఖములు - (దిక్కులయారంభదేశములు) కలదియగునీముఖము-ఈవేళన్ = కోపకాలుష్యము నుడిగినపిమ్మట, ప్రసాదోన్ముఖమగుటచేత - సస్మితముగా = చిరునవ్వుతోఁ గూడినది కాఁగా; 'శ్రీవిలోలాయతాక్షి!' = 'ప్రసాదముచేతనగు ఆందోళన, వికాసములచేత-సుందరములగు, కన్నులుగలదానా!'అని సంబోధనము. 'ఇప్పుడు, పయోనిధి - కొంచెమయినను క్షోభమును (మదనవికారాత్మకమగు చిత్తచాంచల్యమును) బొందకున్నాఁడు'. [అనునది-వాచ్యము.] 'క్షణకాలముక్రిందట (చంద్రో దయసమయమున) క్షోభమును(సలిలోల్లాసలక్షణమగు చాంచల్యమును)బొందెను.' [అనునది - దానిచేత వ్యంగ్యము]

ప్రభా :— కనుక, "జలరాశి ("జడరాశి" అనఁగా;' జాడ్యపుముద్ద')

అను పేరు- ఈసముద్రునికి సార్థకమని స్పష్టపడుచున్నదనితలఁచెదను.'' అనునది- వాచ్యము.

అవ :— ఇట్లు. శ్లేషానుప్రాణితమగు నుత్ప్రేక్ష , ఇచట, వాచ్యము. దీనిచేత :— ప్రధానముగా స్ఫురింపఁజేయఁబడిన రూపకధ్వనిని బ్రదర్శించు చున్నాఁడు.

లోచనము :— (ఇంతవఱకును) కోపకషాయముచేత నెరుపుతోఁగూడిన తెలుపుగలదియు, (ఇప్పుడు ప్రసన్నమగుటచేత) చిరునవ్వుతోఁ గూడినదియు, నగు నీముఖము- సంధ్యారుణ పూర్ణమగు శశధరమండలమేయగుచున్నది. కనుక. (చంద్రమండలాభిన్నమగు నీయీముఖమును జూచుటచేత) సహృదయుఁడు-చలన చిత్తతచేత [మదనవికారాత్మకమగు చిత్తచాంచల్యము రూపముగాఁగలదియగు] క్షోభమును గలిగియుండవలయును. [పయోనిధియో, ఉచ్ఛలత్తరంగరూపమగు క్షోభ మును గలిగియుండవలయును. ద్వివిధమగు క్షోభములకును నిచట నభేదాధ్యవ సాయమొనర్చి చెప్పఁబడినది ] కాని, యీ సముద్రుఁడు - అట్టి క్షోభమునొందుట యేలేదు. కనుక, 'జలరాశి' అనఁగా, జాడ్యసంచయము, ''మొత్తమయిన జడత్వ ముకలవాఁడు'' [అనునామము నీసముద్రునికి] 'సువ్యక్తాభిధేయమౌ నామమ్ము గన్' = అన్వర్థముగాఁ దెలుపఁబడిన నామమని భావింతును. (నిశ్చయింతును.)

ప్రభా :— లకార డకారములకభేద స్మరణమువలన, జలరాశియనఁగా, జడరాశియనియు, భావప్రధాన నిర్దేశ స్వీకరణమువలన - (జడరాశియనుటకు బదులుగా) జాడ్యరాశియనియు, నిచట - నర్థము వెలుఁగవలయును.

అవ :— ఈ యంశమునే తెలుపుచున్నాఁడు.

లోచనము :— ''జలాదులగు శబ్దములు-భావార్థప్రధానములు. (అనఁగా; 'జాడ్యము' మున్నగు నర్థములను ముఖ్యముగా వచించునవి'') అని, యింతకు ముందు తెలుపఁబడినది. ఇచ్చట - (ఓ లోలాయతాక్షీ!) నీముఖావలోకనమున, సహృదయునకు - మదనవికారాత్మకమగు క్షోభముకలుగును'' [తథావిధమగు క్షోభము నొందకుండుటవలన - పయోనిధిని - జాడ్యరాశియని నిశ్చయింతును.]'' అను నింతవరకునుగల యర్థమున, అభిధ- విశ్రమించును. కనుక,(తదుపరినగు) రూపకము - (అర్థశక్తిచేత) ధ్వన్యమానమేయగును. ఇచట వాచ్యాలంకారము - శ్లేషము. కాని, యది - (ఇచట) వ్యంజకముకాదు. అనురణనరూపమగు, నిచటి రూపకము - అర్థశక్తివ్యంగ్యమగుచున్నది. కనుక, కావ్యసౌందర్యమిచట-ఆరూప

కము నాశ్రయించియున్నది. కనుక, దీనికి - 'రూపకధ్వని' యను వ్యపదేశమే యుక్తము.'' అని సమన్వయించునది.

ప్రభా :— ''ఇచట, ప్రేయసీ ముఖమున-పూర్ణచంద్రాభేదము-ప్రధానముగా, స్ఫురింపఁజేయఁబడినది. అభిధావృత్తి- సమాప్తినొందినపిమ్మట - వ్యంజన చేత నిచట రూపకము -ధ్వనింపఁజేయఁబడినది. కనుక,(ప్రేయసీ!) 'నీముఖము-పూర్ణచంద్రుఁడే ' అను నీరూపకము - వాచ్యసిద్ధ్యంగముకాదు. ''క్షోభము''అను చోట, మదనవికార చాంచల్యరూపమునకును, ఉచ్ఛలత్తరంగత్వ రూపమునకును, అభేదాధ్యవసాయము చెప్పఁబడినట్లు, 'జాడ్యరాశి' అనుచోటఁగూడ - 'తెలివిలేని మొద్దు.' అను నర్థమునకును, 'జలత్వరూపమునకును,' అభేదాధ్యవసాయము-చెప్పఁబడినది'' అనితెలియునది.

(126) మూలము :— ఉపమాధ్వని కుదా :—

తే. వీరజన దృష్టి - బహులసిందూరమగుచు
నమరు రిపుగజకుంభస్థలమునఁబోలె;
ఘుసృణ రసముల నరుణమై యెసఁగు, ప్రియత
మా స్తనోత్సంగమున - రమింపనిదియయ్యె.

ప్రభా :— ఈయాంధ్రకృతికి మూలమొకప్రాకృతశ్లోకము. ఇది-దాని సంస్కృతచ్ఛాయ.

వీరాణాంరమతేఘుసృణారుణే - నతథాప్రియాస్తనోత్సఙ్గే।
దృష్టీరిపుగజ కుమ్భస్థలే యథాబహుల సిన్దూరే.

''వీరజనులదృష్టి - అధికమగు సిందూరముగల శత్రుగజ కుంభస్థలమున నెట్లు రమించుచుండెనో; అట్లు, ప్రియాస్తనతటమున రమింపకుండెను.'' అని దీనియర్థము.

లోచనము :— అలంకరింపఁబడిన ప్రియతమలను (సమ్మేళనాదులచేత) ఆశ్వాసించుటయందు - సంసక్తిగలవారలగుటచేతను, సమనంతరీభూతమయిన (ప్రత్యాసన్నమయిన) యుద్ధమునందు - త్వరితమయిన మనస్సుగలవారలగుట చేతను, దోలాయమానమగు దృష్టిగలవారలయినను గూడ - వీరజనులకు-యుద్ధము

నందే త్వరాతిశయము కలిగెను'' అనువ్యతిరేకము- వాచ్యాలంకారమగుచున్నది.

ప్రభా :— వీరజనదృష్టికి - ప్రియాస్తనోత్సంగరమణము నందుకంటె - శత్రుగజకుంభస్థలరమణమునందు - అతిశయము తెలుపఁబడుటవలన - మారకదనత్వరకంటె, వీరకదనత్వర - అతిశయించినదని చెప్పినట్లయినది. కనుక - నిచట నీవ్యతిరేకము - వాచ్యాలంకారమగుచున్నది.

అవ ;— తదుపరి, ''దీనిచేత - ప్రియతమాస్తనతట - రిపుగజకుంభస్థలములకుపమ - ధ్వనితము.'' అనుచున్నాఁడు.

లోచనము :— సకల జనులకును భయంకరములయినను, శత్రుసంబంధులయినను, (తమను) మర్దించుట కుద్యుక్తములగునవియయిననుగూడ - గజకుంభస్థలములయందు- ప్రియాకుచ కుట్మలములతోనగు నుపమ - యేదికలదో, అది మాత్రము - ధ్వన్యమానమే. ఆయుపమావశమున (ప్రియాస్తనాభోగమున) అనురక్తులగు వారికివలె, (వీరభటులకు) గజకుంభస్థలములయందు బహుమానమగుచుండును. కనుక, (ఇట్లు ధ్వనింపఁజేయఁబడిన) ఉపమయే - (ప్రతీయమానమగు) వారి వీరత్వాతిశయమునకు - చమత్కారమును సంపాదించును. కనుక (వీరరసోపస్కారకమగుటచేత) నిచట నుపమయే - ప్రధానము.

ప్రభా : ప్రశ్న :— మీఁది పద్యమున - వీరజనదృష్టికి - ప్రియాస్తనాభోగమునందగు రమణముకంటె, శత్రుగజకుంభస్థలమునందగురమణాతిశయము - ప్రతిపాదింపఁబడినది. దానివలన-మారరణత్వరయందుకంటె - వీరరణత్వరయందగు నతిశయము - గమ్యమగుచున్నది. ఇచటనిట్లు స్ఫురింపఁజేయఁబడిన వ్యతిరేకమేల ప్రధానముకాదు ? దీపకాదులయందు స్ఫురింపఁజేయఁబడిన యుపమవలె, దీనిచేత స్ఫురింపఁజేయఁబడిన యుపమ - దీనికేయుపస్కారకముకాదా ?.

ఉ :— ఇచటి వ్యతిరేకము - వాచ్యాయమానమేయగును. కనుక నిది - వాచ్యాలంకారమే యగుచున్నది. దీనిచేత, నిచట - ''కుంకుమపుఁబూతచేత నెఱుపెక్కిన ప్రియతమాస్తనాభోగము - అత్యర్థమగు సిందూరముచే నెరుపెక్కిన రిపుగజకుంభస్థలమువలెనున్నది. ప్రియానురక్తులకు-కుంకుమ రసారుణమగు వారి స్తనాభోగమునందగు బహుమానమువలె, యుద్ధాసక్తులగువీరులకు- అత్యర్థసిందూరారుణమగు రిపుగజకుంభస్థలమున బహుమానమొదవును''అని ప్రియాస్తనాభోగ-గజకుంభస్థలములకును, తద్గత బహుమానములకును, నుపమ-ధ్వనింపఁజేయఁబడినది. ఈయుపమయే - ప్రతీయమానమగు 'వీరభట - వీరతాతిశయమునకు' చమ

త్కారమునుసంఘటించుచు,వీరరసోపస్కారకమగుటవలన చమత్కారకారియగు చున్నది. కనుక నదియే ప్రధానము. వ్యతిరేకము - ప్రధానముకాదు.

ప్రభా : అవ :— "మీఁది పద్యమున వ్యంగ్యమగు నుపమకంటె - వ్యతిరేకమే ప్రధానమేమో!" అను. సమదిని బురస్కరించుకొని, యింకొక యుదాహరణమును స్వీయము నొసఁగుచున్నాఁడు.

(127) మూలము : — మదీయమేయగు విషమబాణలీల యందు- కామదేవుని యసుర పరాక్రమణమునందలిది- దీనికింకొక యుదాహరణము : —

కం॥ శ్రీసోదర రత్నాహర
ణాసక్తమ్మసురహృదయమది - తత్ప్రియకాం
తా సద్బింబాధరవిని
వేశితముగఁజేసె నలరు విల్తుఁడు వడిగన్.

లోచనము : — విషమబాణలీలయందు- ఆకామదేవుని త్రైలోక్యవిజయ ముగడా వర్ణింపఁబడినది. ఏయసురులచేత - మాటిమాటికిని, 'ఇంద్రపట్టణమున వమర్దించుట' మున్నగు (పరపీడాకరమగు) నేయేకార్యము- చేయఁబడనిదిలేదో; పాతాలవాసులగు నాయసురులకు సంబంధించిన యాహృదయమును - అనఁగా: ఏహృదయము - అతిదుష్కరములయినను, ఆయా (దుష్) కార్యములనుండి చలింపఁజేయఁదగని- వ్యవసాయము (ప్రయత్నము) గలదియో, 'ఆయసుర హృదయమునుగూడ-అనఁగా; ఏహృదయము - శ్రీసోదరములు (లక్ష్మికితోఁ బుట్టువులు) కనుకనే, అనిర్వాచ్యములగు నుత్కర్షముగలవియగు రత్నములను- పూర్తిగా (మొదలంట) స్వీకరించు విషయమున ఆసక్తమో, (ఏకరసమో - అనఁగా, తత్పరమో) ఆహృదయమునుగూడ అలరువిల్తుఁడు- (పూవిలుకాఁడు) సుకుమారతరోపకరణ సంభారుఁడు (మిక్కలి మృదువగు నుపకరణ సామగ్రి కలవాఁడు) వారివారి ప్రియకాంతలకు సంబంధించిన దొండపండువంటి యధర మున, నివేశింపఁబడిన దానినిగాఁజేసెను. అనఁగా; ఏయసురహృదయము - పటి గీషాజ్వలన జాజ్వల్యమానమగు చుండెనో, ఆయసుర హృదయమును - ఆకామ దేవుఁడు- (మిగులమెత్తనియుపకరణ సామగ్రిగలవాఁడయిననుగూడ) తత్ప్రియ కాంతలయధరమును జూచుట, పరిశీలించుట, దానిని పరిచుంబించుట, అను

కార్యములచేత - కృతకృత్యతాభిమానము నొందుచున్నొనచ్చెను" అనిభావము. ఇచట - వాచ్యాలంకారము - అతిశయోక్తి.

ప్రతీయమానమో - ఉపమ.

'బింబాధరము - సకలరత్న సారతుల్యము' అని, వారికి (ప్రియురాండ్రకై యేర్పడియుండేదవిన) బహుమానము వాస్తవమేయగుచున్నదిగదా! రూపకమారోప్యమాణమగుటవలన వాస్తవముకాదు. కనుకనే, యిది - రూపకధ్వని - కాదు. ఆయసురులకు (ప్రియాధరమున - కౌస్తుభాది రత్నముతోడి) సాదృశ్యము - వస్తువృత్తిచేతనే స్ఫురించును. ఆసాదృశ్యమే-ప్రధానముగా చమత్కారహేతువు కూడనగును.

ప్రభా :— ఆంధ్రీకృతికి మూలమగు ప్రాకృత శ్లోకమిది :—

''తంతాణ సిరిసహోఅర, అణ్ణాహరణమ్మిహి అఅమేకరసమ్।
బిమ్బాహరేపిఆణం! ణివేసిఅం కుసుమ బాణేన''

''రత్నాహరణమున నాసక్తమగు నసురహృదయము - వారి ప్రియకాంతల బింబాధరమున నివేశింపఁబడెను'' అని. వస్తుతః, భిన్నములగు (అంతఃకరణ వృత్తిరూప) హృదయములకిచట - ఏకత్వము (అభేదము) ప్రతిపాదింపఁబడినది. కనుక, భేదమునందు - అభేదరూపమగు నతిశయమును దెలుపుటవలన నిచట వాచ్యాలంకారము - భేదమున నభేదరూపమగు నతిశయోక్తికాని, నివేశన సంబంధములేకున్నను తత్సంబంధమునుదెలుపుటవలన, సంబంధాతిశయోక్తిగాని, యగును. దీనిచేత - ధ్వనింపఁజేయఁబడినది- ఉపమయేయగును. రూపకమున-ఉపమానాభేదము - కల్పితమేయగును. కనుక, నిది-రూపకధ్వనికాదు. కాఁగా నిది - ఉపమాధ్వనియనుట - నిర్వివాదము.'' అనిభావము.

(128) మూలము :— ఆక్షేపధ్వని కుదా :—

గీ॥ ఆమహోబ్ధి పరిచ్ఛేద మంబుకుంభ
చయమున గ్రహింపనెవ్వాఁడు-శక్తుఁడగునొ;
అతఁడె - శ్రీహయగ్రీవ సంశ్రితములయిన
సకల గుణముల వర్ణింప శక్తుఁడగును.

పై పద్యమున - (వాచ్యముగు) అతిశయోక్తి చేత- హయగ్రీవుని గుణములను- అవర్ణనీయములుగాఁ బ్రతిపాదించు రూపము గలదియు, అసాధారణమగు, తద్విశేషమును, బ్రకాశింపఁజేయునదియు, నగు నాక్షేపాలంకారము- ప్రకాశింపఁ (ధ్వనింపఁ) జేయఁబడుచున్నది.

లోచనము :— "అతిశయోక్తిచేత" అనఁగా, వాచ్యాలంకారరూపయగు నతిశయోక్తిచేత" అనియర్థము. ఆక్షేపము - తెలుపుట కిష్టమగుదానిని ప్రతిషేధించుట (నిషేధించుట)యే రూపముగాగలది. కనుక, వర్ణించుట కిష్టములగు హయగ్రీవగుణములను అవర్ణనీయములుగాఁ బ్రతిపాదించుటయే- ఆక్షేపమునకు రూపమగును. "అసాధారణమగు" అను విశేషణద్వారమున - ఆయాక్షేపమునకు- ప్రాధాన్యమును జెప్పుచున్నాఁడు.

ప్రభా :— "ఎవఁడు - నీటికడవలచేత - మహాసముద్రముయొక్క పరిమాణమును గొలిచి, తెలిసికొనుటకు- శక్తుఁడగునో; వాఁడే - హయగ్రీవుఁడను నామముగల యసురుని సమాశ్రయించిన గుణసాకల్యమునువర్ణించుటకు - శక్తుఁడగును." అనునది- యిచట-వాచ్యమగు అతిశయోక్తి. (సంబంధములేకున్నను, సంబంధరూపయగునదియగు నతిశయోక్తి.) "దీనిచేత- "హయగ్రీవునిగుణములు- అవర్ణనీయములు" - అని, తెలుపుట కిష్టమగు గుణవర్ణనమును నిషేధించునదియగు నాక్షేపము - ధ్వనింపఁజేయఁబడినది. దానిచేత - తద్గుణముల కసాధారణమగు విశేషము స్ఫురింపఁజేయఁబడినది". అని తెలియునది.

(129) మూలము :— అర్థాంతరన్యాసధ్వని - 1 శబ్దశక్తిమూలానురణన రూపవ్యంగ్యమును, 2 అర్థశక్తిమూలానురణన రూపవ్యంగ్యమునుగూడ సంభవించును.

లోచనము :— "సంభవించును" అనుదానిచేత - ప్రసంగమువలన - శబ్దశక్తిమూలమిచట, విచారింపఁబడునని ప్రదర్శించుచున్నాఁడు.

ప్రభా :— "ఉపమాధ్వనివలె, అర్థాంతరన్యాసధ్వనికూడ - ద్వివిధమగుట - అసంభవముగాదు." అనిభావము.

అవ :— ముందుగా శబ్దశక్తిమూలమగు నర్థాంతర న్యాసధ్వని నుదాహరించుచున్నాఁడు.

(130) మూలము :— అందు ప్రథమమునకు (శబ్దశక్తి మూలానురణ వ్యంగ్యమగు అర్థాంతర న్యాసధ్వనికి) ఉదా :—

ఆ॥ భాగ్యవశతఁ గలుగు ఫలమేమిచేయుదు,
మేము, చెప్పనేర్తుమింతవఱకె;
తాము సాటిగాక, తనరురక్తాశోక
కిసలయమ్ము, లన్య కిసలములకు.

ప్రభా :— "చూతాది పల్లవములకు - రక్తాశోకపల్లవములు సాటిగాక, తనరును" అనఁగా; 'వానికంటె విశిష్టములు.' అనియర్థము.

"ఇతర పల్లవములెవియు - రక్తాశోక
పల్లవములసాటిఁ బడయఁదగవు"

అనునెడల, నీయర్థము - స్పష్టమగును. "ఫలశబ్దమిచట - నానార్థకము. కనుకనిచటి యర్థాంతర న్యాసధ్వని - శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యమగుచున్నది.

లోచనము :— "అశోకవృక్షమునకు - తీయమామిడి మున్నగువానికి వలె, ఫలము (పంట) లేదు. దానికేమిచేయనగును ? కాని, పల్లవములు-(చిగురాకులు మాత్రము - చూతాదులపల్లవములకంటె) మిక్కిలి హృద్యములు" అను నింతతో, అభిధ - సమాప్తమేయగుచున్నది. తదుపరి - ఫలశబ్దమునందగు శక్తి వశమువలన-"లోకోత్తరమగుజిగీషయందును, తమపాయమునందును, ప్రవర్తించువానికిఁగూడ - దైవాధీనమయిన సంపల్లక్షణమగు ఫలమొకానొకప్పుడు లభింపక పోవచ్చును." అను సామాన్యాత్మకమగు వస్తువు - పూర్వోక్తవిశేషరూపవాచ్య వస్తువును సమర్థించునది- పూర్వమే- ( భాగ్యవశతఁగలుగు ఫలము' అనుమాటను వినుచుండఁనప్పుడే) ప్రతీయమానమగును.

ప్రభా :— "దైవాయత్తేఫలే కింక్రియతామే తావత్ పునర్భణామః।
రక్తాశోకపల్లవాః పల్లవానామన్యేషాంనసదృశాః."

అనునవి-ప్రాకృత మూలమునకు సంబంధించిన సంస్కృతచ్ఛాయ. "దైవం దిష్టంభాగధేయం,భాగ్యంస్త్రీనియతిర్విధిః" అనునామలింగానుశాసనోక్తివలన భాగ్య శబ్దము- దైవపర్యాయము, కనుకదాని ననుసరించి,దైవాయత్తశబ్దము-'భాగ్యవశతఁ గలుగు'అని తెనిఁగింపఁబడినది. "భాగ్యవశతఁగలుగుఫలమేమిచేయుము ము"అను చోటనున్న ఫలశబ్దము-ప్రకరణవశమువలన-సస్యరూపఫలమును-(అనఁగా'పంట' అనునర్థమును) అభిధచేతఁ దెలుపును. తరువాత, 'అశోకమునకు ఫలము(పంట) లేదు.' అను ప్రస్తుతార్థము - లభించును. తిరుగ ఫలశబ్దము- స్వశక్తిమూలమగు ధ్వననముచేత-సంపదాత్మక,ప్రయోజనరూపమగు, నర్థమునుబోధించును.తదుపరి- "దైవాయత్తములగు (భాగ్యవశతఁగలుగునవియగు) సంపదలు - అందఱికిని గూడ నొకప్పుడు లభింపకపోవచ్చును.' అను సామాన్యరూపమగునర్థము - (వ్యంగ్యము-) 'అశోకమునకు ఫలములేదు' అను పూర్వోక్తప్రస్తుతార్థమునకు సమర్థకమగును. కనుక సామాన్యరూపమున-ప్రధానమగు వ్యంగ్యముగల యిది - అర్థాంతరన్యాసధ్వన్యుదాహరణమగుచున్నది.

లోచనము : అవ :— "అయ్యా ! ఈ సర్వవాక్యమునకు [ఇచట సంపూర్ణమగు వాక్యమునకు] ప్రధానతచేత వ్యంగ్యమగునది - అప్రస్తుత ప్రశంసాలంకారము. కనుక, నిచట-అర్థాంతరన్యాసాలంకారమునకు ప్రధానవ్యంగ్యత్వ మెట్లుకలుగును ? ఒకేస్థలమున- రెండలంకారములకును, ఒక్కమారుగనే, ప్రాధాన్యయోగము కలుగదుగదా!" అని యాశంకించి; చెప్పుచున్నాఁడు.

**(131)** మూలము :— ఈధ్వని - [అర్థాంతరన్యాసాలంకారధ్వని - ] పదప్రకాశము. కావున [సమస్త] వాక్యమున కర్థాంతరమునందు [అప్రస్తుతప్రశంసాలంకార ధ్వనియందు] తాత్పర్యమున్ననుగూడ - విరోధములేదు.

లోచనము :— "ధ్వని ప్రపంచమంతయుఁగూడ- (1) పదప్రకాశము, (2) వాక్యప్రకాశము, అగుచుండును." అని (ముందు) చెప్పఁబడునుగదా!. కనుక "ఫలము" అనుపదమునందు - ప్రధానతచేత వ్యంగ్యమగునది - అర్థాంతర న్యాసధ్వనియగును. వాక్యమునందో; [ప్రధానముగా వ్యంగ్యమగునది-] అప్రస్తుత ప్రశంసాలంకారము.

ప్రభా :— పదమువలననగు ప్రకాశముగలది - అర్థాంతరన్యాసము• వాక్యమువలననగు ప్రకాశముగలది - అప్రస్తుత ప్రశంస.

అవ :— "అట్లయిన, నిచటనది - యేడిగా వ్యవహరింపఁబడును ?" అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

లోచనము :— ఆరెంటియందునుగూడ - తిరుగ, "ఫలము" అను పదముచేత - సమర్థ్యము, సమర్థకము, అగునర్థములేవి స్వీకరింపఁబడినవో; వాని భావమునకగు (అనఁగా; సమర్థ్య సమర్థకత్వమునకగు) ప్రాధాన్యమే - (సహృదయులకు) స్ఫురించును. కనుక, ఇది- అర్థాంతరన్యాసధ్వనియేయగునని(వృత్తిగతమగు) భావము.

ప్రభా :— "ఇచట - అప్రస్తుత ప్రశంసకూడనున్నదీ. అయినను, [ప్రాధాన్యేనవ్యపదేశాభవన్తి] "ప్రధానతచేత - వ్యవహారములు కలుగును." అను న్యాయమున సమర్థ్యమగు విశేషమును - సమర్థించుటచేత - (సమర్థకత్వముచేత) ప్రధానమగుటవలన-దీనిని- అర్థాంతరన్యాసధ్వనియనియే వ్యవహరింపఁదగును." అనిభావము.

(132) మూలము :— ద్వితీయమునకు [అర్థశక్తిమూలానురణనరూపవ్యంగ్యమగు నలంకారధ్వనికి] ఉదాహరణము :—

ఆ॥ వె॥ మనసులోనె - మన్యువును దాచుకొన్నను
మొగముమీఁద కినుక మొలవనీను.
అనునయింతువయిన నను, నపరాధివై
న, నినునలుగవీలగునె ? బహుజ్ఞ :.

ఇచట-వాచ్య విశేషముతో("అపరాధివైననుగూడ-బహుజ్ఞా! నిన్నుఁగోపించుటకుశక్యముకాదు"అనుదానితో)అర్థశక్తిమూలమగు వ్యంజనచేతఁ ప్రకాశింపఁజేయఁ బడినదియు, (వాచ్యముకంటె) వేరయినదియు, (వాచ్యవిశేషమును) సమర్థించునదియు, నగు, సామాన్యము-"బహుజ్ఞుఁడగువానిని సాపరాధుఁడయిననుగూడ-కోపించుటకు శక్యముకాదు." అనునది -అన్వితమై, ప్రకాశించుచున్నది.

ప్రభా :— దీనికిమూలమగు ప్రాకృతశ్లోకమునకిది- సంస్కృతచ్ఛాయ :-

హృదయస్థాపితమన్యు । మపరోషముఖీమపిమాం ప్రసాదయన్।
అపరాద్ధస్యాపినఖలుతే బహుజ్ఞ। రోషితుం శక్యమ్.

ఒకానొకసుందరి- ఖండిత. మన్యువును (శోకమును, రోషమును,) మనసు నందే దాచుకొన్నది. రోషచిహ్నములనుగూడ - ముఖమునందు - ప్రకటింప కున్నది. ఈమెవల్లభుఁడు - తప్పిదము నొనర్చినవాఁడు. ఈమెను ప్రసాదింపఁ జేసికొనుచున్నాఁడు. కనుక. నీర్ష్యతో నిట్లనుచున్నది.

లోచనము :— "నేను- నాహృదయమునందే నామన్యువును స్థాపించు కొనియున్నాను. కాని, వెలికిఁ బ్రకటించుచున్నదానను గాను. కనుకనే, నాముఖ మున రోషమును గనుపఱుపక యేయున్నాను. అయినను, నన్ననునయించుచు న్నావు. నీవపరాధివైయున్నను, నిన్నుఁ గోపించుటకు శక్యముగాకున్నది." అని, ఇచట- "బహుజ్ఞ" అనునామంత్రణార్థము- [సంబోధనార్థము.] విశేషమునందు [నాయకునికి సంబంధించునదియగు ప్రస్తుతార్థమునందు] పర్యవసింపఁజేయబడి నది. తరువాతనో; దానియర్థమును బర్యాలోచించుటవలన - సమర్థకమగు సామా న్యరూపము - [విశేషమును సమర్థించునదియగు సామాన్యము] ఏది ప్రతీయమా నమగునో; అదియే - (ఇచట) చమత్కారమును గలిగించుచున్నది.

ఆమె- స్వవైదగ్ధ్యముచేత (నాయకసంబంధియగుచాతుర్యముచేత) అనున యింపఁబడుచున్న ఖండితగదా। కనుకనే, వానియెడల నసూయనుజూపుచునిట్లను చున్నది. "సాపరాధుఁడయినను గూడ - బహుజ్ఞుఁడగు (అభిజ్ఞుఁడగు) ప్రతిధూ ర్తుఁడును - (ఇట్లే) స్వాపరాధావకాశము నాచ్ఛాదించును.' అని, నీవు - నీహృద యమునందు - మిథ్యాభిమానమును గ్రహింపకుము" అను సామాన్యము-విశేష ముతో - సంబద్ధము. కనుక, "అన్వితము" అనఁగా, [వాచ్యమగు విశేషముతో, దానికంటె వేరయినదియు, వ్యంగ్యమైనదియునగు సామాన్యము - ] 'సంబంధిం పఁజేయఁబడినది. అనిభావము.

ప్రతిభా :— "జ్ఞాతేఽన్యాసఙ్గవికృతే ఖణ్డితేర్ష్యాకషాయితా" అనునది - ఖండితాలక్షణము.

ఇచట విశేషము - వాచ్యము. సామాన్యము-ప్రధానవ్యంగ్యము. "బహుజ్ఞ" అనుపదమునకుఁ బ్రస్తుతమగునర్థము - అభిజ్ఞుఁడనునది. ఇది - "ప్రియా। నీవు

నన్నపరాధిగాఁ దలచుఁచున్నావు. కానినేనపరాధినిగాను. ప్రభాతరశ్మిజ్యోతివగు నిన్నుఁగాక, వేరొకతెను కన్నెత్తి చూతునా? నీయందుఁగాక, వేరొకతెయందు సంసక్తుఁడనగుదునా? ఏలచిరునవ్వువెన్నెలలు విరియఁజేసి నన్ననుగ్రహింపవు?" మున్నగు అనునయరూపమగు విశేషార్థమున - పర్యవసితమగును. కాఁగా; "ప్రియా! నీవు నన్నపరాధిగాఁదలఁచుచున్నావు," ఇత్యాదిరూపములగు తీపిమాటల బుజ్జగింపునెఱిఁగి, మిక్కిలి తెలివిగలవాఁడవయినన్ను - అపరాధివైనను కోపగించుటకు వీలుగాకున్నది". అనునది-ఇచట- వాచ్యమగు విశేషము. "సాపరాధుఁడయినను, బహుజ్ఞుఁడగు వానిని-కోపగించుట తెవ్వరికిని శక్యముకాదు." అనునిది - వ్యంగ్యసామాన్యము. "సాపరాధులయినను గూడ - మిక్కిలి (అతి) తెలివిగల వారందఱును - ఏవో తీపిమాటలచేత- తమయపరాధావకాశమును-ఇట్టే కప్పిపుచ్చుచుందురు." అని,నీవునీయందుమిథ్యాగౌరవమునుగల్పించుకొనకుము. నీయపరాధములను నేనుగ్రహింపనిదాననుగాను" అను రూపముగల వ్యంగ్యసామాన్యమిచట - వ్యంజనచేత స్ఫురింపఁజేయఁబడును. ఈవ్యంగ్యసామాన్యము - వాచ్యవిశేషముతో నన్వయించును. కాఁగా; ఇదికూడ-వ్యంగ్యమగు సామాన్యము చేత - వాచ్యమగు విశేషమును సమర్థించుటవలన - అర్థాంతరన్యాసధ్వనియే యగును. ఇది - అర్థశక్తిమూలానురణనరూప వ్యంగ్యమగుట- పూర్వోక్తముకంటె దీనియందగు విశేషము.

(133) మూలము :- వ్యతిరేకధ్వనికూడ - (శ్లే) ఉభయరూపమున సంభవమగుచుండును. అందు-ప్రథమమున కుదాహరణమింతకుముందే - ప్రదర్శింపఁబడినది. ద్వితీయమునకు (అర్థశక్తిమూల వ్యతిరేకధ్వనికి) ఉదాహరణ మెట్లనిన :—

ఆ॥ గహనమందె, నేనఘటితపత్రమై, కుబ్జ
మై, యగుకుజమునయి, జనింతుగాఁక!
త్యాగముఖ్యరసుఁడనగు దరిద్రుఁడఁగాను
గాక, మానుషమగు లోకమందు!.

లోచనము :— 'వ్యతిరేకధ్వనికూడ' అనుచోనున్న 'కూడ'శబ్దముచేత- అర్థాంతరన్యాసధ్వనివలెనే, వ్యతిరేకధ్వనికూడ - (శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము. అగుటచేత) ద్విప్రకారమనీ చెప్పుచున్నాఁడు. "ఇంతకుముందే" అనఁగా; "తమమున్" అను నుదాహరణముచేత [వ్యతిరేకాలంకారధ్వని - శబ్ద

శక్తిమూలమగుట] ఇంతకుముందే - ప్రతిపాదింపఁబడినది.'' అనిచెప్పఁబడినది.

ప్రిఖా :— దీని మూలమునకు సంస్కృతచ్ఛాయ - ఇట్లున్నది :—

''జాయేయవనోద్దేశే కుబ్జఏవపాదపో౽ఘటిత పత్రః
మామానుషేలోకే త్యాగైకరసోదరిద్రశ్చ.'' అని.

ఇది - త్యాగమునందే ముఖ్యమగు నాసక్తిగల దరిద్రుని వాక్యము.

అవ :— ఇందలి పదములను వ్యాఖ్యానించుచు, గమ్యార్థములను దెలుపు చున్నాఁడు.

లోచనము :— (''గహనమందె'') వనమునకు సంబంధించిన యేకాంత మగు గహనమునందే-(చొరరాని యరణ్యప్రదేశమునందే) అనఁగా; ఎచ్చట - స్ఫుటతరమగు బహువృక్షసంపత్తిచేత - (ఈకుబ్జపాదపము) నొక్కఁడును, జూడ కుండునో, అటువంటి చొరరాని యరణ్యదేశమునందే. ''కుబ్జమే''- (పొట్టిదగుట వలన) -యూపఘటనాదికమున [స్తంభప్రతిమాదులగు నాకారములను నిర్మించు విషయమున] ఉపయోగింపనిదే;' అనియర్థము. ''అఘటితపత్రమే'' అనఁగా; 'నీడనుగూడ నొసఁగనిది - పూవులు, పండ్లనిచ్చునా !' అనియభిప్రాయము.

ప్రిఖా : గహనమనఁగా ''దుష్టమృగములచేతకలంచఁబడునది.'' అని యర్థము. కనుక. ''అచ్చటికెవ్వరును వెళ్లరు'' అనునర్థమునుగూడ స్వీకరించు నది. కుజమనఁగా; భూమియందు జనించినచెట్టు.

లోచనము :— అటువంటి కుబ్జపాదపముకూడ - ఒకానొకప్పుడు - కట్టెలుకొట్టుకొని జీవించువాని కుపయోగించును. (ఒకప్పుడు) గుడ్లగూబలు నివ సించుటకుఁగూడ నుపయోగించును.

ప్రిఖా :— కనుక, ''నేను - అటువంటి కుబ్జపాదపముగానైన నయి, జనింతునుగాక !'' అని, కోరఁబడినది.

లోచనము : — ''మానుషము'' అనఁగా. సులభార్థిజనము. (సులభులైన యాచకులుగలది.) ''లోకము'' అనఁగా, 'లోకింపఁబడునది - చూడఁబడునది.' అనియర్థము. (కనుక,) త్యాగైక రసుఁడగువాఁడు - అర్థులచేతనెచ్చట లోకింపఁ బడునో, (చూడఁబడునో) వానిచేత, అర్థిజనమెచ్చట లోకింపఁబడునో, (అది -

లోకమని చెప్పఁబడును:) (అయినను) ఏమిచేయుటకును శక్యముగాకుండునో, అది - మహావైశసము. (గొప్పకష్టము)'' అనిభావము.

ఇచట - వాచ్యాలంకారమేదియు లేదు.

(134) మూలము :— మీఁది పద్యమున- త్యాగైకరసుఁడగు దరిద్రుని జన్మమభినందింపఁబడ కుండుటయు, అఘటితపత్రమగు కుబ్జపాదపముయొక్క జన్మమభినందింపఁ బడుటయు, సాక్షాచ్ఛబ్దవాచ్యముగదా!. ఈవాచ్యము - తథావిధమగు (నీడలేనిదియు, ఆకులు, పూవులు, ఫలములు, లేనిదియునగు) పాదపముకంటెను (కుజముకంటెను) గూడ- తాదృశుఁడగు (త్యాగైకరసుఁడయినను దరిద్రుఁడగు) పురుషునకు- ఉపమానోపమేయత్వప్రతీతిపూర్వకమగు శోచ్యతాధిక్యమును - తాత్పర్యముచేత - (వ్యంజనచేత) ప్రకాశింపఁజేయును.

లోచనము :— ''ఉపమానోపమేయత్వప్రతీతి'' అనుదానిచేత - వ్యతిరేకమునకు మార్గపరిశుద్ధి నొనర్చుచున్నాఁడు. ''అధిక్యమును'' అనఁగా నిచట 'వ్యతిరేకమును' అనియర్థము.

ప్రభా :— ఇందు కుబ్జకుజమునకును (మరుగుజ్జుచెట్టునకును) దరిద్రునికిని, ఉపమానోపమేయత్వ (ఔపమ్య) ప్రతీతిపురస్సరముగా- తాదృశవృక్షముకంటె, తాదృశపురుషునికగు నపకర్షముచేతనగు శోచనీయతాధిక్యము - (పూర్వోక్తవస్తుగత) వ్యంజనచేత స్ఫురింపఁజేయఁబడుటవలన, నిది - అర్థశక్తిమూల వ్యతిరేకధ్వనియగుచున్నది.

(135) మూలము :— ఉత్ప్రేక్షాధ్వని కుడా :—

చందనాసక్తభుజగ నిశ్వాసపవన
మూర్ఛితము, మలయాచలోద్భూత, మయిన
మారుతమ్మిది - యీమధుమాసమందు
పాంథసందోహమును మూర్ఛనొందఁజేయు.

ఇచట, వసంతమునందగు మలయమారుతము - మన్మథోన్మాథమును గలిగించుటచేతనే-పథికులకు (విరహులగుబాటసారులకు) మూర్ఛాకారియగుచున్నది. కాని, యిచట, నామలయమారుతము - పథికులకు మూర్ఛనొదవించుట - చందనాసక్త భుజగనిశ్వాసపవనమూర్ఛిత (వర్ధిత) మగుటచేతనయినదిగా, నుత్ప్రేక్షింపఁబడినది. ఇచట నీయుత్ప్రేక్ష - సాక్షాత్తుగా [వలె, మున్నగు నుత్ప్రేక్షావాచక శబ్దముచేత] చెప్పఁబడుటలేదు. అయినను, వాక్యార్థసామర్థ్యముచేత - అనురణనరూపమై (సంలక్ష్యక్రమరూపమై) ప్రతీయమానమగుచున్నది.

లోచనము :— "భుజగ నిశ్వాసపవనమూర్ఛితమగుటచేత నయినదిగా ఉత్ప్రేక్షింపఁబడినది." అనఁగా; (సర్పసంబంధి) విషవాయువుచేత "మూర్ఛితము" అనఁగా, బృంహితము. అనఁగా: ఉపచితము- (వృద్ధినొందింపఁబడినది-) మోహముగలిగించునుగదా! పథికులనడుమ మూర్ఛితుఁడయిన యొకడు- తదితరులకు ధైర్యచ్యుతిని గలిగించి, వారినిఁగూడ- మూర్ఛ నొందించును. కనుక, (ఇచటి) ఉత్ప్రేక్ష - ఉభయవిధములుగానున్నది.

ప్రభా :— (ఇచట వర్ణింపఁబడిన) మలయమారుతము - మలయ పర్వతమునందలి చందనవృక్షములయందు మిక్కిలిసక్తములయిన సర్పముల విషవాయువుచేతఁ దాను మూర్ఛితమయినట్లును, (వృద్ధినొందింపఁబడినట్లును,) తదుపరి వియోగులగు బాటసారులనుగూడ - మూర్ఛనొందించినట్లును, నుత్ప్రేక్షింపఁబడినది. కనుక మలయమారుతము - పథికులను మూర్ఛనొందించుటయందు హేతువుగా నగునుత్ప్రేక్ష - (సంభావన) ఉభయవిధములుగా నగుచున్నది.

లోచనము : ప్రశ్న :— అయ్యా! ఇచ్చట - విశేషణము-("చందనాసక్త" అనువిశేషణము) అధికమగుచున్న హేతువుగానే (హేతుగర్భముగానే) కాన్పించును. అది సంగతమగునా ?.

ఉ :— ఏలకాదు ? (హేతుగర్భత్వ మున్నను సంగతమేయగును.) ఇచట నీవిశేషణమునకు - పరమార్థమున - హేతుత్వములేదుగదా!.

ప్రభా :— "చందనాసక్త.... మూర్ఛిత'మను విశేషణమునకు - పథికమూర్ఛాకారిత్వమున, వస్తుతః, హేతుత్వములేదు." అనియర్థము.

లోచ : అవ :— అయిననుగూడ - (రెండింటికినిగూడ) హేతుత్వము త్ప్రేక్షింపఁబడును. కనుకనిదియొక ప్రశ్నా విషయముకాదు.

ప్రభా :— ''మలయమారుతము - విరహులగు పథికులను మూర్ఛనొందించుటయందు - విషవాయువుచేత వృద్ధినొందింపఁబడుట, మోహావస్థనొందింపఁబడుట, అనురెండును హేతువులుగా నుత్ప్రేక్షింపఁబడును. కనుక, నింద ప్రశ్నావకాశము లేదు.'' అనియర్థము.

**(136)** మూలము : ప్రశ్న :— "ఏవంవిధమగువిషయమున (చందనాసక్త ఇత్యాదిస్థలమున,వలెమున్నగు(ఉత్ప్రేక్షావాచక) శబ్ద ప్రయోగములేనిదే, ఉత్ప్రేక్ష- అసంబద్ధమేయగును".(వాక్యప్రతిపాద్యముకానిదియేయగును.) అనుటకు వీలులేదా ? యేమి ?

ఉ : - (ఇచట - ఉత్ప్రేక్షసిద్ధింపదనుటకు వీలులేదు.) గమకత్వమువలన (ప్రమాణమువలన) అనఁగా; దీనికంటె నితరములగు స్థలములయందుఁగూడ-తత్ ప్రయోగము - (వలె ఇత్యాది శబ్దప్రయోగము) లేకున్నను, ఉత్ప్రేక్షారూపమగు - సర్థజ్ఞానము - కాన్పించుటవలన, ఇచట - ఉత్ప్రేక్ష - అసంబద్ధమనుటకు (వాక్య ప్రతిపాద్యము కాదనుటకు) వీలులేదు.

లోచనము :— ''తత్ ప్రయోగములేకున్నను...వలన'' అనఁగా; 'వలె' మున్నగు ఉత్ప్రేక్షావాచక శబ్దప్రయోగము లేకున్ననుగూడ - ఉత్ప్రేక్షారూపమగు నాయర్థము - తెలియఁబడుటవలన, (ఉత్ప్రేక్షకు - అసంబద్ధతలేదు.) అని యర్థము.

అవ :— దీనినే, (వలె, మున్నగు, ఉత్ప్రేక్షావాచక శబ్దప్రయోగములేకయే - ఉత్ప్రేక్షసిద్ధించుటనే) ఉదాహరించుచున్నాఁడు.

**(137)** మూలము :— దీనికుదా :-

గీ॥ శ్యామ! నీమోముతో, - నిజేర్ష్యాకషాయి
తమ్ముతో, నైన, నిపుడు సామ్యమ్ముఁనొంది

యేమొ, యిముడఁకెయున్నవాఁడిదిగో! చూడు!
స్వాంగమున యందు పున్నమ చందమామ!

లోచనము :— 'నిజేర్ష్యాకషాయితమ్మతోనైనన్' "ఈర్ష్యచేత - కలుష మైయున్నదానితోనయినను" అనఁగా: (పొలయలుకచేత) "ఇంచుక యరుణమగు ఛాయగలదానితో నయినను," అనియర్థము. (ఇప్పుడు - ఒకసారిమాత్రమే) ఇచట "కషాయితమ్మతోనైనను" అనఁచోనున్న అపిశబ్దమునందలి ('ఐనను' అను నపిశబ్దార్థమునందలి) యభిప్రాయమిది. (చందమామ-) ప్రసన్నమగు నీముఖముతోడి సాదృశ్యమునుద్వహించినయెడల నప్పుడేమిచేయునో, [చెప్పఁ జాలను.] ["ఇప్పుడు" అనుదానిచేత గమ్యమిది :-] 'ఎల్లప్పుడును నీమొగము తోడి సామ్యము నొందునెడల నప్పుడేమిచేయునో (చెప్పఁజాలను.) ఈ పున్నపు చందమామ - ప్రసన్నమగు నీముఖమగును' అనునిది మాత్రము - మనోరథము లకుఁగూడ మార్గముకాదు" అనునది.

స్వాంగమునయందున్ = స్వదేహమునందు, ఇముడకెయున్నవాఁడు = పదిదిక్కులను (కాంతులచేత) పూరించుచుండుటవలన- ఇముడకయేయున్నాఁడు. "ఇపుడు" అనఁగా, ఇంతకాలమున కొక్కదినమునందు మాత్రమే - (ఎట్లో ఈసుచేత నెఱుపెక్కిన) నీముఖముతోడి సామ్యమునొందెను." అనియర్థము. ఇచట [మీఁది పద్యమునందు] పున్నమచందమామ-దిశలను(కాంతులచేత) నిండించుట - స్వరససిద్ధమేయగుచున్నను నిట్లుత్ప్రేక్షింపఁబడినది.

అవ : పూర్వ :— "అయ్యా! [మీఁది పద్యమునందు] వితర్కసంభావన నుదెలుపునదియగు "ఏమొ" అనుదానిచేత - అసంబద్ధత (ఉత్ప్రేక్ష - కుదుర కుండుట) నిరాకరింపఁబడినదిగదా!" అని సంభావించి, వేరొకయుదాహరణము నొసఁగుచున్నాఁడు.

ప్రభా : — "మీఁది పద్యమున "ఏమొ" అనుపదము - వితర్కమును సంభావించుచుండుటవలన, నిచటి యుత్ప్రేక్ష- వాచ్యమేయగును. గాని, వ్యంగ్య మెట్లగును ? కాఁగా; వాచకశబ్దములేనియెడల ఉత్ప్రేక్ష - సంబద్ధముకాదు." అను నరుచిని మనస్సునందుంచుకొని వృత్తికర్త, ఉత్ప్రేక్షావాచక శబ్దములేని వేరొక యుదాహరణము నొసఁగుచున్నాడు.

(138) మూలము :— వేరొకయుదా :-

మ. హరిణమ్మొండు-భయాకులమ్మగుచు, సేనావాసమం దంతటన్
బరిధావించె, ధనుర్ధరుల్ పురుషులెవ్వారేని వెన్నంటియే
గరుతన్నైనను, నిల్వదయ్యె, లలనాకర్ణాభిపూర్ణ ప్రిభా
స్థిర, నేత్రాశుగనిర్హతాత్మనయన శ్రీయౌచుఁదానెచ్చటన్.

ప్రభా :— ఇది - శిశుపాలవధమున (మాఘకావ్యమున) పంచమసర్గము నందలి శ్లోకమున కాంధ్రీకృతిరూపము. దీనిమూలమిట్లున్నది.

త్రాసాకులః పరిపతన్ పరితోనికేతాన్
పుమ్భిర్న కైశ్చిదపి ధన్విభిరన్వబన్ధి।
తస్థౌతథాఽపిన మృగః క్వచిదఙ్గనాభి
రాకర్ణపూర్ణనయనేషుహతేక్షణశ్రీః.

"ఒకలేడి - భయముచేత బిత్తరపడి. అచ్చటి సేనాశిబిరమునందంతటను బరుగెత్తుచుండెను. చాపహస్తులగువీరపురుషులెవరైననుదన్ను వెంబడింపకున్నను. ఆమృగము - శిబిరములందున్న యంతఃపురస్త్రీలచేత - కర్ణాంతమువఱకును నాకర్షింపఁబడినవియు, (వ్యాపించినవియు,) స్థిరములగు కాంతులుగలవియు, నగు వారల నేత్రములను బాణములచేత - (తనకుప్రాణప్రదమగు) తననయన సౌందర్యము - నిర్హతమగుట (చెదరఁగొట్టఁబడుట) వలన, నొక్కచోటనైనను నిలువకుండెను." అనునది - దీనియర్థము.

లోచనము :— నికేతనములందంతటను, పరువెత్తునదియగు నీలేడి-చాప పాణులగు వారిచేత నెవ్వరిచేతనుగూడ ననుసరింపఁ (వెంటఁదగులఁ) బడుచున్నది కాదు. అయినను, దీనికిస్వాభావికమగు త్రాసచపలతా యోగముచేతనే-ఎచ్చటను గూడ - నిలువకుండెను.

ప్రభా :— ఈలేడి - ఎచ్చటను నిలువకుండుటకు నిజమగు హేతువు - 'భయముచేతనగు చపలతయే' అని తెలియునది.

లోచనము :— "లలనలచేత - ఆకర్ణపూర్ణములగు నేత్రములను బాణములచేత హతమయినదియు, సర్వస్వభూతమయినదియు, నగు నీక్షణశ్రీ-(ఈక్షణ శోభ -) దేనికి, దేనివలననో; దానివలన - (అనఁగా: ఈలేడికిసంబంధించినప్రాణ

తుల్యమగు నీక్షణసౌందర్యము - అవరోధకాంతలచేతఁ దమకుసంబంధించిన నేత్రములనుశరములచేత-కొట్టఁబడుటవలన)ఆమృగ మెచ్చటనుగూడనిలువకుండెను.'' అని,యిచటను త్ప్రేక్ష-ధ్వనింపఁజేయఁబడుచున్నది.

ప్రభా :— ''కాఁగా, ఇచట - 'వలె'మున్నగు నుత్ప్రేక్షావాచకములేకున్నను గూడ - లలనలచేత - తమకర్ణాంతముల వఱకును నాకర్షింపఁబడిన నేత్రములను బాణములచేత - చెదరఁగొట్టఁబడిన నిజనయన సౌందర్యముగలదివలె, ఈలేడి-ఎచ్చటనునిలువక యే పరిభావింపఁజొచ్చెను.'' అను, హేతూత్ప్రేక్ష - ధ్వనింపఁ జేయఁబడినది. ''ఇట్లే వలె, మున్నగుశబ్దములేకున్నను''చందనాసక్త''అనుచోటఁ గూడ - ఉత్ప్రేక్ష - వ్యంజితముకావచ్చును.'' అనిభావము.

లోచనము :— ''అయ్యా! ఇదికూడ (పూర్వోక్తమగు నుదాహరణము కూడ) అసంబద్ధమగుఁగాక! (ఉత్ప్రేక్షారూపమగునర్థమును బోధింపకుండునదియే యగుఁగాక!] అనియాశంకించి, [అని పూర్వపక్షియనవచ్చునని, వృత్తికర్త-ఆశంకించి] చెప్పుచున్నాఁడు.

(139) మూలము :— శబ్దార్థవ్యవహారమునందుమాత్రము ప్రసిద్ధియే ప్రమాణము.

ప్రభా :— ''ఈశబ్దమునకిట్లర్థము'' అనువ్యవహారమున, 'ప్రసిద్ధియే' అనఁగా; జ్ఞాతలకొదవునదియగు ప్రతీతియే-ప్రమాణము. కాఁగా; ''మీఁదిస్థలములయందు, 'వలె' మున్నగు ఉత్ప్రేక్షావాచకము లేకున్ననుగూడ - ఉత్ప్రేక్షారూపమగు నర్థము - సహృదయానుభవసిద్ధమగుటవలన - 'ఇవాదిశబ్దప్రయోగములేనియెడల నుత్ప్రేక్ష-సంబద్ధముకాదు' అనిచెప్పుటకు వీలులేదు. కనుకనిది యుత్ప్రేక్షాధ్వనియేయగును.'' అనునది - ఫలితార్థము.

అవ :— ఇట్లుత్ప్రేక్షాధ్వనినుదాహరించి, శ్లేషధ్వని నుదాహరించుచున్నాఁడు.

(140) మూలము :— [మాఘుఁడు ద్వారకానగరమును వర్ణించుచున్నాఁడు.]

ఉ. ద్వారక రమ్యతోటను, బతాకలఁబొందినవై, వివిక్తతా
కారణయుక్తి - రాగమధికమ్మొనరించి, నమద్ వలీకలై,

కూరిమిఁగూర్చుచుంట-యువకుల్-వలభీస్థలులన్, నిజాంగనా
వారముతోసమమ్ముగ, శుభప్రకృతిన్ భజియింతు రెంతయున్.

[ఇచట-"పతాకలఁగైకొనుచున్" అనుపాఠాంతరముసుగూడ స్వీకరించునది.] ఇచ్చట, "నిజాంగనాసముదాయముతోఁగూడ-వలభీస్థలులను(భజింతురు.)"అనువాక్యార్థప్రతీతికలిగినతరువాత 'నిజాంగనలవలె(ఉన్న)వలభీస్థలులను(భజింతురు)"అనుశ్లేషప్రతీతి-శబ్దము లేకున్ననుగూడ-అర్థసామర్థ్యముచేత ముఖ్యముగా(ప్ర)వర్తించును.

పరీక్షా :— ఈయాంధ్రీకృతికి మూలమగుశ్లోకము - మాఘకావ్యమున 3వ సర్గమున నిట్లున్నది.

"రమ్యాఇతి ప్రాప్తవతీఃపతాకా। రాగం వివిక్తాఇతివర్ధయన్తీః।
యస్యామసేవన్తనమద్వలీకాః। సమం వధూభిర్వలభీర్యువానః."

లోచనము :— (ద్వారకానగరమునందు) "రమ్యములు" అను హేతువు వలన పతాకలఁగైకొనుచున్, (పొందినవై) ధ్వజపటములను బొందినవియయి; వివిక్తతాకారణయుక్తిన్ = జనసంకులత లేకుండుటవలన, రాగమధికమ్మొనరించి = సంభోగాభిలాషను వృద్ధినొందించి, ఇంకొకరిచట - 'చిత్రశోభను వృద్ధినొందించి.' అనియర్థమును జెప్పుచున్నారు. నమద్వలీకలై - నమ్రములగు ఛది పర్యంతభాగములు (నీధ్రములు-చూరుకొణిగెలు) గలవియై,

ప్రభా :— కూరిమిఁగూర్చుచుంటన్ = కూరిమికూడునట్లుచేయుటవలన, వలభీస్థలులన్ = చంద్రశాలలను, యువకులు - నిజాంగనా వారముతో సమంబుగన్ = తమ యంగనలతోఁగూడ, శుభప్రకృతిన్ = మంగళ స్వభావముచేత, ఎంతయున్ భజింతురు = మిక్కిలియు సేవింతురు. (ఆశ్రయింతురు.) అనునిది-మొదటిదగు వాచ్యార్థము. తరువాత, వ్యంజనచేత - ద్వితీయార్థమిట్లు స్ఫురింపఁ జేయఁబడును.

లోచనము :— "(ద్వారకానగరమునందు) రమ్యలౌటను = రమ్యాకారలగుటవలన, పతాకలన్ = ప్రసిద్ధులను, గైకొనుచున్ = పొందినవారలయి, వివిక్తతాకారణయుక్తిన్ = విభక్తాంగులగు లటభలు (సుందరులు) అగుటవలన, రాగమధికమ్మొనరించి = అనురాగమును వృద్ధినొందించి, నమద్వలీకలై = నమ్రములగుచున్న త్రివళులు (మధ్యమరేఖలు) గలవారలై, కూరిమిఁగూర్చు

యుండుటవలన, నిజాంగనావారముతో సమంబుగన్ = అట్టినిజకాంతలతోఁగూడ - (అట్టివలభులను యువకులాశ్రయింతురు.) అనియర్థము. [వ్యంగ్యమగు ద్వితీయార్థము.]

పూర్వ :— ఇచ్చట "సమంబుగన్" అనుచోనున్న సమశబ్దమువలన 'తుల్యముగా' అను నర్థముకూడ - ప్రతీతమగుటలేదా ?

ఉత్తరము :— మీరన్నది సత్యమే. 'తుల్యముగా' అనునీయర్థముకూడ- శ్లేషబలమువలన లభించును. కాని, యీశ్లేషము - ("తుల్యముగ" అనురెండవ యర్థము) - అభిధావృత్తివలన నాక్షేపింపఁబడునదికాదు(ప్రతిపాదింపఁజేయఁబడునది.) కాదు. ఇంకేమనిన. అర్థసౌందర్యబలమువలననే - (వ్యంజనవలననే) స్ఫురింపఁజేయఁబడును. కనుక నిచటిశ్లేషము-సర్వవిధములచేతను-ధ్వన్యమానమే యగును.

ప్రభా :— ఇందు - 'పతాకలఁబొందినవై' 'సముద్వలికలై', అను పదములు - వలభీస్థలులను పదమునకు సమానములగు (వచన, విశేషణ) విభక్తులను గలిగియుండుటవలన, నిచటియభిధ - వీనిని - వలభీస్థలులతోడనే- యన్వయింపఁజేయుచు, తద్వాచ్యార్థబోధనమునందే - తాను నియమింపఁబడుటవలన - ఇచటి శ్లేషరూపమగు ద్వితీయార్థము-తదర్థసౌందర్యబలము (వ్యంజన)వలననే స్ఫురింపఁజేయఁబడును. కనుకనిది - ధ్వనింపఁజేయఁబడునదియేయగును. (వచన విశేషణాదిసామ్యము లేకుండుటవలన, ద్వితీయార్థము - వాచ్యముకాదు.)

లోచనము :— ఇచట శ్లేషమే - (ప్రధానవ్యంగ్యమగుటవలన)మూలమైయున్నది. కనుకనే; 'నిజాంగనలనువలె వలభులను (సేవింతురు)' అని విశదీకరించినను, వృత్తికర్తచేత నిది - ఉపమాధ్వనియని చెప్పఁబడుటలేదు. ("సమమ్ముగన్" అనుటకుఁబదులు) "సమానలన్" అని(తుల్యార్థము) స్పష్టపడినయెడలనో; అప్పుడుపమయే స్పష్టమగును, కనుక, నాయుపమచేత- శ్లేషమాక్షిప్తము కావలసివచ్చును. "సమమ్ముగన్" అనునది - నిపాతము. అది- క్రియావిశేషణమగుటచేత ("సమమ్ముగభజింతురు" అనుచోట "భజింతురు" అనుక్రియకు విశేషణమగుటచేత) మిక్కిలి వడిగ శ్రోతలకు వినఁబడినతోడనే, సహార్థమును-(కూడ, అనునర్థమాత్రమునే) బోధించును. ('సమానలన్' అనునర్థమును బోధింపదు. ఏలయనిన; 'వలభులను సేవింతురు' అనునర్థమేయిచట ప్రకృతముగదా) తదుపరి "సమమ్ముగన్" అనునీపదము-వ్యంజకస్వబలముచేతనే (వ్యంజనాబలముచేతనే) శబ్దశ్లేషతనుబొందును.("తుల్యలుగ" అను వ్యంగ్యార్థమును బోధించును.)(సమ

మ్మగన్ అనుపదమునకు) "తుల్యముగన్" అనునర్థమును జెప్పనియెడల, అభి ధకు అపరితుష్టతయేదియు లేదుగదా!

ప్రభా :— "యువకులు - అంగనావారముతో సముమ్మగన్' అను దానికి "యువకులు - అంగనాసముదాయముతోఁగూడ - (తాదృశములగు వల భులను సేవింతురు)" అనునర్థముమాత్రమే అభిధచేత బోధింపఁబడును. ఈయర్థ మును బోధించి, అభిధ - పరితుష్టినొందును. కనుక నభిధకు - 'నేనింకొక యర్థ మునుగూడ బోధింపకుంటినే' అను నపరితుష్టియేదియునులేదు. కాఁగా "తుల్య ముగన్" అనునర్థమునుగూడఁ జెప్పనియెడల, నిచటియభిధకు పరితుష్టికలుగదా యేమి ? అని లోచనభావము.

లోచనము : కనుకనే, అభిధ - (ఇంతటితో) సమాప్తము కాఁగా; (వాచ్యార్థమును దెలిసిన పిమ్మట) ఆద్వితీయార్థమును (వ్యంగ్యమును) సహృద యులు - వేరొక యత్నములేకయే తెలిసికొందురు.

"శబ్దమర్థము శాసించు జ్ఞానమెట్టిఁగి
నంతమాత్రమ్ముచేతనె యదిగ్రహింపఁబడదు"

ఇత్యాదిగా నీయభిప్రాయమింతకుముందే తెలుపఁబడినదిగదా!, ఈయభి ప్రాయముకూడ - సర్వోదాహరణములందును ననుసర్తవ్యము.

ప్రభా : అవ :— ప్రసంగవశమున నింతకుముందు తెలిపిన యభిప్రా యమునే - తిరుగఁజెప్పుచున్నాఁడు.

లోచనము :— "దేవదత్తుఁడు బలిసినవాఁడు. పగలుభుజింపఁడు." అను చోట, "అభిధ - అపర్యవసితమే (ముగియని యాకాంక్షగలదియే) కనుక, నదియే - స్వార్థనిర్వాహముకొఱకు - వేరొకయర్థమును (రాత్రి భోజనరూపార్థ మును) ఆకర్షించును." అను తార్కికుని అనుమానమునకుఁగాని. "అభిధయే ఇచట స్వార్థనిర్వాహముకొఱకు - వేరొకశబ్దమును [రాత్రియందు భుజించును. అనుదానిని] ఆకర్షించును." అను మీమాంసకుని శ్రుతార్థపత్తికిఁగాని, ధ్వని ప్రసంగములేదు." అని తెలియునది. ఇఁకఁజాలును. ఈవిషయమే-"శబ్దములేకు న్నను" అని చెప్పఁబడినది.

ప్రభా :— తార్కికమతమునందలి యనుమితికిఁగాని మీమాంసకమతము

నందలి శ్రుతార్థపత్తికిఁగాని, యాశ్లేషాదిధ్వని - గోచరించునదికాదు'' ఇది - అశబ్దముగనే వర్తించును. (స్ఫురించును.) అనిభావము.

(141) మూలము : — యథాసంఖ్యాలంకార ధ్వనికుదా :- "ఆమని" అను జాతీయపద్యము. ప్రభామతి ప్రిసారితము.

దీనికి-ప్రథమపాదమున 28 మాత్రలును, ద్వితీయపాదమున 23 మాత్రలును నుండును. తృతీయచతుర్థములు క్రమముగా ప్రథమ ద్వితీయముల ననుసరించును. ప్రతిపాదమునను పదునాల్గుమాత్రల మీఁద వడియుండును. ద్వితీయ, చతుర్థ పాదములచివరను- ఐదేసి మాత్రలకాల మాగినయెడల, మిశ్రగతికి (చాపుతాళమునకు) సరిపడును.

తీయమామిడిగున్న- మొలకెత్తెను- చిగిర్చెను,మొగ్గఁదొడిగెను,
సోయగము విరియంగఁబూచెను శుభవసంతమునన్;
తీయనగు మదనుండు మొలకెత్తెను,జిగిర్చెను, మొగ్గఁదొడిగెను,
హాయిగాఁబూచెను ప్రియాప్రియసుల హృదయమునన్.

ప్రభా :— క్రొత్తగా సంఘటింపఁబడిన, యీయామనికి (వసంతమునకు) మూలమగు సంస్కృతశ్లోకమిట్లున్నది :—

అఙ్కురితః, పల్లవితః, కోరకితః, పుష్పితశ్చసహకారః।
అఙ్కురితః, పల్లవితః, కోరకితః, పుష్పితశ్చహృదిమదనః అని.

తీయమామిడి - మొలకెత్తెను, చిగిర్చెను, మొగ్గఁదొడిగెను, పూచెను. మదనుఁడు-(కోరిక-) కొంచెముపుట్టెను.ఇంచుక పెరిగెను. రూపుఁగొనెదు,ఏపుఁగనెను. అనునది - యిందలి ప్రథమార్థము.

(142) మూలము :— ఇచ్చట యథోద్దేశముగ (ఉద్దేశ క్రమమునతిక్రమింపక] అనూద్దేశమునొనర్చునపుడు, (దానివెనుక ఉద్దేశము ననుసరించునదియగు క్రమముచేతనే యుచ్చారణము

నొనర్చునపుడు) మదనవిశేషణభూతము గు "మొలకెత్తెను" ఇత్యాది శబ్దగతమును, అనురణనరూపమును, (సంలక్ష్యక్రమవ్యంగ్యమును) అగు నేసౌందర్యము- (సౌందర్యకారియు యథాసంఖ్యాత్మకమును, నగు నేవ్యంగ్యము) వ్యంజితమో, అది-[సౌందర్యకారియు, యథా సంఖ్యాత్మకమును నగు నావ్యంగ్యము-] మదన సహకారములకు (కామమునకును, దీయమామిడిగున్నకును) సంబంధించునదియగు, తుల్యయోగితా-సముచ్చయ లక్షణమగు వాచ్యముకంటె, అతిధిచ్యమానమగునట్లు (ఉత్కృష్టమగునట్లు) ధ్వనింపఁ జేయఁబడుచున్నది గదా! ఇట్లే, తదితరములగు నలంకారములుకూడ - యథాయోగముగ ('ఒకచోటవస్తువు వ్యంజకమగుట, ఇంకొకచోటనలంకారము-వ్యంజకమగుట' ఇత్యాద్యుపాయములనుగాని, ఔచిత్యమునుగాని, యుక్తినిగాని, యతిక్రమింపక) ధ్వనింపఁజేయఁబడుటను- (సహృదయులగు పాఠకులే) యోజించుకొనునది.

ప్రభా :— "ఇచ్చట - వసంతవర్ణనమునందు - ప్రస్తుతములును. కార్యకారణాత్మకములును, నగు మదనసహకారములకు - (కోరికకు, తీయమామిడి గున్నకు) "మొలకెత్తెను" ఇత్యాది ధర్మైక్యమువలన- తుల్యయోగితయు, వసంతము, కామము, అనునుభయములకును - ఒకేకాలమున మొలకెత్తుట, చిగురించుట, మున్నగునవి-కలిగినట్లు (యౌగపద్యమున) వర్ణించుటవలన సముచ్చయమును, వాచ్యమగుచున్నది కనుక నిచటివాచ్యము- తుల్యయోగితా, సముచ్చయ లక్షణమని వృత్తియందుఁ దెలుపఁబడినది. ఈవాచ్యార్థబోధము కలిగినపిమ్మట - తీయమామిడిగున్న-యేక్రమమున మొలకెత్తి, చిగిరించి, మొగ్గఁదొడిగి, పూచెనో, ఆక్రమముచేతనే, కామముకూడ - మొలకెత్తి, చిగిరించి, మొగ్గఁదొడిగిపూచెను, అనుపర్యాలోచనముకలుగును. అప్పుడు - "ఉద్దేశింపఁబడిన యర్థములను (క్రమముగాఁ దెలుపఁబడిన పదార్థములను) ఆక్రమముచేతనే అనునిర్దేశించుట- యథాసంఖ్యము" అను లక్షణముగల యథాసంఖ్యాలంకారము -వ్యంజనావ్యాపారమున ధ్వనింపఁజేయఁబడును. కాఁగా; ఇచట ప్రధానవ్యంగ్యము- యథాసంఖ్యాలంకార రూపమగుచున్నది. కనుకనిది - తుల్యయోగితా సముచ్చయ లక్షణమగువాచ్యము నతిక్రమించిన సౌందర్యమునుగలిగి, యిచట యథాసంఖ్యాలంకారధ్వని యగుచున్నది" అని తెలియునది.

లోచనము :— ఇట్లే,- అర్థాలంకారము లన్నియుఁగూడ ధ్వనింపఁజేయఁ బడుట - కాన్పించుచున్నది. అదెట్లనిన; దీపక ధ్వనికుదా : -

తే॥ పవనమైన, ననలమైనఁ, బరశువయిన,
శక్రికరవిసృతము, వజ్రమ్మయినను,
వలదునిను; లతతోడనోపాదపమ్మ!
అన్నివేళల స్వస్తి నీకగునుగాక !.

అను నిచట, (గాలి, అగ్ని, మున్నగు నదేదియుఁగూడ నిన్ను) "బాధించు నది కాకుండుఁగాక !" అనిపవనాదులతో నన్వయించు ధర్మముగల గోప్యమాన మగు దీపకమువలననే- ఈ పద్యార్థమును పచించినవక్తకు (ఇచట సంబోధింపఁ బడిన లతాసహితమగు నొకానొక సాధువృక్షము) నిరతిశయ ప్రేమాస్పదమను - నర్థము-(వ్యంజనచేత) తెలియఁజేయఁబడుచున్నది. కనుకదీపకమువలననేయిచట- సౌందర్యనిష్పత్తి యగుచున్నది, [కనుక నిది - ధ్వన్యుదాహరణమగుచున్నది.]

ప్రిభా : — "గాలి - నిన్ను తూలింపకుండుఁగాక! అగ్ని - నిన్ను దహింప కుండుఁగాక! గొడ్డలిభేదింపకుండుఁగాక! (మదపుటేనుగు పడఁగొట్టకుండుఁగాక!) ఇంద్రివజ్రము - నిన్ను భేదింపకుండుఁగాక!" అను నధ్యాహారముచేత - ఇచట వాచ్యార్థము-నిష్పన్నమని తెలియునది. "వలదు('లేదు')" అనుదానిచేతవ్యంజిత మైనదియు, గాలి మున్నగువానితో నన్వయించునదియు,నగు "బాధింపకుండుఁ గాక !" అనువ్యంగ్య ధర్మముగల దీపకము వలననే - ఇచట సౌందర్యము స్ఫురింపఁజేయఁబడుచున్నది. అభిమాన యుక్తుఁడగు వక్త - అత్యంత ప్రేమ కాస్పదమగు వస్తువున కనిష్టమును వాచ్యముగాఁదెలుపుట కిచ్చగింపఁడు. కనుక, 'నిన్ను గాలి తూలింపకుండుఁగాక!' ఇత్యాదిగా వృక్షమున కొదవవచ్చునని సంభావింపఁదగిన యనిష్టము-ఇచటఁ ఆశీః[ప్రార్థనమునకైననుగూడఁ జెప్పఁబడు నెడల, "ఈవక్తకు - లతారమణితోఁగూడిన వృక్షరాజు - నిరతిశయ ప్రేమాస్ప దుఁడు" అను సుందరమగు నర్థము స్ఫురింపఁజేయఁబడదుగదా !

లోచనము : — అప్రస్తుతప్రశంసాధ్వని భేదమునకుదా :—

తే॥ ముండ్లతోఁగూడి యుండిన మొగలితోట
లను వెదకు నీవుచావంగలవు భ్రమరమ !

తిరిగి తిరిగియు నవమాలతీ ప్రసూన
సదృశమగు పుష్పమును బొందఁజాలవుసుమ !.

ప్రియతమునితోఁగూడి, యుద్యానమున విహరించుచున్న యొ కా నో క నాయిక - (మొగలితోట కభిముఖముగాఁ దిరుగుచున్న) భ్రమరముతోనిట్లను చున్నది. కనుక, (ఇచట) భృంగవృత్తాంత మభిధేయమగునపుడు- ప్రస్తుతమే యగును.

ప్రభా :— "ఇచట నభిధచేతఁ దెలుపఁబడునదియగు భృంగవృత్తాంతము- అభిధేయ మగుచుండునపుడు - ప్రస్తుతమేమగును. కాని అప్రస్తుతముకాదు. అనఁగా; దీనిచేత - ప్రస్తుతమగు వేరొక యర్థము ధ్వనింపఁజేయఁబడు నంతవఱ కును, నభిధేయమగు భృంగ వృత్తాంతము - ప్రస్తుతమేయగును. దీనిచేత ప్రస్తుత మగు వేరొకయర్థము - ధ్వనింపఁజేయఁబడునపుడు - అప్రస్తుతమగును.'' అను గూఢార్థమిచట లోచనోక్తమని తెలియునది.

లోచనము :— ప్రశ్న :— అయ్యా! [ఇచట సంబోధింపఁబడవలసినది కానిదగు] భ్రమరము సంబోధింపఁబడినది. కనుక, దీనిచేత-భృంగవృత్తాంతమిచట- అప్రస్తుతమని తెలియఁజేయఁబడుటలేదా ?

ఉత్తరము :— ఆమంత్రణముచేత - భృంగవృత్తాంతమిచట నప్రస్తుత మని తెలియఁజేయఁబడుటలేదు. మీదుమిక్కిలి ఈయామంత్రణము - ''ఈనా యికకుఁగల ముగ్ధభావముచేతవిజృంభితము. అనగా, మౌగ్ధ్య హేతుకము. (క్రొత్త వయస్సును, కొంగ్రొత్తకోరికయుఁగలిగిన యమాయిక స్వభావముచేత విజృంభిం పఁజేయఁబడినది.] అని తెలియఁజేయఁబడుచున్నది. కాఁగా భృంగవృత్తాంత మిచట-అప్రస్తుతముకాదు. కనుకనే, ఇచట- (ప్రస్తుతమగు భృంగవృత్తాంతమే - అభిధచేత -సమాప్తి నొందింపఁబడినదికాని) అప్రస్తుత ప్రశంస [తక్కినయప్ర స్తుత ప్రశంసాస్థలములయందువలె] అభి ధచేత - సమాప్తినొందింపఁబడవలసినది కానిదయినది ['సమాప్తినొందింపఁబడుటలేదు'అనిభావము.]

ప్రభా : ... ఇచట, భ్రమరవృత్తాంతము - ప్రస్తుతము కానియెడల ప్రస్తు తమగు ప్రియతమోపాలంభరూపమగు నర్థమునందే [కులవధూకర్తృకమగు ప్రియ తమోపాలంభమునందే-అనఁగా; వ్యంగ్యమగు. ఎత్తిపొడుపునందే] ఏతత్పద్యవా క్యమునకు విశ్రాంతి కలుగవలసియుండును. కాని, ప్రకృతమున, ప్రియతమోపా లంభరూపమగు వ్యంగ్యార్థమునకువలె, భృంగవృత్తాంతమునకుఁ గూడ - ప్రకృత

త్వము సంభవించుచున్నది. ఇట్లు భృంగవృత్తాంతమునకుఁగూడ - ప్రకృతిత్వము సంభవించుటవలననే - ముఖ్యమగునట్లు వివక్షితము కావలసియుండిన ప్రియతమోపాలంభరూపమగు నర్థము - అభిధచేత - సమాప్తినొందింపఁబడఁదగినది కాకపోయినది. కాఁగా; "అభిధేయమగు నవస్థయందు - ఇచటి, భృంగవృత్తాంతము - ప్రస్తుతమేయగును." అనునది - ఫలితార్థము.

అవ :— "అట్లయిన నీభృంగవృత్తాంతమెప్పుడు- అప్రస్తుతమగును?" అనియాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— అభిధ - (భృంగవృత్తాంతమునెఱిఁగించి) సమాప్తినొందిన తర్వాతనో; (అప్పుడా ?) అప్పుడు వాచ్యార్థ (సామ్య) బలమువలన "సౌభాగ్యాభిమానపూర్ణయు, సుకుమార పరిమళమాలతీకుసుమ సదృశియు-నగుముగ్ధకుల వధువు - (ప్రియతమవిషయకమగు) ప్రేమపరతచేత "కృతకమగు వైదగ్ధ్యముచేత లభించిన ప్రసిద్ధ్యతిశయముగలవియు, శంభళీ (కుట్టనీ) కంటకములచేత వ్యాపింపఁబడినవియు, (మిగుల) దూరమునుండి మాత్రమే వ్యాపించు సౌరభము గల మొగలితోటలవంటివియు, నగు వేశ్యాకులములయందిచ్చటనునచ్చటను చంచూర్యమాణుఁడగు (తత్సంభోగముకొఱకుభ్రమరమునవలె మాటిమాటికిని దిరుగువాఁడగు) ప్రియతము నుద్దేశించి యుల్లొత్తిపొడుచుచున్నది" అని యన్యాపదేశత - [ప్రియతమోపాలంభరూపమగు వ్యంగ్యార్థము -] ధ్వనింపఁజేయఁబడును.

ప్రభా :— మీఁది లోచనమున, గూఢముగా నున్న ఫలితార్థము నిట్లెఱుఁగునది. ఒకనాయిక - ప్రియతమునితోఁగూడి, యుద్యానమున విహరించుచు, మొగలిడొంకచెంత కరుగుచున్న తుమ్మెదనుజూచి, యిట్లనుచున్నది. కనుక, నిచటి భృంగవృత్తాంతము - ప్రస్తుతమగుచున్నది మఱియు, నిచట మానవవ్యక్తి కాని భ్రమరమును-(తిర్యగ్జాతీయమును) ఈనాయిక-"భ్రమరమా!"అని(శిశువు వలె)పిలుచుటచేత-ఈపిలుపు-ఈనాయికను-మిక్కిలిముద్దరాలుగా తోపింపఁజేయుచున్నది. కనుక, నిచట నభిధేయమగునపుడు-భృంగవృత్తాంతము-ప్రస్తుతమేయగును కనుకనే, యిచట నభిధచేత-ఈప్రస్తుతమే-తెలుపఁబడినది. కాని, వాచ్యములగు నప్రస్తుత ప్రశంసాలంకార స్థలములయందువలె, అప్రస్తుతము - ప్రశంసింపఁబడుటలేదు. ఇట్లభిధచేత - ప్రస్తుతమగు భృంగవృత్తాంతము - తెలుపఁబడిన పిమ్మట, వాచ్యార్థ సామ్యబలముచేత- [అర్థ సామ్యశక్తిమూలమగు వ్యంజనచేత] అన్యాపదేశరూపమగు వ్యంగ్యమిట్లు ధ్వనింపఁజేయఁబడును.

"వేశ్యాంగనలు - కృత్రిమవేషభాషావిలాస నైపుణ్యముచేత- డాంబికమగు ప్రసిద్ధిని సంపాదించుకొని యుందురు. పైగా ముండ్లవంటి శంభకులు (కుంటెన కత్తెలు) వారినావరించుకొనియుందురు. ఈవేశ్యలకు పైనున్నదే - మెరుఁగు. లోనున్నదో; లొటారము. వారు పురుషులయందుఁజూపు ప్రేమ-గగనారవిందము వంటిదే; కాని, హృదయగతముకాదు. కనుకవారు నీకు ప్రేయసులుకానేరరు. వారి సమ్మేళనముకొఱకు, మాటిమాటికిని దిరుగుచున్న నీకు - ఘోరమగు విపత్తుకలు గునుజుమా!. కులవధువును, ముగ్ధను, నగు నేను-సుకుమారతయు, పరిమళమును, గల నవమాలతీ కుసుమమువంటిదానను. సౌభాగ్యాభిమానపూర్ణను. కాఁగా; అట్టి వేశ్యను బ్రేమించుటయుక్తమో, యిట్టి కులకాంతను బ్రేమించుటయుక్తమో, విచా రించుకొనుము." అనునది యిచట వ్యంగ్యమగుచున్నది. కాఁగా; "అభిధేయ మగునపుడు ప్రస్తుతమగు శృంగవృత్తాంతము - ముఖ్యముగా వివక్షితమయిన మీఁది వ్యంగ్యార్థము వ్యంజితమైన పిమ్మట-అప్రస్తుతమగును. కనుకనిది-వాచ్య మగు నప్రస్తుత ప్రశంసాలంకారముగాక, ధ్వన్యమానమగు నప్రస్తుత ప్రశంసా లంకారమేయగును." అనితెలియునది. [జయదేవునిచేత రచితమగు, చంద్రాలో కమునననుసరించి] 'ప్రస్తుతముచేత - ప్రస్తుతము స్ఫురింపఁజేయఁబడునపుడది - ప్రస్తుతాంకురాలంకారమగును' అని కువలయానందమునఁజెప్పఁబడి, "కింభృఙ్గ సత్యాంమాలత్యాం కేతక్యాకణ్టకేద్ధయా" అని, యిట్టిదియేయగు నుదాహరణమొసఁ గఁబడి, యిచట - 'వాచ్యవ్యంగ్యములు - రెండునుగూడ - ప్రస్తుతములుగనే యగుచుండు'నని సమన్వయింపఁబడెను. కనుక, తన్మతముననుసరించునపుడిది - ప్రస్తుతాంకురాలంకారమగునని తెలియునది.

లోచ :— అస్మదుపాధ్యాయ భట్టేందురాజకృతమగు పద్యము :- అప హ్నుతి ధ్వనికుదా :- క్రొవ్విరి :— [నవలా.]

> గౌరాంగీకుచకలశభూరి సుభగాభోగుఁడగు సుధాకరునందెది-
> సారసకాలాగురుపత్త్రభంగ సత్కృతి వాసైక సారాయతమొ;
> ఓరమణీ! యది - వియోగాగ్ని పరిచితోత్క సతీహృదయోదిత వ్యథా
> పూరమడపఁగోరి, ప్రసారితాంగములనుపలక్షితుఁడగు స్మరుఁడుసుమా!.

ప్రభా :— ఏతత్పద్యసందర్భమిది :- ఆమె - కామినియగు నొకానొక ప్రౌఢనాయిక - ఏమాత్రమును చలితచరిత్రకాదు. కాని, క్షణిక కోపమును, గాఢ ప్రణయమునుగల, లలన. ఆమె-ప్రియతముఁడును-అట్టివాఁడే. ఆమె- గౌరాంగి. (తెల్లని శరీరముగలది.) మఱియు, సుభగమగు కుచాభోగము (సువృత్తమగు స్తన విస్తారము) గలది. ఆ ప్రేయసీ ప్రియులు - ఒకరినొకరు క్షణకాలమునువిడువరు.

వీటికోగాని, ఆనాయిక -మొదట-ఆప్రియతమునియెడc బొలయలుకcగొని, అతc డెంతయనునయించినను గూడ, (సాయంసమయమగువఱకును) అతcడొనర్చిన ప్రణయప్రార్థనము నంగీకరించినదికాదు. అతcడునలుకcగొని, వేరొకచోటికరి గెను. ఇంతలో పూర్ణచంద్రుcడుదయించు చుండెను. తెల్లని చంద్రికలో-ఆకామిని పొలయలుక మెల్లగా చల్లారెను. కాని, యుద్ధతమగు విరహాగ్ని యుదయించెను. దానిచేమస్సహమగు మదనతాపము - విజృంభించెను. దానిచేత హృదయము కాలు చుండుటవలన నామె - విరహోత్కంఠితయయ్యెను. వల్లభుcడు - తనంతటానే వచ్చునేమోయని కొంతకాలమాకాంత-ప్రతీక్షించుచు, చెలికత్తియలప్రేరణోత్సా హమున, చక్కగా నలంకరించుకొని, వాసకసజ్జిక యయ్యెను. కాని స్వాభిమాని యగుటవలన నామె ప్రియతముcడెంతకును రాcడయ్యెను. ఆమె హృదైశమున సౌభాగ్యాన్వితమును, విస్తృతమును, నగు నామె కుచకుంభమువలె; ఆకసమున సుందరుcడును, పూర్ణుcడును, నగు చంద్రుcడు - ప్రకాశింపcజొచ్చెను. ఆభోగ విశిష్టమగు తద్రమణీ కుచకుంభము నడుమను - నల్లనియగురుచేతc జక్కగా రచింపcబడిన పత్త్రిలేఖవలె; పూర్ణచంద్రుని నడుమను, సుస్పష్టమైయున్నమచ్చ- విచ్ఛిత్తికాస్పదమగుటచేత - ఉత్కృష్టత నావహించుచుండెను. ఆప్రమద- ఎంత కాలముని ప్రతీక్షించును ?. దూతికనంపి, పూర్ణచంద్రుc డుదయించుచుండగనే, యజనిని రప్పించెను. చంద్రుcడు పూర్తిగా నుదయించెను. ఆపూర్ణ చంద్రుని చంద్రికలో-మదనోద్విగ్నయు, నతాంగియు, సాలంకృతయు, నగు నారమణిని జూచి, మదనోద్విగ్నుcడును, రసికాగ్రేసరుcడును, నగునాప్రియుతముcడీ వాక్ యము వెలార్చెను. ఆనాయిక- అపుడెంతయానందోద్వేగముసొందెనో; తదుపర్యి వారికొదవినకూటమి- యెంతవిలువగలదో; "పొలయలుకనాటికూటమివెలయింతని చెప్పరాదు వినరా సుమతీ!" అనిచెప్పిన భద్రభూపాలునికిc దెలియునేమో!.

మీcది క్రొవ్విరికి మూలమగు భట్టేందురాజ చరణుల శ్లోకమిట్లున్నది :—

"యఃకాలాగురు పత్త్రభఙ్గరచనా వాసైక సారాయతే
గౌరాఙ్గీకుచకుమ్భభూరి సుభగాభోగే సుధాధామని।
విచ్ఛేదానల దీపితోత్కవనితా చేతోఒధివాసోద్భవం
సన్తాపం వినినీషురేషవితతైరఙ్గైర్నతాఙ్గీః స్మరః."

అవ :— దీనియందు - కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూల సం లక్ష్యక్రమవ్యంగ్యములగు 1. అపహ్నవ. 2. ససందేహ 3. ప్రతివస్తూపమా 4. హేతు 5. సహోక్తి 6. ఉపమేయోపమాది, అలంకార ధ్వనిభేదములు- ద్యోతి తములగుటను లోచనకర్త ప్రదర్శించుచున్నాcడు,

లోచనము : – ఇచ్చట, ''చంద్రమండలమునడుమనున్నమచ్చ- ప్రియ వియోగాగ్ని పరిచితలగు, వనితలహృదయములనుండి యుదయించినదియు, కాలు టచేత మలీమసమగు (నలుపెక్కిన) కాంతిగలదియు, నగుమన్మథాకారము'' అను నపహ్నవము - ధ్వనింపఁజేయఁబడుచున్నది.

పరీభా :— ''చంద్రుని నడుమనున్నది - మచ్చకాదు. ఇంకేమనిన; ఉత్కంఠితలగు వనితల హృదయములు - ప్రియవియోగమను నగ్నిచేత దీపితము లు కాఁగా; ఆహృదయములనుండి, యుదయించినవాఁడును.(వారిహృదయములం దుండునపుడు) తాను కాలుటచేత - మలినమయిన కాంతినొందినవాఁడును, నగు మన్మథుఁడేయగును.'' అను నపహ్నవము - ధ్వనితమనిభావము.

లోచనము :— ఇచ్చటనే, ససందేహధ్వనియునున్నది. ''చంద్రునియం దున్న మచ్చయొక్కనామముకూడ గ్రహింపఁబడునది- (విశేషించి నిర్దేశింపఁబడు నది ) కాకున్నది. కాని, గౌరాంగీస్తనాభోగస్థానీయుఁడగు (తెల్లనివన్నెగల మేను గలస్త్రీకి సంబంధించిన పెద్దస్తనముపంటి) సుధాధామునియందు - (ఆమెకుసంబం ధించిన ఆరమణీయగురుస్తనమునందు) కాలాగురుచేత రచితమగు, పత్రిభంగిము వంటి రూపముచేతనగు విచ్ఛిత్తికి (మహాసౌందర్యమునకు) ఆస్పదమగుట (స్థాన మగుట) చేత, ఏది - (ఏమచ్చ-) 'సారతను' అనఁగా; ఉత్కృష్టతను' - ఆచ రించుచున్నదిగా గ్రహింపఁబడుచున్నదో'' అని నిర్దేశింపఁబడుటవలన ''ఈవస్తు వేదో (ఈమచ్చయేదో)యెఱుఁగము.'' అను ససందేహముకూడ-ధ్వనింపఁజేయఁ బడుచున్నది.

పరీభా :— ''తెల్లనివన్నెగల పడుచుయొక్క విస్తృతసుందర స్తనము వంటి చంద్రునియందు - ఆస్తనమునందు నల్లనియగురుచేత రచింపఁబడిన పత్త్రి లేఖవలె, (విచ్ఛిత్తికాస్పదమగుటవలన) ఈచంద్రునియందు - ఉత్కృష్టతను వహించుచున్న ''యీమచ్చ - ఏవస్తువో తెలియకున్నది. అను ససందేహాలంకార ముకూడ - ధ్వనింపఁజేయఁబడుచున్నది.'' అని, దీనిభావము.

లోచనము : ముందు - ప్రణయమును (ప్రియతముని ప్రార్థనను) అంగీకరింపక, అనుతప్తయు, (పశ్చాత్తాపవతియగుటవలన)విరహోత్కంఠితయు, (కనుకనే) వల్లభుఁడెప్పుడువచ్చునో యను ప్రతీక్షాతాత్పర్యమున - అలంకారాది విధుల నొనర్చుటచేత - వాసకసజ్జికయు, నగు నాయికను - పూర్ణచంద్రోదయ సమయమున - దూతీముఖమునఁ బిలువఁబడి, యేతెంచిన ప్రియతముఁడు - ఓన తాంగీ! (స్తనములచేత వంగినదివలెనున్న శరీరముగలఓరమణీ!) అనిసంబోధించి,

ప్రశంసించుచున్నాఁడు. కనుక "త్వదీయ కుచకలశన్యస్తమగు కాలాగురుపత్త్రభంగరచన - మన్మథోద్దీపన కారిణి. చంద్రవర్తినియగు ఈకువలయదళశ్యామల కాంతికూడ - ఇట్లేచేయునది" అని, కవినిబద్ధవక్తయగు నాయకుని చాటువాక్యార్థము - ధ్వనింపఁజేయఁబడుచున్నది. కనుకనిది - ప్రతివస్తూపమాధ్వనికూడ నగుచున్నది.

ప్రభా :— "వాక్యయోరేక సామాన్యే ప్రతివస్తూపమామతా" "ఉపమానోపమేయ పరములగు వాక్యములయందు ఏకమగు సమానధర్మము- భిన్నశబ్దములచేత నిర్దేశింపఁబడునపుడది - ప్రతివస్తూపమాలంకారమగును"అను లక్షణముగల ప్రతివస్తూపమకూడ - ఇచట ధ్వనింపఁజేయఁబడుచున్నది." అని భావము.

లోచనము :— "సుధాకరునియందు" అనుపదము - చంద్రపర్యాయముగా నుపాత్తమయినను, "వ్యథాపూరమదపఁగోరి" అనుటకు తాను హేతువగుటనుగూడ, స్ఫురింపఁజేయుచున్నది. కనుక, హేతువను నలంకారముకూడ - ఇచట-ధ్వనింపఁజేయఁబడుచున్నది. "త్వదీయకుచశోభయు, మృగాంకశోభయుఁ గూడ. మదను నుద్దీపింపఁజేయుచున్నవి." అనునర్థము- స్ఫురింపఁజేయఁబడుట వలన, సహోక్తి - ధ్వనితము. "చంద్రుఁడు - భవత్కుచాభోగసదృశుఁడు. నీకుచాభోగము - చంద్రసదృశము" అనునర్థముకూడ నిచటఁ బ్రతీతమగుటవలన, ఉపమేయోపమాధ్వనికూడ - ధ్వనింపఁజేయఁబడుచున్నది. ఈ. మహాకవి వాణి- కామధేనువువంటిది. కనుక, నిట్లే మఱికొన్ని (అలంకార) ధ్వనిభేదములు కూడ- ఇచ్చట నూహించుటకు శక్యములగును. ఏలయనిన;

ఉ॥ ఒక్కఁడొనర్చు హేలయు, అనూహ్య ఫలప్రసవమ్ముఁగూర్చు, నిం
కొక్కఁడు సేయుతీవ్రకృషియున్, ఫలమీదణుమాత్రమేనియున్;
దిక్కరి రోమధూతియు, క్షితిన్ గదలించును; నింగినుండి తా
తెక్కలనార్చిదూకియు, ద్విరేఫము - తీవియనూపలేదహో!.

ప్రభా :— దీనికి మూలమగు సంస్కృత శ్లోకమిది :—

"హేలాపికస్యచిదచిన్త్యఫల ప్రసూత్యై।
కస్యాఽపినాలమణవేఽపి ఫలాయయత్నః।
దిగ్దన్తి రోమచలనంధరణీంధునోతి।
ఖాత్సమ్పతన్నపిలతాం చలయేన్న భృఙ్గః"

ఇచట-వాచ్యమగు విశేషముచేత-వాచ్యమగు సామాన్యము సమర్థింపఁబడినది. "ఈశ్వరునివంటి వాఁడగు నొకానొక మహాత్ముఁడొనర్చిన సహజలీలకూడ-తలం చుటకు శక్యముకాని, మహాఫలమును సంఘటించును. అత్యల్పుఁడగు నింకొక వ్యక్తి - బుద్ధిపూర్వముగా నొనర్చిన మహాప్రయత్నముకూడ - అత్యల్పఫలము నీయజాలదు." అని యిచట వాచ్యమగు సామాన్యమును - "దిగ్గజముయొక్క-రోమచలనముగూడ - భూమిసూపఁజాలును. తుమ్మెద - ఆకాశమునుండి యువ్వెత్తుగా దూకినను - మృదువగు లతను(గూడ) గదలింపలేకుండును" అనువాచ్యమగు విశేషము - సమర్థించుచున్నది. ఇది - వాచ్యాలంకారమేకాని, ధ్వనిభేదము కాదు. కాని "మహాకవివాణికి-సాధ్యముకాని సౌందర్యసంఘటనములేదు." అనుటకు, లోచనకర్త- దీనిని దృష్టాంతరీకరించెను." అని తెలియునది.

లోచనము :— మీఁది ధ్వనిభేదములకు సంసృష్టిత్వమును, సంకరత్వమును, గూడ యథాయోగముగ నూహించునది.

ప్రభా :— "గౌరాంగీకుచ' అను పద్యమునందు - అపహ్నవముతోఁ గూడ - తదితరములకు సంసృష్టియు - సందేహము, ప్రతివస్తూపమ, ఉపమేయోపమ, అనుధ్వనిభేదములకు - ఏకవాక్యానుప్రవేశ సంకరమును - ఊహింపవలయును" అనిభావము.

లోచనము :— అతిశయోక్తిధ్వనికుదాహరణము :- నాయదియే. [అభినవగుప్తుని పద్యమున కాంధ్రీకృతిరూపమే.] (ఇది - ప్రభామతి ప్రసారితమగు జాతియపద్యము. దీనిపేరు - 'ఒయ్యారి'. దీనికి ప్రతిపాదమునందును 43 మాత్రలుగల గణములుండును. 24 మాత్రల మీద - వడియుండును. త్రిశ్రగతిని నడుచును. ప్రతిపాదము చివరను - 5 మాత్రల కాలమాగి, పఠించునెడల త్రిశ్ర జాతి త్రిపుటతాళమునకు సరిపడును.)

నీనయనద్వయి - కేళీకందళితుఁడు, శ్రీపెభ్రమ
  నిధియగు, 'మధుసకు' ధుర్యమ్మగు శరీరము . . . .
నీనర్మక్రియాక్రమము, భ్రూయుగమిది - 'శ్రీమన్మధు
  నికి' భంగిభంగురమగు, శుభకార్ముకము . . . .
హా! నీవదనాంబుజగత మీయాసవ - మాపాతము
  నందును, హర్షాది హృద్వికార కరణము . . . .
హౌ! నిజమిది! సుందరి! నీవొక్కటె వె-విధాతృనికృతి
  యందు స్ఫురించిన లోకత్రయ సారమవు! . . . .

ప్రభా :— కవినిబద్ధవక్తయగు ప్రముఖనాయకుఁ డొకఁడు - ఒకానొక జగదేకసుందరిని ప్రశంసించుచున్నాఁడు. "సుందరీ! నీకందోయి-కామోద్దీపనభార మునువహించు వసంతునికి శరీరము. నీకనుబొమ-చక్కని కూర్పుఁగలిగి, వంపులు తిరిగియున్న మన్మథచాపము. ఆహా! నీముఖాంబుజాసవము - కిఞ్చిదాస్వాదము నందును, చిత్తవృత్తి వికృతికారణము. బ్రహ్మసృష్టియందు - నీవొక్కతెవే - త్రిజగతీ సారభూతవు." అనునది-వాచ్యార్థము.

దీనికి మూలమగు శ్రీమహా మహేశ్వరాచార్యాభినవగుప్తుని మూలశ్లోక మిట్లున్నది.

కేలీకన్దలితస్య విభ్రమమధో ర్ధుర్యంవపుస్తే దృశౌ
భఙ్గీభఙ్గురకామ కార్ముకమయం భ్రూనర్మకర్మక్రమః।
ఆపాతేఽపి వికారకారణమహో! వక్త్రామ్బుజన్మాసవః,
సత్యం సున్దరి, వేధసస్త్రి జగతీసారస్త్వమేకా కృతిః.

లోచనము :— ఇచ్చట - మధుమాస, మన్మథాసవములు - [అనఁగా; "వసంతము, కామము, - ఆసవము." అనునవి] - అన్యోన్యపరిపోషకములగుట చేత-"త్రిలోక సుభగములు" అని ధ్వనింపఁజేయఁబడుచున్నదిగదా !. అవియో! (అనఁగా; వసంతము, కామము, ఆసవము, అనునవియో.) అవి - నీయందు లోకోత్తరమగు శరీరముతో['నేత్రరూపము, భ్రూరూపము, అధరరసరూపము' అగు శరీరములతో] మొత్తపడియున్నవి." అను నతిశయోక్తి - ధ్వనింపఁజేయఁ బడుచున్నది. నీముఖకమలాసవము - (అధరసుధారసము-) ఆపాతమునందును (అనఁగా; కొంచెమగు నాస్వాదమునందుఁగూడ) వికారకారణము" అనుటవలన "మాటిమాటికిని నాస్వాదింపఁబడుట వినాగానే (లేకయే) చిత్తవికారరూపమగు ఫలమును గలిగించుచున్నట్లు స్ఫురింపఁజేయఁబడుటవలన-విభావనా (అలంకార) ధ్వనికూడ నిచటనున్నది. "విభ్రమనిధియగు మధునకు-ధుర్యమ్మగు శరీరము" అనుటవలన - (నయనద్వయికిని - మధునకును, సామ్యవివక్షవలన - భామహాభి మతమగు) తుల్యయోగితాలంకారముగూడ - ధ్వనింపఁ జేయఁబడుచున్నది. కొందఱు చెప్పునట్లు - అలంకారవిశేషములు కొన్నిమాత్రమే - వ్యంగ్యములగు నని తలఁపక, అలంకారములన్నియుఁగూడ నిట్లు ధ్వనింపఁజేయఁబడునని (ధ్వని ప్రభేదములగునని) తలంచునది. "యథాయోగముగ" అనఁగా; ఒకచోట నలం కారము, ఇంకొకచోట వస్తువు, వ్యంజకమగు ననునర్థము నూహించునది.

అవ :— "అయ్యా! ఈయలంకారముల నన్నింటినిగూడ- చిరంతనులే- తెలిపియుండిరిగదా! (నీవుచేసినదేమి?) ఇవి- వ్యంగ్యములు కూడనగుననియేగదా! నీవు ప్రదర్శించితివి? ఇంతమాత్రముచేతఁ గలిగిన ఫలమేమున్నది ?'' అని యా శంకించి (వృత్తికర్త - క్రింది కారికను) చెప్పుచున్నాఁడు.

**(143)** మూలము : అవ :— అలంకారధ్వని మార్గము నిట్లు వ్యుత్పాదించి, (విశేషించి తెలిపి) దానికి ప్రయోజనవత్తను (ఫలసత్తను) ప్రకటించుట కిట్లు చెప్పుచున్నాఁడు.

[కా] శరీరీకరణం యేషాం వాచ్యత్వేన వ్యవస్థితమ్।
తేఽలఙ్కారాః పరాంఛాయాంయాన్తి ధ్వన్యఙ్గతాంగతాః.28

తే. ఏయలంకారములకు "దేహీకరణమె"
వాచ్యతా స్థితిచేత వ్యవస్థితమ్మొ;
(లేక)
వాచ్యతాదశయందవ్యవస్థితమ్మొ;
ఆయలంకారములు-ధ్వనికంగములుగ,
నగుచు, నుత్కృష్టమగు ఛాయనలరుచుండు.

ధ్వన్యంగత్వము - (ధ్వనిరూపత్వము - ) వ్యంజకత్వము చేతను, (వ్యంజకమగుటచేతను) వ్యంగ్యత్వముచేతను (వ్యంగ్యమగుటచేతను) ఉభయప్రకారములచేతనుగూడ సంభవించును. అందిచట, ప్రకరణమువలన - ఈధ్వన్యంగత్వము-(అలంకారములకు) వ్యంగ్యత్వముచేత - సంభవించునని తెలియునది. అలంకారములు- వ్యంగ్యములగునపుడుగూడ - ప్రధానములుగా వివక్షింపఁబడునపుడే, అవి-ధ్వన్యంతఃపతితములగును. (ధ్వనిభేదరూపములగును.)

లోచనము : ప్ర — ప్రస్తుతమగు నర్థమే (కావ్యమునకు) శరీరమగుచుండును. (ఇట్లుండ) ప్రస్తుతమగునర్థముకంటె వేరయినవియు, కడియములుమున్నగు నలంకారములవంటివియు, నగునలంకారములు-కావ్యమునకు శరీరమెట్లగును ?

ఉ :— ''సుకవులీయలంకారములను వేరొక్కయత్నము లేకయే సంపాదింతురు. కనుక, వాచ్యత్వముచేత - ఏయలంకారములకు కావ్యశరీరతాపాదనము - వ్యవస్థితమో; లేక, వాచ్యములగు నపుడే యలంకారములకు దేహీకరణముకూడ - (కావ్యశరీరతా పాదనముకూడ - [అనఁగా; అశరీరములగు వానిని - శరీరముగాఁజేయుటకూడ] వ్యవస్థితము కాకుండునో; (దుర్ఘటమో;) ఆయలంకారములు - వ్యంగ్యరూపతచేత - ధ్వననవ్యాపారమునకుఁగాని, ధ్వనికావ్యమునకుఁగాని, - అంగములగునవి యగుచు, 'పరమగు' అనఁగా; దుర్లభమగు, 'ఛాయను' అనఁగా; 'కాంతిని;' అనఁగా; 'ఆత్మరూపతను' బొందును.'' అనియర్థము. ఇందలి ఫలితార్థమిది:— విదగ్ధయగుపురంధ్రి, (నిపుణురాలగు నొయ్యారి) తనభూషణమును తనశరీరమునందు శ్లిష్టమగునట్లు, (మిళితమగునట్లు) ఎట్లు సంఘటించునో; అట్లే, సుకవికూడ - అలంకారమును కావ్యశరీరమునందు సంశ్లిష్టమగు నట్లు (మిళితమగునట్లు) సంఘటించును. అయినను, కుంకుమాపీతికకువలె- (కుంకుమయుక్తమగు ననులేపనమునకువలె) ఉపమాద్యలంకారమునకు [కావ్యశరీరముకాని యలంకారమునకు] శరీరతాపత్తి- కష్టసాధ్యమేయగును. అట్టిచో, ఆత్మత్వసంపాదనమునకు సంబంధించునదియగు సంభావనకూడ - ఎట్లుకలుగును ? [అలంకారముల, కాత్మత్వసంభావన - అతికష్టసాధ్యము'' అనిభావము.] ఈవ్యంగ్యత్వమిటువంటిది. (ఎటువంటిదనఁగా; చెప్పుచున్నాఁడు.) బాలక్రీడయందగు రాజత్వము - రాజవేషముఁ దాల్చిన బాలకునకు - తదితరబాలకులకంటె - ఉత్కర్షమును గలిగించునట్లు, (అలంకారగతమగు) ఈవ్యంగ్యత్వము - ప్రధానభూతము కానప్పుడుకూడ - వ్యంగ్యములగు నలంకారములకు - వాచ్యమాత్రములగు నలంకారములకంటె - ఉత్కర్షమును గలిగించును.

అవ : - ఈయంశమునే మనస్సునందుంచుకొని, చెప్పుచున్నాఁడు.

(144) మూలము:— అట్లు కానప్పుడు -[అలంకారగతమగు వ్యంగ్యత్వమునకు ప్రాధాన్యవివక్ష లేనపుడు] గుణీభూతవ్యంగ్యత్వము - (అలంకారములు వ్యంగ్యప్రధానతగలవి కాకుండుట-) ముందు (తృతీయోద్ద్యోతమునందు) ప్రతిపాదింపఁబడును. అంగిత్వముచేత - వ్యంగ్యత్వముండునపుడుకూడ [ప్రధాన వ్యంగ్యములగునపుడుకూడ] అలంకారములకు - ద్వివిధమగు,గతి- (అవస్థ-స్థితి - ) కలుగుచుండును, ఒకప్పుడవి - వస్తుమాత్రముచేత -

వ్యంజితములగును. ఇంకొకప్పుడు - అలంకారముచేత-వ్యంజితము లగును.

తత్ర [కా] వ్యజ్యన్తే వస్తుమాత్రేణయదాలఙ్కృతయస్తదా।
ధ్రువం ధ్వన్యఙ్గతా తాసాం (అత్ర హేతుః)
కావ్యవృత్తి స్తదాశ్రయా. (29)

అందు-

తే. కావ్యవృత్తి - తదాశ్రయ ;కనుక, నెపుడు।
వస్తుమాత్రమ్ముచేఁ దాము వ్యంజితమ్ము
లగుచునుండు నలంకృతు; లపుడవెల్ల
ధ్రువముగా, ధ్వనికంగమ్ము లవుచుఁదనరు.
(ధ్వనిభేదమ్ము లవుచుఁదనరు.)

లోచనము :— "అందు" అనఁగా; - "ద్వివిధమగు వ్యంగత్వగతి యందు" అనియర్థము. "అత్రి హేతుః" అనునిది - వృత్తిగ్రంథము. [కారికాంశముకాదు.] కావ్యమనఁగా; (శబ్దార్థరూపమగు) కవివ్యాపారము, (కవివ్యాపారరూపమగు) కావ్యమునకు సంబంధించిన వృత్తి - (ప్రవృత్తి) "తదాశ్రియ కనుక" అనఁగా, 'అలంకారప్రవణ [అనఁగా; వ్యంగ్యాలంకృతి యాశ్రయము గాఁగలది] కనుక.' అనియర్థము.

ప్రభా : వృత్తికర్త :— హేతువును విశదీకరించుటకు "అత్ర హేతుః" అనుమాటను ప్రయోగించెను. లోచనకర్త - "కావ్యవృత్తి - తదాశ్రియ. కనుక, అనుకారికార్థమునేస్వీకరించి, వ్యాఖ్యానించెను. నాయాంధ్రీకృతిదానినేయనుసరించెను. 'ఇచట హేతువు' - అనువృత్తిననుసరించి, చివరిపాదమున హేతువును నిబంధించునెడల; "కావ్యగతి - తదాశ్రయతనుగలదియగుట" అని భావార్థనిర్దేశము నొనర్పవలసియుండును.

(145) మూలము :— అచట (వస్తువుచేత నలంకారము వ్యంగ్యమగు స్థలమున) కావ్యము - తథావిథవ్యంగ్యాలంకార ప్రవణతచేతనే, ప్రవృత్తమగుటవలన - (వస్తుమాత్రముచేత-వ్యంజితములగు నలంకారములన్నియు, ధ్వనిభేదరూపములేయగును.)

అట్లుకానియెడలనో; కావ్యవ్యాపారము - వ్యంగ్యతత్పరము కాని యెడలనో;) అది-(అజ్ఞులుకావ్యమగుననుకొనునది) వాక్యమాత్రమే కావలసివచ్చును. [కావ్యముకాదు.]

లోచనము :— "అట్లు కానియెడలనో." అనఁగా, "కావ్యవృత్తికి, వ్యంగ్యాలంకార తత్పరత్వము లేనియెడలనో." అనియర్థము. (వ్యంగ్యతాత్పర్యము లేని స్థలమునందు, కావ్యముగా నభిమానింపఁబడిన రచన - వాక్యమాత్రమే యగును.) కనుక, నచటదానిని-గుణీభూత వ్యంగ్యమని (కూడ) శంకింపఁదగదు.

మహాకవిత్వపదవీ పరాయణులగు కవులకుపదేశము.

ప్రభా :— ద్వివిధముగాఁ దెలుపఁబడిన సమన్వయమున - "వాచ్యతా స్థితిచేత - వ్యవస్థితమ్కో" అనుదాని సమన్వయమిది :- "అలంకార నైపుణిగల యొకపురంధ్రి-బంగారు బొమ్మవలె, చూపఱులకుఁ గాన్పింపఁదలచి, మిగులనల్లని దగుతనయొడలికి-(పసుపురంగుగల) పచ్చనిపొడరునద్దినను, కృత్రిమమగు నాపొడరుపూత - శరీరాంతర్గతముకానట్లు, వాచ్యమగు నర్థముకంటె, వేరగు నలంకారము - వాచ్యశరీరముతో సమ్మిళితమయినట్లున్నను, వాచ్యార్థరూపమగు కావ్య శరీరముకాదు. (కావ్యశరీరముకంటె) బాహ్యమేయగును. అయినను, సుకవి - దీనినప్రయత్నముగఁ గూర్చునపుడిదియు- కావ్యశరీరాంతర్గతమువలెఁగాన్పించుట వలనను, ఇదియు- వాచ్యమేయగుటవలనను, వాచ్యాలంకారముకూడ - [వాచ్యార్థరూపముకావిదయినను] వాచ్యార్థరూపమగు కావ్యశరీరముగా వ్యవస్థాపింపఁబడినదో" అనునది ఇది - "శరీరీకరణంయేషాం 'వాచ్యత్వేన-వ్యవస్థితమ్" అను చోట-లోచనకర్తచేతఁ గావింపఁబడిన మొదటిసమన్వయము "వాచ్యతాస్థితియందవ్యవస్థితమ్కో" అను రెండవ సమన్వయమో, "వాచ్యములగునపుడీయలంకారములు కావ్యశరీరమగుటకూడ - వ్యవస్థితముకాదో, అనఁగా; దుర్ఘటమో.' (కష్టసాధ్యమో)" అనునది. ఇది - "వాచ్యత్వే, నవ్యవస్థితమ్" అనుచోనగు రెండవ సమన్వయము. తదుపరి, లోచనకర్తచేతఁ దెలుపఁబడిన భావమిది :—

"ఇట్లు కావ్యశరీరతాపాదనముకూడ సుఘటముగాఁగలిగిన యలంకారములు- వ్యంగ్యరూపములగునపుడు ధ్వనసమునకుఁగాని, ధ్వనికిగాని, యంగములగుచో, దుర్లభమగు కాంతినేకాదు కాంతికాశ్రయమగు ధ్వన్యంగతనే- అనఁగా, ఆత్మరూపతనే పొందును." అని. వ్యంగ్యత్వమహిమ - ఎట్టిదోచూడుడు. వాచ్యములగునపుడు శరీరతాపాదనముకూడ - దుర్ఘటముగాఁగల బాహ్యాంగములగు

సలంకారములు - (వ్యంగ్యములగునపుడు) కావ్యాత్మధ్వనిరూపములగుట - వాని కెంత మహోత్కృష్టస్థితియో, సమీక్షింపుడు! వ్యంగ్యములగు నీయలంకారము లొక్కొకచోటఁ బ్రాధాన్యము నొందకుండుటవలన, ఆత్మరూపతనొందకున్నను, వాచ్యాలంకారములకంటె, మిగుల నుత్కృష్టములేయగును. వ్యంజనయందింత - మహత్త్వమున్నది!. కనుక, శక్తివ్యుత్పత్తులుగలకవి - వాచ్యాలంకార రచనయందుకంటె, వ్యంగ్యాలంకార రచనయందు నిరంతర పరాయణుఁడైన, శ్రద్ధా, ధురీణుఁడు కావలయును. సత్కవియగు నతఁడు- ఛందో,యతి ప్రాసాదినియమముల నుతప్పక నిర్వహింపవలయును. కాని చంధోయతి ప్రాసనిర్వహణ మాత్రమే - కవికి, సత్కవిత్వప్రయోజకతా సంపాదకముకాదు. కనుక, ముఖ్యముగా, మహాకవిదృష్టి-కావ్యాత్మధ్వనిద్యోతన పరాయణమై వికాసితముకావలయును. "ధ్వన్యాలోక,లోచన, సమీక్ష- దీనికత్యావశ్యకము" అని, అభినవునిచేత నిచట (వ్యంగ్యముగా) కవులనుద్దేశించునదియగు మహోపదేశము కావింపఁబడినది. దీనిని నవ్యకవులందఱును, గుర్తించి, సాహితీరసధ్వన్యాలోక లోచనప్రభామత్యాలోక సమాలోకులగుదురుగాక !" ఇట్లు - ప్రభామతి.

అవ :— అలంకారములు - వస్తువ్యంగ్యములగునపుడు - ధ్వనిరూపము లగునని తెలిపి, అవి - యలంకారవ్యంగ్యములగు నపుడుకూడ - ధ్వనిరూపము లగునను చున్నాఁడు.

(146) మూలము :— (తాసామేవాఽలఙ్కృతీనామ్-)

[కా] 'అలఙ్కారాన్తర వ్యఙ్గ్యభావే.' (పునః) 'ధ్వన్యఙ్గతాభవేత్।'
చారుత్వోత్కర్షతో వ్యఙ్గ్యప్రాధాన్యం యదిలక్ష్యతే. 30

"అవెల్ల" అని, దీనికి ముందలి కారికయందేయలంకారములు తెలుపఁబడినవో; ఆయలంకారములకే -

గీ॥ అన్యమగు నలంకృతిచేత - వ్యంగ్యభావ
మలరునప్పుడు (కూడ) ధ్వన్యంగమగుటకలుగు,
చారుతోత్కర్ష నాయలంకారములను
వ్యంగ్యము-ప్రధానముగ లక్ష్యమైనయెడల.

లోచనము :— 'ఆయలంకారములకే" అనునది - 'అవెల్ల' అని దీని

ముందలి కారికనుండి, అనువృత్తి కావింపఁబడినది. అది-ప్రస్తుతకారికకుపస్కారక మగును. (ఉపకరించును.) కారికామధ్యమున - (కారికాభాగముకాని) "కూడ" అనునదికూడ- కారికోపస్కారమే (ఉపకారియే) యగును. "ధ్వన్యంగమగుట" అనఁగా; 'ధ్వనిభేదమగుట' అనియర్థము. వ్యంగ్యము ప్రధానముగా లక్ష్యమగుటకు హేతువు - చారుత్వోత్కర్ష. [అనఁగా; వాచ్యవ్యంగ్యాలంకారములలో వ్యంగ్యాలంకారగతమగు సౌందర్యాధికత.] అది - "లక్ష్యమైనయెడల" అనుట చేతనగునర్థమిది :- "వ్యంగ్యమగునలంకారము-ప్రధానముకానియెడల; (వ్యంగ్యాలంకారమును వ్యంజింపఁజేయునదియగు) వాచ్యాలంకారమే, ప్రధానమగును-కనుక, (అప్రధాన వ్యంగ్యమగు నాయలంకారమపుడు) గుణీభూతవ్యంగ్యమే యగును." అనునది.

ప్రభా :— "ఉపస్కారమగును" అను లోచనాభిప్రాయమిది. "అన్యమగు...ధ్వన్యంగమగుటకలుగును" అనునప్పుడు-'వేనికి?' ('ఏయలంకారములకు-ధ్వన్యంగత్వముకలుగును ?) అనునాకాంక్షకలుగునుగదా! ఆయాకాంక్షను "ఆయలంకారములతే - " అను మీఁది వృత్తి - నివర్తింపఁజేయుటచేత నుపకరించును" అనునది.

(147) మూలము :— "వాచ్యవ్యంగ్యముల ప్రాధాన్య వివక్ష - చారుత్వోత్కర్ష నిబంధనము" అను నభిప్రాయమింతకు ముందే చెప్పఁబడినదిగదా ;

ప్రభా :— "అలంకారము - వ్యంగ్యమగునపుడుగూడ - వాచ్యమగు నలంకారాంతరముచేత - స్ఫురింపఁజేయఁబడి, వ్యంగ్యమగు నాయలంకారము - సౌందర్యోత్కర్షముగలది యగునపుడే, ప్రధానమగును. అట్లు ప్రధానముకానపుడో; సౌందర్యోత్కర్షముగల వాచ్యాలంకారమే [దీపకాదికమే] ప్రధానమగును. కనుక, నప్పుడప్రధానవ్యంగ్యమగు నలంకారము (ఉపమాదికము) గుణీభూత వ్యంగ్యమేయగును." అనిభావము.

లోచనము : అవ :— "అయ్యా! అలంకారము - వస్తువుచేత - వ్యంజితమగును. వేరొకయలంకారముచేతఁగూడ -వ్యంజితమగును.' అనునిచట - ఉదాహరణములను ప్రదర్శించినారుకారేల ?" అనియాశంకించి చెప్పుచున్నాఁడు.

(148) మూలము :— అలంకారములు - వస్తుమాత్రము

చేతను, - అలంకారముచేతనుగూడ - వ్యంగ్యములగుటయందగు విషయమును - ఇంతకుముందుఁ బ్రదర్శింపఁబడిన ('మంథార్తిన్' ఇత్యాదులగు) ఉదాహరణములచేత నూహింపవలయును.

లోచనము : అవ :— ఈయర్థమును సంక్షేపించి ముగించుచున్నాఁడు.

(149) మూలము :— ఇట్లు, అర్థమాత్రముచేతఁ [వస్తుమాత్రముచేతఁ]గాని, అలంకారవిశేషరూపమగు నర్థముచేతఁగాని, వ్యంగ్యమగు నర్థాంతరము (వస్తువు) గాని, అలంకారము (వేరొకయలంకారము) గాని, ప్రకాశింపఁజేయఁబడునపుడు-చారుత్వోత్కర్షనిబంధనమువలన దానికి ప్రాధాన్యము కలుగునపుడు - అది - అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యమగు ధ్వనియగునని తెలియునది.

లోచనము :— "వ్యంగ్యమును, వ్యంజకమునుగూడ - ప్రత్యేకముగా, వస్తువు, అలంకారము, అను రూపములనుగలిగియుండుటచేత - ద్విప్రకారమగుటచేత - అర్థశక్తి మూలసంలక్ష్యక్రమవ్యంగ్యమగు, ఈధ్వని -చతుర్విధమగు" నని తాత్పర్యము. *

ప్రిభా :— "వస్తువు - వ్యంగ్యము, వ్యంజకము, కూడనగుచుండును. అట్లే, అలంకారముకూడ - వ్యంగ్యము, వ్యంజకము, కూడనగుచుండును. కనుక, చతుర్విధమగు అర్థశక్త్యుద్భవ సంలక్ష్యక్రమధ్వని - పూర్వోక్తవిధమున ద్వాదశవిధమగును" అని తాత్పర్యము. *

అవ :— ధ్వని, గుణీభూతవ్యంగ్యములు- వేరగునని తెలుపునదియగు కారికనవతరింపఁజేయుచున్నాఁడు.

(150) మూలము : అవ : — ఇట్లు, ధ్వనికి సంబంధించిన ప్రిభేదములను బ్రతిపాదించి, తదాభాస (ధ్వన్యాభాస) వివేకమును ('విభాగమును' అనగా; ధ్వనినుండి, తదాభాసముల విభజనమును) గావించుటకు చెప్పుచున్నాఁడు.

## —* ధ్వనిప్రభేద పరిగణనము *—

లోచనము :— ధ్వనికి మూలభేదములు - అవివక్షితవాచ్యము - వివక్షితాన్యపరవాచ్యము - అనునవి. (అందు) ఆద్యమగు, అవివక్షిత వాచ్యమునకు భేదములు - రెండు. అవి-'అత్యంత తిరస్కృతవాచ్యము,' 'అర్థాంతర సంక్రమిత వాచ్యము' అనునవి. ద్వితీయమగు, వివక్షితాన్యపరవాచ్యమునకు సంబంధించిన భేదములు - రెండు.

అవి - అసంలక్ష్యక్రమము, అనురణనరూపము, (అనఁగా; సంలక్ష్యక్రమ వ్యంగ్యము) అనునవి. అందు ప్రథమమగు 'అసంలక్ష్యక్రమము - అనంత భేదము. (తెంపులేనిభేదములుగలది.) కనుక,అసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనిభేదములను లెక్కించుటకు వీలుకాదు ద్వితీయమగు ననురణన రూపమునకు [సంలక్ష్య క్రమమునకు] సంబంధించిన భేదములు - రెండు. అవి - శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము, అనునవి. (అందు) అర్థశక్తిమూలమునకు భేదములు - మూడు. "1. కవి ప్రౌఢోక్తికృతసిద్ధశరీరము. 2. కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తి కృతశరీరము. 3. స్వతస్సంభవి శరీరము." అనునవి. పూర్వోక్తవిధమున, వస్త్వలంకారరూపములచేత - వ్యంగ్యవ్యంజకములగుటవలన - ప్రత్యేకములగు నాలుగేసిభేదములుగల, యీమూడింటికిని సంబంధించిన భేదములవెరసి - పండ్రెండు. కనుక, అర్థశక్తిమూల, అనురణనరూపధ్వని - ద్వాదశవిధమగుచున్నది. [పండ్రెండు భేదములుగలది] ఈభేదములను ఆద్యములగు భేదములతోఁ [అనఁగా; "1. అత్యంత తిరస్కృతవాచ్యము 2. అర్థాంతర సంక్రమితవాచ్యము. [అనంతభేదమయినను, ఒకటిగాఁజేర్చఁబడిన] 3. అసంలక్ష్యక్రమవ్యంగ్యము. 4. శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యము" అనుభేదములు నాల్గింటితోడను] గూర్చినపుడు పదునారు భేదములగుచున్నవి. కాఁగా ముఖ్యములగు ధ్వనిభేదములు - పదునారు. ఇవి - పదముచేతను, వాక్యముచేతను, ప్రకాశింపఁజేయఁబడుటవలన ప్రత్యేకించి రెండేసి భేదములను గలిగియున్నవి. (అందు) అసంలక్ష్యక్రమము మాత్రము, పదవాక్యములచేతనేగాక, వర్ణ, సంఘటనా, ప్రబంధములచేతఁగూడఁ ప్రకాశింపఁజేయఁబడుటవలన-తదితరములకంటెమూడుభేదములసధికముగాఁగలిగియున్నది. కనుక. ధ్వనిభేదములు - పంచత్రింశత్సంఖ్యాకములు. అనఁగా; 35. అగుచున్నవి. [4 + 12 = 16 × 2 = 32 + 3 = 35] "తదాభాసవివేకమును" అనఁగా; ధ్వన్యాభాసములనుండి(గుణీభూతవ్యంగ్యములనుండి) ధ్వనికి సంబంధించు విభాగమును (వేరొనర్చుటను) అనియర్థము.

(151) మూలము :—

[కా] యత్ర ప్రతీయమానోఽర్థః ప్రమ్లి(క్లి)ష్ట త్వేనభాసతే।
వాచ్యస్యాఙ్గతయావాపి, నాస్యాసౌగోచరో ధ్వనేః. 31

తే॥ వ్యంగ్యమగు నర్థమస్ఫుటమ్మగుచునుండు
నపుడు, స్ఫుటమయ్యు - వాచ్యాంగమగునపుడును,
అది - యనుస్వాన సన్నిభ వ్యంగ్యరూప
మయిన, యీధ్వనికిన్ విషయమ్ముకాదు.

ద్వివిధమగు (శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము అగు) ప్రతీయమానముగూడ - స్ఫుటమును, అస్ఫుటమును, నగుచుండును. అందు - శబ్దశక్తిచేతఁగాని, అర్థశక్తిచేతఁగాని, యేవ్యంగ్యార్థము - స్ఫుటముగాఁ బ్రకాశింపఁజేయఁబడునో; అదియే - ధ్వనికి విషయమగును. తదితరము - కాదు. [దానికంటె వేఱగు అస్ఫుటమగు వ్యంగ్యము - ధ్వనికి విషయముకాదు.] స్ఫుటమైయున్నను గూడ-ఏప్రతీయమానము [వ్యంగ్యము-] వాచ్యార్థమున కంగమగునట్లు భాసించునో; ఆ ప్రతీయమానము - అనురణనరూప వ్యంగ్యమగు నీధ్వనికి - గోచరముకాదు.

ప్రభా :— "ఈధ్వనికి, అది" అనుదానికి వృత్తికర్త తెలుపనియర్థమును లోచనకర్త జెప్పుచున్నాఁడు.

లోచనము :— "ఈధ్వనికిన్" అనఁగా; ఆత్మభూతమగు ధ్వనికి "అది" అనఁగా; కావ్యవిశేషము - "విషయమ్ముకాదు" అనఁగా; "గోచరముకాదు" అనియర్థము.

ప్రభా :— అస్ఫుటవ్యంగ్యము - చమత్కారకారికాదు. కనుకనది-ధ్వని కాదు. స్ఫుటవ్యంగ్యముకూడ - వాచ్యాంగమగునపుడు, తాను ప్రధానముకాకుండుటవలన -ధ్వనికాదు స్ఫుటము, ప్రధానము, అగువ్యంగ్యమే - ధ్వనియగును.

అవ :— వాచ్యాంగవ్యంగ్యమగు గుణీభూతవ్యంగ్యము నుదాహరించు చున్నాఁడు.

(152) మూలము : — దీనికుదా :- [ఒకబాల - నీటికై, యూరివెలుపలనున్న యొక కోనేటికివెళ్ళి, కొలనినీట - జలధర మున్నట్లుచూచి, యాశ్చర్యపడి, తనయత్తతోనో, చెలికత్తెలతోనో, ఇట్లనుచున్నది.]

ఆ. ఊరిచెరువునీట, నొకఁడెవ్వఁడోతాను
(ఓయత్తయెవఁడో ? యీ)
జలధరమ్ము, నెట్లు వెలికిలఁబడ
నేసినాఁడోగాని, యెగురవు వడిగ హం
సములు, కమలవయ్యె కమలములును.

ఇచట ప్రతీయమానము - ముగ్ధవధూకర్తృకమగు జలధర ప్రతిబింబము. ఇచటనది - వాచ్యాంగమే యగుచున్నదిగదా !

ప్రభా :— ఇది - గాథాసప్తశతియందలిది. 'మియంకుఁడు' (మృగాంకుఁడు) అనునతఁడు రచించిన ప్రాకృతశ్లోకమున కాంధ్రీకృతిరూపము. దీని సంస్కృతచ్ఛాయ లోచనమున నిట్లు - ప్రకటితము.

లోచ :— కమలాకరా నమలితా,హంసా ఉడ్డాయితాన చసహసా।
కేనాఽపి గ్రామతటాకేఽభ్రముత్తానితం క్షిప్తమ్.

కొందఱు ("సహసా" అనుటకుబదులు) "పిఉచ్ఛా" అనఁగా;'పితృష్వసః' (అత్తా!) అని, యామంత్రిణ రూపార్థమును పఠించుచున్నారు.

"ఒకఁడెవ్వఁడో" అనఁగా; (వాఁడు) "మిక్కిలినేర్పరి." అనిభావము. (ఇచ్చట) విస్మయమను భావమునకు - విభావరూపమగు వాచ్యముచేతనే - (ఈ బాలకు సంబంధించిన) ముగ్ధిమాతిశయము - ప్రతీయమానమగుచున్నది. కనుక నిచట వాచ్యమువలననే - సౌందర్యసంపదకలుగుచున్నది. ఈవాచ్యము-"ఈమె-ముగ్ధబాల, జలధర ప్రతిబింబమును జూచెను."అను, అర్థాంతరమును (వ్యంగ్య

మును) స్వాత్మోపపత్తికొఱకు (స్వబోధవిశ్రాంతికొఱకు) స్వోపకారవాంఛచేత-వ్యంజింపఁజేయుచున్నది.

ప్రభా :— "అత్తా! ఈచెరువునీట - మేఘమును - వెలికిలఁబడునట్లు విరియఁజిమ్మినవాఁడెవఁడో; కాని, వాఁడు చాలనేర్పరిసుమా!. మేఘముమీఁదఁ బడుచున్నపుడు-హంసలు వడిగా నెగురవలసియుండును. కాని, యవి యెగిరి పోలేదు. కమలములు - కమలవలసి (మలినములుకావలసి) యుండినను, కమల లేదు. (మలినముకాలేదు.)" అనునది - ఇచటివాచ్యము. దీనిచేత - పాఠకులకు స్ఫురింపఁజేయఁబడినది - "ఈమె ముగ్ధయగు బాల, ఈమె కొలనినీట - జలధర ప్రతిబింబమును జూచినది." అనువ్యంగ్యము.

మీఁది వాచ్యమిచట - ఈబాలహృదయమున స్ఫురింపఁజేయఁబడిన (అసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనియగు) విస్మయమునకు - విభావమయి - "ఈబాల - ఓక్కొలి ముద్దరాలు" అనిపాఠకులకామె ముగ్ధిమాతిశయమును స్ఫురింపఁజేయు టచేత - ఇచటి వ్యంగ్యముకంటె, ఈవాచ్యమే- సుందరమగుచున్నది. (అసుందరమగు వ్యంగ్యమెందులకనిన) "ఈబాల - ఏమియుతెలియని వెఱ్ఱిబాగులది. మేఘప్రతిబింబమును జూచినది." అనునీవ్యంగ్యము - వాచ్యమున కుపకరింపని యెడల; అసలు, వాచ్యమగు నర్థమే - సిద్ధింపదు. కనుకనే, యిచటి వాచ్యము కూడ - స్వార్థమును సిద్ధింపఁజేసికొనుటకీయర్థము - తనకుపకరించునను వాంఛచేతనే దీనిని వ్యంజింపఁజేయుచున్నది. కాఁగా; "ఇదియిట్లు వాచ్యాంగమగుట వలన గుణీభూతవ్యంగ్యమేకాని, అర్థశక్తిమూలమగు సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వని కాదు." అనునిది-ధ్వన్యాభాసవివేకమున మొదటి యుదాహరణమని తెలియునది.

**(153)** మూలము :— (ఈస్థలమునందేకాక) ఏవంవిధమగు నితరస్థలమునందుఁగూడ - ఎచ్చట - వ్యంగ్యమునందుకంటె వాచ్యమునకే - చారుత్వోత్కర్ష ప్రతీతిచేతనగు ప్రాధాన్యమేర్పడునో, అచ్చట - వ్యంగ్యమంగముగానే ప్రతీతమగును. కనుక నది - (అంగమగుచున్న వ్యంగ్యము.) ధ్వనికి విషయముకాదు.

దీని కుదా :-

తే. అల్లవానీరవల్లి గహనమునుండి -
ఖగములెగురుచు నొనరించు కలకలమ్ము

వినుచుఁడా, నింటిపనులఁ గావించుచున్న
కోడలికి నంగములు మహాకులతనొందు.

ఇటువంటివిషయమే - తఱచుగ, గుణీభూత వ్యంగ్యమున కుదాహరణముగా నిర్దేశింపఁబడును.

లోచనము :— "వేతసలతా గహనోడ్డీన శకుని కోలాహలం శృణ్వన్త్యాః
గృహకర్మవ్యాపృతాయా, వధ్వాః సీదన్త్యఙ్గాని."
అనునది - సంస్కృతచ్ఛాయ.

"దత్తసంకేతుఁడగు, చౌర్యకాముకుఁడు- (జారపురుషుఁడు-) సురతసము చిత స్థానమగు వేతసలతాగహనమునందుఁ బ్రవేశించెను." అనువ్యంగ్యము - "ఖగములెగురుచు నొనరించు కలకలమ్ము" (కోలాహలము) చేత - ధ్వన్యమానము [వ్యంజింపఁజేయఁబడినది.] ఈవ్యంగ్యము - వాచ్యమునే యుపస్కరించు చున్నది.

అభినవ :- "ఇంటిపనులఁగావించుచున్న" అనుదానిచేత "అన్యాసక్తురాలైనను," అనియు, "కోడలికి" అనుదానిచేత - "సాతిశయలజ్జాపరతంత్ర్యబద్ధురాలికిఁగూడ" అనియు, "అంగములు" అనుదానిచేత - "ఒకయంగమైనను, గాంభీర్యముచేతనగు నాకారగోపనవశముచేత-(ఆకులత లేనిదిగా) ఆచ్ఛాదించుటకు శక్యముకానిదయ్యెను." అనియు, 'మహాకులతనొందును' అనుదాని చేత - "ఇంటిపనులను సమకూర్చుటయటుండ. స్వాత్మను (తనశరీరమును) ధరించుటకుఁగూడ - ఈయంగములు సమర్థములు కానివయ్యెను." అనియు, "ఇంటిపనులఁగావించుచున్న" అనుదానిచేతఁ దెలుపఁబడిన గృహకర్మయోగము చేత - ఆయంగములు - మహాకులతనొందుచున్నట్లు స్పష్టముగాఁ గాన్పించు చున్నపనియు, గమ్యమగుచున్నది. ఈవ్యంగ్యముతోఁగూడిన, [పక్షులకలకలారావమును వినుచుండునపుడే, అటువంటి యాకోడలి సర్వాంగములును మహాకులత నొందుచుండెను.' అను] ఈవాచ్యార్థమువలననే - ఈవధువునందు - 'సాతిశయ మదనపరవశత' - ప్రకాశింపఁజేయఁబడుటవలన- చారుత్వసంపత్తి కలుగుచున్నది.

(154) మూలము :— ప్రకరణాది ప్రతిపత్తిచేత-నిర్ధారితమగు విశేషము (వ్యంగ్యము) గలదియు, తిరుగ, వాచ్యమును, నగునర్థము - ఎచ్చట ప్రతీయమానమగు నర్థమునకంగముగానే

భాసించునో; అదిమాత్రమే - (వ్యంగ్యమున కంగమగు నావాచ్యముగలస్థలమే -) ఈయనురణన రూపవ్యంగ్యమగు ధ్వనికి విషయమగును.

లోచనము :— శబ్దాంతరసన్నిధానము, సామర్థ్యము, లింగము, మొదలగునవి - (అభిధానియామకములు -) ప్రకరణమే - ఆదిగా (మొదటిదిగాఁ) గలవి. కనుకనవి - 'ప్రకరణాదు'లని చెప్పఁబడును. "ప్రకరణాది ప్రతిపత్తి" అనఁగా, ఆప్రకరణాదులజ్ఞానము. దానివలననే - ఎచ్చటియర్థము - నిశ్చితసమస్త స్వభావమును, (బోధింపఁదగిన నాయికాదులకు సంబంధించినదియు, వాక్యముచేత జనించినదియు, నగు నిశ్చయముచేత తెలియబడిన సమస్తమగు స్వభావముగలదియు) 'తిరుగవాచ్యమును' అనఁగా; (ప్రకణాదులచేత నిశ్చితమగు సమస్త స్వభావముగలదయినను) తిరుగ స్వవాచక శబ్దముచేతఁ జెప్పఁబడునదియు, కనుకనే, అనఁగా; స్వాత్మజ్ఞానము - పూర్వమే సమ్పన్నమగుటవలననే, తావన్మాత్రమున (వాచ్యార్థమాత్రమున) పర్యవసించునదికానిదియు, నగునో; అటువంటి యర్థమే - ప్రతీయమానమున కంగత్వమునొందును. కనుక, అది - (ఆకావ్యము) ధ్వనికివిషయము." అనియర్థము. వ్యంగ్యతాత్పర్యనిబంధనమును స్పష్టముగాఁ దెలుపునదియగు దీనిచేత - "గుణీభూతవ్యంగ్యమునందగు నిబంధనము - దీనికి విపరీతమేయగునని తలంపవలయు"నని చెప్పఁబడినదగుచున్నది.

ప్రభా :— ప్రకరణాదులచేత నొకప్పుడు వ్యంగ్యమగు నర్థముపలక్ష్యమానమగుచుండును, దానిచేత - వాచ్యనిశ్చయము - సంపాదింపఁబడునపుడా వ్యంగ్యము - వాచ్యమునకంగమైనను, వేరొక వ్యంగ్యమున కుపస్కారకమగుచుండునపుడావ్యంగ్యమునకుఁ బ్రాధాన్యమేర్పడవచ్చును. కనుక, నపుడది - ధ్వనియేయగును" అనుటకుదాహరణము నొసఁగుచున్నాఁడు.

(155) మూలము :— దీనికుదా :-

తే॥ హాలికస్నుష! రాలినపూలె కొనుము!
కదలుపకుమమ్మ! శేఫాలికాలతికను;
వెలికివినఁబడుచున్న నీవలయరవము-
విషమ పరిణామమగు మామవిన్నయెడల.

"ఒకానొక సఖి- [కామినియగు నాయిక]-(పెరటిలోనున్న శేఫాలికానికుంజమున) అవినయపతితోఁగూడి - (ఉద్ధతముగ) క్రీడించుచుండెను. (కనుకనే) ఆమె వలయములగలగలధ్వని-వెలికి (స్పష్టముగ) వినఁబడుచుండెను. ఆచప్పుడు వినుచున్న యామె సఖి - ఆమెనిట్లు ప్రతిబోధించుచున్నది." అనునిది - [సఖీకర్తృక నాయకా ప్రతిబోధనరూపమగు నీవ్యంగ్యము - ] ఇచట-వాచ్యార్థ ప్రతిపత్తికై, అపేక్షణీయమగుచున్నది. [ఈవ్యంగ్యమును సహక రించుకొని లభించిన] వాచ్యార్థము - తెలియఁబడినపిమ్మట - (శబ్ద ముచేతఁ దెలుపఁబడినపిమ్మట) అది- ["శేఫాలికాలతికనూపకుము" ఇత్యాది రూపమగు నావాచ్యార్థము-] అవినయ ప్రచ్ఛాదనతాత్ప ర్యమునఁ (దొంగసురతమును గప్పిపుచ్చు నఖిప్రాయముచేతఁ) దెలుపఁబడుటవలన, తిరుగ ("వలయాదులు శబ్దించునట్లు స్వైర విహారము నొనర్పకుము" అను, వేరొక) వ్యంగ్యమున కంగమే యగును. కనుకనిది - ఈయనురణనరూప వ్యంగ్యధ్వని యందంత ర్భవించునదియేయగును.

ప్రిభా :— మీది యాంధ్రీకృతికి మూలమగు ప్రాకృతగాధకు సంబం ధించిన సంస్కృతచ్ఛాయ - లోచనమున నిట్లు ప్రిసారితము.

లోచ :— ఉచ్చినుపతితంకుసుమం, మాధునీహి శేఫాలికాంహాలికస్నుషే॥
ఏషతేవిషమ విపాకః శ్వశురేణ శ్రుతోవలయశబ్దః.

(ఈమె) మామ - శేఫాలికాలతికను (బహు) ప్రయత్నములతో రక్షించు చు, దాని యాకర్షణధూననాదులను (సహింపక. అట్లొనర్చినవారి నెవ్వరినైనను) కోపగించుచుండును. దానిచేత నిచట "వలయాదిశబ్దము-(ఈమెగాజులచప్పుడు) మున్నగునది - విషమవిపాకము (అనిష్టజనకమగు పరిణామముగలది) అగును" అనితలంపఁదగును. అట్లు తలఁపనియెడల; నిచట - స్వోక్తిచేతనే - వ్యంగ్యాక్షే పము కలుగవలసివచ్చును. మఱియు, నిచ్చటఁగూడ, "ఎవనికైనను" అను (ప్రథమోద్ద్యోతమున నుదాహృతమగు) పద్యమునననుసరించి [విషయభేదముచేత నానావిధ వ్యంగ్యవ్యవస్థాపనమును] వ్యాఖ్యనొనర్పవలయును.

ప్రభా : అవ :— "వాచ్యార్థ ప్రతిపత్తికై" అనువృత్తిని వివరించుచున్నాఁడు.

లోచ :— "వాచ్యార్థప్రతిపత్తికై" అనఁగా; "వాచ్యార్థలాభముకొఱకు", అనియర్థము. "అనునది-యపేక్షణీయము." అనఁగా; "ఒకానొకసఖి'అని యారంభించి, - ప్రతిబోధించుచున్నది." అనునంతవఱకునుగల వ్యంగ్యము -అపేక్షణీయమగుచున్నది. [ఆవశ్యకమగుచున్నది.]" అనియర్థము. అట్లపేక్షింపనిచో [వ్యంగ్యమగు నీసందర్భమును దెలియనియెడల] వాచ్యార్థము లభింపనిది కావలసివచ్చును. [ఏలయనిన, శేఫాలికలతనూపినయెడల మామకోపించుననునది నాయికాదులకు స్వయముగాఁదెలియుటచేత-స్వతసిద్ధమే. [స్వయముగా సిద్ధించునదియే] కనుక శేఫాలికనూపకుమని చెప్పుట నిష్ప్రయోజనమేయగును. కనుక నాయర్థము- (పూలకొఱకు శేఫాలికమ గదలింపకుము" ఇత్యాద్యర్థము-] అవచనీయమే [తెలుపవలసినదికానిదే] యగునుగదా!

ప్రశ్న .— అయ్యా! అట్లయినచో, మీదుమిక్కిలి (ఇచట) వాచ్యము-వ్యంగ్యము నుపకరించుకొనుననని చెప్పఁబడినట్లయినదే!.

ఉ :— "వాచ్యార్థము - తెలియఁబడినపిమ్మట" అనఁగా, "శబ్దముచేతఁదెలుపఁబడినపిమ్మట," అనువానిచేత దీనికి-సమాధానముచెప్పఁబడినది.

ప్రభా :— ప్రశ్న :— ప్రకరణాది ప్రతిపత్తిచేత నిర్ధారితమగు వ్యంగ్యము - వాచ్యప్రతిపత్తి కుపకరించునపుడు - వాచ్యమే - ప్రధానమగునుగదా;. అట్టిచోనిది ధ్వని కుదాహరణమెట్లగును?

ఉ :— "గాజులున్నగువానిచప్పుడు వినుచున్నసఖి - నాయికనిట్లు మేలుకొలుపుచున్నది." అనునర్థము - ఇచటఁ బ్రకరణాదులచేత నిర్ధారితమగు వ్యంగ్య విశేషమగుచున్నది. దానినుపకరించుకొని యిచటి వాచ్యార్థము తెలియఁబడుచున్నది. కనుక మీఁది వ్యంగ్యమిచట వాచ్యార్థమున కుపస్కారమగుటవలన వాచ్యము - ప్రధానమగునని తోఁచును. కాని దీనిచేత స్ఫురింపఁజేయఁబడిన వేరొక వ్యంగ్యమునకిది తిరుగ నంగమేయగుచున్నది. కనుక నిచటి వ్యంగ్యాంతరము - ధ్వనిత్వమునొందుచున్నది. ఈయభిప్రాయము - "వాచ్యార్థము తెలియఁబడిన పిమ్మట.... ........ (వేరొక) వ్యంగ్యమున కంగమేయగును." అనుమీఁది వృత్తివాక్యముచేతఁదెలుపఁబడినది.

అదెట్లనిన :- "ఒకానొకసఖి ప్రతిబోధించుచున్నది." అనువ్యంగ్యవిశేషమును - సహకారిగాఁజేసికొని, (అంగముగాఁజేసికొని) "శేఫాలికాలతిక

నూపకుము', ఇత్యాదిరూపమగు వాచ్యమిచట లభించుచున్నది ఈవాచ్యము - "చతురురాలగు నొకసఖిచేత-తనసఖియొనర్చుచున్న యవినయమును గప్పిపుచ్చ వలయునను తాత్పర్యమునఁజెప్పఁబడినది." అనఁగా; "శేఫాలికనూపకుము." అను నభిప్రాయముననఁగాక, నాయికా రహస్యగోపనాభిప్రాయమునఁజెప్పఁబడినది. కనుక,నిది."గాజులు, మున్నగువానిచప్పుడుపైకివినఁబడునట్లు,నీవింత స్వేచ్ఛఁగొని యుద్ధతమగు క్రీడయందు విహరింపకుము" అను వ్యంగ్యార్థమును-తిరుగ స్వశక్తి చేత ధ్వనింపఁజేసి, ఆవ్యంగ్యాంతరమునకు తానంగమగుచున్నది. కనుక, "శేఫా లిక నూపకుము" ఇత్యాది వాచ్యము నంగముగాఁగొని, స్ఫురించిన "గాజులు మున్నగువాని చప్పుడు వెలికివినఁబడునట్లు నీవింత ప్రచండసురతతాండవము నొనర్పకుము" ఇత్యాదివ్యంగ్యము - కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూల మును, వివక్షితాన్య పరవాచ్యభేదమును నగు సంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వనియే యగును." అనునది - వృత్తిగతమగు సమాధానభావమని తెలియునది.

(156) మూలము : అవ :— ఇట్లు వివక్షితవాచ్యమగు ధ్వనికి సంబంధించిన యాభాసమునువివేచించు సందర్భమున, అవి వక్షితవాచ్య ధ్వన్యాభాస వివేకమునుగూడఁ గావించుటకై చెప్పు చున్నాఁడు.

[వివక్షితాన్య పరవాచ్యమగు ధ్వనిప్రభేదమునకు సంబంధిం చిన 'ధ్వన్యాభాసవివేక ప్రస్తావలక్షణమగు ప్రసంగమువలన'-అవి వక్షితవాచ్య ధ్వన్యాభాస వివేకమునుగూడఁ గావించుటకుఁ దెలుపు చున్నాఁడు.]

లోచనము :— (మూలమున) 'ధ్వన్యాభాసవివేకే ప్రస్తుతేసతి'('ధ్వన్యా భాసవివేకము ప్రస్తుతమగునపుడు') అనియున్నది. ఇచటనున్నసప్తమి- హేతువు నుదెలుపును. "తదాభాసవివేక ప్రస్తావలక్షణమగుప్రసంగమువలన" అనునర్థము నిచ్చుటఁదెలుపవలయును. "దేనికి సంబంధించిన ధ్వన్యాభాసవివేకము?" అను ప్రశ్నమునకు-'వివక్షితవాచ్యమునకు సంబంధించినది'.అనియుత్తరమీయఁబడినది. (ఇచటిమూలమును) స్పష్టముగా (యథాశ్రుతముగా) "ప్రస్తుతమగునపుడు" అని వ్యాఖ్యానించునెడల, "ప్రస్తుతమగునపుడు" అనునది - యసంగతమగును. వివక్షితవాచ్యమునకు సంబంధించిన ధ్వన్యాభాసవివేకము - ప్రస్తుతమును,

ఉత్తరకాలమును బంధించునదియుఁ, గూడఁగాక, పరిసమాప్తమగునపుడది ప్రస్తుత మెట్లగును ? [కాఁగా: హేతు, రూపార్థమే - ఇచట స్వీకర్తవ్యము.]

(157) మూలము :—

[కా] అవ్యుత్పత్తే, రశక్తే, ర్వా నిబన్ధోయః స్ఖలద్గతేః।
శబ్దస్య సచనజ్ఞేయః సూరిభిర్విషయోధ్వనేః. (32)

తే॥ కవులు - వ్యుత్పత్తిలేమినిగాని, శక్తి
కలుగమినిగాని, గౌణలాక్షణిక రూప
మును- స్ఖలద్గతియగు శబ్దమును- ఘటింత్రు;
సూరులదియును ధ్వనియని చూడఁదగదు.

"స్ఖలద్‌గతియగు శబ్దమును"-అనఁగా; 'ఉపచరితమగు శబ్దమును-అవ్యుత్పత్తిచేతఁగాని, అశక్తిచేతఁగాని, నిబంధించుటకూడ-[నిబంధింపఁబడినయుపచరిత శబ్దముకూడ-]ధ్వనికివిషయముకాదు.

లోచ :— "గౌణలాక్షణికరూపమును-స్ఖలద్గతియగు శబ్దమును", అనఁగా; "గౌణముగాని, లాక్షణికముగాని, యగుశబ్దము - స్ఖలద్గతియగుచుండును. కనుక, నట్టిశబ్దమును" అనియర్థము. "అవ్యుత్పత్తి" అనఁగా; అనుప్రాసాది నిబంధనమున, తత్పరమగు ప్రవృత్తి. దీనికుదా :— క్రొవ్విరి.

"బాఢప్రేంఖత్ ప్రేమప్రసరప్రచుర పరిచయమ్మగు దేశమునన్।
ప్రౌఢసుందరీ హృదయాకాశావకాశమున విహరించెడివాఁడే-
గాఢసుభగతాస్థానము." అనునది.

ఇచ్చట - ఏతత్కవి - అనుప్రాసరసికతచేత - "ప్రేంఖత్" అను లాక్షణిక (స్ఖలద్గతికశబ్ద) ప్రయోగమును, 'హృదయాకాశ' అను గౌణశబ్దప్రయోగమును, కావించెను. అయిననది - ధ్వన్యమానరూపమగు సుందర ప్రయోజనాంశమునఁ బర్యవసించునదికాదు. అశక్తియనఁగా; వృత్తపరిపూరణాదులయందు సమర్థములేకుండుట. దీనికుదా :—

తే. పంచకాండకకుటుంబక సంచయ ప్ర
వరః చలతరంగ ఘూర్ణితభాజనమగు
సఖ్ధిఁబడుచున్న కుడ్యమయమ్మయిన భ
వత్తనువునందు - 'విచలతావృత్తి' - కృతము.

ఇచట, "పంచకాండ కుటుంబక సంచయప్రివరః" అనునంతవఱకును గల మొదటిపదము - చంద్రునియందుపచరితము. [ఆరోపితము.] ఇట్లే "భాజనము" అనుపదము - (పాత్రము, యోగ్యము, అను నర్థమునఁ బ్రసిద్ధమగునది-) 'ఆశయము' ('ఆధారము.') అనునర్థమునందును, 'కుడ్యమయమ్ము' అనుపదము - (గోడరూపుగలది అనునర్థముగలది-) 'అచంచలము' అనునర్థమునందును, ఉపచరితము. ఇచట నీప్రయోగము-వృత్తపూరణము నొనర్చుచున్నది యేకాని, వేరొక కాంతిని, దేనినిగూడ - పోషించుటలేదు. "అదికూడ" అనుచో నున్న 'కూడ' శబ్దార్థమిది :— "ప్రథమోద్యోతమునందు "ఉపచరితమగు శబ్దవృత్తిచేత (ఆరోపితమగు శబ్దవ్యాపారముచేత) కవి పరంపరా ప్రసిద్ధి ననుసరించి,వ్యవహరించినకవులు - కానుపించుచున్నారు." అనుచోట "బిసినీపలాశ యనమ్మవచించు" ఇత్యాదిగా 'భాక్తము' చెప్పఁబడినది. అయినను, అదిమాత్రమే - ధ్వనివిషయముకానిదికాదు. అన్యముకూడ - ('కవులువ్యుత్పత్తిలేమిని' ఇత్యాదిగాఁ జెప్పబడినప్రకారముకూడ)ధ్వనివిషయముకానిదియేయగును." అనునది. [ప్రథమోద్యోత సంపుటమున 282 నుండి 286వ పేజీ వఱకును జూచునది.]

అవ :— "కారికాకారుఁడు - పూర్వోక్తమగు ధ్వనిస్వరూపమునే-ధ్వన్యాభాస వివేకహేతువుగా, అనువదించుచున్నాఁడు." అనునభిప్రాయమున వృత్తికర్త యుపస్కారము నొనఁగుచున్నాఁడు.

(158) మూలము :— ఏకారణమువలన

[కా] సర్వేష్వేవ ప్రభేదేషు స్ఫుటత్వేనావభాసనమ్।
యద్వ్యఙ్గ్యస్యాఙ్గిభూతస్య తత్ పూర్ణంధ్వనిలక్షణమ్. 33

ఆ॥ అంగియగుచునుండు వ్యంగ్యమ్ము-స్వప్రకా
రమ్ము లంతటను స్ఫుటమ్ముగ,నవ
భాసమానమగుచు, భాసించునికి-పూ
ర్ణమగుచుండు లక్షణమ్ము ధ్వనికి.

అదియు, వెనుక నుదాహరింపబడినదియే యగుచున్నది. ఇది - శ్రీ రాజానక, ఆనందవర్ధనాచార్య విరచితమగు ధ్వన్యాలోకమున, ద్వితీయోద్ద్యోతము.

లోచనము :— ''భావానయనమున, ద్రవ్యానయనముకలుగును.'' అను న్యాయమువలన [సంస్కృతమూలమునందలి] 'అవభాసన' పదముచేత - అవభాసమానమగు (వ్యంజింపఁజేయఁబడునదియగు) వ్యంగ్యము లక్షింపఁబడును. ''పూర్ణమగుచుండులక్షణమ్ముధ్వనికి'' అనఁగా; ''పూర్ణమగు ధ్వనిస్వరూపము'' అనియర్థము. లేక, అవభాసనము'' అనఁగా; జ్ఞానము. అది - ధ్వనికిలక్షణము, అనఁగా, 'ప్రమాణము' అనియర్థము. పూర్ణమగు ధ్వనిస్వరూపమును నివేదించునదియగుటవలన అదికూడ - [స్ఫుటముగాఁ దెలియుటకూడ] పూర్ణము,

ప్రిభా : అవ :— ''లక్షణ- జ్ఞానములకు- పరిచ్ఛేద్య పరిచ్ఛేదకభావము వలనవాని ఐక్యరూపమున నిచట నిర్దేశము'' అనుచున్నాఁడు.

లోచనము :— అథవా (లేక)' లక్షణము- జ్ఞానపరిచ్ఛేద్యము, కనుక,' జ్ఞానమే - లక్షణము. [వృత్తియందు] ''దానికంటె నితరమగు వ్యంగ్యము - అభాసరూపమే.'' అని సూచించునదియగు నేకారము (ఏవకారార్థకము) చేత- ధ్వన్యాభాస వివేకమేది ప్రకాశింతమో - అదియే - నిర్వాహితము ఇతి- శివమ్. 'శ్రీజగన్మాతృ నమస్కృతి.' [అభినవగుప్తకృతి కాంధ్రీకృతి.]

తే॥ ప్రాజ్యమగు నీజగమ్ము - ప్రోల్లాసమాత్రి
మగుచు, సద్భేదమగుచుండు నటులొనర్చి;
దీనిఁగనుచుండు నాయమన్,' నేనభినవ
గుప్తుఁడ' నమస్కృతి ఘటించికొలుచుచుందు.

ఇది - శ్రీ మహామాహేశ్వరాచార్యవర్యాభినవగుప్తోన్మీలితమగు, ధ్వన్యాలోక లోచనమున - ధ్వనిసంకేతమున-ద్వితీయమగు, ఉద్ద్యోతము.

ప్రిభా :— ''లక్షణము.... కనుక'' అనఁగా; ''లక్షణము-లక్ష్యజ్ఞానము చేత నిర్ణయింపఁదగినది కనుక'' అనియర్థము . గవాదిలక్షణము- గవాదిజ్ఞానము చేతనే నిర్ణయింపఁబడునుగదా!. ''అంగిగానుండి,తనకుసంబంధించినభేదములన్నిఁటియందునుగూడ స్పష్టముగా నవభాసమానమగు (స్ఫురింపఁజేయఁబడునదియగు)

లేక, తెలియఁబడుఁనదియగు, వ్యంగ్యమే - పూర్ణమగు ధ్వనిస్వరూపము.''
అనునది - ఫలితార్థము.

మ. ఆనందధ్వనిరూప తత్త్వము - సుకావ్యాత్మ స్వరూపమ్ము, బ్ర
హ్మానంద ప్రతిభవానుభావమది - గూఢాలోకమై, లోచన
ప్రాణశ్రీ వెలుఁగొంద; మూటికి సమగ్రాంధ్రీకృతిం గూర్చి, నీ
వే! నాతల్లి! 'ప్రభామతి'ద్యుతివిగా, నేనెవ్వఁడన్ భారతీ!

* పొగడ

ప్రసృత కుసుమమాలాబంధన సమ - పదవినిబంధనలీలా! ...
రసభావగుణాభరణాదిగణా! రమణీయార్థస్ఫురణా!
విస్మరమర వినయప్రవణసంస్కృతీ! విమలాత్మకథాప్రకృతీ!
లసిత జ్ఞానానందమయగతీ! లావణ్యవతీ! సుకృతీ!

కం॥ వాణీ! ప్రణవ ధ్వనిమయ
వీణా నిక్వాణరూప విద్యాలాప
శ్రేణీ! వాగ్, గీతి, కళా
ప్రాణస్తనకలశయుగళి! భాషాజననీ!

గద్యము :— ఇది - శ్రీ రాజానక ఆనందవర్ధనాచార్య ప్రణీత ధ్వన్యాలోకమునకును, శ్రీమదభినవగుప్త లోచనమునకును, ఆంధ్రీకృతిరూపమును, స్వవిరచిత 'ప్రభామతి' వ్యాఖ్యానసమన్వితమును, శ్రీమదన్నపూర్ణాంబా, వేంకటరామ బుధేంద్ర, ద్వితీయపుత్త్ర, 'సీతారామా'ప్రియ, శ్రీవాగ్దేవతోపాసక, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, విరచితమును, నగు, ఆంధ్రధ్వన్యాలోకమునందలి ద్వితీయోద్ద్యోతము.

ఓమ్. తత్. సత్.

---

* ద్వితీయోద్ద్యోతమున 25వ పేజీయందుఁజూచునది. ఇది - ప్రభామతి ప్రసారితమగు నూతన జాతీయపద్యము. ప్రతిపాదమునను 28 మాత్రలుగల గణములుండును. 16 మాత్రలమీఁద-వడియుండును. చతురశ్రగతిగలది. పాదాంతమున 4 మాత్రల కాలమాగినయెడల చతురశ్ర జాతిగల త్రిపుట (ఆది) తాళమున నడుచును.

ఓం నమోభగవతే శ్రీరమణాయ.

# శోధిక.

[ఆంధ్రధ్వన్యాలోకము - ద్వితీయోద్యోతమునకు సంబంధించినది.]

| పేజీ | పంక్తి | ఒప్పు. |
|---|---|---|
| 1 | 15 | అవివక్షిత |
| 5 | 16 | (3A) |
| 8 | 26 | వేఱుగా నాస్వాదింపఁబడనట్లు. |
| 8 | 32 | [సౌందర్యాతిశయకారియగు] |
| 9 | 15 | (3B) |
| 25 | 17 పొగడ. | దీనికి-ప్రతిపాదమునందును 28 మాత్ర లుండును. పదునారుమాత్రలమీఁద వడి యుండును. నాలుగు మాత్రిలకాలము-పాదముచివరనాగినయెడల, దీనినిచతుర శ్రజాతిత్రిపుటతాళమునఁ బఠింపనగును. |
| 28 | 11 | లోచనము. కొన్ని |
| 60 | 14 | చం. తలిః శతపత్త్రి పత్త్రిమృదు |
| 62 | 6 | అనఁగా; ఆఖంటకు - |
| 85 | 23 | గ్రహింపవలయును'' అనుపాఠముండుట |
| 86 | 24 | (38A) |
| 86 | 26 | సర్వరచనా |
| 90 | 15 | (38B) |
| 106 | 6 | వాలుగాగళమెనసి, వీలుగానురమెరసి, |
| 108 | 15 | అలంకారము - తాను |
| 112 | 13 | సాలంకారములునయి, |
| 112 | 20 | సమునందు నంగభావము |
| 112 | 24 | నంగభావ |
| 115 | 26 | వ్రిత: నీవేకృతి |
| 116 | 15 | దృష్టినే. నల్లకలువ |
| 118 | 27 | ఇచట, కవికి - |
| 121 | 1 | [కాంతాపక్షమున] |
| 122 | 13 | ళ్లు, నిటుల్, |
| 122 | 23 | ననురక్తుఁడనై |
| 128 | 17 | పర్రిశయానిలుకైన |
| 128 | 19 | ద్వీపసమస్త |
| 130 | 30 | ఉపమను గూర్చునదియగు. |

| పేజీ | పంక్తి | | ఒప్పు |
|---|---|---|---|
| 134 | 20 | | (71) మూలము :— |
| 143 | 8 | | అను ప్రథమపాదము |
| 158 | 17 | వెండితెర. | దీనియందు-ప్రతిపాదమునను 39 మాత్రలుండును. 20 మాత్రలమీఁద- వడియుండును. పాదముచివర నొకమాత్ర కాలమాగినయెడల, దీనిని-ఖండగతి యందుఁగాని, ఖండజాతిత్రిపుటతాళమునందు గాని, పఠింపవచ్చును. |
| 200 | 19 | | [అనుచోటనున్న |
| 201 | 31 | | ఔపాధికము |
| 214 | 21 | | చామంతిరేకు. 'పవనచలత్' |
| 224 | 26 | | 20 మాత్రలమీఁద వడియుండును. |
| 237 | 5 | | త్యాగైకరసో దరిద్రశ్చ |
| 246 | 14 | | శబ్దమర్థము |
| 253 | 20 | | వాక్య |
| 266 | 4 | | వాచ్యస్యాఙ్గతయావాఽపి |

105వ పేజీయందుఁగల "కలువతీఁగ" అను నూతనజాతీయపద్యమునకును, 225వ పేజీయందుఁగల "జాబిల్లి"కినిగలభేదము నిట్లెఱుఁగునది. కలువతీఁగయందు - ప్రతిపాదమునను మొదటిగణము- రగణముగానుండును. జాబిల్లియందు - రగణ, తగణములలో నేదయినను మొదటిగణముగానుండును. తదితరలక్షణము - రెంటికిని సమముగానుండును.

---

ప్రథమోద్ద్యోతమునందలి లోచన ప్రారంభమునఁ గ్రింది పద్యములను జేర్చి పఠింపవలయును.

ఇది- మిటారి. అనునూతనజాతీయము. [ప్రఖ్యామతి ప్రసారితము.] దీనికిఁ బ్రతిపాదమునందును 44 మాత్రలుండును. పాదముచివర 4 మాత్రలకాలమాగి త్రిశ్రగతిని వ్రాఁతనగును. 256వ పేజీయందుఁ బ్రదర్శింపఁబడిన,'ఒయ్యారి'కంటె ఈ'మిటారి' - ఒకమాత్రచేత నాధిక్యమును గలిగియున్నది. తదితరలక్షణము - సమానమైయున్నది.

౧

తత్త్వమ్మెయ్యది - కారణకళలేకయె, అపూర్వమయి,
తనరు వస్తువును సృజించి, విస్తరించునో
తత్త్వమ్మెయ్యది - పాషాణముఁబోలిన, యీజగమును
తనరసభరమున సారముగా రచించునో;
తత్త్వమ్మది - ప్రఖ్యోపాఖ్యముల క్రమప్రసరణమున
తరళసుభగముగ దీనిని వెలుఁగజేయునో;
తత్త్వము శ్రీభారతీయమది-సుకవి సహృదయాఖ్యము-
ధన్యము, గణ్యమ్ము, నగుచు విజయముఁగాంచున్.

నవలా. (౨)

'భట్టేందురాజ' పదాబ్జకృతాధి - వాసుఁడ'నేనభినవగుప్తపదుఁడ'
నెట్టెట్టో, ధ్వన్యాలోకము నొక్కింతయనురణించెద; నల్లైనను.
గుట్టెఱిఁగి, స్వాలోచన నియోజనముఁగూర్చి,'యథార్థాలోకము'గాఁగా,
గట్టిగ, స్పష్టమొనర్చెద "శ్రీసత్కావ్యాలోకము" నీలోకమునకు.

ఓమ్. తత్. సత్.

ఓం నమో భగవతే, శ్రీరమణాయ.
[illegible]

## ప్రథమానుబంధము. (౧)

* [ప్రథమోద్ద్యోతమున నిబంధింపఁబడిన లోచనోన్మీలిత విషయము.]

# రసాలోకము.

పరిభాషితి :— ఇంతకుముందు "ధూమశబ్దము- ధూమరూపమగు స్వార్థమునందే విశ్రాంతిని బొందునట్లు, విభావాదులను (శకుంతలాదులను) బోధించునవియగు శబ్దములు - విభావాది రూపములగు స్వార్థమునందే విశ్రాంతములగును. కనుక, రసాదిప్రతీతియందు లక్షణావ్యాపారమునకు అవకాశము లేదు." అని సిద్ధాంత మొనర్పఁబడినది. ఈసిద్ధాంతమునువినియు, "నేనేవాక్యార్థప్రతీతి తత్త్వజ్ఞుఁడను." అని గర్వించిన మీమాంసకుఁడిట్లనుచున్నాఁడు.

—, "రసప్రతీతి-శబ్దవ్యాపారజన్యముకాదు." అనుమీమాంసకుని యాశంక :—

లోచనము :— "అయ్యా! (ధూమశబ్దమువలన దానియర్థమగు) పొగ - తెలియఁబడినపిమ్మట అగ్నియొక్క స్మరణము కలుగునట్లు, విభావాదులు-తెలియఁబడినపిమ్మట - రత్యాదిచిత్తవృత్తులు తెలియఁబడును. కనుక, రసప్రతీతి విషయమున శబ్దవ్యాపారము - లేనేలేదు." (అని మీమాంసకుఁడనవచ్చును.)

ప్రథా :— "విభావాదులు తెలియఁబడిన పిమ్మట కలుగునదియగు రత్యాది ప్రతీతి- ధూమాదిప్రతీతిచేత జనించునదియగు, అగ్న్యాది స్మృతివంటిదేయగును. కనుక, అయ్యగ్న్యాదుల స్మృతివలె, ఈ రసాది ప్రతీతికూడ - శబ్దవ్యాపారము వలనను, జనించునదికానిదైయుండఁగా; అది- వ్యంజనావ్యాపార జన్యమెట్లగును ? అనఁగా; రసాదిప్రతీతియందు-లక్షణకువలె, వ్యంజనకుఁగూడ-ప్రసక్తియుండదు." అనునది మీమాంసకుని యాశంక.

---

["ఆంధ్రధ్వన్యాలోకమునందలి ప్రథమోద్ద్యోతమునందలి 300వ పేజీయందు "లక్షణావ్యాపారమునకవకాశము లేదు." అను 21వ పంక్తిక్రిందయువాత, లోచనమునఁ దెలుపఁబడిన రసతత్త్వము - ఈప్రథమానుబంధమునందలి 'రసాలోకము'గా నిబంధింపఁబడినది" అని పాఠకులు తెలియునది.]

## 2

### —* పరకీయ చిత్తవృత్తిప్రతీతి - రసప్రతీతికాదు *—

లోచ :— అట్లైనచో (వాక్యార్థ) ప్రతీతి స్వరూపమ్మెట్టిదగు మీమాంసకు నిది యడుగవలసియున్నది. "అయ్యా! పరచిత్తవృత్తిమాత్రము నెఱుగుటయే-రసప్రతిపత్తి" అనియా! నీయభిమతము? ఇట్లునీవు భ్రమపడఁదగదు. అట్లైనచో; [అనఁగా; లౌకికమగు (పరకీయమగు) చిత్తవృత్తి నెఱుఁగుటయే-రసప్రతీతియగు నెడల] ఆరసప్రతీతి - లోకమునందగునదియగు చిత్తవృత్త్యనుమాన మాత్రమే యగుటవలన - రసముకాఁజాలునా ? (ఆస్వాదింపఁబడునదియగునా ?)

ప్రభా :— "ధూమజ్ఞానమువలన - అగ్నిననుమానించునట్లు, విభావాది ప్రతీతివలన-పరకీయములగు రత్యాది చిత్తవృత్తుల నూహించుటయే రసప్రతీతి." అనునది-మీమాంసకుని యభిప్రాయమగునెడల; నది-భ్రాంతిమూలకమేయగును. పరకీయ చిత్తవృత్తులగు రత్యాదుల యనుమానము - (ఊహించుట) శబ్దవ్యాపారమువలన జనించునదికాదనునంశమును - మేముకూడ నంగీకరింతుము. కాని, ధూమజ్ఞానమువలన నగ్నిననుమానించునపుడు (ఊహించునపుడు) రసత్వము (ఏమియునాస్వాద్యత) కలుగనట్లు, పరకీయ చిత్తవృత్తి నూహించునపుడుగూడ రసత్వముకలుగదు. ఏదియాస్వాదింపఁబడునో; [అనుభవింపఁబడునో;] అదియే-రసము. కాఁగా; లౌకికమగు పరకీయ చిత్తవృత్తిమాత్రప్రతీతి - రసప్రతీతి యెట్లగును ? [అనుమితిరూపమగు లౌకిక (పరకీయ) చిత్తవృత్తిమాత్రప్రతీతియందు స్వల్పమైనను నాస్వాద్యతకలుగునా ?"] అనిభావము.

లోచ :— రసాస్వాదము - అలౌకిక చమత్కారాత్మ. కానిని, కావ్యగతమగు విభావాది చర్వణయే - (ఆస్వాదమే) - ప్రాణమగుచుండును. కనుక, అది - కావ్యగతవిభావాది చర్వణాప్రాణము. అట్టి రసాస్వాదము - స్మరణా[illegible] మానములతోడి సామ్యముచేత, ఖిలీకారపాత్రముగా [భ్రష్టమగుటకుఁదగినదిగా] చేయఁదగినదికాదు.

ప్రభా :— రసాస్వాదము- లౌకికసుఖాస్వాదముకాదు, అది-అలౌకికము. కావ్య, నాట్య, గతములగు విభావాదుల యాస్వాదమే-దీనికి ప్రాణమైయున్నది. ఈరసాస్వాదముకూడ - స్మరణమువంటిదిగాని, అనుమానమువంటిదిగాని, యగుననిచెప్పి, అలౌకికమగు రసాస్వాదమునకు సంబంధించిన గౌరవము భ్రష్టమొనర్పఁదగదని భావము.

### —• రసమెట్లు ప్రతీతమగును ? •—

లోచ :— లౌకికమగు 'కార్యకారణానుమానము' మున్నగు వానిచేత-సహృదయజ్ఞాతయొక్క హృదయము - (మొదటనే) సంస్కరింపఁబడియుండును. అసంస్కారముగల సహృదయుఁడే - కావ్యనాట్యగతములగు విభావాదులను గ్రహించును. ఆసహృదయుఁడగు జ్ఞాత - విభావానుభావ, వ్యభిచారిభావములను [నాయికా నాయకాదులను, తత్కటాక్షాదులను, లజ్జాదులను] తటస్థములుగా [తనకంటె నితరులగు దుష్యంతాదులకు సంబంధించినవిగా] గ్రహింపఁడు. "అతఁడీ విభావాదుల నింకెట్లు గ్రహించును ?" అనిన; "హృదయ సంవాదము" అనుమారుపేరుగల, సహృదయత్వముచేత పారవశ్యము నొందింపఁబడుటవలన ఈవిభావాదుల నతఁడు - (ముందుముందు) పూర్ణీభవింపఁగలదియగు రసాస్వాదమునకు సంబంధించిన యంకురీభావముచేత- అనుమానము, స్మరణము, మున్నగు సరణిని (అనుమితి, స్మృత్యాద్యుపాయమును, వ్యాప్తి జ్ఞానాదికమును) అవలంబింపకయే, తన్మయీభవనమున, ఉచితమగు చర్వణా ప్రాణతచేత-ఆస్వాదమున కుపయోగించు వానినిగానే గ్రహించును.

పరిభా :— సహృదయవివేకి - లోకమునందలి నాయికానాయకుల పరస్పరావలోకనము, స్మితము, మున్నగువానివలన, వారి హృదయమునందలి రత్యాది చిత్తవృత్తుల నూహించియుండుటవలన - ఆసంస్కారముతోఁగూడిన యాతఁడు - కావ్యమున వర్ణింపఁబడినవియు, నాట్యమున, సాత్త్వికాంగిక వాచికాహార్యరూపములగు, నభినయములచేతఁ బ్రదర్శింపఁబడినవియు, నగు విభావాదులను, తటస్థములుగా గ్రహింపఁడు. ఈవిభావాదులు-సహృదయుని-వానికిఁగల సహృదయత్వము (హృదయ సంవాదము) చేత-పరవశీకరించి, ముందుపూర్ణముకావలసియున్న రసమునకు (ఆస్వాదమునకు) సహృదయహృదయమునందంకురమునేర్పరచి, అనుమాన స్మరణాదిమార్గము నాశ్రయింపకయే - తన్మయీభవనమున నుచితమగు నాస్వాదమునకు-ప్రాణము (ఉపయోగి) లగుచున్నవి. కనుక, ఈవిభావాదుల నతఁడు - తన్ను-తన్మయునిగాఁజేయునవియగు నాస్వాదమునకు (రసమునకు) ప్రాణములనుగానే (ఉపయోగులుగనే) గ్రహించును. [ఆవిభావాదులు - రసాస్వాదోపయోగులగుటవలన-వానినతఁడు- సాధారణములుగనే గ్రహించును.]

లోచ :— ఈ చర్వణ (అనుభూతి) ఇంతకుముందు-వేరొక ప్రమాణముచేతనైనను బుద్ధియుండినయెడల నిప్పుడది - స్మృతికావచ్చును. ఏ ప్రమాణముచేతను జనింపని యాచర్వణ-(ఆస్వాదనము) స్మృతియెట్లగును ?

## —• రసప్రతీతి - లౌకికముకాదు •—

అలౌకికమగు రసప్రతీతియెడల, ప్రత్యక్షములు - పనిచేయఁజాలునవికావు. కనుక, వేరొకప్రమాణము దేనిచేతనుగూడ - రసచర్వణ - పుట్టదు. కనుకనే, [రసప్రతీతి - అలౌకికము - కనుకనే] రసప్రతీతికిఁ గారణములగు నాయికాదు లను (స్త్రీ పురుషాదులను) కాదంబాదులనక. (అలౌకికములగు) విభావాదులనుగా వ్యవహరించుచున్నారు. [స్థాయిభావమును, వ్యభిచారులును, దీనిచేతనే విశే షించి భావింపఁజేయబడును. కనుక,] విభావము - విజ్ఞానార్థము.

లౌకికమగు చిత్తవృత్తికిఁగారణమగు కాంతాదులను లోకమునందు- కారణ మనియే వ్యవహరింతురు, కాని, విభావమని వ్యవహరింపరు, ఇట్లే, అనుభావము కూడ, వాచికము, ఆంగికము, సాత్త్వికము, అగు సభిసయములచేత(స్థాయులగు రత్యాదులను, వ్యభిచారులగు నిర్వేదాదులను) అనుభావింపఁజేయును. కనుక, అనుభావముకూడ - అలౌకికమేయగును.'' అని, భరతనాట్యమునఁ జెప్పఁబడినది గదా !

(శ్రోతలును, సామాజికులును, నగు సహృదయులు) చిత్తవృత్తిరూపము లగు స్థాయిభావములయు, వ్యభిచారిభావములయు, తన్మయము నొందుటయే - అనుభవనము. (అనుభావము)

ప్రభా :— ''పరకీయమగు చిత్తవృత్తిసూహించి, తెలియుట - యిచట ననుభవనముకాదు. కావ్యగతములగు వర్ణనలవలన(శ్రోతలును,సాత్త్వికాభినయ ప్రయోగములవలన సహృదయ సామాజికులును )ఆయాచిత్తవృత్తులను భావిం చునప్పుడు, తత్సజాతీయములగు స్వీయచిత్తవృత్తులయుద్బోధము కలుగును. ఆ చిత్తవృత్తుల తన్మయీభవనమే - అనఁగా; అనుభవనమే - అనుభావము.'' అని భావము.

లోకమునందు మాత్రము చిత్తవృత్తికిఁ గార్యమగు కటాక్షాదిక్రము - కార్య మనియే వ్యవహరింపఁబడును గాని, అనుభావమని వ్యవహరింపఁబడదు.సవిరాదు. కాఁగా; అనుభావమనఁగా;కావ్యాదులవలన సహృదయుల కొదవునదియగు నను భవమేకాని, లోకమునందలి పరకీయచిత్తవృత్త్యనుమితిమాత్రముకాదు.

* రసప్రతీతి-పరకీయచిత్తవృత్తి ప్రతీతికాదు. అది - సహృదయనిష్ఠమేయగును *

లోచ :— ''కనుకనే, (కావ్యాదులవలన)పరకీయచిత్తవృత్తి-గమ్యమును

నదికాదు. (సామాజికులచేత - స్వీయమగు చిత్తవృత్తియే అనుభవింపఁబడును.'') అనునభిప్రాయమున, భరతమునిచేత "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్ రసనిష్పత్తిః" "విభావానుభావ వ్యభిచారిభావముల సంయోగమువలన రసము నిష్పన్నమగును." అనుసూత్రమునందు - స్థాయిభావగ్రహణము - కావింపఁబడుటలేదు.

ప్రభా :— లోకమునందు, ప్రియుఁడు ప్రేయసులగు స్త్రీపురుషులయందు స్థాయులగు (స్థిరముగానుండునవియగు) రత్యాది (ప్రేమమున్నగు) చిత్తవృత్తులకు ఆలంబనకారణములగు, స్త్రీపురుషులను, ఉద్దీపనకారణములగు వనవిహార, వసంత,మలయానిలాదులను, ఆరత్యాదులకు కార్యములగు కటాక్షమందహాసాదులను, మఱియు, పులకాదులను, స్థాయిచిత్తవృత్తితోఁబాటుసంచరించుచు,ఆ స్థాయి చిత్తవృత్తియగు రత్యాదికమునకు సహకారులగు చింతాదులను, సహృదయ ప్రేక్షకులు చూచుచునే యున్నారుగదా !.

కావ్యమునందుఁగాని, నాట్యమునందుఁగాని- యివి ప్రదర్శితములగునప్పుడు లౌకికములు కాకుండుటవలన-అలౌకికములగును, అలౌకికములగు నాలంబనోద్దీపన కారణములు - రత్యాదులను విశేషించి భావింపఁజేయును. కనుక. విభావము లని చెప్పఁబడును. రత్యాదిస్థాయిభావములవలన, కటాక్షములును, రోమాంచాదులును, గలుగుచున్నవి. కనుక, కార్యములగు నీకటాక్షాదులు- ('అను = పశ్చాత్, భావః = ఉత్పత్తిః. ఏషామ్,' 'అనుభావయ'న్తీతివా)స్థాయిభావమునకుఁ దరువాత నివి పుట్టుటవలనగాని, స్థాయిభావము ననుభవింపఁజేయుటవలనఁగాని, అనుభావములనిచెప్పఁబడును. స్థాయిభావముతోఁగూడి సంచరించుచు. సహకారులగుచింతాదులు - (విశేషేణ అభితః, చరన్తీతి) స్థాయియందుండుటను, ఉన్మగ్న నిమగ్నములగుచు,(సముద్రమునందలి తరంగములవలె) విశేషించి చరించుటవలన, వ్యభిచారులు అనిచెప్పఁబడును. ఇది - విభావానుభావ వ్యభిచారిభావ పదవ్యుత్పత్తి.

అవ :— విభావానుభావ వ్యభిచారిభావములంతోడి సంయోగమను - దేనికి ? అనునాకాంక్షయందు ప్రకృతరసనిష్పత్తిసూత్రమునందు "స్థాయికి" అనిషష్ఠ్యంతము గ్రహింపవలసియున్నను, (కార్యమగు) అనుభావమును గ్రహించుటవలననే తత్కారణమగు స్థాయిభావముయొక్క ప్రతీతికలుగును.' అను నభిప్రాయమున స్థాయిభావము గ్రహింపఁబడినదికాదు. మఱియు, "దానిని గ్రహించుట వలన అనిష్టమగు నర్థమేర్పడును'' అని చెప్పుచున్నాఁడు.

లోచ :— శ్రీ భరతముని మీఁది సూత్రమున స్థాయినిగూడ గ్రహించిన

యెడల, ఈస్థాయిభావగ్రహణము - ప్రతీత్యుత - శల్యభూతము. (మిగుమిక్కిలి, అత్యంతమును బాధించునది - అనఁగా, అనుభూతివిరుద్ధమగు నర్థమును చెప్పుట వలన విఘటించునది) కావలసివచ్చెడిని.

ప్రభా :— “సహృదయుఁడు-విభావాది వ్యంజితమును, స్థాయిరత్యాది రూపమునునగు స్వచిత్తవృత్తినే ఆస్వాదించును. కనుక, ఈసూత్రమున భరత ముని- స్థాయిభావమునుగూడ - గ్రహించునెడల; నప్పుడు - పరకీయమగు చిత్త వృత్తిని (నాయకాది నిష్ఠమగు రత్యాదికమును) దెలిసికొనుటయే - రసము” అను నర్థమేర్పడుటవలన నిచట స్థాయినిగ్రహించుట - మిగుమిక్కిలి అనిష్టము నాపాదించునదికూడఁగావలసివచ్చును” అనిభావము. పరకీయ(నాయకాదినిష్ఠ)చిత్తవృత్తి- (శ్రోతృ, సామాజిక) సహృదయ చర్వణకుపయోగించునదికాదు, ఇచట - స్థాయి భావసంయోగముగూడ గ్రహింపఁబడునెడల; పరకీయమగు (నాయకాదినిష్ఠమగు) రత్యాది చిత్తవృత్తికూడ - రసముకావలసివచ్చెడిని.

అవ:— “అయ్యా! భరతనాట్యసూత్రకారాదులు-“స్థాయియేరసమగును” అని చెప్పియున్నారే! అదియెట్లు కుదురుపడును.” అని యాశంకించి-శ్రీమదభినవ గుప్తపాదులు - స్వలోచనోన్మీలనము నొనర్చుచున్నారు.

లోచ :— కావ్యనాట్యప్రదర్శిత నాయికానాయకాదిగతమగు స్థాయికి సంబంధించిన విభావానుభావముల కుచితమగు,రత్యాదిచిత్తవృత్తి సంస్కారమేది- సహృదయుల హృదయము నందుండునో; దానినే - ( స హృ ద య ని ష్ఠ మ గు స్థా యి నే ) వి భా వా ను భా వ ము లు ద్బో ధిం చు ను. ఆయుద్బోధముచేత సుందరమగు నాస్వాదము (రసము) ఉదయించుటవలన స్థాయియే- రసమని, ఔచిత్యమువలన స్థాయియగు రత్యాదికమునకురసీభావము - చెప్పఁబడుచున్నది. కాని, స్థాయియే - రసముకాదు. మఱియు, హృదయ సంవా దమున కుపయోగించునదియును, లోకచిత్తవృత్తి పరిజ్ఞానము- కేనియెడల. హృద యసంవాదము [అనఁగా సహృదయులకు - కావ్యనాట్యప్రకాశితములగు తత్తద్ విభావాది పదార్థములరూపమున భాసించునదియగు చిత్తవృత్తి]కలుగదు. కనుక, హృదయ సంవాదమున కుపయోగించునదియగు లోకచిత్తవృత్తి పరిజ్ఞానముకావల యును. ఆచిత్తవృత్తినెఱుఁగు నవస్థయందు 'కాంత' మున్నగు (ఆలంబన) కార ణములచేతను, 'ఉద్యానము' (ఉద్యానవిహారము), మున్నగు ('ఉద్దీపన') కార ణములచేతను. రోమాంచము ('పులకలు-పులకోద్గమము') మున్నగు కార్యముల చేతను, 'రతి' మున్నగు స్థాయిభావము తెలియఁబడుటవలనఁ గూడ- ఔచిత్యము వలన, 'స్థాయిభావము-రస'మని చెప్పఁబడినది.

తాత్కాలికముగా నివర్తింపఁజేయఁబడును. అజ్ఞానావరణముభగ్నముకాఁగానే- ఆనందాత్మ-ప్రకాశించును. ఈ యాత్మ ప్రకాశించినసంబంధముననే రత్యాదులయా స్వాదముకలుగదు. ఆవరణ భంగమునొందిన, దీపము - తాను ప్రకాశించుచు, సన్నికృష్టపదార్థములను భాసింపఁజేయునట్లు, అజ్ఞానావరణ భంగముకలుగగానే, స్వయం ప్రకాశుఁడగు ఆనందాత్మ - స్వయముగా భాసించును, సహృదయుని యందు వాసనారూపముననున్న అలౌకిక రత్యాదులను భాసింపఁజేయును. అలౌకిక విభావాది వ్యంజనా వ్యాపారమువలననే వ్యంజితములగు నీ రత్యాదులు- సాక్షియగు చిదానందాత్మచేత భాసింపఁజేయఁబడుటవలన - సాక్షిభాస్యములని చెప్పఁబడును. ఆవరణభంగము కలిగినపుడు - శకుంతలాది విభావపదార్థముల యందు "ఇది-నాది. ఇది-పరునిది. అను లౌకిక సాంసారిక భేద ప్రతీతికలుగదు- అలౌకికములగుటచేత - సర్వసాధారణములగు విభావాదుల సంబంధనముచేతనుద యించిన అలౌకిక వ్యాపారమగు వ్యంజన - సహృదయుని యందు వాసనారూప ములుగానున్న రత్యాదుల నుద్బోధించునుగదా ! (మేలుకొలుపునుగదా !) ఈ విభావాదులచేత - రత్యాది రూపమగు సహృదయుని స్వచిత్తవృత్తియే - వ్యంజిత మగును, కనుక నప్పుడీ విభావాది చర్వణవలన - సామాజికుఁడు - తన్మయుఁ డగును. వ్యంజితమయిన యీ రత్యాదిచిత్తవృత్తి - అజ్ఞానావరణభంగమువలన - స్వతః ప్రకాశమానమయిన, చిదానందరూపమగు స్వాత్మచేత - భాస్యమగుచు, ఆ చిదానంద స్వాత్మతోఁగూడ నాస్వాదింపఁబడునపుడు - లేక, విభావాది వ్యంజితమగు - రత్యాదిరూపమగు - చిత్తవృత్తితోఁ గూడి -అజ్ఞానావరణభంగము గల చిదానందాత్మ భాసించునపుడది రసమగును. స్వచ్ఛమగు స్ఫటికము నందు నీలవర్ణముప్రసరించునపుడు - ఆస్ఫటికము-నీలవర్ణముగలదిగా నారోపింపఁ బడు నట్లు - అజ్ఞానావరణభంగమువలనఁ బ్రకాశించుచున్న చిదానంద రూపమగు స్వాత్మ-స్థాయిచిత్తవృత్తి రత్యాదిస్థాయిభావముతోఁగూడి యాస్వాదింపఁబడుట కలన, 'స్థాయిభావమే - రస' మని యుపచరింపఁబడినది. (ఆరోపింపబడినది.) కాని స్థాయియే - రసముకాదు, మరియు, విభావానుభావములు- రసము నభివ్యం జన మొనర్చునపుడు. ఆ రసాభివ్యంజనమును ముఖ్యముగా సంస్కరించునది- స్థాయిభావమే యగుటవలనను, పుష్పములలోని దారమువలె, వ్యభిచారులయందంత టను స్ఫురించునది - స్థాయిభావమే యగుటవలనను, ఔచిత్యముననుసరించి - స్థాయియే (స్థాయిభావమే) రసమని చెప్పఁబడినది. కాని స్థాయియే-రసముకాదు. "భగ్నమైన అజ్ఞానావరణముగల చిదానంద స్వాత్మతోఁ గూడిన రత్యాదిస్థాయి భావమే - రసము" అని తెలియునది. చిదానందరూపమగు స్వాత్మకు రత్యాదు లతో-నీస్థాయిభావము-ఉపాధియగుటనూ, ఆస్థాయిరూపములతోఁగూడియుండుటవలన

నది - శృంగారాది రసమగును.

ప్రిజా :— "ఆనంద చిద్రూపాత్మవిశిష్టమగు రత్యాదిస్థాయిభావము - లేక, రత్యాది విశిష్టమగు చిదానందరూపాత్మ - సహృదయునిచేత - తనయందే- ఆస్వాదింపఁబడునపుడది - రసమగును. పరకీయమగు రత్యాది చిత్తవృత్తి రూప స్థాయిభావము- సహృదయునిచేత నాస్వాదింపఁబడునదికాదు. కనుక, నది-రసము అనఁగా; ఆస్వాదింపఁదగిన రత్యాదిసంవలిత చిదానంద స్వాత్మరూపముకాదు" అనునది - అభినవగుప్తుని యభివ్యక్తివాదమునకు స్వరూపము. ఇదియే-సర్వ సమ్మతము.

అవ :— "అయ్యా! సహృదయనిష్ఠమగు రత్యాది స్థాయిభావమువలె, సహృదయ నిష్ఠమగు నిర్వేదాది వ్యభిచారిభావముకూడ - చిత్తవృత్తియేయగు చున్నది. దానికంటెవేరుకాదు. కనుక, భరతసూత్రమున, స్థాయిభావము గ్రహింపఁబడినట్లు, వ్యభిచారిభావముకూడ - గ్రహింపఁబడఁదగినదికాదు. అట్టిచో, నది యేల గ్రహింపఁబడినది ?" అనియాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— వ్యభిచారియో; అదికూడ - (స్థాయిభావమువలె) చిత్త వృత్తిరూపమేయగును. అయినను, ముఖ్యమగు స్థాయిచిత్తవృత్తి పరవశమే (స్థాయిచిత్తవృత్తికి గుణమగునంగమే) యగుచు, నాస్వాదింపఁబడును. కనుక, వ్యభిచారిభావము - విభావానుభావ మధ్యముననే లెక్కింపఁబడినది, కనుకనే, "రసనిష్పత్తిః" (రసముదయించును - రసము - పుట్టును.) అని సూత్రమునఁ జెప్పఁబడిన నిష్పత్తి - రస్యమానతకు (అనఁగా; రసీభవింపఁజేయునదియగు - రసనావ్యాపారమునకు - చర్వణకు) సంబంధించిన నిష్పత్తియే (అనఁగా; ఉదయమే) యగును. [రసచర్వణయే యుదయించునుగాని రసముదయింపదు.]

ప్రిభా :— రసము - పుట్టునదికాదు. రసనిష్పత్తియన; రసనావ్యాపార నిష్పత్తియనియేయర్థము. అభినవభారతియనుపేరుగలదియు, అభినవగుప్తునిచేతనే రచితమయినదియు, నగు భరతనాట్యవ్యాఖ్యయందు - "కథంతర్హి సూత్రేనిష్పత్తి రితి;నేయం రసస్య. అపితు, తద్విషయ రసనాయాః; తన్నిష్పత్త్యాయది తదేకా యత్తజీవితస్యరసస్యనిష్పత్తిరుచ్యతే; తదానకిఞ్చిదపిదోషః" అనిచెప్పఁబడినది. దీనియర్థమును ప్రశ్నోత్తరరూపమున నిట్లు తెలియునది.

ప్రశ్న :— అట్లగుచో; (రసము - జనించునదికానియెడల) సూత్రమున ("రసనిష్పత్తిః" అని) రసమునకు జననముకలుగును." అని, యెట్లు చెప్పఁ బడెను ?.

ఉ :— నిష్ప_ యనునిది - రసమునకుఁగాదు. ఇఁకదేనికి ? అనిన, రసవిషయకమగు రసనకు (అలౌకికమగు వ్యంజనావ్యాపారమునకు) నిష్పత్తి - (ఉత్పత్తి) చెప్పఁబడినది. రసనా (వ్యాపార) నిష్పత్తి - రసనయే ముఖ్యాధార జీవితముగాఁగల రసముయొక్క నిష్పత్తిగాఁ జెప్పఁబడినది. (రసనానిష్పత్తియే - 'రసనిష్పత్తి'గా ఆరోపింపఁబడినది,)కనుక, నిష్పత-కొంచెమైననుదోషములేదు". అనిచెప్పఁబడియెను. వ్యంజకములగు విభావాదులయుత్పత్తిగాని, ఆవరణభంగము యొక్క ఉత్పత్తిగాని, రసోత్పత్తియని, యుపచరితమగును.

అవ :— రస్యమానతకు (రసీభవింపఁజేయుట యనురసనకు) లక్షణమును దెలుపుచున్నాఁడు.

లోచనము :— ప్రకృష్టమగు - బంధముచేతఁ బ్రవర్తించిన బంధుసమాగమము మున్నగుకారణముచేత నుదయించు హర్షాది లౌకికచిత్తవృత్తిని దిరస్కరించునదియగు (లౌకికహర్షాదికముకంటె వేరగు) చర్వణారూపత్వము - రస్యమానతకు స్వరూపము. [ఇట్లు చర్వణ - లౌకికచిత్తవృత్తి విలక్షణమగుచున్నది.] కనుక, రసవిషయమగు చర్వణ - అభివ్యంజనమేకాని, జ్ఞాపనము (జ్ఞప్తినొదవించునదియగు వ్యాపారము) కాదు. హేతువగు వ్యాపారమగు, ఉత్పాదనము (పుట్టించుట) కూడఁగాదు.

ప్రభా :— చర్వణయనునది - యలౌకికవ్యాపారము, కనుక, నది-అభివ్యంజనమను (అభివ్యంజింపజేయుటయను) వ్యాపారమేయగును. ప్రమాణములగు నింద్రియాదులకు జ్ఞాపనవ్యాపారమువలెను, దండచక్రాదుల కుత్పాదన వ్యాపారమువలెను, విభావాదులకు జ్ఞాపనము (తెలియఁజేయుట) గాని, ఉత్పాదనము (పుట్టించుట) గాని, వ్యాపారముకాదు. "విభావాదులు - రసము తెలియఁజేయునవిగాని, పుట్టించునవిగానికావు." అనిభావము.

లోచనము : పూర్వపక్షము :— అయ్యా! రసచర్వణయను నిది - జ్ఞప్తి రూపము (తెలియఁజేయునది) గాని, నిష్పత్తిరూపము (పుట్టించునది) గాని, కాని యెడల, ఈరసచర్వణ - యేరూపముగలదియగును ?.

ఉత్తరము :— జ్ఞప్తిరూపమును, నిష్పత్తిరూపమునుగాని. రసచర్వణ - అలౌకికమగుచుండును.

పూర్వ :— అయ్యా! రసప్రతీతియందు విభావాదికము-జ్ఞాపకహేతువా ?

లేక, కారకహేతువా ?

ఉ :— విభావాదిక మిచట - జ్ఞాపకమగు హేతువుగాని, కారకమగు హేతువుగాని, కాదు. ఇంకేమగుననిన; చర్వణోపయోగియగును.

పరిభా : అవ :— "ఈవిభావాదికము, జ్ఞాపకముగాని, కారకముగాని, కానియెడల, రసప్రతీతికొఱకు, దీనిని నుపపాదించుట- (వర్ణించుట) - వ్యర్థమే యగును. ఈవిభావాదికము జ్ఞాపకముగాని, కారకముగానియగునెడల, నప్పుడు-రసమలౌకికముకాదు. లౌకికమేయగును." అనిపూర్వపక్షి ప్రశ్నించుచున్నాఁడు.

పూర్వపక్షి :— ఇది - (ఒకయర్థము - వేరొకదానికి కారకముగాని, జ్ఞాపకముగాని, కామఁడుట) ఇంకొకచోట నెచ్చటనయినను జూడఁబడెనా ?.

ఉత్త :— (చూడఁబడుటలేదు.) కనుకనే, రసము - అలౌకికమని చెప్పఁబడినది.

పరిభా :— "లోకమున - హర్షాది చిత్తవృత్తికి - హేతువు - కారక జ్ఞాపకములలో. నేదోయొకటి- కావలయును" అను నియమముండుటవలన నది- లౌకికమగును. విభావాదికము - రసాదిప్రతీతికి- కారకరూపమగు హేతువుగాని- జ్ఞాపకరూపమగు హేతువుగాని, కాదు. కనుకనే రసప్రతీతి- అలౌకికమని చెప్పఁబడినది.

లోచ : ప్రశ్న :— ఇట్లయినయెడల, [రసమలౌకికమగుచు, ప్రమాణ నిరూపితము కానియెడల] రసము - అప్రమాణము కావలసివచ్చునే ?

పరిభా :— "అది యప్రమాణమగునెడల - శుభప్రాప్త్యుపాయమును గూర్చునదియు, అశుభపరిహారోపాయమును సంఘటించునదియుఁ, గాకపోవలసి వచ్చును." అనునది ప్రశ్నార్థము.

అవ :— రసము - ప్రమాణములేనిది కావలసివచ్చినను, కార్యకారి యగును" అని యుత్తరము నిచ్చుచున్నాఁడు.

లోచ : ఉ :— అప్రమాణమగుఁగాక; దానివలననగు హానియేమున్నది? రసచర్వణవలననే, ప్రీతి, వ్యుత్పత్తి, సిద్ధి (ప్రీతి, వ్యుత్పత్తులసిద్ధి; లేక, ప్రీతిపూర్వకయగు వ్యుత్పత్తియొక్క సిద్ధి) కలుగును. కనుక, దీనికంటెఁ గోరఁదగినదే మున్నది ?.

ప్రభా : అవ :— "రసమలౌకికమగునెడల, రసమునుసాధించునదియగు ప్రమాణముండదు." అని యాశంకించుచున్నాఁడు.

లోచ : ప్రశ్న :— అయ్యా ! అట్లయినచోనిది - అప్రమాణకమే యగును.

ఉ :— ఈరసము - స్వసంవేదనసిద్ధమే. [స్వానుభవముచేతనే సిద్ధించు నది.] కనుక, నిది - అప్రమాణకముకాదు.

ప్రభా : ప్రశ్న :— రసము - విశిష్టచర్వణారూపముగా నంగీకరింపఁ బడినది. కనుక, అది - స్వసంవేదనసిద్ధమెట్లగును ?

లోచనము : ఉ :— జ్ఞానవిశేషము - చర్వణారూపమే. కనుక, నతి విస్తరమికఁజాలును.

ప్రభా :— అభినవ భారతియందు [అభినవగుప్త విరచితనాట్యశాస్త్ర వ్యాఖ్యయందు]

"రసనాచబోధరూపైవ. కిన్తు, బోధాన్తరేభ్యోవిలక్షణైవ.
ఉపాయానాం, విభావాదీనాం, లౌకికవైలక్షణ్యాత్"

రసనా వ్యాపారము (చర్వణ) కూడ - బోధరూపమే (జ్ఞానరూపమే - ) అట్లయినను (ఇచట) ఉపాయములగు విభావాదులు - (లౌకికములుకాక) లౌకిక విలక్షణములగుటవలన (రసనారూపమగు) ఈబోధము - (ఈ జ్ఞానవిశేషము - ) తదితరబోధములకంటె వేరగునదియేయగును." అనియిట్లేచెప్పఁబడినది. కాఁగా; చర్వణయు, స్వసంవేదనమును, (అనఁగా; జ్ఞానవిశేషమును) వేరుకావు. ఒక్కటియేయగును." అనిభావము.

అవ :— రసమలౌకికమను విషయమును-మరల దృఢీకరించుచున్నాఁడు.

లోచనము :— ఈ కారణమువలనఁగూడ - రసమలౌకికమేయగును. లలితము, పరుషము, అగు ననుప్రాసము - అర్థాభిధానమున కుపయోగించునది కాదు. అయినను, రసవ్యంజకమగుచున్నది. కాఁగా;[ఇట్లిచట నభిధావ్యాపారము నకే ప్రసక్తి కలుగకుండునది కాఁగా;] లక్షణా (వ్యాపార) శంకకుఁగూడ నెవ కాశము కలుగునా ? (ఇచట) కావ్యరూపమగు (అనుప్రాసాది విశిష్టమగు) శబ్ద మునకు సంబంధించిన నిష్పీడనము (ఆవృత్తిరూపాదికము) చేతనే రసచర్వణ కాన్పించుచున్నది. [రసానుభవ సాక్షాత్కార మొదవుచున్నది.]

పరిభా :   అనుప్రాసాదులయందర్థమున్నను, అది యపేక్షింపఁబడి యుపయోగించునదికాదు. అభిధాలక్షణావ్యాపారముల నపేక్షింపక, ఆమ్రేడితాది రూపమగు శబ్దస్వరూపమే (శబ్దాలంకారమే) రసవ్యంజకమగును'' అనుటకు సహృదయానుభవమును ప్రమాణీకరించుచున్నాఁడు.

లోచ :— సహృదయలోకము - ఒకేకావ్యము నొకసారి పఠించినను, తిరుగ దానినే పఠించి యాస్వాదించుచుండుట - కాన్పించుచున్నది.

''ఏవి స్వీకరింపఁబడి, విడువఁబడునో; వాని నుపాయములని చెప్పుదురు'' అనున్యాయముచేత - కృతప్రతీతికమగు (రసప్రతీతిని గలిగించిన) కావ్యశబ్ద మునకు - (రసప్రతీతికలిగిన పిమ్మట) అనుపయోగమే కలుగవలెను. కాని, యిచట (తిరుగ) నుపయోగమే కలుగుచున్నది. కనుక, (అర్థమునపేక్షింపని) శబ్దమునకుఁగూడ - ఇచట - ధ్వననవ్యాపారమున్నది. కనుకనే, రసము (ముఖ్యముగనదియగుధ్వని) అలక్ష్యక్రమమగుచున్నది.

పరిభా :— ''శబ్దాలంకారములగు ననుప్రాసాదులయందు అర్థమునపేక్షింపని శబ్దస్వరూపముకూడ- శృంగారాది రసవ్యంజకమగుట-కాన్పించుచున్నది. కనుకనే, రసాదికము - అసంలక్ష్యక్రమమగుచున్నది. అర్థప్రతీతికి సంబంధించిన వ్యవధానము నపేక్షించియే - లలితానుప్రాసాదిశబ్దము - రసప్రతీతిని గలిగించునెడల; నప్పుడది - సంలక్ష్యక్రమవ్యంగ్యమే- అయ్యెడిది. కాఁగా; రసము- అర్థము నపేక్షింపనిశబ్దస్వరూపముచేతఁగూడ వ్యంజితమై, అసంలక్ష్యక్రమమగుట కూడ- దానికలౌకికత్వమును సిద్ధింపఁజేయుచున్నది.'' అనిభావము. ''భీముఁడు, అతనిచేష్టలు, మున్నగు విభావాదులను వర్ణించునప్పుడు - పరుషవర్ణవృత్తి యందుఁగలదియగు పరుషానుప్రాసము - (నాగరికానుప్రాసము -) అర్థమునపేక్షింపని శబ్దస్వరూపముచేతనే-శబ్దస్వరూప- వ్యంగ్యరస-ప్రతీతిక్రమము గుర్తింపఁబడకుండునట్లు, రౌద్రరసమును ధ్వనింపఁజేయుట - దీనికుదాహరణమని తెలియునది. ఇట్లు శబ్దస్వరూపమాత్రముచేతఁగూడ - రసప్రతీతి - అసంలక్ష్యక్రమము గలదియగుటవలన - రసమలౌకికమగుట- సంభవించుచున్నది.'' అనితెలియునది.

—, ఇచట వాక్యభేద దోషములేదు ,—

లోచ :— ''అయ్యో! [కావ్యవాక్యము - వాచ్యార్థమును, వ్యంగ్యార్థ మును, గూడ బోధించునెడల;] వాక్యభేదము కలుగవలసి వచ్చునే'' అనియొకఁడనెను. అది - బాగుగాఁ దెలియక చెప్పినమాట.

ఒకసారి యుచ్చరింపఁబడిన శాస్త్రము (కావ్యవ్యతిరిక్తమగు వాక్యము) సమయ (సంకేత) బలముచేత- అర్థమును బ్రతిపాదించుచు, ఒకేసారి, అనేకము లగు సంకేతములుగల విరుద్ధములగు నర్థములకు - స్మృతి - సంభవింపకుండుట వలన, విరుద్ధమగు నర్థద్వయము నెట్లు బోధింపఁగలుగును ?.

ప్రిభా :— ఆయాపదముల కాయాయర్థములయందు సంకేతముండును. కావ్యవ్యతిరిక్తమగు శాస్త్రవాక్యము - ఆయా సంకేతములను సహకరించుకొని, వానిబలముచేత నర్థమును - దెలుపునపుడు - ఆసంకేతములు - పరస్పర విరుద్ధ ములగునెడల; అవి యొకేసారి స్మృతి గోచరములగుట సంభవించునదికాదు. ప్రకరణాదులు - రెండవ యర్థమును దెలుపుటకు ప్రతిబంధకములగును. కావున, శాస్త్రము - విరుద్ధములగు నాయర్థములను రెండింటినిగూడ నొకేమారు బోధించు నది కానేరదు. కనుక, ఒకయర్థమునే బోధించును.

లోచ :— (ఆయాపదములకు సంబంధించిన యాయాసంకేతములు) విరుద్ధములు కానియెడల, (ఒకదానితో నింకొకటి సంబంధించునవియగునెడల) అచటియర్థమంతయు నొకవాక్యార్థమేయగును. ("అవిరుద్ధార్థములు-) క్రమ ముగానైనను బోధింపఁబడఁగూడదా ?" అనిన, విరమించిన శబ్దమునకు తిరుగ వ్యాపారము కలుగదు. (ఒకసారి ప్రసరించిన అభిధ-తిరుగప్రవర్తింపదు.)

ప్రభా :— కనుక, విరుద్ధములగు నర్థములు క్రమముగానైనను, నభిధే యములు (వాచ్యములు) కావు.

లోచ :— వాక్యమును దిరుగనుచ్చరించినను గూడ - సంకేతప్రకరణా దులు వెనుకటివేయగుటవలన, (ఆవాక్యార్థ మావాక్యార్థమే యగుటవలన) ఆవా క్యమావాక్యమేయగును.

ప్రభా : ప్రశ్న :— సంకేత ప్రకరణాదుల నపేక్షింపనిచో నష్టమేమ యిన నుండునా ?

లోచనము :— (శాస్త్రము-) ప్రకరణ, సంకేతాదులచేతఁ బొందవలసిన యర్థమును దిరస్కరించి, వేరొకయర్థమును గొనితెచ్చునెడల, నియమములేకపో వలసివచ్చును. "అనియమము లేనప్పుడు- "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గ కామః" ("స్వర్గమును గోరువాఁడు - అగ్నిహోత్రమును హోమముచేయవల యును.") అను శ్రుతికి, "కుక్కమాంసమును దినవలయును" అనునది- యర్థ ముకాదు." అనుటకు ప్రమాణమేమి ?

ప్రభా :— "ఆయాపదముల కాయా యర్థములయందుఁగల సంకేత మును, ప్రకరణాదికమును,నపేక్షింపక,(ఇచ్చవచ్చిన)యర్థమును దెలుపవచ్చును" అని యంగీకరించునెడల, "అగ్నిని-హవన మొనర్పవలయును"అను ప్రతివాక్య మునకు,"కుక్కమాంసమును-దినవలయును"అనునర్థమునుగూడఁజెప్పవచ్చును. కాఁగా; అట్లు చెప్పఁదగదనుటకప్పుడు ప్రమాణముండదు. అప్పుడీయర్థములలో నేది యథార్థజ్ఞానమో, తెలుపుటకు వీలుపడదు.

లోచనము :— (కనుక) అప్పుడుఁగూడ - ఈయర్థమింతవఱకే కలదను వ్యవస్థలేనియెడల, నిశ్చితార్థబోధకత- లేకుండుటవలన, నచట వాక్యభేదము - దూషణమగుచున్నది.

ప్రభా :— "కావ్యవ్యతిరిక్తమగు - వైదికవాక్యముగాని, లౌకికవాక్య ముగాని, వీనిలో నేవాక్యముఖునసుగూడ - సంకేతప్రకరణాదులను సహకరించు కొని, ఒక్కసారిగాఁగాని, క్రమముగాఁ గాని, ఒకయర్థమునే దెలుపును. కనుక, అనేకార్థబోధకతచేత, నచట వాక్యభేదములేదు. సంకేతప్రకరణాదుల నపేక్షింప కయే, వాక్యమర్థమును బోధించునని యంగీకరించునెడల; నది- యవ్యవస్థితమగు నర్థమును బోధించుటచేత - అర్థబోధన ప్రామాణ్యము లేనిదికావలసివచ్చును. కనుక, వేదమునందును, లోకమునందును, వాక్యభేదము- దోషావహమగును." అనునది - ఫలితార్థము.

అవ :— కావ్య (వాక్య)మునందలి విశేషమును దెలుపుచున్నాఁడు.

లోచ :— కావ్యమునందు మాత్రము - [విభావాద్యర్థబోధనమునందే - సంకేతాదుల కుపయోగముండును. తరువాత వీనిచేత - ] ప్రతిపాదింపఁబడిన విభావాదికమే- చర్వణావిషయమగుట (ఆస్వాదగోచరమగుట) కున్ముఖమగును. తదుపరి - (రసనావ్యాపారముచేత) రసాది వ్యంగ్యప్రతీతికలుగును, కనుక, రసాది ప్రతీతియందు సంకేతాదుల యుపయోగములేకుండును. "ఈకార్యమున నేను నియోగింపఁబడితిని. కనుక, దీనినొనర్చి, కృతార్థుఁడనగుదును," అను ప్రతీతి - శాస్త్రమువలన జనించును. శాస్త్రజన్యమగునీప్రతీతి - తరువాతికాల మున నేదికర్తవ్యమో, ఆకర్తవ్య- న కున్ముఖమగుటచేత లౌకికమగును. కనుక, రసాదిప్రతీతి - (వైదిక,ధార్మిక,) శాస్త్రీయ ప్రతీతివంటిదికాదు. కావ్యమునందు మాత్రము - అద్భుతపుష్పమువలె - (ఇంద్రజాలాదులయందుఁ జూపఁబడిన పూవువలె. అనఁగా; గారడీపూవువలె,) [వాక్యమువలన - ] ఉదయించిన విభా వాది చర్వణ - వర్తమానకాలసారమే- (ప్రస్తుతకాలమునకు సంబంధించునదియే)

అగుచుండును, గాని, పూర్వాపరకాలానుబంధిని (ముందు, వెనుకలకాలములకు సంబంధించునది) కాదు. కనుక, లౌకికాస్వాదముకంటెను యోగవిషయమగు నాస్వాదముకంటెను, ఈరసాస్వాదము - వేరేయగును.

పరీక్షా :— "కావ్యనాట్యములయందలి విభావానుభావాదుల చర్వణ వలన - సహృదయ సామాజికులకు తన్మయీభవనము కలుగు"నని చెప్పఁబడినది గదా!. అప్పుడు విభావానుభావచర్వణ-వ్యభిచారిచర్వణయందుఁ బర్యవసించును. అదెట్లనిన :— "విభావానుభావములు భావితములు కాఁగానే, వానిచేత స్థాయి తోఁబాటు వ్యభిచారులుకూడ స్ఫురింపఁజేయఁబడును. కనుక, విభావానుభావ చర్వణ- అప్పుడు వ్యభిచారిచర్వణయందుఁబర్యవసించును. ఆవ్యభిచారిభావముల చర్వణలో, పులమాలికలోని దారమువలె నుండునదియగు స్థాయిభావముకూడ - చర్విత (అస్వాదిత) మగును. 'ఇట్లు చర్వ్యమాణమగు (ఆస్వాదింపఁబడునది యగు) స్థాయిభావముతోఁ గూడినదియు, అజ్ఞానావరణ భంగముచేతఁ బ్రకాశించు నదియు, చిదానందరూపమును, నగు స్వాత్మయే - రస'మని చెప్పఁబడుచున్నది. ఈ రసానందము - లౌకికసుఖాదుల వంటిదికాదు. లౌకిక సుఖముకూడ - అంతః కరణ వృత్తి విశిష్ట చైతన్యరూపమయినను, అచటి చైతన్యము - ఆవరణభంగము గలదికాదు.

రసమో - భగ్నావరణ చిద్విశిష్టమగు రత్యాదిస్థాయిభావరూపము. ఇట్లిది- లౌకికాస్వాదముకంటె వేరగుచున్నది. మఱియు, నీరసాస్వాదము - యోగవిష యమగు పరబ్రహ్మానందాస్వాదము (పరబ్రహ్మమగు నానందమేయగు నాస్వా దము) కంటె వేరగును. అదెట్లనిన :- రసచర్వణకు - విభావాదివిషయ సంవలిత చిదానందము - ఆలంబము. యోగవిషయమగు బ్రహ్మానందమున - విషయము లేవియు నుండవు. అది - యేకరూపము. అచట - వృత్తిశూన్యమగుబుద్ధి - బ్రహ్మానందరూపమున నుండును. స్థాయ్యుపహితానందరూపమగు రసము - స్థాయిచిత్తవృత్తులగు రత్యాదులతోఁగూడి యుండుటవలన నానారూప(నవరూప) మగుచున్నది. విభావాది చర్వణ-యుంతు నంతవఱకును మాత్రమే యీరసానం దము స్ఫురించును. కనుకనే. ఇది - బ్రహ్మానందరూపముకాక, బ్రహ్మానంద సహోదరమగుచున్నది." అని సాహితీవేత్తలు ప్రవచించుచున్నారు. (లౌకికా నందము ననుభవించునపుడు - మనఃకాలుష్యము సమగ్రముముగా నశింపదు. రసానందము ననుభవించునపుడు - మనఃకాలుష్యమంతయు నశించును. ఇది - నిర్వికల్పసమాధికిఁ దుల్యముకాకున్నను, ఒకవిధమగు సవికల్పకసమాధి కావచ్చు నని కొందఱిమతము. కాని ప్రయత్నపురస్సరమగు నింద్రియనిగ్రహధారణాది కములేనిది-వీనమాధియుఁగా నేరదు.

* (౨) [ద్వితీయోద్ద్యోతమున నిబంధింపఁబడిన లోచనోన్మీలిత విషయము.]

• రసస్వరూప వ్యవస్థాపనము •

—* భట్టనాయకుని పూర్వపక్షము *—

లోచనము : పూర్వ :— అయ్యా! భట్టనాయకునిచేత నిట్లు చెప్పఁబడి నదిగదా; "(రత్యాది స్థాయిభావరూపమగు) రసము - (శృంగారాదికము) పర గతముగా (సహృదయునికంటె వేరగువ్యక్తికి సంబంధించునదిగా) ప్రతీతమగు నెడల, నప్పుడది - తటస్థమే (సహృదయునికి సంబంధింపనిదియే) యగును.

ప్రభా :— "రసప్రతీతి - తటస్థమగునెడల(సహృదయునికి)సంబంధిం పక, పరునికి సంబంధించునదియగునెడల; నది, సహృదయునిచేత నాస్వాదింపఁ బడఁదగినదికాదు." అనఁగా; "తత్ప్రతీతివలన సహృదయహృదయమునకు రసా నందము కలుగునదికాదు." అనిభావము.

• రసప్రతీతి - (సహృదయునికి) స్వగతమగుటకూడ-బాధకమేయగును •

లోచ :— రామాది చరితమయమగు కావ్యమునుండి, యీ రసము - స్వగతముగాఁగూడ ప్రతీతముకాదు. (సహృదయునికి) స్వాత్మయందు- స్వాత్మ గతముగనే రసప్రతీతి కలుగునెడల; రసమున కుత్పత్తియే - అంగీకరింపఁబడి నదిగా, కావలసివచ్చును.

ప్రభా :— "ఆస్వాదయితయగు సహృదయజ్ఞాతకు సంబంధించిన స్వచిత్తవృత్తియే - [స్వీయమగు రత్యాదిచిత్తవృత్తియే] ప్రత్యక్షరూపయగునను నెడల; ఆచిత్తవృత్తి - జనించునదియేయగును" అని చెప్పకతప్పనిదగును. ఏల యనిన; విషయములేనిదే - ప్రత్యక్షమగుట - కుదురదుగదా!.

అవ :— "అట్లయిన రసమునకుత్పత్తి యంగీకరింపఁగూడదా ?" అనినఁ జెప్పుచున్నాఁడు.

---

* "ఆంధ్ర ధ్వన్యాలోకమున, ద్వితీయోద్ద్యోతమునందలి, 38వ పేజీ యందు-"ధ్వనికంటెనుగూడ - వేరగుచున్నది." అను 25వ పంక్తికిఁదరువాతి లోచనమున; క్రింది విషయము - నిబంధింపఁబడినవి." కనుక, నచ్చట నిది - పఠింపఁదగినదిగా (పాఠకులు) - తెలియునది.

లోచ :— సీతాదేవి - సామాజికునికి (సహృదయునికి) విభావము (రత్యాలంబనకారణము) కాకుండుటవలన (సహృదయునికి) స్వాత్మయందే రసోత్పత్తి (రసముదయించుట) కూడ - యుక్తముకాదు.

ప్రశ్న :— కాంతాత్వమను సాధారణ ధర్మమిచట సహృదయగత రత్యాదివాసన వికసించుటకు(ఉద్బుద్ధమగుటకు) హేతువగు విభావమగుటయందు ప్రయోజనముకావచ్చునే ? (సీత - కాంతయను సాధారణరూపమున, సహృదయునకు విభావము కాఁగూడదా ?)

ఉ :— "ఈమె - సాధారణయగు కాంత" అను జ్ఞానముకూడ - దేవతావర్ణనమున నెట్లు సంఘటించును ?.

ప్రభా :— "ఒకదేవతను - నాయికగా వర్ణించునపుడు - 'ఆదేవత - పూజింపఁదగినది' అనుజ్ఞానము - "ఈమె కామ్యయగు కాంత" అనుజ్ఞానము నకు ప్రతిబంధకమగును. కనుక, నచట 'ఈమె- సాధారణకాంత' అను జ్ఞానము కూడ-కలుగదు." అనిభావము.

అవ :— "అయ్యా! కావ్యాదులవలన సీతాదిజ్ఞానముకలుగగా, సహృదయునకు - స్వకాంతాస్మరణము కలుగును. దానిచేతనైనను రత్యాదివాసన కుద్బోధముకలుగవచ్చును." అనియాశంకించి, ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.

లోచ :— స్వకాంతాస్మరణముకూడ (కావ్యజన్యమగుననుభవము) నడుమను దెలియఁబడునదికాదు. (అట్టి యనుభూతి యెవ్వరికిని గలుగుట లేదు.) మఱియు, లోకసామాన్యులుకాని, శ్రీరామాదులకు సంబంధించిన సముద్రసేతు బంధాదులగు విభావములు - సర్వసాధారణత నెట్లుపొందును ?

ప్రభా :— "సామాజిక సహృదయులకు - సేతుబంధాదులు - సాధారణములు కాఁగలుగునవియగు విభావములుకావు." సముద్ర సేతుబంధాదుల యందు సహృదయుల కుత్సాహము, ఆపనిసాధింతునను సంకల్పము, హృదయ సంవాదము, కలుగవుకదా!.

అవ :— "రామాదిగత స్థాయిజ్ఞానమైనను, సహృదయులకు రసోద్బోధ హేతువుకాఁగూడదా ?" అనియాశంకించి, 'కా'దనుచున్నాఁడు.

లోచనము :— రామాదిగతమగు నుత్సాహము - సహృదయునిచేత

నింతకుముందు - అనుభవింపఁబడి యుండినదికాదు. కనుక, ఉత్సాహాదిసంపన్నుఁడగు రాముఁడు - సహృదయులచేత స్మరింపఁబడఁడు.

ప్రభా :— అనుభవింపఁబడినది - స్మరింపఁబడును. రామాదిగతమగు అసాధారణోత్సాహము - సహృదయుని కనురూపము కాకుండుటవలన, నింతకు ముందనుభవింపఁబడినదికాదు. కనుక, రామాదిగతమగు నుత్సాహము- స్మరింపఁబడునదియౌటఁగాదు.

అవ ;— ''కావ్యమువలననే - అనుభవరూపమగు, రామాదిగతోత్సాహప్రతీతి కలుఁగఁగూడదా ?'' అని యాశంకించి - ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.

లోచ :— ప్రత్యక్షమువలన నాయికానాయక మిథున (రతి) ప్రతిపత్తి కలిగినను, సహృదయులకురసోత్పత్తికలుగనట్లు; శబ్దమువలన, రామాదిగతమగు నుత్సాహముయొక్కప్రతీతికలిగినను, సహృదయులయందు రసోత్పత్తికలుగదు.

ప్రభా :— ''మిఠాయి'' అనుశబ్దమువలన శాబ్దమగు ననుభవము కలిగినను, మిఠాయికి సంబంధించిన విచిత్రవిభిన్నమధుర రసానుభవము కలుగునది కాదు. లోకమున సముద్రతీరాదిప్రదేశములయందు, సరససల్లాపములలోమునిఁగి తేలుచున్న ప్రేయసీప్రియమిథునములను ప్రత్యక్షముగాఁ జూచుచున్నను గూడ- సహృదయునకు శృంగారరసానుభవము కలుగుటలేదుగదా!.

''ఇట్లు ప్రమాణ శిరోమణియగు ప్రత్యక్షమువలనఁగూడ - శృంగారాది రసానుభవము కలుగనపుడు, శాబ్దమగు ననుభవమాత్రమున, తద్రసాస్వాదము కలుగునా ?'' అనిభావము.

లోచ :— ('ఇట్లు - రసమునకుత్పత్తియగును' అని) ఉత్పత్తిపక్షము నంగీకరించినను, కరుణరసోత్పత్తి కలుగునపుడు - సహృదయులకు దుఃఖము కలుగవలసివచ్చును. కనుక, కరుణ ప్రేక్షలయందు [కరుణ రసప్రధాన-నాట్య, కావ్యములయందు) సహృదయులకుఁ దిరుగ ప్రవృత్తికలుగకుండవలసివచ్చును. కనుక, రసమున కుత్పత్తి (అనుపక్షము) సంగతముకాదు. రసమున కభివ్యక్తి కూడ - (అభివ్యంజనముకూడ) కుదురునదికాదు. (సహృదయ హృదయమున, రసమున కభివ్యక్తి నంగీకరించునెడల;) శక్తిరూపమగు (వాసనారూపమగు) శృంగారమునకు (రతికి) సంబంధించునదియగు అభివ్యక్తివిషయమున - విషయా

ర్జన తారతమ్యప్రవృత్తి కలుగవలసివచ్చును.

ప్రభా :— వాసనాత్మకమగు సూక్ష్మరూపముతోనుండిన ''శృంగార మునకు'' అనఁగా, శృంగారవీరాదిరసస్థాయిభావములగు, రత్యుత్సాహాదులకు, సహృదయహృదయమున నభివ్యక్తి నంగీకరించునెడల; ఆరత్యాదివిషయములగు (నుత్తమోత్తమలావణ్య సౌందర్యశాలినులగు) కాంతాదులను-అభివ్యక్తి కుపాయములుగా నార్జించుటయందు తరతమభావరూపమగు బ్రయత్నము - కలుగవలసి వచ్చును.

అదెట్లనిన :— ''మిక్కిలియధికమగు విభావాది విషయానుభవమువలన- వాసన - శీఘ్రముగా నభివ్యక్తినొందును. గాఢమగు నంధకారమునందుఁగల యత్యల్పవస్తువులనుగూడ- అధికాధికముగాఁ బ్రకాశింపఁజేయుటకు-దాని కుపాయమగు వెలుతురు గూడ - అధికాధికముగా నార్జించుటయందు - (పొరుగింటి యందలి వెలుతురుకంటె తమయింటియందలి వెలుతురున కాధిక్యము కలుగవల యునను తలఁపున పోటీపడులోకులకు తరతమ భావముతోఁగూడిన ప్రవృత్తి కలుగునట్లు, సహృదయులకుఁగూడ వాసనారూపమున తమహృదయమునందున్న రత్యాదికమున కధికాధికమగు నభివ్యక్తికొఱకు, తదుపాయభూతమగు విభావాదికము ననుభవరూపమున నార్జించుటయందు - అధికాధికమగు ప్రవృత్తికలుగ వలసివచ్చును.'' అనునది - దీనిభావము.

లోచనము :— ''అప్పుడుఁగూడ (అభివ్యక్తికలుగు ననునపుడుగూడ) రసము-స్వగతముగా నభివ్యక్తమగునా ? లేక, పరగతముగా నభివ్యక్తమగునా ? అనుదోషము - పూర్వమువలెనే (నిలిచి) యుండును. ఆకారణమున, కావ్యము చేత - రసము (సహృదయాత్మయందు) ప్రతీతముకాదు. పుట్టునదికాదు. అభివ్యక్తమగునది (వ్యంజితమగునది)యుఁగాదు.

ప్రభా :— ఇతరమతముల నిట్లు ఖండించిన 'భట్టనాయకుఁ'డిప్పుడు- స్వమతమును జెప్పుచున్నాఁడు.

—• భట్టనాయకమతము - భుక్తివాదము •—

లోచ :— ఇఁక నెట్లనిన కావ్యాత్మకమగు శబ్దము - త్ర్యంశతాప్రసాద మువలన [అంశత్రయముతోడి సంబంధమువలన] అన్యశబ్ద (శాస్త్రీయాదిశబ్ద) విలక్షణమగుచున్నది. (ఆయంశములు - అభిధ, భావన, భోగీకృతి, అనునవి.)

అందు - అభిధకు - వాచ్యములు - విషయము. (అభిధ - వాచ్యార్థమును దెలుపును.) భావనకు - రసాదులు - విషయము, భోగీకృతికి - సహృదయులు - విషయము (భోగీకృతిచేత సహృదయులు రసమునాస్వాదింతురు.) కనుక, అంశ భూతములగు వ్యాపారములుకూడ - మూడగుచున్నవి.

అందభిధాభాగము- (శాస్త్రములందువలె) శుద్ధమగునెడల, (ఇతరవ్యాపార సంపర్కము లేనిదగునెడల) నప్పుడు - తంత్రాదులగు శాస్త్రన్యాయములకంటె శ్లేషాద్యలంకారములకుఁ గలుగునవియను భేదమేముండును ?

పత్రిభా :— "అనేకములగు నర్థములను దెలుపునిచ్చచేత - ఒకేపదము నొకమారే యుచ్చరించుట - తంత్రము. ఒకపదము నొకసారియే యుచ్చరించి - యనేకార్థములను దెలుపునవియగు తంత్రాదులగు శాస్త్రన్యాయములయందువలె, "సర్వదో మాధవః పాయాత్" ఇత్యాదిశ్లేషస్థలములయందుఁగూడ- తంత్రాదులచేత- అనేకార్థబోధము కలుగుటవలన, నారెంటికిని భేదములేకుండవలసివచ్చును." అనిభావము.

లోచనము :— (ఉపనాగరికాది) వృత్తిభేదవైచిత్ర్యముకూడ-అకిఞ్చిత్కరమేయగును,

పత్రిభా :— కావ్యమున (తదితర వ్యాపారమును స్వీకరింపక) అభిధామాత్రమునే స్వీకరించునెడల; వృత్తిభేదవైచిత్ర్యముకూడ - ఇంచుకయు నుపయోగింపనిదియేయగును.

పత్రిభా :— వేదాది శాస్త్రములయందుఁగూడ - కైశిక్యారభటీసాత్త్వతీ వృత్తుల కవకాశముండుటవలన, నావృత్తులు - కావ్యశబ్దమునకు వైలక్షణ్యమును సంపాదించుట యందుపయోగించునవికావు.

లోచ :— (కావ్యమున) శ్రుతిదుష్టాది దోషములను వర్జించుట దేనికొఱకు ?.

పత్రిభా :— "చెవికిఁ గటువులుగానుండు దోషములను గావ్యమునందు విడువవలెను" అనియుందురే ? శుద్ధమగు నభిధయేచాలుననినచో; శుద్ధమగు నభిధవలన - స్పష్టముగా నర్థమును దెలుపునదియగు కావ్యమున - శ్రుతిదుష్టాదిదోషములను విడువవలసియుండుటయేల ? (అది - నిష్ఫలమనిభావము.) "శాస్త్ర

ములయందువలె, అర్థమును స్పష్టముగాఁ దెలియుటయే చాలును'' అనినమొదల; శాస్త్రములయందువలె, కావ్యములందుఁగూడ - చెవికింపుగాని శబ్దములనుగూడ ప్రయోగింపవచ్చును, ''ఇట్లు, శాస్త్రములయందు విడువనక్కఱలేని శ్రుతి దుష్టత్వాదులనిచట విడువవలయు ననుటవలన - 'కావ్యమునందలి అభిధ - శాస్త్రములయందలి యభిధవలె, శుద్ధము (వ్యాపారాంతర సంపర్కము లేనిది)కాదని తెలుచున్నది'' అనునది ఫలితార్థము.

లోచనము :— ఈకారణమున రసభావనాఖ్యమగు (రత్యాదిభావనాత్మకమగు) ద్వితీయవ్యాపారమున్నది ఏలయనిన :— ఈభావనావశమువలననే - అభిధ - 'విలక్షణ' యగుచున్నది.

పరిభా :— ''ఈభావనావ్యాపారము - శాస్త్రీయాదిప్రసిద్ధమగు అభిధకంటె - విజాతీయమే యగును.'' అనిభావము.

లోచ :— కావ్యమునకు (నాట్యమునకు) సంబంధించిన భావకత్వమనఁగా (రసభావనావ్యాపారమనఁగా): రసములను, (అనఁగా సీతారామాదిగత రత్యాదులను) ఆరసములకు సంబంధించిన విభావానుభావ వ్యభిచారిభావములను గూడ (సహృదయసామాజికులకు) సాధారణములుగాఁ జేయుటయే.

పరిభా :— ''భావనావ్యాపారమనఁగా; కావ్యమున విశేషరూపమునఁ దెలుపఁబడిన, సీతారామాది, విభావములను, వారియందస్మిత సల్లాపాద్యనుభావములను, వారి లజ్జాది వ్యభిచారిభావములను, వారియందుదయించిన రత్యాదులను, సహృదయులకు సాధారణ కాంతాకాంతాదులుగాను, సాధారణమందస్మితాదులుగాను, సాధారణ లజ్జాదులుగాను, సాధారణములగు రత్యాది స్థాయులుగాను, నొనర్చుటయే'' అనిభావము.

లోచనము :— (రామాదిగత రత్యాదులు) - భావనావ్యాపారముచేత - సహృదయులకు సాధారణములుగాఁజేయఁబడుటవలన, రసము- (రత్యాదికము-) భావితము కాఁగానే, (భావనావిషయముగాఁ జేయఁబడఁగనే,) అనుభవ, స్మరణ, జ్ఞానములకంటె విలక్షణమే యగుభోగము (సాక్షాత్కారవిశేషము) సహృదయుల కొదవును. అభోగము - ద్రుతి, విస్తారవికాసాత్మ, లగు రజస్తమోగుణముల వైచిత్ర్యమున (విశేషముచేత) అనువిద్ధమగు సత్త్వగుణముయొక్క ప్రాచుర్యముగలదియు, నిజచిత్స్వభావ (స్వాత్మచైతన్యరూప) నిర్వృతి (లోకోత్తరానందు) విశ్రాంతి లక్షణమును - (విగళిత వేద్యాంతరముగా నుండుటయే

రూపముగాఁగలదియు) పరబ్రహ్మాస్వాద సవిధమును, (బ్రహ్మానంద సమీపవర్తియు) నగుచుండును.

పరిభా :— 'విశ్రాంతి లక్షణమును' అనఁగా; "తెలియఁదగిన వేరొక వస్తువులేకుండనుండుటయే స్వరూపముగాఁగలది" అనియర్థము. "రసానుభూతి కలుగునపుడు ప్రాపంచిక విషయములేవియు సహృదయులహృదయమునఁ దోఁచవు. కనుక, రసానుభవము - లౌకికసుఖానుభూతి వంటిదికాదు. బ్రహ్మానంద తుల్యము." అనిభావము.

లోచ :— భోగీకృతివ్యాపారముచేత - పూర్వోక్తవిధమగుభోగము - పరిభావనభూతాంశమగు సిద్ధరూపమే. (చిదానందరూపమగు నాత్మయే) కనుక (ఇచట - జ్ఞాపకము) చమత్కారశోభాయు వ్యుత్పత్తి - అప్రధానమేయగును.
[ఇది భట్టనాయకుని సిద్ధాంతము]

పరిభా :— భట్టనాయకుని సిద్ధాంతమిది :- కావ్యమున - మూడంశము లున్నవి. కావ్యమునందలి, అభిధావ్యాపారమువలన, మొదట - సహృదయులకు విభావాది (శకుంతలాది) పదార్థజ్ఞానము కలుగును. తదుపరి, దానిసుండె భావకత్వమను (భావనయను) వ్యాపారముదయించి, రసప్రతీతికి విరోధముగానున్న శకుంతలాదిగతమగు అగమ్యాత్వజ్ఞానమును, పరిబంధించును. మఱియు, అగమ్యయను జ్ఞానమును ప్రతిబంధించుటద్వారమున - కాంతాత్వాదులగు రసానుకూలధర్మములు - సర్వసాధారణములుగాఁ జేయఁబడును. అప్పుడు - దుష్యంతుఁడు, శకుంతల, ఆదేశము, ఆకాలము, వయస్సు, స్థితి, మొదలయిన పదార్థములు - సహృదయులకు సాధారణములగును. ఈసాధారణీకృతిలో - ఇంకను రసచర్వణ కలుగదు. తరువాత, మూడవదియగు భోగీకృతి (భోగోత్పాదకతా) వ్యాపారముదయించును. దాని ప్రభావమువలన, సహృదయులయందుఁగల రజస్తమోగుణ వైచిత్ర్యముతోఁగూడిన సత్వగుణమభివృద్ధినొందును. రజోగుణము వలన - ద్రుతియు (హృదయము కరఁగుటయు) తమోగుణమువలన - విస్తరమును (కొలఁదిగా విప్పారుటయు) సత్వగుణమువలన-వికాసమును (పూర్ణముగా విప్పారుటయు) జరుగును. దానిచేత - సహృదయులు - నిజచైతన్యరూపమగు నానందమునొంది; విగళిత వేద్యాంతరముగానుండుట (తెలియఁదగిన ఇంకొక విషయములేకుండుట) యను విశ్రాంతినొందుదురు. ఇంతకుముందు - భావనా క్రియాప్రభావమున - సాధారణములుగాఁ జేయఁబడిన రత్యాదులు - అప్పుడు- రససాక్షాత్కారమునకు విషయములుగాఁ జేయఁబడియుండును. రజస్తమో గుణములతోఁగూడిన సత్త్వగుణమున కభివృద్ధికలిగినపుడు- పరికాశించిన, ఆనంద

రూపచైతన్యమునకు 'భోగ'మనిపేరు, రత్యాదిస్థాయిభావములు - ఆభోగమునకు విషయములగుచుండునపుడది-రసమగును. కాఁగా; "సత్త్వజనిత నిజచిత్స్వభావ నిర్వృతి విశ్రాంతిలక్షణమగు సాక్షాత్కారముచేత - విషయీకృతమును, భావనోపనీతమును, కనుకనే, సాధారణాత్మమును. నగు రత్యాదిస్థాయిభావము-రసము" అని యేర్పడుచున్నది.

విశే :— ఇచటఁగూడ - 'చైతన్యయుక్తమగు రతియే-రసము." అని గాని, "రత్యుపహిత చైతన్యమే - రసము" అనిగాని, (పుష్పమాదుల పక్షము నందువలె,) అభిప్రాయద్వయము - సిద్ధించును. రసభోగమునందగు భోగము రత్యాదులతో మిశ్రితమైయుండును. కనుక, బ్రహ్మానందాస్వాదమునకు సమీపమునందుండును. కనుకనే, పరబ్రహ్మాస్వాదసవిధమని (తుల్యమని)చెప్పఁబడును. కేవలమగు బ్రహ్మానందమున, రత్యాదివిషయము లేవియునుండవు. కనుక, నిది - బ్రహ్మానందరూపము - కాదు. ఈమతమున భావనయను వ్యాపారాంతరమును స్వీకరించుటయే - అభివ్యక్తివాదమునందు కంటె - విశేషము. ఇందు స్వీకరింపఁబడిన భోగీకృతి - వ్యంజనకంటెవేరుకాదు. ఇంతవఱకును దెలుఁపఁబడినది - భట్టనాయకుని మతము.

—• రసస్వరూపమునందగు వివిధాభిప్రాయములు •—

లోచనము :— ఇచ్చటఁజెప్పుచున్నాము. ప్రతివాదులకు రసస్వరూపమునందే (రసపదార్థమునందే) విభిన్నములగు మతములు - కాన్పించుచున్నవి.

పరిభా : అవ :— నాట్యమునందలి విప్రతిపత్తులను మొదటవివరింతుము. "నాట్యమునఁ బ్రకటింపఁబడిన లలనామలగు నాలంబనవిభావములచేత- రత్యాదికముజనించి, ఉద్యానాదులగు నుద్దీపకములచేత - ఉద్దీపింపచేయఁబడి, కటాక్షస్మితాదులగు ననుభావములచేత, ప్రతీతియోగ్యముగాఁ జేయఁబడి, లజ్జాదులగు వ్యభిచారిభావములచేత - పరిపోషింపఁబడి, 'రాముఁడు' మున్నగు అనుకార్యునియందు రసముదయించును. అనుకరించునటునియందో; "నేనురాముఁడను" అని, రామాదిరూపత ననుసంధానించుటచేత - రసమారోపింపఁబడి, సామాజికులకు చమత్కారమును గలిగించును."అను, భట్టలొల్లటాది మతమును మొదటఁ బ్రదర్శించుచున్నాఁడు.

—• రామాదులందు రసమునకుత్పత్తిని దెలుపు భట్టలొల్లట మతము •—

లోచ :— ఆదెట్లనిన :- "పరిపోషము నొందింపఁబడని, పూర్వావస్థ

యందు, స్థాయిగా వ్యపదేశింపఁబడిన రత్యాదిస్థాయిభావమే - 'వ్యభిచారిభావములు వచ్చిపడుట' మున్నగువానిచేత పరిపోషము నొందింపఁబడి, యనుకార్యుఁడగు రామాదివ్యక్తియందు రసమగును. ('ఆరస, మనుకర్తయందారోపింపఁబడును'అని తెలియునది.)

ప్రభా : ప్రశ్న :— అట్లయిననది-నాట్యరసముకాదేః అట్టిచో, అనుకార్యరసమగు దీనిని భరతుఁడు - నాట్యరసమని యేలనెను ?

లోచనము :— (అనుకార్యరామాదిగత) రసము - నాట్యమునఁ (నటులచేతఁ) ప్రయోగింపఁబడును. కనుక నాట్యరసమని చెప్పఁబడును. అను కార్యగతమగు నారసము - అనుకర్తయగునటుని యందారోపింపఁబడి, సహృదయహృదయములయందు చమత్కారమునుగలిగించును.'' అనునది-కొందఱిమతము.

ప్రభా :— భట్టలొల్లటుఁడు-మీమాంసకుఁడు. ఇతనిమతమునకు-'ఉత్పత్తివాదము'. లేక 'ఆరోపవాదము.' అనిపేరు.

అవ :— ఈమతమును దూషించునదియు, వేరొక ప్రకారమున రసస్వరూపమును దెలుపునదియు, నగు శ్రీశంకుకాదిమతమును దెలుపుచున్నాఁడు·

—. నటునియందు రసము నమమానించునదియగు శ్రీశంకుకాదిమతము .—

లోచనము :— చిత్తవృత్తి - ప్రవాహధర్మిణి - (నదీప్రవాహమువలె మాటిమాటికినిఁబుట్టి, గిట్టుచుండునది.) ఈచిత్తవృత్తి-ప్రవాహధర్మిణియగుచుండఁగా(తత్తత్ కారణవశమున- మాటిమాటికిని, బుట్టునదియు, నశించునదియు, నగుచుండ;) ఉత్కంఠాదులగు నావ్యభిచారి చిత్తవృత్తిభేదములచేత - (అటువంటి ప్రవాహధర్మిణియేయగు) రత్యాది స్థాయిచిత్తవృత్తికి పరిపోషమెట్లు కలుగును ?

ప్రభా :— ''ఒకచిత్తవృత్తియుండు సమయమున, నింకొక చిత్తవృత్తియుండదు. ఈచిత్తవృత్తులు - క్షణికములు. కనుక, స్థాయికి, వ్యభిచారులచేత - పరిపోషము కలుగదు.'' అనిభావము.

లోచ :— విస్మయము, శోకము, క్రోధము, మున్నగువానికిఁగూడ - కాలక్రమముచేత పరిపోషముకలుగదు. కనుక, అనుకార్యుఁడగు రామాదివ్యక్తియందు రసముండునదికాదు.

పరిహా :— త్రేతాయుగమునందున్న శ్రీరాముని యందున్న రత్యాది భావము - కాలక్రమవశమున నశించును. కనుక, రసము - అనుకార్యుఁడగు శ్రీరామాదిగతమగుట కవకాశములేదు.

లోచనము :— అనుకర్తయగు నటునియందు రసముండునెడల; నటఁడు-లయాదుల (నృత్యగీత వాద్యాభినయాదుల) ననుసరింపఁజాలని వాఁడగును. (ఈసామాజికగతముకాని) 'రసము - సామాజికగత' మగునెడల, చమత్కారమే ముండును ?

పరిహా : అవ :— రామాదులకుపలె, సామాజికునికిఁగూడ - రత్యాది కముపుట్టునెడల;చమత్కారముకలుగదు· కాఁగా; రసమునకు, రామాదులయందు-(అనుకార్యులయందు) 'ఉత్పత్తిని', నటులయందు - 'ఆరోపమును' దెలుపునది యగు భట్టలొల్లటమతము - సమీచీనముకాదు. అనితెలుపునదియగు శ్రీ శంకుక మతమును దెలుపుచున్నాఁడు.

లోచ :— కరుణాదిరసము, సామాజిక గతమగునెడల; సామాజికునకు దుఃఖప్రాప్తికూడ - కలుగవలసివచ్చును. కనుక, నీపక్షము యుక్తముకాదు. 'యుక్తమగుపక్షమిఁకేది ?' అనిన; స్థాయి - అనంతము, కనుక, నియతమగు (నిశ్చితమగు ఏకావస్థతోఁగూడిన) స్థాయిననుకరించుటకు శక్యముకాదు.

పరిహా :— అనుకార్యగతమగు రత్యాదిభావము మందతమము- మందతరము - మందము - మున్నగు నవస్థాభేదములచేత ఒకొక్కనియందొకొక్కవిధముననుండి, అసంఖ్యమగుచుండుటవలన - అనంతమగుచుండును. కనుక, నిశ్చితమగు నేకావస్థగలదికాదు. కనుక, నట్టి రత్యాదిభావము ననుకరించుటకు వీలుకలుగదు.

లోచ :— (ఒకానొకప్పుడు దానినను కరించుట సంభవించినను) సామాజికులచేత ఆవిశిష్టత తెలియఁబడినపుడు - అది - తటస్థమగుటచేత- వారికి (సహృదయులకు) వ్యుత్పత్తి లేకుండుటవలన నది - నిష్ప్రయోజనమగును.

పరిహా :— రామాదివ్యక్తి విశేషములయందు - స్థాయిభావమునకుఁగల మందతమ, మందతరత్వాది వృత్తిత్వ వైశిష్ట్యము గుర్తింపఁబడి; నటునిచేత-తదనుకరణ మొనర్పఁబడునపుడుకూడ - ఆవృత్తిత్వ వైశిష్ట్యము - సామాజికులకక్షి తెలియఁబడదు. కనుకనది తటస్థమగును. కనుక, తటస్థమగుదానివలన - చతుర్వ

గ్లోపాయ వ్యుత్పత్తియుదయింపదు. కనుక, నిష్ప్రయోజనమేయగును.

అవ :— ఇట్లు, పరమతదూషణాదికము నొనర్చిన శ్రీశంకుకుఁడు - స్వమతమును దెలుపుచున్నాఁడు.

లోచ :— కావున, అనియతములగు నవస్థలు రూపముగాఁగల స్థాయి ప్రతీతినుద్దేశించి, నటునిచేత ప్రయోగింపఁబడి, సంయోగము నొందింపఁబడిన (మేళగింపఁబడిన) విభావానుభావవ్యభిచారిభావములచేత-[అనుమాప్యానుమాపక భావరూపమగు విభావాది సంయోగముచేత] - ఈ రాముఁడు-సుఖి. (సీతయందు రతిగలవాఁడు.) అని, స్మృతికంటె వేరయిన రత్యాదిస్థాయిభావము - ప్రతీతి గోచరమగుటచేత - ఆస్వాదరూపమగు (చమత్కారచర్వణా రూపమగు) ప్రతి పత్తి - (అనుమితి -) అనుకర్తయగునటు నాధారముగాఁజేసికొని, నాట్యమొక దానియందే ప్రసరించునదియగుచు, రసమగును. [చిత్రతురగన్యాయముననటుని యందే రాముఁడను తలఁపుకలుగును. కనుక, నటునాధారముగాఁజేసికొనిన యీ ప్రతిపత్తి - నాట్యైకగామినియగు రసమగును.]

అదికూడ (స్థాయిప్రతీతిరూప రసముకూడ) వేరొక యాధారమునపేక్షిం చునదికాదు. ఇంతేసునిన; ''ఈనటుఁడు-అనుకార్యుఁడగురామునికంటె భిన్నుఁడు కాఁడు. (ఈనటుఁడు - రాముఁడే)''అని, అనుకార్యాభిన్నముగా భావింపఁబడు నర్తకునియందేయుండును. దీనికాస్వాదయిత - (ఆస్వాదరూపమగు ప్రతీతికా శ్రయము) సామాజికుఁడు''. అనునింతమాత్రము చెప్పినఁజాలును. ఆకారణము చేత - నాట్యమునందే - (నటునియందే-) రసముండును. అనుకార్యులగు (అను కరింపఁదగిన నాయకాదులగు) రామాదులయందుండదు.

ప్రభా :— ''అనుమితి రూపమగు రసప్రతీతికి-నటుఁడే యాశ్రయము. ఇట్లురసము - నటాశ్రయకమగుటవలన, నాట్యాశ్రయకమగుట - ఉపపన్న మగును'' అనియర్థము. ఈమతమున - అనుకర్తయగు నటునియందు (పక్షము నందు) రసమనుమానింపఁబడును. అయినను, వస్తుసౌందర్యబలమువలన నీయను మితి - అనుమానింపఁబడునవియగు వహ్న్యాదులకంటె, విలక్షణమగును. నటుని యందు నిజముగా లేకున్నను, దుష్యంతాద్యభిన్నుఁడుగా గ్రహింపఁబడిన, నటు నియందు స్థాయిగానున్నట్లు సంభావింపఁబడునదియగు రత్యాదిభావము- సామాజి కులచేత-వాసనచేత (ధారావాహియగు నిచ్చచేత) చర్వ్యమాణమయ్యు,రసమగును. నటునియందు - అనుమీయమానమే - (ఊహింపఁబడునదియే)- రసమనిభావము. శ్రీశంకుకుఁడు - నైయాయికుఁడు; అతనిచేతఁ దెలుపఁబడిన,యీమతమునకు -

'అనుమితివాద' మనిపేరు.

—* ఇంకొకరిమతము *—

లోచనము :— "హరితాళాది వర్ణముల (సంయోగము) చేత - భిత్తి యందుఁగలిగిన అశ్వావభాసము (గుఱ్ఱపుబొమ్మ) వలె, రామాదుల ననుకరించుటవలన ననుకర్తయగు నటునియందు - 'అభినయాదిసామగ్రి' మున్నగువాని చేత- (నాట్యముచేత) స్థాయ్యవభాసము (రత్యాదిస్థాయిభావాభాసము) కావింపఁ బడును.అవభాసమానమగు నాస్థాయిభావమే-లోకాతీతతచేత, ఆస్వాదమనుమారు పేరుగలప్రతీతిచేత-రస్యమానమై(ఆస్వాదమునకు విషయముగాఁజేయఁబడి) రసమగును. ఇచట - స్థాయ్యవభాసము - నాట్యమువలనఁ గలిగినది. కనుక, నాట్యమువలననగు రసములు - నాట్యరసములని చెప్పఁబడును." అనునది ఇంకొకరి మతము.

—* ఇంకనొకరి మతము *—

లోచ :— ఇంకనొకరు-"విభావానుభావమాత్రమునే రసమనుచున్నారు. అదెట్లనిన :- విశిష్టసామగ్రిచేత [భావకత్వ విశిష్టమగు సాత్త్వికాంగికాదినాట్య సామగ్రిచేత] సామాజికులయందు సమర్పింపఁబడునదియు, ఆవిభావానుభావములచేత క్రమముగా, విభావింపఁదగినదియు, అనుభావింపఁదగినదియు, నగు (రత్యాది) స్థాయిరూపచిత్తవృత్తి కుచితమగునదియు, (సామాజికగత) వాసనతో సంబద్ధమయినదియు, స్వనిర్వృతిరూప చర్వణతోఁగూడినదియు, నగు విభావానుభావమాత్రమునే రసమని చెప్పుచున్నారు. కనుక, (తద్విషయభూతమగు) నాట్యమే - రసములగుచున్నవి." అని చెప్పుచున్నారు.

ప్రభా :— "విభావానుభావములు- నటన యోగ్యత్వరూపమగు నాట్యమగుచుండుటవలన ఇంకనొకరు - నాట్యమే - రసమని చెప్పుచున్నారు." అని భావము.

లోచ :— ఒకరు- శుద్ధమగు విభావమునే-రసమనుచున్నారు. వేరొకరు- శుద్ధమగు ననుభావమునే - రసమనుచున్నారు. ఇంకొకరు - స్థాయిమాత్రమునే- రసమనుచున్నారు. ఇంకనొక్కరు - వ్యభిచారిభావమునే - రసమనుచున్నారు. మఱియునొకరు- తత్సంయోగమునే- రసమనుచున్నారు. ఒకరు-అనుకార్యమునే రసమనుచున్నారు. వేరొకరుసకలమగు నేతత్సముదాయమునే-రసమనుచున్నారు

'ఇఁకనీవి స్తృతి - చాలును'

శ్రవ్యకావ్యమున - లోక, నాట్య, ధర్ములు - రెండునునుండును. కనుక, లోకనాట్యధర్మి స్థానీయమగు, శ్రవ్యకావ్యమునందుఁగూడ-స్వభావోక్తి, వక్రోక్తి, అనుప్రకారద్వయముచేత- అలౌకికమును, ప్రసన్నమును,మధురము,ఓజస్వియు, నగు శబ్దముచేత సమర్పింపఁబడు విభావాదులతోడి సమ్మేళనమువలన - మేమింతకుముందుతెలిపినదియే- రసవార్తయగును. ఉపాయ వైలక్షణ్యమువలన, (ఉపాయములు - వేరగుటవలన) శ్రవ్యకావ్యమునందు - నాట్యమునందుకంటె విచిత్ర రూపమగు (విజాతీయమగు) రసప్రతీతి, - కలిగినఁగలుఁగుగాక:. అయినను, కావ్యమునందలి సరణి - ఇదియే. (మేమిపుడు చెప్పనున్నదియే.)

ప్రథమపక్షమునందే (భట్టలోల్లటోక్తమగు రసోత్పత్తిపక్షమునందే) రస ప్రతీతి - స్వగతమా ? పరగతమా ? అనునీమొదలగు వికల్పనముచేతనగు, దూషణము లేర్పడును. సర్వపక్షములయందునుగూడ - రసప్రతీతి - పరిహరింపఁదగిన దికాదు. (అందఱికిని రసప్రతీతికలుగుచున్నది.) ప్రతీతముకానిచో; (విశేషించి తెలియఁబడనియెడల:) అది - పిశాచమువలె వ్యవహరింపరానిది కావలసివచ్చును.

ప్రభా :— పిశాచమునునది - విశేషించి తెలియఁబడకుండుటవలననది - "ఇది పిశాచము" అని లోకులచేత వ్యవహరింపఁబడుటకు వీలగునదికాదు.

లోచ :— విశేషమేమనిన; ప్రతీతిమాత్రతచేత ["తెలియఁబడుట" అను రూపముగల సామాన్యధర్మముచేత] విశేషము లేకున్నను, ప్రాత్యక్షికియు, (ప్రత్యక్షమగునదియు) ఆనుమానికియు (అనుమితిజన్యయు,) ఆగమోత్థయు (శబ్దజన్యయు) ప్రతిభానకృతయు, యోగిప్రత్యక్షజయు, అగుప్రతీతి - ఉపాయ వైలక్షణ్యమువలన - ఒకదానికంటె నింకొకటి భిన్నమేయగును. కనుక, ఈ ప్రాత్యక్షిక్యాది ప్రతీతులవలె, వానికంటె భిన్నమగు నీరసప్రతీతికూడ- చర్వణ, ఆస్వాదనము, భోగము, అనువేర్వేరు నామములుగలదియగుఁగాక:. దీనికి - నిదానభూతమును, హృదయసంవాదాదులచేత నుపకరింపఁబడునదియునగు విభావాది సామగ్రి - లోకోత్తరరూపమగుటవలన నట్లు కావచ్చును. [ప్రతీయమానమే (స్ఫురింపఁజేయఁబడునదియే) - రసమగుచుండ] "రసము - ప్రతీయమానమగుచున్నది." అను వ్యవహారము "అన్నమును వండుచున్నాఁడు" అను వ్యవహారమువంటిదేయగును. (వండఁబడినదియే యన్నమగునట్లు) ప్రతీయమానమే - (ప్రతీతివిషయతా విశిష్టమే) రసముగదా:. విశిష్టమగు (విభావాది విశిష్టస్థాయి విషయకమగు) ప్రతీతియే - రసన. (రసనావ్యాపారము.) నాట్య (కావ్య) జన్య

మగు నారసప్రతీతికూడ - లౌకికమగు ననుమానముచేతనగు ప్రతీతికంటె (ధూమాదిలింగకమగు వహ్న్యాద్యనుమితికంటె) వేరగునదియేయగును. అయినను, మొదట - లౌకికమగు ననుమానప్రతీతినిగూడ - స్వప్రతీతి కుపాయముగా నంధించును. (అపేక్షించును.)

లోచ :— అట్లే, యీరసప్రతీతి - (శ్రవ్య) కావ్యమున, శబ్దజన్యప్రతీతి కంటె వేరయినను, అన్యమగు నాశబ్దజన్యప్రతీతినిగూడ - మొదట- ఉపాయము ముగా నపేక్షించును.

ప్రభా :— "లౌకికానుమాన వ్యుత్పత్తియు, శబ్దప్రమాణవ్యుత్పత్తియుc, గల హృదయముగల, సహృదయునికి-రసనావ్యాపారముచేత - రసప్రతీతి కలుగును." అనిభావము.

అవ :— ఇప్పుడు భట్టనాయకమతమును ఖండించుచున్నాcడు.

లోచనము :— కనుక, ("రసము - ప్రతీయమానముకాదు" ఇత్యాదిగాcజెప్పcబడిన) పూర్వపక్షము - అనుత్థానోపహతము. (అసలు పొడచూపక ముందే, అడcచివేయcబడినది.) "చిత్తము - చిత్ర (నానావిధ) వాసనావిశిష్టము కనుక, అలోకసామాన్యమగు రామాదిచరితముమాత్రము - సహృదయులందఱికిని హృదయసంవాదము గలదికాదు." అనుట - మహాసాహసము."

ప్రభా :— చిత్తము - అనాదివాసనలతోcగూడియున్నది. కనుక, లోకసామాన్యముకాని చరిత్రము విషయమునcగూడ - సహృదయులకు హృదయసంవాదము కలుగవచ్చును." అనిభావము.

అవ :— "చిత్తము - అనాదులగు రత్యాదివాసనలతోcగూడి యుండుననుటకు పాతంజల యోగసూత్రము నుదాహరించుచున్నాcడు.

లోచనము :— (యోగసూత్రకారుcడు) ఈ విషయమున నిట్లనుచున్నాcడు.

"తాసామనాదిత్వమ్, ఆశిషోనిత్యత్వాత్"
"జాతిదేశ కాలవ్యవహితానా మప్యానన్తర్యమ్,
స్మృతిసంస్కారయోరేకరూపత్వాత్" అని.

ఈ కారణముచేత - (రత్యాదివాసనలనాదిసిద్ధములగుటచేత) రసప్రతీతి - సిద్ధమగుచున్నది.

పరీక్ష :— పాతంజలయోగసూత్రమున "జాతిదేశ" అనుసూత్రము మొదటనున్నది. "తాసామ్" అనుసూత్రము దానితరువాతనున్నది, కావునసూత్ర క్రమము ననుసరించి వానియర్థము నిర్ణైయుఁగునది.

"జాతిదేశ కాలవ్యవహితానా మప్యానన్తర్యం,
స్మృతిసంస్కారయో రేక రూపత్వాత్."
[యోగసూత్రము. కైవల్యపాదము, తొమ్మిదవసూత్రము.]

"జాతిచేతను, [నడుమనుగలిగిన పెక్కుజన్మములచేతను], దేశముచేతను, [మిక్కిలిదూరముల యందున్న పూర్వోత్తరాదిదేశములచేతను] కాలముచేతను, (కల్పసహస్రాబ్దాదులచేతను) వ్యవహితములైనను, [వ్యవధి-అనఁగా; పూర్వము నందలిదగు ఒకానొక జన్మమునకును, తదితరజన్మములచేత వేరుపరుపఁబడి - పూర్వమునందలి జన్మమునకు సమానమగు, నింకొక జన్మమునకును, నధికముగాఁ గల దూరము. అట్టి దూరముకలవియైనను] స్మృతియు, సంస్కారమును, ఏకరూప ములు-[సమానవిషయములు.] కనుక,వానికి [అనఁగా; స్మృతిమూలములగు వాస నలకు] ఆనంతర్యము [సమానజన్మమునందలి సంస్కారములు వానికి తొలుతనున్న సమానజన్మమునందలి సంస్కారములకుఁ దరువాతివగుట] కలుగును." అనునది సూత్రార్థము. దీనిభావము నిర్ణైయుఁగునది.

"ఈ సంసారమున - నానాయోనులందును దిరుగుచున్న, సంసారులగు, [జననమరణరూప సంసారముగలవారగు] జీవులు - మొదట నొకానొక జన్మము నొంది, నడుమ ననేకములగు నితరజన్మములనొందినను, తిరుగనదియే జన్మము నొందునపుడు- స్మృతియు, దానికి హేతువగు సంస్కారమును, ఒకేరూపముగలవి యగుటవలన - ఈజన్మము- ఆ మొదటి జన్మమునకు మిక్కిలిదూరమునైనున్నను, దానితరువాతిదేయగుట సిద్ధించును." దీని ఫలితార్థమిది :—

ఒకప్రాణి యొనర్చినకర్మము-విపచ్యమానమగుచు ఏజాతికి సంబంధించిన విపాకము నారంభించునో; ఆజాతి కనుగుణములగు వాసనలకు - ఆకర్మము - అభివ్యంజకమగుచు, వానినభివ్యక్త మొనర్చును. కాఁగా, జీవునిచేతఁ గావింపఁబడిన కర్మసంస్కారము- వానిచిత్తమున, వాసనారూపమున, గ్రామఘోష ప్లేటునందలి

రేఖాపంక్తివలె స్థాయిగా నిలిచియుండును. కనుక, ఆవాసనారూపమగు సంస్కారమే - ఈజీవునకు ముందు కలుగనున్న జాత్యాయుర్భోగములకు (పుట్టుక, బ్రతుకు, ఫలానుభవము, మున్నగువానికి) అంకురముగానుండును. ఈ సంస్కారము నుండియే - జీవునకు స్మృతికలుగును. ఆస్మృతివలన సుఖదుఃఖముల యనుభవము (భోగము) సిద్ధించును. ఆయనుభవమువలనఁ దిరుగ సంస్కారమును, దానివలన స్మృతియుఁ గలుగుచుండును. (పూర్వ)కర్మానుభవమువలన వాసన-కలుగునని చెప్పఁబడుచున్నదిగదా! ఆవాసననుండి యుదయించిన యొకానొక కర్మము-(అదృష్టము) బలీయమగుటవలన పరిపక్వమగునపుడు; తత్కర్మానుగుణములగు మనుష్యాది జన్మములు కలుగును. ఒకజీవుఁడు - ఒకసారి, వాసనావశమున, మొదట (పూర్వము) మనుష్యజన్మమునొంది - నడుమను, వేరువేరు జాతుల యందు (పశ్వాదిజాతులయందు) వేరువేరుదేశములయందు, వేరువేరు కాలముల యందు - పెక్కుజన్మములనొందిన తరువాతఁ, దిరుగమనుష్య జన్మము నొందు నెడల; ఈనడుమను గలిగిన జన్మములయందలి సంస్కారస్మృతులు వానికిఁ గలుగక; జాతిదేశకాలములచేత మిగులదూరమైయున్న పూర్వమనుష్యజన్మమునందలి సంస్కార, స్మృతులే కలుగును. గాని, నడుమను గలిగిన పశుపక్ష్యాదులసంస్కార, స్మృతులు-కలుగవు. దీనికి దృష్టాంతము నిట్లెఱుఁగునది :—

ఒకజీవుఁడు - కర్మాశయవశమువలన నొకానొకజన్మమున - మనుష్యజాతి యందు- ఏగ్రీసుదేశమునందో, కొన్నివేల సంవత్సరముల క్రిందటఁ బుట్టి, తరువాత పశుపక్ష్యాదులయందు- ఆగ్రీసుదేశమునకు సమీపమునందున్న వియేయగు పెక్కు దేశములయందు - పెక్కుకాలములయందుఁ బుట్టి, తిరుగ ననల్పదూరమునసున్న భారతదేశమున మనుష్యజన్మము నొందెననుకొందము. అప్పుడు - ఆజీవునికి - ప్రస్తుతమనుష్య జన్మమునకు సమీపమునున్న పశుపక్ష్యాదులకు సంబంధించిన సంస్కారస్మృతులు కలుగవు. 'ఇంకేవికలుగును?' అనిన; ఈపశుపక్ష్యాదుల సంస్కారస్మృతులచేత మిక్కిలిదూరముగాఁ జేయఁబడియున్నను. గ్రీసుదేశము నందుఁగలిగిన మానవజాతికి సంబంధించిన సంస్కారస్మృతులే కలుగును. కనుక, తదితరజన్మములయందలి సంస్కారస్మృతులకంటె - సమానజాతి (మనుష్య జన్మము) యొక్క సంస్కారస్మృతులే మిక్కిలి సమీపవర్తులగుచున్నవి. కనుక భారతదేశమునందు మానవుఁడైన వ్యక్తికి సంబంధించిన వాసనలు - గ్రీసుదేశము నందు మానవుఁడైన వ్యక్తికి సంబంధించిన వాసనలకుఁ దగువాటివగుట సిద్ధించుచున్నది. మరల నీజీవునకు కేవలపశుజన్మమే కలిగినయెడల; అపుడు వానికి మిక్కిలి దూరకమునందున్న మనుష్యజన్మమునుగూడ - తత్పూర్వము, తానుపొందిన, పశుజన్మము నందుఁగల్గిన సంస్కారస్మృతులే సంభవించును." అని తెలియనది.

అవ : — (1) "అభివ్యంజకమగు కర్మ - తుల్యజాతీయమగుటవలనను, (2) సంస్కారస్మృతులు సమాన రూపములగుటవలనను, గూడ - ఒకవాసనకు దూరముగానున్న యింకొక వాసన-దానికిఁ దరువాతిదగుట సంభవించును." అని శ్రీ శంకరభగవత్పాదభాష్యము. "అయ్యాః కర్మానుభవజన్యములగు ప్రథమ వాసనలు - తరువాతి జన్మమున నుదయించునవియగు వాసనలకుఁగారణము కావచ్చును. కాని, ప్రథమకర్మానుభవ జన్యములగు మొదటివాసనలు- దేనివలనఁ గలుగును?" అని యాశంకించి - ఈయాశంకను దొలగించుటకు "వాసనలకు మొదలేలేదు" అని తెలుపునదియగు క్రింది సూత్రమును ప్రసరించుచున్నారు.

"తాసామనాదిత్వంచాశిషో నిత్యత్వాత్."
[యోగసూత్రము. కైవల్యపాదము. 10వ సూత్రము.]

"సంకల్పము-అనాదిగనుండుటవలన స్మృతిసంస్కారములు-అనాదులు." (అనగా 'మొదలు' లేనివి). "నాకుమరణముకలుగకుండుఁగాక! నేనుసుఖముగా నుందునుగాక!" అను మహామోహరూపమగు సంకల్పములేని వ్యక్తియుండదు గదా!. ఈసంకల్పము పూర్వజన్మమునందలి స్మృతిసంస్కారములవలననే జనించును; కాని, స్వాభావికము (నిమిత్తములేకయే సహజముగా నుదయించునది) కానేరదు. ఏల? సుదీర్ఘవయస్కులగుటవలన మరణభయాద్యనుభవముగల లోకులకు, మరణభయము, ద్వేషము, మున్నగు నిమిత్తములచేతఁ గలుగునవియగు దుఃఖము, కంపము, మొదలగునవి- అప్పుడేపుట్టిన శిశువునకుఁగూడ - కలుగుట- కాన్పించుచున్నదిగదా!. మరణభయ, ద్వేషాదుల నింతకుముందెన్నడును ననుభవింపని యాశిశువునకాభయమేల? అగ్నికి - ఉష్ణత - స్వాభావికము. అది - నిమిత్తమువలన వేడియగుటలేదు; కనుక 'స్వాభావికమగు వస్తువు - కారణము నెప్పుడును స్వీకరించునదికానేరదు.' నిమిత్తములేకయే - స్వభావముచేతనే శిశువేడ్చునెడలను, కంపించునెడలను, అపుడు పూర్వజన్మమునందలి స్మృతి సంస్కారములనంగీకరింపవలసిన యక్కఱయుండదు. కాని, వస్తుస్థితియట్లులేదు. అగ్నికి ఉష్ణతవలె, శిశువునకేడుపు - స్వాభావికముకాదుగదా!. లోకమున-కంప, రోదనాదులచేత, భయమును, ఆభయముచేతఁ దమకుఁగలుగునని తలఁపఁబడు ప్రమాదస్మరణమును, నూహింపఁబడుచున్నవి, అట్టిప్రమాదస్మృతికలుగనియెడల ఏప్రాణియు భయముచేతఁ గలుగునదియగు కంపమును, రోదనమును, గావింపదు. కనుక, ఇట్టి భయాదిస్మృతి-అప్పుడేపుట్టిన శిశువునకుఁగూడ నిమిత్తమువలననే కలిగినదనిచెప్పకతప్పదు. శిశువునెదుటనొకవ్యక్తి కణ్ణనూపినయెడలనాశిశువు కంపించును; మఱియు గట్టిగానేడ్చును. మరణభయ స్మృతిలేనియెడల శిశువుకం

పింపదు, ఏడువదు. వీనివలన-శిశువునందు మరణభయస్మృతి నూహింపకతప్పదు. అనుభవింపఁబడని యామరణభీతి-స్మృతిగోచరముకాదు. కనుక, నాస్మృతికి- వాసనయు, వాసనకు-పూర్మజన్మమునందలిసంస్కారానుభవమును, తొలుతనున్నవిగా నూహింపవలసియున్నది. కావున, అనాదివాసనలతోఁగూడిన చిత్తము - నిమిత్త వశమువలన విపచ్యమానములగు కర్మముల కనుగుణములగు (నావశ్యకములగు) కొన్ని వాసనలను వెలువరించి, యాజీవరూపవ్యక్తికి - మనుష్యాది జన్మముల యందగు సుఖదుఃఖరూపభోగము నిచ్చుటకు ప్రవర్తించును'' - 'అని సిద్ధాంతిత మగుచున్నది.' అని నిశ్చయింపవలసియున్నది.

కాఁగా; సహృదయుని చిత్తమునందడఁగియున్న రత్యాదివాసనలే - విభావానుభావ వ్యభిచారిభావములచేతఁ గావింపబడిన, రసనా (వ్యంజనా) వ్యాపారము వలన మేలుకొలుపఁబడి, భగ్నావరణ - చిదానందరూప స్వాత్మతోఁగూడి, సహృదయునిచేత నాస్వాదింపఁబడి రసమగుననుటయే సర్వసాహితీ విద్వదభిమతమగు సిద్ధాంతము. కనుక నిట్లు (రసనారూపమగు) రసప్రతీతియే సిద్ధించును.'' అనునది - అభినవగుప్తకృత 'రసాలోకసిద్ధాంతము'.

లోచనము :— ఈరసప్రతీతి - రసనారూపముగా నుదయించును. కాని రసప్రతీతియందు వాచ్యవాచకములకుఁ (కావ్యమునకుఁ) గల వ్యాపారము-అభిధాదులకంటె వేరయినదియు, వ్యంజనాత్మయు, (వ్యంజకత్వరూపయు- అనఁగా; స్ఫురింపఁజేయునదియు) అగు ధ్వననవ్యాపారమేయగును. (భట్టనాయకునిచేఁ దెలుపఁబడిన) కావ్యరసవిషయకమగు భోగీకరణ (భోగకృత్త్వ)వ్యాపారముకూడ ధ్వననాత్మకమగు వ్యాపారమేయగును. కాని, వేరొకటియేదియుఁ గాదు. కావ్యమునకు సంబంధించిన భావకత్వవ్యాపారముకూడ - ఆయారసములకు సముచితములగు గుణాలంకారములను పరిగ్రహించుటయే- రూపముగాఁగలదిగా; మాచేతఁగూడ - విస్తరించిచెప్పఁబడనున్నదియే. ఇది- (భట్టనాయకుఁడు తెలిపిన భావన-) అపూర్వమా, యేమి ?.

ప్రిభా : అవ :— మఱియు, భావకత్వవ్యాపారమును స్వీకరించునపుడు - ''రసము - పుట్టునదికాదు'అని, నీవొనర్చిన ప్రతిజ్ఞకుఁగూడ - భంగము కలుగును.'' అనిచెప్పుచున్నాఁడు.

లోచ :— కావ్యము- రసములకు భావకమని చెప్పుచున్నావుగదా; ఇట్లు, కావ్యమునకు భావనను జెప్పుచున్న నీచేతనే - భావనావ్యాపారమువలన, (కావ్యము-భావనచేత రసోత్పాదకమగునని యంగీకరించుటచేత) ఉత్పత్తిపక్షమే.

(''రసము-పుట్టును'' అనుపక్షమే) ప్రత్యుజ్జీవితము. (తిరుగ బ్రతికింపఁబడినది.) మఱియు నర్థము బాగుగాఁదెలియనపుడు - భావనకలుగదు. కనుక, కేవలములగు కావ్యశబ్దములకు భావకత్వము [భావన] కూడకలుగదు.

ప్రభా :— ''అర్థపరిజ్ఞానము లేనపుడు - కేవలములగు కావ్యశబ్దములు మాత్రమే - రసమును భావింపఁజేయఁజాలవు.'' అనిభావము.

లోచ :— అట్టి-శబ్దాంతరముచేత (లౌకికవాక్యముచేత) నయిననుగూడ నర్థము సమర్పింపఁబడినపుడు - రసభావనపొసఁగదు. కనుక కేవలములగు నర్థములకుఁగూడ - భావకత్వముకలుగదు. కనుకనే, ''అర్థమైన శబ్దమైన'' అనుచోట- శబ్దార్థములు రెంటికినిగూడ భావకత్వమును మేమేచెప్పియున్నాము.

ప్రభా : అవ : - ''శబ్దార్థమయమగు కావ్యము - గుణాలంకారములతోఁగూడుటచేత - సహృదయులకు రసచర్వణను జనింపఁజేయును'' అని చెప్పుచున్నాఁడు.

లోచ :— కావున, కావ్యము - వ్యంజనాఖ్యమగు వ్యాపారముచేతను, గుణాలంకారౌచిత్యాదికమగు నితికర్తవ్యతచేతను, (రస) భావకమగుచు, రసములను భావింపజేయును. కనుక, త్ర్యంశయగు (అంశత్రయముగలదియగు)భావనయందుఁగూడ - కరణాంశమున (సాధనాంశమున) ధ్వననమే - వచ్చిపడుచున్నది.

ప్రభా :— భావనయనఁగా - భావింపఁదగినవస్తువుయొక్క భవనమున (పుట్టువున) కనుకూలమగు వ్యాపారము. 'కేన? కథమ్? కిమ్? భావయేత్' 'దేనిచేత? ఎట్లు? దేనిని? - భావింపవలెను'- అని; యీభావన - ''సాధనము-ఇతికర్తవ్యత-సాధ్యము''- అను నంశత్రయము నపేక్షించును. కాఁగా; ''యజేత''అనుచోట - భావకమగు వైదికవాక్యము - స్వర్గము నుద్దేశించి, పురుషునికి - (జ్యోతిష్టోమ) యాగమును విధించుచున్నది. కనుక, యాగమును సాధనముచేత - 'ప్రయాజాది క్రియనొనర్చుట'యను నితికర్తవ్యతచేత, స్వర్గకామునిచేత 'స్వర్గమనుసాధ్యమును' భావింపఁజేయునట్లు- భావకమగు కావ్యము- వ్యంజనావ్యాపారమును సాధనముచేతను, గుణాలంకారౌచిత్యరూపమగు నితికర్తవ్యతచేతను, సహృదయునిచే, 'రసమును సాధ్యమును' భావింపఁజేయును. కనుకనిట్లు,మూడంశములుగల భావనయందు-కరణాంశమున (సాధనాంశమున)ధ్వననవ్యాపారమే- వచ్చిపడుచున్నది, ధ్వననమువలననే - రసభావనకలుగుచున్నది.

లోచనము :— భోగముకూడ - కావ్యశబ్దముచేతఁ జేయఁబడునదికాదా ? (భోగముకూడ - కావ్యశబ్దకృతమే - యగును.) ఇంతేకాక ఘనమోహాంధ్యసంకటతానివృత్తిద్వారమున [అనఁగా; నిబిడమోహరూపమగు, నజ్ఞానముచేత - ఆనందాంశమున కొదవిన యావరణమునుదొలఁగించుట ద్వారమున] ఆస్వాదమను నామాంతరముగలదియు, లౌకికముకానిద్దియు, ద్రుతి, విస్తర, వికాసములు, స్వరూపములుగాఁగలదియు, లోకోత్తరమగునదియు, నగు భోగము - [ఆనందాంశమునందుఁగల ఆవరణమును (వ్యంజనావ్యాపారముచేతఁ) దొలఁగించునవియగు, అలౌకిక విభావాదులతోఁగూడిన రత్యాదిస్థాయిభావముతో, సంవలితమయిన, ఆత్మచైతన్య సాక్షాత్కారము] కర్తవ్యమగునప్పుడు - ధ్వననవ్యాపారమే - మూర్ధాభిషిక్తమగును. (ప్రధానహేతువగును) నీవుచెప్పిన(భట్టనాయకోక్తమగు)భోగము- రస్యమానతచేత- (రసీభవింపఁజేయబడుటయను హేతువుచేత) ఉదయించిన చమత్కారముకంటె వేరుకాదు. [వ్యంజనావ్యాపారముచేత స్ఫురింపఁజేయఁబడునని మేముచెప్పిన చమత్కారరూపమగు రత్యాదిసంవలిత చిదానందవ్యాత్మసాక్షాత్కారముకంటె - వేరుకాదు.] కనుక, నీవుచెప్పినయీభోగకృత్త్వము, అనగా, భోగీకృతి (భోగోత్పాదకతయను వ్యాపారము) కూడ - రసమునకు - ధ్వననీయత్వము - సిద్ధించునప్పుడే (అనఁగా; రసము - ధ్వనింపఁజేయఁదగియుండుట- సిద్ధమగునప్పుడే) దైవసిద్ధమగును. (సిద్ధించును).

సత్త్వరజస్తమో గుణములకుఁగూడ-(న్యూనతాధికతలవలననగు)అంగాంగిభావముచేతనగు వైచిత్ర్యము - అనంతము. (అసంఖ్యము.) కనుక, (అసంఖ్యమగు స్వరూపభేదముగల) రసాస్వాదమును - ద్రుతి, విస్తర, వికాసాత్మకముగనే గణించుటకూడ - యుక్తముకాదు. (నీవుచెప్పినట్లు) ఈ రసాస్వాదము-పరబ్రహ్మాస్వాద సబ్రహ్మచారికూడ నగుఁగాక; [అదిమాత్రభిమతముకానిదికాదు.] (కాంతాసమ్మితమగు) కావ్యమువలన జనించునదియగు వ్యుత్పాదనము (జ్ఞానోపదేశము) కూడ - (ప్రభుసమ్మిత) శాస్త్రకృతమగు శాసనముకంటెను,(సుహృత్సమ్మిత) ఇతిహాస (భారతాది - పురాణాది) కృతమగు ప్రతిపాదనముకంటెను. విలక్షణమేయగుచుండును.

(కావ్యము) "శ్రీరాముఁడెట్లోనర్చెనో నేను నట్లేయొనర్పవలయును" అనునుపమానముకంటె వేరయినదియు, రసాస్వాదముపాయముగాఁగలసహృదయునిస్వకీయమగు ప్రతిభయొక్కవిజృంభణము (వికాసము) స్వరూపముగాఁగలదియు, నగు వ్యుత్పత్తిని - తుట్టతుదను (కావ్యపఠనము ముగిసినపిమ్మట) కలిగించును.

ప్రిభా :— రసాస్వాదమువలన - సహృదయ హృదయమునందలి ప్రతిభ - విజృంభించి, వ్యుత్పత్తినొందును. "తుట్టతుదను" అనుటచేత - మొదట నుపమితిరూపమగు వ్యుత్పత్తినిగూడఁ గలిగించునని సిద్ధించును. "కాఁగా; కావ్యము - ఉపమానమువలన లభించునదియగు జ్ఞానముకంటె నధికమగు జ్ఞానమునే కలిగించును." అనితెలియునది.

లోచనము :— కనుక, (రసప్రతిపాదన విషయమున) ఎవని నుపాలంభింతుము ?

ప్రిభా :— "వస్తుస్థితి- ఇట్లు సహృదయ హృదయగోచరమై యుండనే యున్నది. కనుక భుక్తివాది, ఉత్పత్తివాది, అనుమితివాది, మున్నగువారిలలో నెవ్వరినిగూడ నిందింపవలసిన పనిలేదు." అనిభావము.

లోచ :— కాఁగా; తుదకుఁదేలిన ఫలితార్థము నిట్లెఱుఁగునది :– "రసములు - ప్రతీతిరూపమగు రసనావ్యాపారముచేతనే (అభివ్యక్తిచేతనే) రసీభవింపఁజేయఁబడును. [ఆస్వాదింపఁజేయఁబడును.] కనుకనే, (రసములనిచెప్పఁబడుచున్న) రసములు - అభివ్యంజితములే (అభివ్యక్తికి విషయములుగాఁజేయఁబడిన (చిదానందవిశిష్ట) స్థాయిభావములే) యగును.

ఇచట నభివ్యక్తి - ప్రధానముగాఁ గావచ్చును. లేక, అప్రధానముగాఁ గావచ్చును. (రసవిషయకమగు) అభివ్యక్తి-ప్రధానమగునపుడు (అభివ్యక్తమగు రసము) ధ్వనియగును. (రసాదివిషయకమగు) ఈయభివ్యక్తి - ప్రధానముకానపుడీరసాదులు - రసాదులుకాక, రసాద్యలంకారములగును.

ప్రిభా :— అభివ్యక్తి - ప్రధానము కానపుడు, ప్రధానమగు వేరొక వాక్యమునకీ రసాదులంగములగును. కనుక, నప్పుడివి - రసాద్యలంకారములగును. ఇవి - గుణీభూతవ్యంగ్యములని చెప్పఁబడును. ఈవిషయము - లోచనమునఁ దెలుపఁబడిన యీరసతత్త్వనిరూపణము (రసాలోకము) ముగిసినపిమ్మట "అన్యము ప్రధానమగుట" అను కారికచేతను, వృత్తిచేతను, లోచన ప్రభామతులచేతను, సమగ్రముగా నిరూపింపఁబడినది.

[చూ. ఆ. ధ్వ. ద్వితీ. 39వ పేజీ 11 పేరా]

ఇది - ప్రభామతి ప్రసారిత, లోచనోన్మీలిత శ్రీమదానందవర్ధన, రసాలోకము ఇది - శ్రీభారతీదేవికి - సమర్పితము.

ఓమ్. తత్. సత్.

## ద్వితీయానుబంధము. (౨)

## కారికా (ధ్వని) కార - వృత్తి (ఆలోక) కార

## —* ద్వైతాద్వైతములు *—

ఆనందవిరచితమని జగత్ ప్రసిద్ధమగు ధ్వన్యాలోకము నందలి, ధ్వనికిఁ గర్తయెవ్వఁడను విషయమున విప్రతిపత్తులున్నవి. అవి- ద్వైతాద్వైతరూపములు. (భిన్నులు, అభిన్నులు, అనునవి.) అవియింకను నిరూపితములుకాలేదు.

ఇందలికారికలు,'ధ్వని'యనియు,వృత్తి,'అలో'కమనియుఁబేర్కొనఁబడినవి. ఈరెండిఁటికిని గూడకర్త, ఆనందవర్ధనుఁడా? కాఁడా? అను సందేహమునకు నివృత్తికలుగకున్నది. ఆలోక (వృత్తి) కారుఁడానందవర్ధనుఁడేయను విషయము- సర్వపండిత సమ్మతమేయగుచున్నది.

కాని ధ్వనికారుఁడెవ్వఁడో తెలియకున్నది.కొందఱు-ధ్వని(కారికా)కారుఁడు- ఆలోక (వృత్తి) కారుఁడు- ఆనందవర్ధనుఁడేఁయను నద్వైతవాదులు. కొందఱు- ఆలోకకర్తయానందవర్ధనుఁడే యగును.కాని ధ్వనికారుఁడతఁడుకాఁడను ద్వైత (భేద) వాదులు. లోచనోక్తమగు సాక్ష్యమును విచారించునెడల; కారికా- వృత్తి- కారులు భిన్నులయినట్లు కాన్పించును. కారికా - వృత్తులయందు కొన్నిచోట్ల నగ పడు విషయభేదమును సమీక్షించువారికిఁగూడ నీద్వైతవాదమే సమంజసమని తోఁచును. అయినను లోచనకారులగు శ్రీమదభినవగుప్త పాదులవారే స్వవిరచిత భరతనాట్యశాస్త్రవ్యాఖ్యయగు నభినవభారతియందు-కారికా, వృత్తి,ప్రోక్తములగు విషయములనుదాహరించునపుడు ''ధ్వనికారుఁడిట్లుచెప్పెను, వృత్తికారుఁడిట్లు చెప్పెను'' అనిద్వైతమునుజెప్పక, ఆయావిషయములన్నిఁటినిగూడ నానంద వర్ధనాచార్యుఁడు చెప్పినట్లే (ఐక్యము నే) వ్యాఖ్యానించియున్నారు.

మఱియు''ఆనన్దో మనసిలభతాంప్రతిష్ఠా మితిప్రకాశ్యతే.'' ''సహృదయుల మనస్సుల యందానందము (ఆనందుఁడు) ప్రతిష్ఠితము (తుఁడు) కావలయునను నుద్దేశమున ధ్వనిస్వరూపమును ప్రకాశింపఁజేయుచున్నాము'' అను విషయ మును వ్యాఖ్యానించునపుడు, '' కావ్యేరసయితా సర్వో,నబోద్ధాననియోగభాక్'' రసపర్వణాశీలుఁడే కావ్యమునందధికారి. బోద్ధ, నియోగభాక్కు, అధికారులు కారు........ కావ్యమువలన-వ్యుత్పత్తి, ప్రీతి, కలుగును. అయినను వానియందు

ప్రీతియే (ఆనందమే) ప్రధానము......చతుర్వర్గవ్యుత్పత్తికిఁ గూడపార్యంతికమగుముఖ్యఫలమానందమే. ఆనందుఁడనునది-గ్రంథకర్తృనామము (అనియైనను చెప్పవచ్చును) దానినాయానందవర్ధ నాచార్యుఁడు - ఏతచ్ఛాస్త్రద్వారమున దేవతాయతనాదులయందు (దేవుని)వలె సహృదయహృదయములయందనశ్వరియగు స్థితినొందునుగాత'' అనిభావము. దీనికిఁ బ్రమాణము (భామహోక్తము)

శ్లో॥ ఉపేయుషామపిదివంసన్ని బన్ధవిధాయినామ్
ఆస్తఏవనిరాతఙ్కంకాన్తం కావ్యమయంవపుః॥

''ప్రబంధనిర్మాతలగు మహాకవులు స్వర్గాములైయున్నను, కమనీయమగు వారి కావ్యశరీరము మాత్రము నిరాతంకముగా నిల్చియుండును'' అనునది.

ఇతని మనస్సు - వైదుష్యము - లేక యీశాస్త్రము-సహృదయ హృదయములయందు ప్రతిష్ఠితమగునదియే. ఈగ్రంథకర్త సహృదయ చక్రవర్తియనునది-ప్రసిద్ధమేగదా॥...............సంభావనా ప్రత్యయోత్పాదన ముఖముననిట్లు స్వనామమును ప్రకటించుట- శ్రోతృప్రవృత్త్యంగమే(ఖ్యాతిలాభముకొఱకుఁగాదు)'' అను నంశమును గ్రంథాంతమున ''ఆనన్దవర్ధన ఇతిప్రథితాభిధానః'' అను పద్యమును వ్యాఖ్యానించునపుడు చెప్పుదుము. ఇట్లు గ్రంథకర్తయగు కవికి, శ్రోతకు, ముఖ్యప్రయోజనము - ఆనందమేయని చెప్పఁబడియెను. గ్రంథకర్తకూడ ''అస్మదుపజ్ఞేన విస్మార్యః'' (అస్మదుపజ్ఞము-మరువఁదగదు) అనియు, ''ఆనన్ద.... ప్రథితాభిధానః'' అనియు, తానే యీ గ్రంథమునకుఁ గర్తనని చెప్పుకొని యున్నాఁడు.

గ్రంథాంతమునందు ''ఆనన్దవర్ధన....అభినవగుప్త విలోచనంతత్'' అని యభినవగుప్తుఁడు- గ్రంథకర్తృనామమును, తన నామమునుగూడ, చెప్పియున్నాఁడు. ముకుళుఁడు-ఁన యభిధావృత్తిమాతృకలో సహృదయోక్తమగు ధ్వని-లక్షణాంతర్భూతమని చెప్పెను. ఇతఁడు కారికా - వృత్తులను, రెండింటినిగూడ తన గ్రంథమునందుదాహరించుచు నవి సహృదయకర్తృకములనియే వచించియున్నాఁడు - కావున నీ సహృదయుఁడానందునికంటె భిన్నుఁడుకాఁడని తోఁచుచున్నది. రాజశేఖరుఁడు ''ధ్వనినాతిగభీరేణ, కావ్యతత్త్వనివేశినా। ఆనన్దవర్ధనః కస్యనాఽసీదానన్దవర్ధనః''అని-ధ్వని-యానందవర్ధనోక్తమనియేచెప్పెను. మహిమభట్టుకూడ - ధ్వనివాదమును ఖండించునపుడు కారికావృత్తికారులకు భేదమును పాటించియుండలేదు. కావున, సహృదయుఁడు-ధ్వనికర్తయనియు, ఆనందవర్ధనుఁడాలోక కర్తయనియుఁ, జెప్పువాదముకూడ సమంజసముకానేరదు.

ఈ గ్రంథమునకు ధ్వన్యాలోకము- సహృదయాలోకము-కావ్యాలోకము, అను నామత్రియ ముండుటచేత నిందలి కారికాభాగము - ధ్వని, సహృదయ, కావ్య, నామములచేతను, వృత్తి, ఆలోకనామముచేతను-పేర్కొనఁబడినట్లుతోఁచెడిని. ఆనందవర్ధనునకు సహృదయుఁడను నామాంతరమో, బిరుదమో, యుండియుండునని యూహింపవలసియున్నది. ''ఈ గ్రంథకర్త- సహృదయ చక్రవర్తి గదా'' అని లోచన మీ విషయమునే చెప్పినది. ధ్వనికారుని నామము- కరాళకాల గర్భకబళితమై, విస్మృతమయ్యెనని సిద్ధాంతము చేయఁబడునంతపఱకును శ్రీరాజానక శ్రీమదానంద వర్ధనాచార్యునకుఁగల, ధ్వని - ఆలోక . కర్తృత్వమును విశ్వసించుటయే యుక్తమని తోచుచున్నది.' ఈవిషయమున నా యభిప్రాయమును గ్రింది పద్యరూపమున పాఠకులకు నివేదింతును.

కం॥ ''ధ్వని'' కర్తయైన దేవుం
దని ''ధ్వన్యాలోక'' కర్తయైన ఋషీందుర్గిం
దని పూజించెద మానం
దుని మాకానందవర్ధనుండతఁడగుటన్॥

ఇట్లు, ఆంధ్రీకృతికర్త.

# —* ప్రభామత్యాలోకము *—

[శ్రీ విజయనగర మహారాజ ప్రభుత్వ సంస్కృత కళాశాలాధ్యాపకులైన, న్యాయవిశారద, న్యాయసుధానిధి, న్యాయమీమాంసాలంకారవిద్యాప్రవీణ, శ్రీ కొల్లూరు లక్ష్మణమూర్తిశర్మగారి అభిప్రాయము.]

నాకు శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి - చిరపరిచితులు. బాల్యము నుండియే కవిత్వమలవడిన యదృష్టశాలి. సంగీతము-వీరిసాహిత్యమునకు మెఱుఁగులు దిద్దినది. అతికష్టసాధ్యములైన యుపనిషత్తులను, శాస్త్రగ్రంథములను, సులభశైలిలో నాంధ్రీకరించుటయే వీరి పాండిత్యప్రకర్షకును, శాస్త్రవిజ్ఞానమునకును, గీటుఱాయియగుచున్నది. ఉపాధ్యాయపదవిని సక్రమముగనిర్వహించుచు, బృహద్గ్రంథములను రచించుచుండుట- వీరిదైవోపాసనాశక్తిని బహుముఖములుగఁ జాటుచున్నది. ప్రాచీన "భారతీయసంస్కృతి పునరుద్ధరణమే - భారతీయుల ప్రస్తుత కర్తవ్య"మని మనదేశనాయకులు పదేపదే హెచ్చరించుచున్నారు. ఆసంస్కృతి నుద్ధరింపవలెననిన తత్స్వరూప స్వభావము లసంఖ్యాక భారతీయులకుఁ దెలియవలయును. ఏతత్సర్వసంస్కృతియు సంస్కృత వాఙ్మయముననే యిమిడియున్నది. అందుచే నందఱు నొక్కుమ్మడిగ సంస్కృతభాష నభ్యసించి, దానినవగాహన చేసికొనవలసిన పరిస్థితియేర్పడినది. అది మనమనుకొనునంత వేగముగ జరుగునట్టిదికాదు. కావున సంస్కృతపండితులే దానిని దేశభాషలోనికి సులభశైలిలో నత్యంతవేగమున ననువాదములు చేయవలసిన సమయ మాసన్నమైనదని మొదటఁదెలిసికొనిన 'క్రాంతదర్శి' శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి. జగత్ప్రళయ మొనరించు శక్తిగలిగిన యీ యణుయుగమందలి ప్రజలకు-దయా సత్యాహింసాదులవంటి మూలసిద్ధాంతములలోని రహస్యములను బోధించుట- యెంతయేని యావశ్యకమయియున్నది. అట్టి మూలసూత్రముల కుపనిషత్తులాలవాలములనెడి సంగతి మరువరాదని శ్రీ శాస్త్రి శంఖారావమును గావించిరి.

మహాకావ్యములు - ప్రవృత్తి నివృత్తిదాయకములు. సహజీవనము, విశ్వసౌభ్రాత్రము, మున్నగునవి యీ మహాకావ్యములపై నాధారపడియున్నవి. ఏతాదృశ కావ్యములయొక్క స్వరూపస్వభావాదులను స్పష్టపరచునది యలంకారశాస్త్రము. భరతుఁడు, భామహుఁడు, దండి, ఉద్భటుఁడు, వామనుఁడు, ఆనందవర్ధనాచార్యుఁడు, అభినవగుప్తుఁడు, మమ్మటుఁడు, విశ్వనాథుఁడు, జయదేవుఁడు విద్యానాథుఁడు, అప్పయ్యదీక్షితులు, జగన్నాథపండితుఁడు, మున్నగునాలంకారిక

దిగ్గజశ్రేష్ఠులు- భరతనాట్యము, భామహాలంకారము, కావ్యాదర్శము, ఉద్భ ...లు లంకారము, కావ్యాలంకారసూత్రము, ధ్వన్యాలోకము, లోచనము, కావ్యప్రో ...లము సాహిత్యదర్పణము, చంద్రాలోకము, ప్రతాపరుద్రీయము, కువలయానం ...యు చిత్రమీమాంస, రసగంగాధరము మున్నగు నలంకార శాస్త్రగ్రంథములన ... కావ్యరూపములను తీర్చిదిద్దిరి. వానిలో లోచనయుక్త ధ్వన్యాలోకము ... మధ్య చంద్రునివలె ప్రకాశించును. ఏలన, ధ్వనియుతమైనది మహాకావ్యమ ... ఆధ్వనియేలేదని కొందఱును, నున్నను నభిధశక్తిచేతనే (లక్షణచేతనే) గతార్థమ ... నని కొందఱును, నున్నను నయ్యది యనిర్వచనీయమని మఱికొందఱును, వాదిం చుచు ధ్వనియొక్క ప్రాశస్త్యమును శంకింపఁగా నట్టివాదముల కన్నింటికిని స్వస్తిచెప్పి, (రసాది) ధ్వనిని కావ్యాత్మగా నిరూపించిన సహృదయ విద్వదగ్రేస రులు- శ్రీమదానందవర్ధనాభినవగుప్తపాదులు. కవి యెట్టి కావ్యమును వ్రాయవలె నన్నను, సహృదయులెట్టి కావ్యమును పఠింపవలెనన్నను, లోచనయుక్త ధ్వన్యా లోకావలోకనములేనిదే సాధ్యపడునదికాదు.

నవరచనలు శరవేగమున బయలుదేరవలెనని నేఁటియువరచయిత లభిని ... శముఁ గలిగియున్నారు. అట్టివారలకు సంస్కృతభాషా విజ్ఞానపటిమ సాధార ముగ నల్పమయియున్నది. పురాతన కావ్యనిబంధనావళిని దెలిసికొనవలెనన కుతూహలము మాత్రము ప్రతిరచయితయందును వెల్లివిరియుచున్నది. ఏతాదృ శులయిన నవ్యుల యభిలాషను తీర్చుటకొఱకే యలఁతి యలఁతి పలుకులఁ : దెలుఁగు నుడికారమేకొంచెము తెలిసినవారికైనను సుబోధమగురీతిని, భగీరథుఁ తపస్సుచేత నాకాశగంగను శివజటాజూటమునుండి హిమవత్పర్వత ద్వారమున భారతావనియందు ప్రసరింపఁజేసినటుల, ప్రభామతులగు శ్రీ శాస్త్రిగారు ప్రతి మతిచేత, 'ధ్వనిని' 'నాలోకమునుండి' 'గుప్తలోచనోన్మీలన' ద్వారమున సహ యులహృదయములందుఁబ్రసరింపఁజేసిరి. పండితైకవేద్యములయిన శర్కాశర ... గ్రంధములనుగూడ వీరి ప్రభామతి - సర్వజన సువిజ్ఞేయము గావించినదనుట నతిశయోక్తిలేదు.

సారస్వతమార్గప్రదర్శకంబును, సంస్కృతభాషానభిజ్ఞ దుర్విజ్ఞేయంబునున్న ధ్వన్యాలోకగ్రంథము నాంధ్రీకరించి; లోచనమును సమగ్రముగా ననువదింపు

(1) రసస్వరూప నిరూపణ సందర్భమునందును,

(2) రసధ్వని - రసవదలంకార - వివేచన సందర్భమునందును,

(3) అలంకారనిర్వచన, తన్నివేశౌచిత్యవివేచన సందర్భమునందును, వీరి ...3, కవిలోకమునకెంతేని యుపకరించి యుపదేశకమగునను టలో నతిశ ...ంచెమైననులేదు.

(4) మఱియు, ప్రథమ - ద్వితీయోద్యోతములందు సందర్భవశమున ...యాంతరాంతరితముగ నిరూపింపఁబడిన రసవిషయములను, తత్తన్మతస్వరూప ...ఐను, అయాస్థలములందు వివరించియు, పాఠకులకు ఏకవాక్యతకలుగునట్లు - ...త్రియోద్యోతాంతమున "రసాలోకము" అనుపేర ననుబంధముగ నిబంధించి యున్నారు. ఇయ్యది పాఠకుల కత్యంతోపయుక్తము గాన నవశ్యపఠనీయము.

(5) మఱియు నాంధ్రీకరణమున వీరనుసరించిన యన్యూనానతిరిక్తమై రసనిధానభూతమగు శైలి-మిక్కిలి ప్రశంసనీయము. ద్వితీయోద్యోతమున 25వ పేజీయందు-'పొగడ'యనునామమున నవీనముగ వీరిచేకూర్పఁబడిన జాతీయపద్య మగు "తరుణి ప్రియునితో పవళించెన్" మున్నగునవి, సమాస్వాదించునది.

వీరు స్వీకరించిన భాషాంతరీకరణపద్ధతి యెంతశ్లాఘ్యమైనదో యీసూత్రా ...ళినిబట్టి స్పష్టమగును.

(1) ఉన్నవిషయము నున్నట్లేచెప్పుట.

(2) చేర్పులు, మార్పులు కూర్పకుండుట.

(3) మృదుమధురమైన సరళరచనతో గ్రంథమంతయును నడిపించుట.

(4) అక్షరచ్ఛంద, మాత్రాచ్ఛంద, జాతీయోపజాతీయపద్యరచనలలో ...తనములనుసృష్టించి వానికి రాగతాళలయాదులనుగూర్చుట. (కేసరి, సమ్మోటి ...ండితెర, కలువతీగ, జాబిల్లి, పొగడ, ఆమని మున్నగు పద్యములు-వైదాని ...దాహరణములుగఁ జూపవచ్చును. జాతీయములలో సూర్యేంద్రగణములు ...త్రమేయుండును. చంద్రగణములుగూడఁ గలసినచో నుపజాతీయములగును. జాతీయోపజాతీయములను రాగతాళలయాన్వితముగఁ జూపుట- వీరి రచనలలోని విశేషము.)

(5) శాస్త్రగ్రంథములయొక్క పఠనపాఠనాదులలో నలసటలేకుండు నట్లు ప్రశ్నోత్తరరూపములతో నూతన మార్గములను వెలయించుట.

కావున, పరిభామతి లోచన సంయుక్తమైన యాంధ్రధ్వన్యాలోకము నాంధ్రభాష నభ్యసించినవారందఱును జదువవలయును. యువరచయితల నేకులు లేఖినీవిన్యస్తహస్తులయి, కావ్యగ్రథన కుపక్రమించు నాధునిక శుభకాలము నందాంధ్ర ధ్వన్యాలోకమును సమగ్రరూపముతో నాంధ్రరచయితలకందఁజేయు చున్న సుహృద్వరులు శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారెంతేనిస్తుత్యులు. వీరి గద్య పద్యములలో నెద్దానిని సమీక్షించినను నది - మధురకోమల ప్రసన్నకాంతి లలిత మయి యుండుటచేత- ప్రత్యేకించి యుదాహరించుట మానితిని. శ్రీ శాస్త్రిగారికి నాయురారోగ్యాది సమస్తైశ్వర్యములనిచ్చి వీరిచే శతాధికములగు నిట్టిసద్గ్రంథము లను వెలార్పఁజేయుఁగావుతమని శ్రీమదుమామహేశ్వరు నభ్యర్థింతును.

హరిః ఓం తత్ సత్.

ఇట్లు
న్యాయవిశారద, న్యాయసుధానిధి, న్యాయమీమాంసాలంకార, విద్యాప్రవీణ,
*కొల్లూరు లక్ష్మణమూర్తిశర్మ,*
ప్రభుత్వ శ్రీ విజయనగర మహారాజ సంస్కృత కళాశాలాధ్యాపకులు.
విజయనగరము, 21 –8 —'59.

---

* ప్రథమ, ద్వితీయోద్ద్యోతములుగల, ఈయాంధ్రధ్వన్యాలోక ప్రథమ భాగమును, (1960, 61, సంవత్సరములలో) భాషాప్రవీణకు పాఠ్యముగా నిర్ణయించిన ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు మిగులఁ గృతజ్ఞుఁడను.

ఇట్లు,
విధేయ రచయిత.
*పం. లక్ష్మీనారాయణశాస్త్రి.*

ఓం నమో భగవతే శ్రీరమణాయ.

* శ్రీ బాలసరస్వతీ ప్రచురణములు *

• శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి కృతులలో లభించునవి •

(౧) ఆంధ్ర ధ్వన్యాలోకము, ఆంధ్రీకృత శ్రీమదభినవగుప్త లోచనోన్మీలితము[సంస్కృత మూలకారికానహితము.] స్వవిరచిత ప్రభామతి వ్యాఖ్యా పరిష్కారితము. Rs. np.

1) ప్రథమభాగమున ప్రథమోద్ద్యోతము గ్లేజు ముద్రణము 5-00
న్యూసు ముద్రణము 4-00

2) ప్రథమభాగమున ద్వితీయోద్ద్యోతము గ్లేజు ముద్రణము 5-00
న్యూసు ముద్రణము 4-00

3) ఆంధ్ర ధ్వన్యాలోకము - [సలోచన ప్రభామతి సమున్మీలితము] ద్వితీయభాగము [తృతీయోద్ద్యోతము] 4-00

4) [అచ్చులో] తృతీయభాగము. [చతుర్థోద్ద్యోతము] 4-00

(౨) ఈశావాస్యోపనిషత్తు, మూలమంత్ర, ఆంధ్రపద్యానువాద, పదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్య, త్రిమత సంబంధి, షోడశభాష్యార్థ,శాక్తాద్వైతభాష్యానుబంధ, స్వాభిప్రాయ సమన్వితము. ఇట్టిది-తెలుగున నేటి కింకొకటి వెలువడలేదని విద్వాంసులచేత ప్రశంసింపఁబడినది. 2-50

(౩) ఉమాసహస్రము. శ్రీ కావ్యకంఠ గణపతి మునికృత మూలశ్లోకసహితము. ఆంధ్ర పద్యానువాద, ప్రభా వ్యాఖ్యా, వివరణ, సమన్వితము.

1) ప్రథమభాగము [మొదటి శతకము] 2-00
2) ద్వితీయభాగము [రెండు, మూడు, నాల్గుశతకములు] 3-00
3) తృతీయభాగము [మిగిలిన ఆరుశతకములు] 5-00

(౪) అంజలి ["శ్రీరమణాంజలి" మున్నగునంజలులుగలది.] 0-50

(౫) శ్రీగీతా సుధాంజలి ఉచితము.

(౬) భామతి [స్వతంత్రనవ్యకావ్యము.] త్వరలో వెలువడనున్నది. 2-00